తాళ్ళపాక పద సాహిత్యము - సంపుటము - 27

# శృంగార సంకీర్తనలు



అన్నమాచార్య ప్రాజెక్టు
తిరుమల తిరుపతి దేవస్థానములు

శ్రీ తాళ్ళపాకవారిపదసాహిత్యము--సంపుటము 27

# శృంగారసంకీర్తనలు

అన్నమాచార్య విరచితము

పరిష్కరణ:

వే.శే. గౌరిపెద్ది రామసుబ్బశర్మ

మరియు

కామిశెట్టి శ్రీనివాసులు




ప్రచురణ:

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1998

# ANNAMACHARYA SRINGARA SANKEERTHANALU

**Volume No.27**

Edited and Compiled by

**LATE GOURIPEDDI RAMASUBBA SARMA &**

**KAMISETTY SRINIVASULU**

T.T.D. Religious Publications Series No.565






First Edition : 1988

Copies : 1,000




Published by:

M.K.R. Vinayak, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507.

Printed at:

Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

తాళ్లపాక కవుల పదవాఙ్మయం మీద ఇటీవలికాలంలో శ్రద్ధ ప్రబలింది. కవులు, పండితులు, పరిశోధకులు, కళాకారులు ఈ సారస్వత క్షీరసముద్రంలో మునకలు వేయడానికి ఎంతో ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు. తాళ్లపాక కవులలో ఆద్యుడు అన్నమాచార్యుడు. రాశిలో వాసిలో అన్నమయ్య సంకీర్తనలే ఎక్కువ. అన్నమయ్య అడుగుజాడలలో సంకీర్తనలను రచించిన వారిలో కుమారుడు పెదతిరుమలయ్య, మనుమడు చినతిరుమలయ్యలు ప్రధానులు. తాళ్లపాక కవులు రచించిన వేలకొలది కీర్తనల్లో మనం దక్కించుకొన్నవి పదమూడువేలకు తక్కువే. ప్రాథమిక మూలద్రవ్యమైన (Primary Source Material) రాగిరేకులు మనకు లభించినవి మూడువేలకు తక్కువ. వీనిని పరిష్కరించి ప్రకటించడమనే గురుతరబాధ్యతను స్వీకరించిన పెద్దలెందరో. వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, ఉదయగిరి శ్రీనివాసాచార్యులు, పి.టి.జగన్నాథ రావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మగార్లు.

స్వర్గీయ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు అసంపూర్ణంగా వదలివేసిన రెండు సంపుటాలను కామిశెట్టి శ్రీనివాసులుగారికి అప్పగించినాము. వారు పునః పరిష్కరించిన 26వ సంపుటం ఇదివరకే ప్రచురింపబడినది. ఇప్పుడు 27వ సంపుటం సిద్ధమైంది. పాటలతో పాటు విపులము విలువైన పీఠికను కూడ ఇందులో చేర్చడమైనది. అన్నమయ్య సాహితీ వ్యాప్తికి దీప్తికి ఇతోధికంగా కృషిచేసిన శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు పీఠికలో వెలువరించిన విషయాలు వారి తీవ్రమైన ఉద్యమ స్ఫూర్తికి, మౌలికమైన పరిశోధనాకృషికి నిదర్శనాలు.

ఎంతోకాలంగా నిరీక్షిస్తున్న అన్నమాచార్యుల శృంగార సంకీర్తనల 27వ సంపుటం మీ ముందున్నది. చిత్తగించగలరు.

"నీ వంటి చుట్టము నాకు నిండు నిధానము గాదా
పూవుల నీ పాదములు పూజింతుఁగాక"

(అన్నమయ్య)

ఎం.కె.ఆర్. వినాయక్, ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

తిరుపతి,
26-6-1998.

# పీఠిక

తాళ్లపాక అన్నమాచార్యుల వాఙ్మయ అధ్యయనం ఒక వీడరాని బంధంగా ఏర్పరచిన కొండలయ్య లీలలు ఊహాతీతం. అన్నమయ్య పాట, దైనందిన జీవితచర్యలో ఒకభాగమై నిలవడం నా గురుదేవుల ఆశీర్వాదబలం. సాధనలు, శోధనలు, బాధలు, ఆవేదనలు ప్రక్కకు నెట్టి గుండెబలంతో 'కొండలరాయుని పాటబలిమి'తో ముందుకు సాగి భాషలో, భావంలో, ప్రక్రియలో వినూత్న పథాలను సృష్టించినవాడు పదకవితాపితామహుడు, సంకీర్తనాచార్యుడు, ద్రవిడాగమసార్వభౌముడు తాళ్లపాక అన్నమాచార్యులు. తాను అనుభవించిన శ్రీనివాసతత్త్వాన్ని లలితసుందరంగా తీర్చి గీతిమధురిమల దిద్ది తీర్చి భక్తజనకోటికి "వేంకటేశ్వరమంత్రాలు"గ అందించిన తెలుగు ఆళ్వారు అన్నమయ్య.

తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం నాకు చేయూత నివ్వడంతో తెలుగు అధ్యాపక వృత్తిలోఉన్న నేను 1970 నుండి అన్నమయ్య సంకీర్తన ప్రచారం ఇతోధికంగా చేసే అవకాశం కలిగింది. పరిశోధన, ప్రచురణ, ప్రచారం వీనిలో సాగించేవైనం పసిగట్టిన యాజమాన్యం 1978లో అన్నమాచార్య ప్రాజెక్టు ఏర్పరచి నన్ను సంస్థాపక డైరెక్టరుగా నియమించడంతో నా జీవితానికొక పరమార్థం ఏర్పడింది. ఎందరో కళాకారులు, వాఙ్మయధురీణులు, పత్రికలు (ప్రధానంగా సప్తగిరి, ఆంధ్రప్రభ) ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలు పలు సంగీత సాహితీ సభలు, అధికారులు, అనధికారులు తమ సంపూర్ణ సహకారాలనందించినారు. నన్ను, ప్రాజెక్టును పెంచి పోషించినారు. అన్నమాచార్య సంకీర్తన మహోద్యమానికి నిండు మనసుతో, వాత్సల్యంతో తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యం ఊపిరులు పోసింది. కన్నతల్లిలాంటి నా సంస్థకు నేను చేయగలిగిందేమిటి? అన్నమయ్య మాటల్లో నేను సదా వేంకటరమణుని ఇట్లా ప్రార్థిస్తాను. "విడువలేని శ్రీ వేంకటవిభుడవు -- కడదాకా నను(గాతువు(గాక".

నా మనసెరిగిన సంస్థ నాకు శృంగారసంకీర్తనల సంపుటాల పరిష్కరణ భాగ్యాన్ని కొంత నాకప్పగించినది. రేకులలోని పాటలు, ఆ వ్రాత, అందులో ఉన్న చిక్కును, గురువర్యులు రాళ్లపల్లి, గౌరిపెద్ది గార్ల సమక్షంలో ప్రత్యక్షంగా తెలుసుకొన్న నాకు ఈ పునః పరిష్కరణ సులువుగానే సాగింది. అందుబాటులో ఉన్న రేకులతో పరిచూసి, వ్రాయసగాళ్ల తప్పులను సరిదిద్ది గౌరిపెద్దివారి వ్రాతప్రతిని ముద్రణ కెక్కించి తద్రచనయకా పూర్తిచేయ గలిగినాను. శృంగార సంకీర్తనలు 26వ సంపుటంలో కొన్ని మౌలికమైన పరిశోధనాంశాలను తెలిపినాను. ఈ 27వ సంపుటం పీఠికలో కూడ నేను చర్చించిన అంశాలను సాహితీ రసికులు పరిశీలించగలరని విశ్వాసం. ఈ సంపుటంలో 1701 రేకునుండి 1800 రేకు వరకు ఉన్న 598 పాటలు చోటుచేసుకొన్నవి.

## పదకవిత -- తాళ్లపాక కవులదృష్టి

'పదం'[1] అనేది ఒక మనోహరమైన సంగీతాత్మక ప్రక్రియ. దీనికి రాగం, తాళం రెండు మూలద్రవ్యాలు. సాహిత్యానికి కూడ ఇందు ప్రాధాన్యం ఉంటుంది. ఇటువంటి రచనకు పదం అనే పేరు పాల్కురికి సోమ నాథుని కాలానికే స్థిరమైనట్లు తెలుస్తున్నది.[2] లాక్షణికులు 'పద్యమ్ చతుష్పదమ్' అన్నారు. అంటే నాలుగు పాదాలున్న పద్యంలో నాల్గవ భాగానికి పదం అనో, పాదం అనో పేరు సిద్ధిస్తుంది. ద్విపదలో అయితే

1 'పదగ పద్యతే అనేన ఇతి పదమ్' అనే వ్యుత్పత్తితో ఏర్పడింది. దీనికి 'పొంద బడింది' అని అర్థం. 'పదమ్ వ్యవసిత త్రాణస్థాన లక్ష్మాంఘ్రివస్తుషు' అని అమరకోశంలో ఈ పదానికి ఉద్యోగం-రక్షణం-స్థానం-చిహ్నం-వస్తువు అనే అర్థాలున్నాయి.

2 "పదములఁ దుమ్మెద పదముల్ ప్రభాత। పదములఁ బర్వతపదము లానంద పదములు శంకర పదముల్ వివాళి। పదములు వాలేశు పదములు గొబ్బి పదములు వెన్నెల పదములు సంజ। వర్ణన మఱి గణవర్ణన పదము"
(పండితారాధ్య. చరి. వాదప్రకరణము పు. 513)

అది రెండవ భాగం; షట్పదిలో ఆరవ భాగమౌతుంది. ఎనిమిది పాదాలున్న జయదేవుని అష్టపదు లిట్టివే. తెలుగు కన్నడ భాషలలో పదానికి భాగం అనే అర్థం పోయి ఇప్పుడు పాట అనే అర్థమే రూఢమైంది.

పదం అనే సంకేతం తెలిసినప్పటికీ తాళ్లపాకకవులు తమ రచనలను సంకీర్తనలనే వ్యవహరించినారు. అన్నమయ్య సంస్కృతంలో 'సంకీర్తన లక్షణ'[1]మనే గ్రంథాన్ని రచించినాడు. దీనిని తెలుగు చేసిన తిరుమలయ్య "మహనీయంబగు సంకీర్తన నామక పద సంప్రదాయం బెట్టిదనిన"[2] అని పదానికి పర్యాయపదంగా సంకీర్తన శబ్దాన్ని వాడినాడు. అంతేకాక భరతముని నాటినుండి పదానికి లక్షణాలు చెప్పబడినట్లు స్పష్టం చేసినాడు. తాళ్లపాక కవులకు పూర్వం కృష్ణమాచార్యుని సింహగిరి వచనాలున్నవి. అతడు తన వచనాలను సంకీర్తనలనే పేర్కొన్నాడు.[3] వేంకటాచలవిహార శతకంలో కూడ 'కృష్ణమాచార్య సంకీర్తనలనే' ఉన్నది.[4] కాని చిన తిరుమలయ్య వీనిని పదాలని వ్యవహరించినాడు.[5] అన్నమయ్యకు సంకీర్తనాచార్యుడనే కాక 'పద కవితాపితామహుడనే బిరుదు కూడ ఉంది. దీనిని బట్టి తేలిన సారాంశం 'పదం' 'సంకీర్తన' అనేవి ఒకదానికొకటి పర్యాయపదాలని కాలక్రమంలో ఇది శృంగార రసమయం రాగతాళనిబద్ధం అయిన ఒక ప్రత్యేక పద్ధతికి చెందిన

---

1 చూ. సంకీర్తన లక్షణము ప.15, 17 - పు.139-40 T.T.D. Talapakam Telugu Works, Vol.II, Minor Works-1935 అన్నమాచార్యులు సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణంగాని దానిని తెలుగులో గద్యాత్మకంగా వెలయించిన పెదతిరుమలాచార్యుల రచనగాని మనకింతవరకు మనకింతవరకు లభించలేదు.

2 చూ. సం.ల.పు. 140.

3 ఈ సంకీర్తనఫలం బెవరు వ్రాసిరి...(సిం.వ.పు. 1.1)" ఇది కృష్ణమాచార్యులు చెప్పిన సంకీర్తన ఫలంబు" (సిం.వ.పు. 2-2) సింహగిరి నరహరి వచనములు ఆంధ్ర రచయితల సంఘము, హైదరాబాదు, 1968.

4 "కృష్ణమాచార్య సంకీర్తనంబులఁజొక్కి । సింహాద్రియప్పయచేతఁగాదు". వేంకటాచల విహార శతకము (పు.23 ప.52) శ్రీ వేంకటేశ్వర లఘు కృతులు - T.T.D. Publications - 1967.

5 "భరకృష్ణాచార్యాదిక పరికల్పిత పదములు తాళ బంధచ్ఛందోవిరహితమై" (చూ. సం.ల.ప.54 పు.147)

రచనకు సంకేతనామంగా సంగీత రసికుల సంప్రదాయంలో నిలిచిపోయిందని తెలుస్తున్నది. క్షేత్రయ్య కాలానికే ఈ వాడుక వచ్చినట్లుంది.[1] రంగాజమ్మ 'మిగుల శృంగారంబు గన్పట్ట పదములు మృదురసాస్పదము లగుచు రాణింప' రచించినదట. కీర్తన శృంగారాత్మకమై పదమైనదని సుబ్బరామ దీక్షితుల గారి అభిప్రాయం.[2] అంటే శృంగార రసస్పర్శలేనిది పదశబ్ద వాచ్యం కాదనే రూఢి ఏర్పడింది.

తెలుగు సాహిత్యంలో 'తుమ్మెదపదాలు' ఆదిగాగల పదరచనలు, తాళ్ల పాకవారి సంకీర్తనలు లేక పదాలు, క్షేత్రయ్య పదాలు, పలనాటి వీరగాథవంటి సుదీర్ఘ వస్తుమయ గేయరచనలు - తందాన పదాలు, కానవస్తున్నాయి. వీటిలో పదశబ్దానికి గల అర్థపరిణామం తెలుగులోని పదకవిత్వ వికాసాన్ని తెలియజేస్తుంది. 'తుమ్మెదపదాలు' అంటే పాట అనే సామాన్యార్థమే. తాళ్లపాక వారి పదాలు లేక సంకీర్తనల్లో అది పల్లవి చరణాలు అనే ప్రత్యేక లక్షణాలతో విలసిల్లి శృంగార పరంగానో, అధ్యాత్మ పరంగానో రచింపబడిన సంగీతాత్మక రచన అనే అర్థం వస్తుంది. క్షేత్రయ్య పదాలలో ఇది ఒక్క శృంగారానికే పరిమితం. పలనాటి వీర గాథ మొదలైన వాటిలో వీరరసస్ఫోరకమైన గేయాంశం ఉన్న సాహిత్యరచనగా విదితమౌతుంది.

ఏ వాఙ్మయంలోనైనా పద్యకవిత్వం కన్నా పదకవిత్వమే ముందు పుట్టి పెరుగుతుందని విజ్ఞుల అభిప్రాయం. పదకవితకు నాదం కాలం రెండు పాదపీఠాలు! దీని రాణింపుకు తోడ్పడేది కవిత్వం. భాషా సాహచర్యం లేకుండ కేవలం నాదకాలలయలే ప్రధానంగ ఉండేది సంగీతం. పద కవిత్వంలో నాదకాలాలతో బాటు భాషా రచనకు కూడ ప్రాధాన్యం ఉంటుంది. రాగతాళలయలు పదకవిత్వానికి అలంకారాలు మాత్రమే. పద్య కవిత్వంలో గీతి ఛందోరూపంగా అప్రత్యక్షంగానే ఉంటుంది. 'పద్యకవితను చూచిన చూపుతో పద కవితను చూడరాదంటూ శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు ఇట్లా వివరించినారు. "స్వతంత్రమైన ధారాళతగల

---

1 'పదము పాడగా వినేవో చదరంగమే చూచేవో'

2 'తెలుగు సాహిత్యంలో దేశికవిత' ఆర్వీ.యస్. సుందరం. పు. 66.

పద్యరచనలో అర్థభావాలకు కవి చూపగలిగినంత అఖండత, వైశాల్యం, సూక్ష్మత, వైవిధ్యం మొదలైన గుణాలు పదరచనలో చూపలేడు. మరి రాగతాళాలు, సూత్రాలు బొమ్మ నాడించినట్లు, అర్థభావభావనలను పట్టి చూపగలిగిన పదరచనలో ఉన్నంత వర్చస్సు, శక్తి, ఆకర్షణ పద్యరచనలో రాదు."[1]

"తాళ్లపాకవారి సంకీర్తనలు........, కవిత్వము, రాగతాళాలు పరస్పర సౌహార్దంతో కలసి తయారైన నిండురచనలు. పల్లవి అను ధ్రువపదము, అనుపల్లవి, మూడు చరణములు. ఇవి కలసిన పూర్ణరూపమే సంకీర్తన లేక పదం". దీని స్వరూపం 'సంకీర్తన లక్షణం'లో ఇట్లా వింగడింపబడింది.

> "పదముల యర్థముఁ బల్లవి వదలక యన్నిటికి నేకవాక్యతఁజేయఁగా
> గుదిగ్రుచ్చినట్లు తగులై పదము తుదిఁగామఱియు మఱియుఁ బల్లవి యలరుఁగా". [2]

పాటలో చరణాలెన్ని ఉన్నా పల్లవిలోని భావాన్నే పోషించి, పల్లవితోనే ముగుస్తాయి. 'పదరచనలో భిన్న సందర్భాలకు చెందిన అర్థభావాలు కాని, భిన్నరాగ తాళలయలు కాని ఉండవు". దీనికి విరుద్ధంగా భిన్నరాగతాళాలు కల "సూళాదులు"* అనే పదాలు ఎన్నో 15, 16 శతాబ్దాలలో కన్నడ భాషలో పుట్టినవని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తెలిపినారు.[3] తాళ్లపాక అన్నమాచార్యుల శృంగార సంకీర్తనల రాగిరేకుల్లో తొలుత నాకంటబడిన దేశిసూళాది 1978 డిసెంబరు 28 మద్రాసు మ్యూజిక్ ఆకాడెమీలో

---

[1] 'అన్నమాచార్యుని కవిత' రా. అ.కృ.శర్మ. (వాణి. 22-7-55)

[2] సంకీర్తన లక్షణము. (ప. 39)

* సూళాదులు-సూడగ, సూళాది అన్నది ప్రసిద్ధ అలంకార సప్తతాళంబులును, రగణ మత్యంబును, ఉద్గ్రాహ, ధ్రువ, ఆభోగ ధాతువులతో ఏకకలగా (యథాక్షరముగా) విళంబ, మధ్యమ లయలు గలదియై వర్ణక్రమంబులతో సాహిత్యరూపమైయుండును. ఈ సూళాదులు శ్రీపురందరదాసులు వారు గాక తక్కిన వారెవరును జూచినట్లు కనుబడలేదు - సుబ్బరామదీక్షితులు 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని పు. 51.

[3] 'అన్నమాచార్యుని కవిత' (వాణి.22.7.55)

సమర్పించినాను.* పరిష్కరించి, ప్రకటించి, పాడించి, ప్రచారంచేసిన ఈ రాగతాళమాలిక బహుజనామోదం పొందింది. దీని నిర్మాణం తీర్పు కన్నడసూళాదులలాగ కాక విలక్షణంగ ఉన్నది. కన్నడ సూళాదులు కేవలం తాళమాలికలే. ఇది రాగతాళమాలిక ఇందు ఉపయోగించిన రాగాలక్రమం ఈషత్ స్వరభేదాలలో ఒప్పినది. సూళాదులతో కనిపించని వాక్యమనే వింత ప్రయోగం ఇందు కనిపిస్తుంది. రేకులలో సామాన్యంగ ప్రతి కీర్తన ముందు పల్లవి అని పేర్కొనబడి ఉంటుంది. ఈ సూళాదిలో చరణం తర్వాత పల్లవి అని పేర్కొనబడింది. కేవలం శబ్ద పంజరంగ మిగిలిన ఈ 'దేశిసూళాది'ని స్వరపరచి తొలుత పాడిపెట్టినవారు ఆత్మీయమిత్రులు, సంగీత శాస్త్రవేత్త ఎస్. ఆర్. జానకీరామన్‌గారు. పదకవిత ముక్తక రచన వంటిది. దేనికది స్వతంత్రం-సమగ్రం. క్రీ.శ. 14వ శతాబ్దం నాటికే పదానికి ఈ స్వరూపం ఏర్పడినట్లు తెలుస్తున్నది. క్రీ.శ. 15, 16 శతాబ్దాలలో ఆంధ్రకర్ణాట వాఙ్మయాలలో ఇటువంటి పదరచన విరివిగా సాగింది. తెలుగులో తాళ్లపాకవారు, కన్నడంలో దాసకూటానికి చెందిన శ్రీపాదరాయలు మొదలైనవారు ఇటువంటి పదాలు రచించినారు. కన్నడంలో వీనిని 'దాసరపదగళు' అంటారు.

తాళ్లపాకకవులు తమ పదరచనలను వర్ణ్యవిషయాన్ని బట్టి రెండు తరగతులుగా విభజించినారు. 1. శృంగార సంకీర్తనలు 2. వైరాగ్య సంకీర్తనలు. 'పదములు శృంగార వధూ మృదుమధురమనోజ్ఞవాక్య మిశ్ర ములై' నప్పటికి, 'విదితార్థ గ్రామ్యోక్తులు పదిలముగాఁ బొంక మెఱిఁగి' పలికితే చాలన్నారు. 'పల్లవనారీ మ్లేచ్ఛాద్యుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు' గ్రామ్యాలైనా చెల్లుబడి ఔతాయన్నారు. 'జగతిఁగల చెల్లుబళ్లై నగినగి భాషించునట్టి నానుడి పలుకుల్ తగదన రహిచెదుఁ బువ్వుల సొగసుడుగం బిసికి కంపు చూచిన భంగిన్,' అని నానుళ్లను, పలుకుబళ్లను స్వేచ్ఛగా వాడినారు. వైరాగ్య పదాలు మాత్రం 'అగ్రామ్య రమ్యములై విష్ణుచరితో దారములై' ఉండవలెనన్నారు.[1] వీనికి అధ్యాత్మ సంకీర్తనలనే వ్యవహారం

---

* దీనిని గానం చేసినవారు శ్రీ ఎస్.ఆర్. జానకీరామన్, శ్రీమతి శోభారాజుగార్లు.

1 సంకీర్తన లక్షణము ప. 58,59,60

కూడ ఉంది. పదం సంస్కృత ప్రాకృతాలలోగాని, దేశభాషల్లోగాని రచింపబడవచ్చు.[1] అవి సంప్రదాయ సిద్ధమై, అలంకారం, చమత్కారం భావం, రసం, శయ్య మొదలైన కావ్య సామాన్య గుణాలతోనే కాక దైవిక మానుష రచనా పావనములుగా ఉండవలెనన్నారు. 'బూఱుగు కాయం గొఱికిన నీరసతూలంబు దిశలనిండుగతి నిస్సారపదబంధకవితాపారీణుల పదము హాస్యాస్పదమై ఉండునట.[2]

లక్షణ భేదాన్ని బట్టి ఈ పదాలను 1. వృత్తపదం 2. నిబంధపదం 3. చూర్ణపదం -- అని మూడు తెరగులుగా విభజించినారు. వృత్తపదాలు షడ్వింశచ్ఛందో భేదాలకు చెందినవి. యతులు, ప్రాసలు, పదాలు, మాత్రలు తాళసంగతులు కలిగినవే నిబంధపదాలు. తాళ్లపాక వారి సంకీర్తనల్లో ఇవే కనిపిస్తున్నాయి. గేయగంధులైన కృష్ణమాచార్యుని సింహగిరి వచనాలు, రాగతాళ బంధములైన పెదతిరుమలయ్య వైరాగ్యవచన మాలికలు చూర్ణపదశాఖకు చెందినవి. ఇవిగాక దరువులు, ఏలలు, గొబ్బిళ్లు, చందమామ పదాలు, మున్నగు సంకీర్తన భేదాలకు కూడ లక్షణాలు వివరించినారు. ఈ లక్షణాలకు లక్ష్యాలు కూడ చాల వరకు తాళ్లపాకవారి సారస్వతంలో కనిపిస్తాయి.[3] ఇవే తర్వాత పదకర్తలకు శిరోధార్యాలైనవి.

తెలుగు సాహిత్యంలో ఆదికాలంలో 'తుమ్మెదపదాలు' మొదలైన పదరచనలున్నాయి. కన్నడిగుల ప్రభావంతో తర్వాతి కాలంలో పాడుకోవడానికి అనువైన వచనాలు రచింపబడినాయి. తాళ్లపాక వారి కాలంలో తాళలయాత్మకమైన వచనాలతో బాటు నిర్దిష్ట లక్షణాలతో సంకీర్తనలనే పదరచన లేర్పడినవి. క్షేత్రయ్య కాలంలో శృంగారాత్మకం, అభినయయోగ్యం అయిన పదాలకు ఆకారమేర్పడింది. ఇతనికాలంలో పదానికి సంకీర్తనమనే

---

1 సంకీర్తన లక్షణము ప. 27

2 సం.ల.ప. 69,70

3 తాళ్లపాక వారు సంకీర్తన లక్షణమును రచించుటయే కాదు, వానికిఁదగిన లక్ష్యములను గూడరచించి "సంకీర్తనా పరిశుద్ధి" కెంతయో పాటు పడిరని నిస్సందేహముగా చెప్పవచ్చును". తాళ్లపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రక్రియలు (పు. 458) డా॥ వేటూరి ఆనందమూర్తి - 1974.

పర్యాయనామం తొలగిపోయింది. త్యాగరాజు కాలంలో సంగీత ప్రాధాన్యంతో సాహిత్యాన్ని నామమాత్రంగా చేసుకొన్న కృతులేర్పడినవి.

పదకవిత నిసర్గ మధురమూ, నిరాడంబరమూ అయినది. జన సామాన్యంలో చోటుచేసుకొని, సజీవమై నిలిచింది. భారతదేశంలో పదకవితకు ఇతర భాషలలో గౌరవ ప్రచారాలున్నవి. వంగ భాషలో పదకర్తల రచనలు ప్రముఖాలు. హిందీలో సూరదాసు, మీరా, కబీరు, పదాలకు విశేష ఆదరణ ఉంది. తెలుగుభాషలో తప్ప ఇతర భారతీయ భాషల్లో పదకవితను నిందించినవారు కూడ అరుదే.

"ముదివిటులు విధవలంజలు । పదకవితలు మారుబాస బాపనవారల్
చదువని పండిత వర్యులు । కదనాస్థిర వీరవరులు కడిదిపురమునఁ"[1]

ఇట్లు నగుబాట్లపాలైన పదకవితకు తాళ్లపాక వారు ఉన్నతస్థాయి నిచ్చి నెలకొల్పినారు.[2] సుప్రసిద్ధమైన దేశిరాగాలలో, సుగ్రహమైన లయ తాళాలలో నిబంధించి పదాలను సులభీకరించినారు. వానిని 'వరకవిత్వ వాణీ వీణా నినాదములు'గా, సర్వమంత్ర పరమరహస్యోద్భావనములు'గా, గాయక నికరావనములు'గా తాళ్లపాక కవులు తీర్చినారు. అవి:

శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీధులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభ రతిక్రీడారహస్యంబులై
నుతులై తాళులపాక యన్నయ వచోనూత్నక్రియల్ చెన్నగుఁ"[3]

* * *

---

[1] చూ. చాటు పద్య మణి మంజరి - వేటూరి ప్రభాకర శాస్త్రి.

[2] 'తాళ్లపాకవారి సారస్వత సేవ' రా.ఆ.కృ.శ. (22-9-1956).

[3] సం. ల. ప. 12

## అన్నమయ్య సప్తగిరీశునకు సమర్పించిన సప్తరాగతాళమాలిక

# అన్నమయ్య "దేశిసూళాది"*

## దేశిసూళాది

శృం. సం. రేకు. 1500

1. మాళవిగౌళ - ధ్రువతాళం

వలెవలెనని వలచితినట తన వలలకు లోఁగా నటరే ఇఁక
పలమో చలమో నాకును పతితో జగడములా
నెలఁతలు తనకెందరు గలిగిన నేనే సతమని తెలియరె
పొలమెల్లాఁదిరిగిన తేఁటికి పూఁబొదయే నెలవుగదె.

పల్లవి :

అనఁగదరే ఓ చెలులాల ఆతని తోడుత నీ మాటలె
వినయంబున నే నడవఁగ శ్రీవేంకటపతి కిది దగవా

వాక్యం :

అల్లనాఁ డొకతె తోడ నట్టె మాటలాడఁగాను
చల్లఁగా నేనే మాచి జంకించితినా
పల్లద మాడితి నటె పైడివంటి మాటనైన
చిల్లరలే మానఁడాయె శ్రీవేంకటేశ్వరుఁడు.

2. రామక్రియ - మఠ్యతాళం :

తానాడిన మాఁటలెల్లా దలచుమని
కోనేటిరాయునికి నా గుబ్బల మీఁదటను । ఆనవెట్టరే.

3. వరాళి - రూపకతాళం :

వెగ్గళముగ సారెకు నిఁక వెంగెము లాడఁగఁజాలను
శిగ్గరితనమునఁ గొసరెద శేషాచలపతిని

---

* దీనిని రేకులలోనుండి తొలుత సేకరించి, పరిష్కరించి, స్వరాలను ఏర్పరచి (ఎస్.ఆర్. జానకీరామన్‌గారితో) 1978లో ప్రకటించి మద్రాసు మ్యూజిక్ అకాడెమీలో సమర్పించినాము.

4. **బౌళి - ఝంపె :**

అలిగి సాధించఁదగ దంజనాద్రీశ్వరునిఁ
గలికి చూపులనె మదిఁగరఁగ జేసెదను

5. **పాడి - త్రిపుట :**

చనవు గలిగిన సరస మమరును సముకముననే మనసు దెలిసెద
మునుప నడుగరె మదన జనకుని ముద్దుటుంగరము

6. **వాఁట - ఆటతాళం**

మా యింటికిఁదానే రాఁగా మంకులు బొంకులుఁదేరె
వేయినేల నే మొక్కేనే వేంకటారాయునికి

7. **శ్రీరాగం - ఏకతాళి :**

అలరిన రతులఁ దొయ్యలు లాల నన్నుఁ
గలసె వేడుక శ్రీవేంకటవిభుఁడు

* * *

## భజన సంప్రదాయంలో తాళ్లపాకవారి పద్ధతులు:

దక్షిణాపథంలో భజన సంప్రదాయాన్ని నెలకొల్పిన కీర్తి తాళ్లపాక అన్నమాచార్యుల మనుమడు చిన్నన్నకే దక్కినది. పుదుక్కోటభాగవతులుగ ప్రసిద్ధి పొందిన గోపాలకృష్ణభాగవతులు, సంజీవిభాగవతులు దీనిని వ్యాప్తి లోనికి తెచ్చినవారు. ముత్యాలపేట భజనగోష్ఠికి చెందిన శ్రీ చింతామణి అయ్యంగారు ద్వారా నేను సేకరించిన (25-6-77) తాళ్లపాక వారి సంకీర్తనలను తొలిసారిగ ఈ గ్రంథంలో ప్రకటిస్తున్నాను. తాళ్లపాక చిన్నయ్యంగారు పాడి ప్రచారం చేసిన వీనిని చిన్నన్న రచనలుగానే వారు పేర్కొంటారు. చిన్నన్న ద్విపదరచనలేగాని పదరచనలేవి మనకు రాగిరేకులమీద లభించలేదు. ఉపలబ్ధమైన రాగిరేకులలో అన్నమయ్య, పెదతిరుమలయ్య చినతిరుమలయ్య సంకీర్తనలే ఉన్నవి. సుబ్బరామ దీక్షితులు రచించిన సంగీత సంప్రదాయప్రదర్శినిలో చిన్నన్న కృతులుగ రెండు ప్రకటింపఁబడినవి. "శ్రీహరిపాదతీర్థమే చెడని మందు", "నా

మొరాలింపవే అయ్య వెంకటరమణా". చిన్నన్నను మహా గాయకునిగా రేవణూరి వెంకటార్యుడు శ్రీపాదరేణు ప్రభావమునందు (I - 52) "మా తాళులపాక చిన్నన పదంబులు పాడిన నాడె సర్వరాట్ శైలవిభుండు" అని సగర్వముగ చెప్పుకొన్నాడు. "తాళ్లపాక చిన్నన్న దండె మీటులుగావు", "అల తాళ్లపాక చిన్నన్న రోమములైన తంబుర దండెకుఁ దంతులౌనె" అను వేణుగోపాల శతక కర్త మాటలు చిన్నన్న గొప్పగాయకుడని తెలుపుతున్నవి. (చూ. పీఠిక. పు. 3,4 రాళ్లపల్లి. శృం. సంపు. XIV తి.తి.దే. 1965). (నాట-జంపె)

ఈ భజనసంప్రదాయం తాళ్లపాక వారి 'జయజానకీరమణ' 'శరణు శరణు సురేంద్రసన్నుత' (ఆరభి - మిశ్రచాపు), 'మురహరనగధర' (మధ్య మావతి - ఆది) 'దేవేశగణారాధిత' (సావేరి-రూపకం), 'మాధవ భవతు తే మంగళం' (సౌరాష్ట్ర) సంకీర్తనలతో ప్రారంభమౌతుంది. దీనిని 'తోడై మంగళం' అని వ్యవహరిస్తారు. తాళ్లపాకవారి సంకీర్తనలతో పాటు జయదేవుని గీతగోవిందం, శ్రీకృష్ణలీలా తరంగిణి, నారాయణ తీర్థ, భద్రా చలరామదాసు, పురందరదాసు, సదాశివబ్రహ్మేంద్ర, గోపాలకృష్ణభారతి, త్యాగరాజాదుల సంకీర్తనలు కూడ ఈ భజన సంప్రదాయంలో గానం చేస్తారు.

తాళ్లపాక వారి రచనలుగా పేర్కొన్న వీనిని యథాతథంగ ప్రకటిస్తు న్నాను.

రాగం:మధ్యమావతి | తాళం: ఆది

పల్లవి

పంతము చెల్లెను పదపదరా
ఇంతలోనే తప్పులెంచకు పదరా

చరణాలు

1. రాని కోపమున రట్టుఁ జేసితి వెంతే
పానుపు మీదికిఁ బదపదరా

సోనల చెమటల సొలసితి వెంతే
తేనె మోవి దప్పి దీర్చుకో పదరా ॥పంత॥

2. అనుమానముల నలసితి వెంతే
పనిగలఁదికనైనఁ బదపదరా
నను నిటు చూడఁగ నవ్వితివెంతే
తనదగు నెప్పటి తావుకుఁబదరా ॥పంత ॥

3. వాసిగఁగాఁకలఁ బడలితివెంతే
బాసల నమ్మితిఁ బదపదరా
ఆసల శ్రీవేంకటపతి నీవిఁక
వేసారక రతి వేదికిఁ బదరా ॥పంత॥

రాగం: సౌరాష్ట్రం తాళం: చాపు

పల్లవి

జేరి వచ్చెను అలమేలుమంగ
జిలుగు పయ్యెద జారగ

అనుపల్లవి

గారవమ్మున వేంకటపతి పడకిల్లు
తీరని ప్రేమతో తిరిగి జూచుకొంట

చరణాలు

1. ముడిపూలు రాలగ ముంగురుల శ్యామ
విడెము కప్పురతావి వెదవల్లగ
ఒడలు వాడుదేర ఒంటికట్టుతోను
పడతి రవల గిల్కు పావల మెట్లతో

2. నికరంపు జవ్వాజి నిగ్గుల కస్తూరీ
యగరు కుంకుమగంధ మందుకొని
మగువ మోము నిదుర మబ్బుతేరగాను
నొగిలిన కెమ్మోవి నొక్కుల తోడను

## భగవత్ప్రబోధం

రాగం: భూపాళం తాళం: జంపె

### పల్లవి

శ్రీవేంకటేశ రాజీవాక్ష మేలుకొనవే
వేగవేగ మేలుకొను వెలిఛాయ లమరే

### చరణాలు

1. సురలు గంధర్వ కిన్నరులెల్ల గూడి తం
బురుశ్రుతులను జేర్చి సరవిగాను
అరుణోదయము దెలిసి హరిహరి యనుచు నర
హరి నిన్ను దలచెదరు హంసస్వరూప

2. అల చిలుక పలుకులకు నధరబింబము బోలె
తెలివి దిక్కుల మిగుల తేట బారే
అలరు కువగిరుల నుదయాస్త్రాద్రిపై వెలిగె
మలినములు తొలగ నిదో మంచు తెరవిచ్చె

3. తళుకొత్త నిందిరా తాటంకరవిరుచుల
వెలిగన్ను తామరలు వికసింపగాను
అలర్మేల్ మంగ శ్రీవేంకటాచలరమణ
చెలువు మీఱగను ముఖకళలు గనవచ్చె

రాగం: నాదనామక్రియ తాళం: చాపు

## పల్లవి

వేంచేయరయ్యా మీరు విడిదిండ్లకు
పాంచజన్యధరుఁడు పవ్వళించి యున్నాఁడు

## చరణాలు

1. గరుడ కిన్నర కింపురుషులార సిద్ధ
వరులార విద్యాధరులార
గిరివల్లభులార శరణాగతత్రాణ
బిరుదు వేల్పుని నగరు బీగముద్రలాయె

2. వేదాంబుధులార విబుధగణములార
సనకాదిమునులార ఘనులార
ఆదిత్యులార గ్రహములార దానవ
భేదినగరు తలుపు బీగముద్రలాయె

3. నాగకంకణులార గణనాయకులార
భాగవతులార దిక్పతులార
బాగుగ నలమేలు మంగపతి వేంకటేశ్వర
భోగివేల్పునగరు బీగముద్రములాయె

రాగం: యదుకులకాంబోది తాళం: చాపు

1. అప్ప దుండే కొండలోన ఇప్పపూల ఏరబోతే
ఇప్పపూలు కప్పలాయెరా ఓ వేంకటేశ
అప్పలుగల వాని వలనే ఓ వేంకటేశ.

2. ఆకాశాన పొయ్యేకాకి మూకజూచి కేకవేశే
మూక మూడు విధము లాయరా - ఓ వేంకటేశ
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశ.

3. అహోబిలయ్య గుంటలోన వొల్వాలు ఉదుక పోతే
వొల్వాలెల్ల మల్లెలాయే - ఓ వేంకటేశా
దీనిభావము నీకే తెలుసురా ఓ వేంకటేశా.

4. అహోబిలాన చెట్టు బుట్టె భూమి యెల్ల తీగపారే
కంచిలోన కాయ కాచేరా ఓ వేంకటేశా
శ్రీరంగాన పండు పండేరా ఓ వేంకటేశా.

5. పుట్టమీద చెట్టు బుట్టె భూమియెల్ల తీగపారే
పర్వతాన పండు పండేరా ఓ వేంకటేశా
అందవచ్చు కోయరాదురా - ఓ వేంకటేశా.

6. చేయిలేనివాడుకోశే నెత్తిలేని వాడుమేశే
కాళ్లులేని వాడు నడచే ఓ వేంకటేశా
పెదవిలేనివాఁడు చిలుక తినేరా ఓ వేంకటేశా.

7. గుంట యెండి పండు పండే - పండుకోశి కుప్పవేశే
కుప్పకాలి యప్ప తీరేరా - ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా.

8. సందెకాడ తల్రవాలు సంధిదీరి వేంకటరాయా!
తెల్లవారనాయనీడరా ఓ వేంకటేశ!
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశ!

9. ముత్యాల పందిటిలోన ముగ్గురు వేంచేశి రాగ
ముక్కంటిదేవుని జూచేరు ఓ వేంకటేశా!
దీని భావము నీకే తెలుసురా! ఓ వేంకటేశా!

10. ఏటిలోన వలవేశే తాటిమాను నీడలాయె
దూరపోతే వోటులేదురా ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా.

11. ముందు కూతు రాలు ఆమె ముందు అలు కూతురాయె
పొందుగా పెండ్లాము తానాయె ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా.

12. ఆకులేని అడవిలోన మూడుతోకల పెద్దపులిని
మేక యొకటి యెత్తి మింగేరా ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా.

13. పున్నమ వెన్నెంలోన వన్నెలాడితోను గూడి
కిన్నర మీటుము పాయ్యేవు ఓ వేంకటేశా
దీని భావము నీకే తెలుసురా ఓ వేంకటేశా.

14. అర్థరాత్రివేళలోని రుద్రవీణ నెత్తుకొని
నిద్రించిన నిన్ను పాడగ - ఓ వేంకటేశా
దీనిభావము నీకే తెలుసురా - ఓ వేంకటేశా.

రాగం: పంతువరాళి తాళం: చాపు

పల్లవి

ఓహో యన రయ్యా ఒకసారి - ఇట్టె
సాహసాన తిరుగ రోయి జంట భేరీ

చరణాలు

1. కోనేటిరాయఁడు కోరి నిద్రించి యున్నాఁడు
కోనలను తిరుగ రోయి కోట భేరి
వెనకటి వాకిండ్లు ఓగముద్రులైయున్నవి
ఘనముగ వాయించ రోయి ఘంట భేరీ

2. తిరుమణి మాడుగులో తిరుగు దేవతలెల్ల
మరువక తిరుగరోయి మట్టు భేరీ

పరగదేవతలెల్ల బడలికై యున్నారు
ఇరువంక చంద్ర సూర్యు లెదురు భేరీ

3. గొలుసులు బంగారు గొలుసులు ఘల్లనగ
కోటగస్తి తిరుగురోయ ఒకభేరీ
పలుమాఱు మీరందఱు మూలమూలలను
తలవరై తిరుగు రోయ తముకుభేరీ

4. శ్రీవేంకటేశుడు విత్తగించి యున్నాడు
కోవిదులై తిరుగురోయి కోటభేరీ
ఆవల బంగారుగుదియలు ఘల్లనగ
తావుల హనుమంతయ్య తలారిభేరీ.

రాగం: మంగళకౌశికి తాళం: ఆది

పల్లవి

ఆరగించె నమ్మ నేఁడు శ్రీవేంకటేశుఁడు

అనుపల్లవి

ఆరగించె నమ్మ నేఁడు ఆంౘనందఘను గూడి
సారెసారెకు నెంగిలి చవిఁజూచి సల్లాపముతోను

చరణాలు

1. ఉల్లాసము తోడ గొల్ల యువిదలతోఁ జేరుకొని
ముల్లోక మెల్ల నేలు శ్రీ మూర్తి పాలు పండ్లు బువ్వము

2. అంతరంగవాసమున నలివేణు లొప్పఁ మీఁద
వింత భక్ష్యభోజ్యముల వేడుకఁబెట్టిన విందు.

3. మందయాన శ్రీయలమేలుమంగ వేంకటేశునకు
నందు మోవి తేనియల నమరఁబెట్టిన విందు

రాగం: ఆహిరి　　　　　　　　　　　　　　　　　　　　తాళం: త్రిపుట

### పల్లవి

వీణ వాయించెనే అలమేలుమంగమ్మ　　　　　　　　　　　॥ వీణ॥

వేణుగానవిలోలుఁడైన వేంకటేశుల యొద్ద　　　　　　　　॥ వీణ॥

### చరణాలు

1. కురులు మెల్లన జాఱఁగ సన్నజాజి
   విరులు జల్లన రాలఁగ
   కరకంకణంబులు ఘల్లని మ్రోయఁగ
   మరువైన వజ్రాల మురుగు తూలాడఁగ

2. సందిటి దండలు కదలఁగా నాణిముత్యాల
   సరు లుయ్యాల లూఁగఁగా
   నందమై పాలిండ్ల నలఁదిన కుంకుమ
   గందము చెమటచేఁకరఁగి ఘుమఘుమనగా

3. ఘననయములు మెరయఁగా వింతరాగ
   మును ముద్దులు గులుకఁగా
   ఘననిభవేణి జంత్రగాత్రము మొరయఁగా
   వినెడి శ్రీవేంకటేశుల వీనుల విందుగా

రాగం: శంకరాభరణం　　　　　　　　　　　　　　　　　　తాళం: త్రిపుట

### పల్లవి

శరణాగతవత్సలా సర్వసులభా　　　　　　　　　　　　　॥శర॥

### అనుపల్లవి

పురుషోత్తమా నాచేతి పూజకైకొనవయ్యా

### చరణాలు

1. ముమ్మరంపు బ్రహ్మాండములు మోచు నీకు నే
చెంబులోను నీళ్లను చిలికించెదా
పమ్మిన యిందిరాదేవి పన్నెను వసంతమునీకు
సమ్మతించి మబ్బుదీర జలకమాడవయ్యా ॥శర॥

2. పట్టరాని విశ్వరూపములు చూపు నిన్నునేఁ
బెట్టెలోని సంచిలోఁబెట్టి కట్టెదా
పట్టమహిషి కౌసల్యా గర్భమున నున్నమేటి
పెట్టె చోటు వైకుంఠముగాఁ బెట్టు కొనవయ్యా

3. అలచరాచరములను నారగించునీకు నే
వెలయు కుండలోని నైవేద్య మిచ్చెదా
అలమేలుమంగా శ్రీవేంకటేశా మీరిది
వెలయు భరద్వాజుల విందుగాఁ గైకొనవయ్యా

రాగం: సౌరాష్ట్రం తాళం: ఆది

### పల్లవి

వీడే వెలకొన్నాడు శ్రీవేంకటగిరి మీద
వీడే కౌరవుల పాలిటికి విశ్వరూపుడితడు

### చరణాలు

1. త్రిపురంబులపై వ్రాలిన యాఘన తీవ్ర బాణమితడు
చపలపు బాణుని మర్మభేదియగు చక్రధరుడితడు
విపరీతము కంబములో వెలసిన వీరసిహ్మమితడు
కపటపు భస్మాసురుని పాలిటికి కాలదండమితడు

2. ధరణి కింద బలి నణచిన యాపాతాళభేదియితడు
పరశురాముని గర్వము నణచిన ప్రళయ వాయువితడు

ఒరసిన నరకాసురుని పాలిటికి ఉరుమని పిడుగితడు
దురమున నెదిరిన దనుజకోటులకు ధూమకేతువితడు

3. అదుగో విధిరుద్రాదుల కెల్లను ఆదిమూల మితఁడు
పదిలముగా తను గొలిచిన యాశ్రితపారిజాతమితడు
కదలని యా బ్రహ్మాండ కోటులకు కన్నతండ్రి యితడు
వెతకి వెతకి వరము లొసంగెడి వేంకటేపతి యితడు

రాగం: దేశాక్షి                తాళం: జంపె

పల్లవి

అదుగో కొలువై యున్నాడు - అలమేలుమంగపతి
పదివేల విధములను పారుపత్తెము జేయుచు

చరణాలు

1. రంగమండపములో - రత్నసింహాసనముపై
అంగనామణులతో - అమర వేంచేసి
బంగారు పావడలు - పసరింప యిరుగడల
శృంగారముగ సురలు - సేవ శేయఁగను

2. వెండిబైడి గుదియలను - వేత్రహస్తులు పొగడ
నిండు వెన్నెలపూల - దండ లమర
హుండిగను కానుకల - నొనర లక్కలు జేయ
దండి మీఱగ నిపుడు - దేవరాయడు వెలగి

3. అంగరంగ వైభవముల - రంగుగా చేకొనుచు
మంగళహారతుల - మహిమవెలసి
శృంగారమైనట్టి మా శ్రీవేంకటాధిపు
డంగనలు కొలువగా నిపుడు వేంచేసి

రాగం: నవరోజ్ తాళం: చాపు

## పల్లవి

జోజో దీనజనావనలోలా
జోజో యదుకుల తిలకా గోపాలా

## చరణాలు

1. వేదములు రత్నాల గొలుసులై యమర
వేదాంత మపరంజి తొట్లగా నమర
నాదము ప్రణవము పానుపై యమర
ప్రణవార్థమై యిచ్చట పవ్వళింపు స్వామీ

2. అతి చిత్రముగఁబది యవతారములఁబ్రోవ
అమరుచు పదినాల్గు జగములఁ బ్రోవఁ
బ్రతి యుగమున జనియించు మిగుల
ప్రబలి జన్మరహితుఁడనుకొన్న స్వామీ

3. శాంతియు మణిమయ మకుటమై మెఱయ
శక్తులు మహాహారమై మెఱయ
దాంతియుఁ గుసుమమాలికయై మెఱయ
ధరలో శ్రీవేంకటేశ రమణుడౌస్వామీ!

రాగం: శంకరాభరణం తాళం: జంపె

1. వటపత్రశయనుఁడా వార్ధి బంధనా
వసుదేవనందన లాలీ
చటులనాగము మీఁద సమ్మతితోను
జెలఁగి యూఁగినవాఁడ లాలీ

2. మీనమై జలధియును మెఱుఁగు బంగారు తొట్ల
మీఁద నూఁగినవాఁడ లాలీ

ఆనందకమఠమై యమృతమగు తొట్లలో
యమరి యూఁగినవాడ లాలీ

3. గోణంబు తొట్లలో కూటవరాహమై
గునిసి యూఁగినవాఁడ లాలీ
మానవసింహమై గడపతొట్లలోన
మరఁగి యూఁగినవాఁడ లాలీ

4. వామనుఁడై చాల త్రిభువనంబు తొట్లలో
వచ్చి యూఁగిన వాఁడ లాలీ
రాముఁడై జమదగ్ని యూపుతొట్లెలోన
రంజిల్లు వాఁడ లాలీ

5. ఆమీద రాఘవుఁడై పుష్పకపు తొట్లలో
నమరి యూగినవాడ లాలీ
మామ కొరకు గొల్లమంద తొట్లలో
మరగి యూగినవాడ లాలీ

6. తగు బుద్ధ రూపమున దయయను తొట్లలో
తన్ని యూగిన వాడ లాలీ
పొగడ కల్కియై ధర్మంబు తొట్లలో
పొసగ యూగినవాడ లాలీ

7. తగు అలమేలుమంగ కాఁగిలి తొట్లలో
తగిలి యూఁగినవాఁడ లాలీ
చిగిరించుమని మానసంబు తొట్ల మీఁద
శ్రీ వేంకటనాథ లాలీ.

రాగం: నాదనామక్రియ తాళం: ఆది

### పల్లవి

ఉయ్యాల యూఁపులు ఓ ముద్దులయ్యా
వెయ్యారు గోపికలు వేడుక నూఁచెదరు

### చరణాలు

1. భోగీంద్ర తల్పుఁడా భువన విఖ్యాతా
గోగోపరక్షకా కువలయాధీశా
ఆగమసన్నుతా యచ్యుతానంతా
యోగనిద్ర పోవయ్య యోగీంద్రవంద్య

2. దెసలందు వెలిఁగెడి దేవర్షివరులు
ప్రసరించి బంగారు భవనంబులోన
కొసరక నిద్రించు గోవిందా యనుచు
పసమీర పాడెదరు పన్నగశయనా

3. సన్నుతించెదరయ్యా సద్భాగవతులు
పన్నుగా శ్రీభూమి వనితలు చేరి
ఉన్నతి పదముల నొత్తెదరు నిద్రించు
వెన్నుఁడా ప్రసన్న వేంకటరమణా

రాగం: ఆహిరి తాళం: ఝంపె

1. ఉదయాస్త శైలంబు లూను కంబము లాయె
ఉడుమండలము మించు నుయ్యాల
అదిరి యాకాశమై యడ్డ దూలంబాయె
అఖిలాండములు నీ కుయ్యాల

2. మేలుకట్లే నీకు మేఘమండల మాయె
మెఱుఁగు జాలరి మెఱుపాయె నుయ్యాల

ఓలి బ్రహ్మాండం బొరుగునో యని భీతి
నొయ్య నొయ్యన నూఁతు రుయ్యాల

3. పదిలముగ వేదములు బంగారు చేరులై
బట్టబయలై తోఁచు నుయ్యాల
వదలక ధరణిదేవతయుఁ బీఠంబాయె
వర్ణింపఁదగు నీకు నుయ్యాల

4. కమలయును భూసతియుఁగదలమెదలక నిన్ను
కౌఁగిలింప నూఁతు రుయ్యాల
అమరాంగనులు నీకు వామభాగమునందు
అందంబుగా నూఁతురుయ్యాల

5. పాలిండ్లు కదలగాఁ బయ్యదలు జాఱఁగ
భామ లిరుగడ నూతు రుయ్యాల
నీల శైలము వంటి నీమేను కాంతియు
నిండి వెలిగించు నుయ్యాల

6. కమలాసనాదులకుఁ గన్నుల పండుగై
గణుతింపరాదు నీ కుయ్యాల
కమనీయమూర్తి శ్రీ వేంకటేశ్వరా నీకుఁ
గదువేడ్క లాయె నీ కుయ్యాల

రాగం: శంకరాభరణం తాళం: త్రిపుట

పల్లవి

దృష్టిదాఁకు మా యయ్యకు తెరవేయరే

అనుపల్లవి

దృష్టించెద రెవరైన దరిజేర నియ్యకురే

## చరణాలు

1. చప్పుడు సేయుట కవసరము గాదనరే
అప్పుడు మజ్జన మాడునని దెల్పరే
కప్పురంబు సురటుల గొలిచెదరనరే
అప్పుడు సతులంతోను నారగించినాడనరే

2. దంతపుఁ జవికెలో నేకాంతమాడు ననరే
అంతరంగమున నెత్తమాడెదరని తెల్పరే
దొంతిపూల తోట్లలోన దొమిగూడి యున్నాఁడనరే
చెంత కేళాకూళిలోన జిత్తగించి యున్నాఁడనరే

3. పట్టపురాణియుఁదాను బవ్వళించియున్నాఁడనరే
రట్టుసేయ నిందెవరైన రానీయకురే
పట్టపు అలమేల్మంగపతి శ్రీవేంకటేశ్వరుఁడు
సృష్టిలోకకర్తగాన సేవించి పొమ్మనరే

రాగం: నీలాంబరి తాళం: ఝంపె

1. నారాయణా వాసుదేవ నగధర నారసింహ
శ్రీరామ పూర్ణకామ శ్రీకృష్ణ పవ్వళింపు

2. కరివర కరుణాకర కమలాక్ష గరుడేశ
మరువంపు శయ్యమీఁద మన్నారు పవ్వళింపు

3. కాకుత్థ్సకులనాథ కావేరిరంగనాథ
పాకశాసన వినుత పరమాత్మ పవ్వళింపు

4. గోపికాదధిచోర గోవర్ధనోద్ధార
పాపసంఘవిదార భయహర పవ్వళింపు

5. వేదాంతశ్రుతిసార విశ్వరూపవిహార
మాధవీకుసుమహార మాధవ పవ్వళింపు

6. విదురు నింటికిఁబోయి విందారగించితివి
నిదుర పోవయ్య కృష్ణ నిర్మల పవ్వళింపు

7. కమలసంభవనుత కరిరాజవరద శౌరి
విమల కస్తూరిరంగ వేడ్కతోఁబవ్వళింపు

8. పరమేశ పరమపురుష పరిపూర్ణభక్తరక్ష
విరుల పానుపుమీఁద శ్రీవేంకటేశ పవ్వళింపు

* * *

'దోమటి' శబ్ద చర్చ:

ఈ సంపుటంలో ప్రయోగాలు.

దూరుగా నీమోవి గొల్ల దోమటాయ ననఁగాను
నారుకొన్న ప్రేమతోడ నవ్వితి మిందరము (2)

కడమ లెక్కటి వేఁక కానవచ్చిన పనికి
జడిసి దోమటి విందు చవివుట్టీనా (298)

వోముక మారుమొగమై వూరకుందాన ననేవు
దోమటి గొల్ల మాటలు తోఁచీనా మాకు (327)

వేమారు నడవులెల్ల వెదకించె వలపు
ఆముకొని గొల్లదోమటాయ నదె వలపు (390)

దోమటి చుట్టరికాలు తోయఁగరాని తగుళ్లు
భామలగంటే మనసు పట్టనెట్టు వచ్చును. (533)

ఈ శబ్దార్థ నిర్ణయం చేయడానికి ముందు ఈ శబ్దంగురించి చేసిన చర్చలను పరిశీలిద్దాం

1. ఆమని పులకలలో నాసలు పెనగొనఁగ

<u>దోమటివి</u> వద్దివారితో నవ్వవలెవా (శృం.సంపు. XIX - 25)

పడఁతి నీ పతికె భాగ్యములు

తొడిఁబడ దొరకెను <u>దోమట్లు</u> (శృం. సంపు. XIX -129)

"అన్నము అని సూ.ని.శ.ర. లిచ్చిన అర్థము ఇక్కడ పొసగదు. <u>'దోమటి దొడుకు'</u> అను ప్రయోగము శబ్దపల్లవము వలె పలుచోట్ల నిందు కానవచ్చుచున్నవి. అని రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తెలిపిరి. (శృం. సంపు. XIX సందిగ్ధపదసమీక్ష, పు.5 తి.తి.దే. 1965).

2. కోరినన్నుఁగౌఁగిలించి కొత్తలుగా నాడేవు

దూరనేలె గొల్లవారి <u>దోమటం</u>టానే (శృం. సంపు. .XXIV - 186)

"దోమటి: అన్నము అని శ.ర.సూ.ని. ఆయర్థ మీ వాఙ్మయమున సరిపడదు. మడ్డితనము, మొరటుతనము దొమ్మివంటివి కావచ్చు. ఈపద మీవాఙ్మయమున విపులముగ నున్నది. <u>"దోమటి దొడుకు"</u> అని జంట గనుగలదు. (గౌరిపెద్ది రామసుబ్బశర్మ. సందిగ్ధపదసమీక్ష శృం. సంపు. XXIV పు. 431 తి.తి.దే. 1977)

వేటూరి ఆనందమూర్తిగారు మరికొన్ని ప్రయోగాలను ప్రదర్శించి,

దోమటి రతులలో (సంపు. 3-120)

గొల్లదోమటి చేసిరి గొల్లెతలందరును (3-135)

దోమటి నింతెరగరా (7-181)

దోమటి మరుబలము దొమ్మెనట్లున్నది

దోమటి కర్మలు చేపి తుదకెక్కేవాఁడనుగాను (8.181)

మఱి యేటి సుద్దులు మమ్మడిగేవునీవు

మెఱపి మీ యిక్కువలు మించెను దోమటై (14-174)

సూ.ని.లో "దోమటి - అన్నము చి.ని.శ.ర. ఈక్రింది ప్రయోగములను బట్టి ఔపవిభక్తికముగాఁ దోఁచుచున్నది. కాని ప్రథమాంత రూపమునకు

ప్రయోగములు కానరావు" అని వివరింపఁబడినది. కాని తాళ్లపాకవారి ప్రయోగమును బట్టి 'దోమటి' పదమునకు అన్నము అను నర్థము పొసగదు. అర్థమింకను విచార్యము. అని తెలిపిరి (చూడు. తాళ్లపాకకవుల పదకవితలు - భాషాప్రయోగ విశేషములు పు. 454 డాక్టర్ వేటూరి ఆనందమూర్తి . 1976).

ఈ శబ్దంగురించి ప్రస్తావించినప్పుడు "సమగ్ర ఆంధ్రసాహిత్య" స్రష్ట శ్రీ ఆరుద్రగారు "Dravidian Gods in Modern Hinduism" అనే గ్రంథంలో "Perantalu worship" అనే అధ్యాయంలో విషయాన్ని నాదృష్టికి తెచ్చినారు. W.T. Elmore వివరించిన ఆవృత్తాంతాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాను. (ఎల్మొరేగారి ఆంగ్లానికి నా స్వేచ్ఛానువాదం).

భర్తజీవించి ఉన్న ఇల్లాలిని పేరంటాలు అంటారు. ఆమెను చాల అదృష్ట వంతురాలుగా భావించి గౌరవిస్తారు. పతివ్రతను, సంతానవతిని, భర్తకంటె ముందు గతించిన స్త్రీనికూడా పేరంటాలని వ్యవహరిస్తారు. కందుకూరు తాలూకా మత్స్యవరంలో దానధర్మాలు చేసి తటాకాలు నిర్మించి గతించిన అత్తాకోడళ్లను పేరంటాళ్లుగా రెండురాళ్లను స్థాపించి పూజింపసాగినారు. బుచ్చమ్మ లింగమ్మలను కూడా నెల్లూరు జిల్లాలో ఇట్లానే పూజిస్తారు.

కందుకూరు తాలూకా పోకూరులో ఉసూరమ్మ అనే పేరంటాలు గ్రామదేవతగా పూజింపబడుతున్నది. గ్రామ సరిహద్దుల్లో మొండిగోడల మధ్య ఒక బండరాయిని ఉసూరమ్మగా పూజిస్తారు. తర్వాత ఒక పంచలోహ విగ్రహం ఏర్పడింది. దానిని ఉత్సవాలలో ఊరేగింపులో వాడుతారు. ఇది మాత్రం బ్రాహ్మణుల ఆధీనంలో ఉంటుంది. కేవలం ఆ ఊరికే పరిమితమైన ఈ గ్రామదేవతను కొలవడానికి చుట్టుప్రక్కల గ్రామాలనుండి కూడ జనం విరివిగా రాసాగినారు. ఆమెను చాలా ఆత్మీయంగా పూజిస్తారు. చాలాదయగల తల్లి అని స్తుతిస్తారు. దుష్టగ్రహపీడలను తొలగించే శక్తిగా, పాడిపంటలను సమృద్ధిగా పండించే దేవతగా ఆమెకు ఎనలేని కీర్తి ఉన్నది. ఈ ఉసూరమ్మకు పూజాపునస్కారాలు నిర్వహించేది

గొల్లపూజారి. వారంవారం ఆమెకు అభిషేకం చేసి పసుపు కుంకుమంతో క్రొత్తకోకలతో అలంకరిస్తారు. ఇట్లా పూజలు చేయడమేకాదు, చాలా మాహాత్మ్యం ఉన్న తల్లిగా భావించి మ్రొక్కులు మొక్కుకుంటారు. వాళ్ల కోరికలు ఈడేరుతూనే పసిపిల్లలను గుళ్లో కూర్చోబెట్టి ముఖాలు కడిగి పసుపుకుంకుమపెట్టి లడ్డు, మిఠాయిలు పంచిపెడతారు.

ప్రతి సంవత్సరం ఉసూరమ్మకు పెద్ద ఉత్సవం జరుగుతుంది. బాగా డబ్బుతో కూడుకొనే వ్యవహారం కాబట్టి సంవత్సరానికో మూడేండ్లకొకసారో తప్పనిసరిగా నిర్వహిస్తారు. ఈ ఉత్సవం ఐదురోజులపాటు జరుగుతుంది. మొదటిరోజు ఊరేగింపులు గుడిచుట్టూ మూడుమార్లు ప్రదక్షిణగా నిర్వహిస్తారు. తర్వాత రాత్రి గొల్లపెద్దలు పాత కథలన్నీ వినిపిస్తారు. రెండవరోజు విందు. ఇది ఒక జమ్మి చెట్టుక్రింద ఏర్పాటుచేస్తారు. ఆ చెట్టుమీద దయ్యాలు, భూతాలు ఉంటాయని విశ్వాసం. విందు తర్వాత తొలిరోజు లాగానే కథలు వినిపిస్తారు. మూడవరోజు ఊరేగింపులు కథాకాలక్షేపాలు సాగుతాయి. గొల్లపూజారి కుటుంబం నుండి ఒక మగవాడు ఆడవేషం వేసుకొని పల్లె అంతా తాను గంగమ్మనంటూ తిరుగుతాడు. అతడి ముందు మాదిగవాడు కొమ్ము ఊదుకుంటూ పోయి డబ్బు, ధాన్యం వసూలు చేస్తాడు. నాలుగోరోజు మొక్కులు మొక్కుకున్న ఆడవాళ్లు మధ్యాహ్నందాకా ఉపవాసం ఉంటారు. ప్రతి ఇంటినుండి గ్రామం మధ్యదాకా కోకలు పరుస్తారు. ఆడవాళ్లు పళ్లాల నిండుగా 'ఉగుమంచిభోజనం' తయారుచేసుకొని ఆ కోకలమీద నడుస్తూ ఊరి మధ్యకు చేరుకుంటారు. ఊరు నడిమధ్య అందరూ చేరుతూనే తప్పెట్ల మోత కొమ్ముల శబ్దం ఓగ్గరగా చేస్తారు. ప్రధాన కథకుడు ముందుకు వస్తూనే శబ్దాలు క్రమంగా తగ్గిపోతాయి. అతడు గొంతు పెద్దదిగ చేసి రక్తంవేడెక్కే వీరగాథలను వినిపిస్తాడు. కొమ్ములు తప్పెట్లమోత తోడుగా అందరూ వీరతాండవం చేస్తారు. ఇంతలో ఒక కథకుడు ముందుకు వచ్చి దబ్బలంతో దవడలకు ఎడంవైపు కుచ్చుకొని కుడివైపునకు దారం లాగుతాడు. ఇదొక మొక్కుగా మొక్కుకున్నవారంతా అతడిలాగానే చేస్తారు. ఉన్నట్లుంటి అక్కడ చేరిన వారంతా బ్రహ్మాండమైన గుంపుగా కూడి కానుకలు తీసుకొని ఉసూరమ్మ

గుడివైపు వెళ్తారు. వాళ్లు నడుస్తూ ఉంటే వాళ్లకుముందు చాకలివాళ్లు కోకలు పరుచుకుంటూ పోతారు. మరికొందరు ఆకోకల్ని చాందినీల్లాగా (కప్పుల్లాగ)పైన పట్టుకుంటారు. అట్లా కోకలమీద నడుస్తూనే గుడిచుదు తూంటారు. దేవతముందు సాగిలపడి మొక్కుతారు. అక్కడ బ్రాహ్మణులు గొల్లపూజారులు వాళ్ల కానుకలను తీసుకొని అమ్మవారి కర్పిస్తారు. కోకలు మాత్రం తెచ్చినవారికి తిరిగి ఇచ్చేస్తారు. ఆ సాయంకాలం గొల్లవాళ్లు దోమడి(టి) ని పాటిస్తారు. దోమడి అంటే ఉత్సవవిందు. పెళ్లైన ముత్తై దువులు మాత్రమే భర్తలతో కలిసి ఆ విందులో పాల్గొంటారు. ఇదంతా ఒక జమ్మిచెట్టు క్రింద జరుగుతుంది. దుష్టశక్తులను పారదోలడానికి తప్పెట్లు వాయిస్తారు. కథకులు, కొమ్ములు ఊదేవాళ్లు గొల్లల పురాణం వినిపిస్తారు. ఒక్కొక్క వాక్యం పూర్తౌతూనే అన్నం ముద్దలను గాలిలోకి విసిరేస్తారు దయ్యాలకు, భూతాలకు. ఈ విందు తతంగం ముగుస్తూనే ఒక గొర్రెను కట్లువిప్పి వదిలివేస్తారు. ఎవరు దాన్ని పట్టుకొని నరుకుతారో వారికి బహుమానం యిస్తారు. అందుకని జనం ఆ పేదజంతువు వెంటపడి ముక్కలు ముక్కలుగా నరుకుతారు. అట్లా గొర్రెను పట్టుకోగలిగితే ఆ అమ్మవారికి సత్యం ఉన్నట్లు. ఇది చాల అనూచానంగా వచ్చే గొల్లల ఆచారం. ఆరాత్రి గొల్లవాళ్లు గిరిరాజు రేణుకల్లాగ వేషాలు వేసుకొని గొల్లపురాణంలోని దృశ్యాలను సన్నివేశాలను ప్రదర్శిస్తారు.

ఐదవరోజు పండుగ ఇంకా జోరునందుకొంటుంది. బండ్లు కట్టుకొని గుడిచుట్టూ చేరుతారు. ఇక్కడ ఒక భయంకరమైన వేడుక జరుగుతుంది. బండికి ఒక పెద్ద గుంజనాటి దానిమీద అడ్డంగా ఒక కొయ్య కడ్తారు. ఒక వైపు మేకను వేలాడదీసి దానితోపాటు ఒక ఇనపకొక్కెంతో మనిషి వీపుకు కుచ్చి కట్టివేస్తారు. మరొకవైపు బరువు తులతూగడానికి రాయిని కడ్తారు. బండిని చుట్టూ తిప్పుతారు. పైన మేక మనిషి గిరగిర తిరుగుతూ ఉండగా ఆమనిషి క్రిందున్న మనుషులమీదికి తమలపాకులు విసిరేస్తాడు. ఈ వేడుక సాయంకాలందాకా ఇట్లానే సాగుతుంది. సాయంకాలం ఒకమాదిగవాడు యోధునిలా వేషంవేసుకొని గొల్లపురాణంలోని సన్నివేశాలను ప్రదర్శిస్తాడు. ఒక పెద్ద గుంజను తీసుకొని కత్తితో నరుకుతాడు. తర్వాత చిందులు

తొక్కుతూ గుడిచుట్టూ తిరుగుతాడు. అంగళ్లవాళ్లు వానిచుట్టూచేరి బహుమానాలు తీసుకోమని బ్రతిమలాడుతారు. అట్లా వాడు కానుకలు స్వీకరిస్తే ఊసూరమ్మ అనుగ్రహిస్తుందని వాళ్ల విశ్వాసం.

ఈ ఉసూరమ్మ జాతర లాగానే మధుర జిల్లాలో మరియమ్మ అనే దేవతకు కూడ జాతర జరుగుతుందట. (Chapter IV. Perantalu Worship from Dravidian Gods in modern Hinduism by W.T. Elmore - Asian Educational Services, New Delhi - 1984.)

## "మాచునూరు కైఫియ్యతు"

కైఫియ్యతు మం॥ మాచునూరు సముతుపైడి కాలువతాలూక కాములాపురం మం॥ మజుకూరు కరణం నందవైదీకి వెంక్కటప్ప వ్రాయించినది.........*

కాంలాపురానకు దక్షిణ భాగమునందు మూదు పరువుల దూరమున పాపఘ్నినదీ తీరమునందు నదికి దక్షిణభాగమున ద్వాపారాంత్యం వరకు జాంబవంత్వాశ్రవమయిన షువంట్టిస్థలమందున కలయుగమున కొంత్తకాలం జరిగిన పిమ్మట మాచన అనెవాడు ఆవులమంద నిలుపుకొని అరణ్యామధ్యమందు వుండెవాడు గనుక పయా (ర్యా)యం చెత వానిపెరనె అక్కడ గ్రామం నెగిడి అది మాత(చ)నవోలు అనివాడుకోబడెను. యిం(విం)ద్యానగర శింహ్వాసనాధీశ్వరులయిన రాజులుయేలబడిన ఘండికోట శీమలోకి చెల్లుతూవుండెను. యీవల అచ్చుతదేవమహారాయులు వింద్యానగర శింహ్వాసనాధీశ్వరుండ్డై రాజ్యముయేలుతూవుండి తాళ్లపాక చింనంన్నగారికి జాగీలున్ యిచ్చిన సర్వాగ్రహారాలు వివరము...... యీమాచునూరు గ్రామం వీర శ్రి అచ్చుతరాయమహారాయులు విజయనగరమందు రాజ్యంయేలుచూవుండి శ్రీమద్వేదమాగన్ ప్రతిష్టాచార్యులయిన తాళ్లపాక పెదతిరుమలయ్యు

---

* Govt. Oriental Manuscript Library, Madras. L.R. Vol.II Meck. Mss.15-3-56. BK.NO.44, 841590. P.262.

గారికి అగ్రహారముగా యిచ్చివుండిరి అది వరకు గ్రామం ఖిలపడివుండగాను తాళ్లపాక తిరుమలాచార్లవారు గ్రామానకు వచ్చిచూచి గ్రామానకు అయిన పొలం అంత్తా అరణ్యము బలిశివుండగాను ఆయనచేతినుంచి విస్త రించి ద్రవ్యం వ్రయము చేశి అరణ్యము అంత్తా నరికించి బస్తీ చేశిరి. ఆగ్రామం తిరుమలయ్యగారికి అష్టభోగతేజస్వామ్య సవాతముగాను రాయలు ధారపోశియిచ్చివుండె గనక ఆగ్రామానకు తత్పూర్వము వున్న కరణములు నందవైదీకులై గ్రామములో కరణీకమునకు తమహస్తకులు వుంచుకుని గ్రామములో విస్తారంగా నగల్లున్ కట్టుకుని అక్కడ నివాసము చేసుకుని వుండ్డె. ఆ గ్రామానకు అయ్నుపొలం యావత్తు ఫలపర్చుకుని తామె అనుభవిస్తూవున్న వారైరి. అప్పుడు గ్రామానకు తూపున్ విఘ్నేశ్వరునిదేవా లయం కట్టించి గ్రామానకు దక్షణభాగమునందునను యీశ్వరునిదేవాలయం కట్టించి గ్రామానకు పశ్చిమభాగమందున శ్రీ ఆంజనేయ దేవాలయం కట్టించ్చి గ్రామానకు మధ్యభాగమందునను శ్రీచెన్నకేశ్వరదేవునికి ఆలయం కట్టించి విగ్రహం ప్రతిష్ట చేయించి ఆ దేవాలయములలో పూజపునస్కా రములు యథావిధిగా నడిపిస్తూ వుండిరి. యీ ప్రకారం జరుగుతూ వుండగాను వఖనాడు తిరుమల దెవాలయములో చోరులు ప్రవేశం అయి శ్రీస్వామి సన్నిధిని వున్న వుత్సవవిగ్రహము సంపుటములోకూడా అపహ రించుకుని తిరుమలగడిచి యీవల కొంత్త దూరము మిగిలివచ్చినంత్తట ఆచోరులకు ప్రపంచము దృష్టికి యంత్త మాత్రము గొచరముకాక అంధకారమై ిండా వ్యాకుల పడుతూవుండగాను శ్రీస్వామికి కరుణవచ్చి మీరు దౌజన్న్యం వహించి మహాస్థళమునుంచి నన్ను నిష్కారణముగా తెచ్చిన వాడ్లు అయితిరి. అందుచాత మీకు యీదురవస్థ సంభవం అయినది అయినాగాని యిప్పుడు యీ సామీప్యములో వఖగ్రామం యందు నాకుమిక్కిలి భక్తుడు తాళ్లపాక పెద తిరుమలాచార్యులు అనివున్నాడు. అక్కడకు నన్ను తీసుకొనిపోయి అప్పగింత్త చేశినట్టు అయితే మీకు తీరుగా నేత్రములు చక్కపడుతవి అని ఆనతియివ్వగాను మహాప్రసాదమని ఆ చోరులు తీసుకుని సహాయం మనుష్యుల వెంట తీసుకుని తాళ్లపాక

తిరుమలయ్యగారు యంక్కడ వున్నారని అడుగుతూ రాగాను మాచనూ రుగ్రామముయందు వున్నారని వత్తన్‌మానం తెలిశినందునను ఆచోరులు ఆవిగ్రహమును తీసుకుని మాచనూరికి వచ్చి తిరుమలయ్యగారి వద్దికి పోయి తాము అపహరించి తెచ్చిన విగ్రహ సంపుటముతో కూడ వారికి వప్ప చెప్పినంత్తట వాళ్లకు నేత్రములు యప్పటు వలె చక్కనాయను తదుపరి తమవృత్తాంత్తము యావత్తు తిరుమలయ్యగారికి యరుక చేసుకుని తరువాత అర్పన తీసుకుని చోరులు నిజెశ్చగా పోయిరి. అటుపింమ్మట తాళ్లపాక తిరుమలయ్యగారు ఆ సంపుటము బీగము తీశి లోవిగ్రహము చూచి సంప్రోక్షణ చేశి యింటివద్ద వుంచి పూజచేస్తూవుండి ఆ విగ్రహము శ్రీస్వామి సంన్నిధి విగ్రహము గన్క తీరుగా తిరుమలకు అర్పించవలెనని యోచనచేసి సంన్నిధిలో వుత్సవిగ్రహము చొరులు అపహరించి తెచ్చి మధ్యను వాండ్లకు వుపద్రవం అయినంత్తట నిండా బాధపడితె శ్రీస్వామికి కరుణపుట్టి శ్రీస్వామి తాళ్లపాక తిరుమలయ్య అనిమాచనూరులోనా భక్తుడు కలడు వప్పచెప్పమని ఆజ్ఞ సాయిచ్చినారని ఆ చొరులు తాముతెచ్చిన విగ్రహము సంపుటములొ కూడా తెచ్చి యిక్కడ మాచనూరులొ వప్పచెప్పిబొయిరి కాబట్టి యీ విగ్రహం తిరుగా తిరుమలకు వెంచ్చేపు చేసుకుపొంమ్మని తిరుమలలొ శ్రీస్వామి సంన్నిధిని ముఖ్యస్తులయిన వారికి వత్తన్‌మానం అంప్పించగాను వారు అదె ప్రకారం మాచనూరికి శ్రీస్వామినిమిత్తము పాలకీ తీసుకుని మరుదివసమందు తర్లిపోవలెనని తిరుమలలో వుద్యుక్తు లయి వుండగాను ఆ రాత్రి శ్రీస్వామి తిరుమలనుంచి విగ్రహం నిమిత్తమై మాచనూరుకు రానుద్యుక్తులయినవారికి స్వప్నయవస్థ యందు సాక్షాత్క రించ్చి చా(తా)ళ్లపాక తిరుమలాచార్యుల వద్దనె వెంచ్చేశివుండవలెనని అభిలాష వున్నదిగన్క ఆ విగ్రహం తీరుగా తిరుమలకు తే అక్కరలేదని ఆజ్ఞ యిచ్చినందున వారు తెలుసుకుని ఆవతన్ మానము మాచనూరుకు తిరుమలయ్యగారికి అంప్పించి విగ్రహం మాచనూరులొనె తిరుమలయ్యగారి వద్దనె వుండనీ అని వూరికెవుండిరి. అప్పుడు యావత్తన్ మానములు అచ్యు తరాయ మహారాయలవారికి యెరుక చేసినంత్సట మాచనూరులోకి వేంచేశి

శ్రీస్వామికి అచన్న దీపారాధన మహోత్సవములు చక్కగా జరగవలెను అని ములికినాటి శీమలోను తుంమ్మలూరు గిద్దలూరు శీమలోను వుడదుత్తిన్ దువ్వూరు శీమలోను కామనూరు అవిదెన అగ్రహారమునకు చెల్లెవేటపల్లె యీ గ్రామములు జాగీలున్ యిచ్చినారు యీ గ్రామములు తాళ్లపాక వారికి నడుస్తూ వుండెను అని పరోక్షంగా వినబడడెమెకాని తాళ్లపాకవారి శకం(?) మాచనూరులోను వున్న అన్నమాచార్యులు చిన్నంనగారు యీవుభయులు తమయొక్క యధాధన్మైన పూర్వం భోగపట్టాలు వ్రాయించె దానికి శక్తులు కారుగనక ఆగ్రామములకు పోయి శిలాశాసనములు భోగపట్ట విచారనియ్యం చేశినంత్తటగాని కృతనిశ్చయంకాదు మాచనూరు గ్రామం తాళ్లపాకవారికి అగ్రహారంగా నడిచినందుకు శిలాశాసనము వల్ల రుజువువు న్నది. యెమంట్టె యీవల సదాశివదేవమహారాయులు రాజ్యం చెశెటప్పుడు శాలివాహన శకం ౧౪౭౫ అగునేటి పరిధావి సంవత్సర మాఘ బ ౭ లు మాచనూరు పర్వతస్థళమందువున్న వీరముష్టివారికి మాచనూరి గ్రామస్తులు యెటా యిచ్చెటి వీరముష్టి పంన్ను ముక్తిస్థానం పరమేశ్వరునికి రాచవీటి వేరేశ్వరునికి దారాపూర్వకముగా యిచ్చి శిలాశాసనం వ్రాయించినాడు. ఆ శాసనములోను ఘండికోట రాజ్యానకు చెల్లెటి తాళ్లపాక వారి మాచనవారి అగ్రహారమందు ముక్తిస్థానేశ్వరునికింన్ని దిపారాధనకు పర్వ తెశ్వరునికిన్ని రాచవీటి వీరేశ్వరునికిన్ని శివాచారానకు లోనైన వీరముష్టి పెద్దల పుణ్యం గాను దారపోశి యిచ్చిన ధర్మశాసనం అని వ్రాశివున్నది. సదర వాశాసనం మవుజె మజుకూరులో యీశ్వరుని యొక్క చి(శి)దిలమయిన దెవాలయం వద్ద పూడిచివున్నది. యీప్రకారం నడుస్తూ శాలివాహన శకం ౧౪౭౮ పింగళసంవత్సర పౌష్య శువలు సదాశివరాయులు నాడు కనమకింద తండునావుల అనె గ్రామం సర్వాగ్రహారంగ్గా యిచ్చి నాగరు తాంమ్రశాసనం యిచ్చినారు. ఆ తాంమ్రశాసనం నకలు వవాదాఖలు చేశినాను తరువాత శాలివాహన శకం ౧౫౩౨ అగునేటి సాధారణ నామసంవత్సరం వరకు రాయపీఠం వున్న పర్యంత్తరం తిరుమలాచార్యుల వారి తాలూకు ముసలి అన్నమయ్య్య వారి వరకు రే(ఏ)క భోగం సర్వాగ్రహారం నడిచినది అంత్తట రాయపీఠం

నిలిచిన తరువాతను శ్రీమాన్ మహామండలేశ్వరులయ్ను మట్లి తిరువెంగళ నాధరాజుదేవ చోళమహారాజులుగారు శిద్ధవటం రాజ్యం యేలుతూ వుండ్డి అప్పుడు తమతాలుకు చెంత్తలపల్లె తిరుపతిని అంప్పించి మాచనవోలు గ్రామం తోరణకట్టించగా అప్పుడు ముసలి అన్నమయ్యగారు రాజుగారి తావుకుపోయి అక్కడ దశన్నం అయి మాకునడిచె గ్రామాదులు అంన్ని తొరణకట్టి జప్తి చేసుకుపోతేను మాకు నిభావు యేబ వున్నది అని శృతపర్చగాను అప్పుడు ఆ రాజుగారు విచారణీయ్యం చెయించ్చిరాయల నాట నుంచ్చి అదివరకు తాళ్లపాకవారికి నడుస్తూ వున్నగ్రామాదులు తుంమ్మలూరు పుడదుత్తిన్ కొమనూరు వేటపల్లె మొదలయిన గ్రామాదులు జప్తి చేయించ్చి మాచన వోలు గ్రామం యక్కు ముసలంన్నయ్య వాలన్‌కు అష్టభోగ తేజస్వామ్యము స్వాధీనము చేసుకు చాతుభాన్‌గం వారు తీసుకు శేషించినమూడుభాగాలు సరకారుకు యిచ్చెలాగున నిష్కరష చేసుకు తదారభ్యం ఆ ప్రాకారం అను భవిస్తూవుండగా తురకప్రభుత్వం చేస్తూవుండినప్పుడు మ్లెచ్ఛ దరబారుగనుక తాళ్లపాక అయ్యవాలున్ తాము దరుబారు పోవడానకుయుక్తం కాదు అని గ్రామస్తులకు దరబారు పంప్పించె వరకు గ్రామం సర్కారు జప్తిచేసుకు బేరీజు కాయంజేసి అంప్పించిరి యీ వర్త-న్‌మానములు గ్రామస్తులు వచ్చి అయ్యవాలన్‌తాను మనవిశాయగాను అయ్యవాలున్ గ్రామస్తులమీదను కోపంచేశి అయ్యవాలున్ దరబారుపొయి అక్కడవారి జాగానువున్న ఉద్యో గస్తుల తోను శృతపరచగాను వారు మనస్కరించి అయ్యవాలన్‌ను వెంట బెట్టుకపోయి నవాబుదరిశనం చెయించిన తరువాతను వారు చెప్పకొగా వారు దయచేశి నినన్ యించినది చేను ౯ మడి 21 తూ ౧ కి కాత్తి ౯ కానకు ౪౩ మూడేశిర్కులు - కాడారంభం చేసుకు ౨ రెండ్డు శిర్కులు వైశాఖం నీరారంభానకు ౧॥కు నడుంగా కడారంభం చేను ౨౧ వ ౧ కి 3 ర్యను వెల్లయత్తుకు కాత్తీ ౯ కం తు ౧ వైశాఖం తూ ౧ కి ౦॥ ర్యను యిదిగాక సర్వమాన్యం చేను 20 ॥ పందుము మడి 20 ॥ పందుము వుభయం చేనుమడి 21 యీప్రకారం నిష్కరషచేశి యిచ్చి గ్రామం సర్కారుకు దాఖలు చేసుకునిరియీ ప్రకారం అయ్యవాలున్

అనుభవిస్తూవుండగా బుస్సాజివారో తరపుదారు కడవగారు యీదేశం ప్రభుత్వం చేస్తూవుండగాను తాళ్లపాక ముసలంన్నమయ్యగారి సంతతివారు తిరుమలాచార్యులవారు చెప్పకొని దీపారాధనకు చాలదు అని శృతపర్చగాను వారుమనస్కరించి దీపారాధనకు శెలవు యిచ్చినది గంగిరెడ్డి కాలును చేను అ ౧ మడి ఖం ౭ వుభయం ఖం ౭౧ తదారభ్యం యీప్రకారం తాళ్లపాక వారు అనుభవించ్చు కొచ్చూవుండిరి.

ఇందులో నాకైవాడము లేదు. కైఫియ్యతులోనిది "మక్కికి మక్కి" పొందుపరచినాను. కనుమరుగైన వేలకొలది అన్నమయ్యపాటలను తలచు కొని నిట్టూర్చి ప్రయోజనం లేదు. వెలుగు చూసిన వేలకొలది పాటలను పరిశీలించి అందులో దాగిఉన్న శబ్దార్థనిధులను వెలికి తీయవలసిన బాధ్యత మనమీద ఉన్నది. పదప్రయోగాలకు ప్రత్యేకమైన నిఘంటువును సిద్ధం చేసుకోవలె. అందుకు కళాసాహితీరసికులందరు నడుంబిగించి ఆ సారస్వతక్షీరసముద్రంలో ఈదవలసిందే. పారమార్థిక చింతనతో మనమంతా ముందుకు సాగినప్పుడే తాళ్లపాకభక్తకవులందించిన "శ్రీనివాస భక్తిప్రబంధం" వర్చస్స్వంతంగ నిలుస్తుంది.

ఇప్పటికే గ్రంథం పెద్దదయినది. ఈ సంకీర్తన సంపుటాన్ని ఎద్ధం చేయడంలో నాకు సహకరించిన ఆత్మీయమిత్రము చేట్లూరి శేషాద్రికి, నా సహధర్మచారిణి చి.కుం.సౌ.రుక్మిణికి, ప్రూఫులు దిద్దడంలో సహాయపడిన నాకుమార్తె చి. వైజయంతికి శ్రీనివాసుని అనంతమంగళాశాసనాలు.

ఈ పరమభాగవత కైంకర్యానికి అవకాశం, ప్రోత్సాహం కలిగించిన తి.తి. దేవస్థానాల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్. వినాయక్ ఐ.ఎ.ఎస్. గారికి, సంయుక్తకార్యనిర్వహణాధికారి దేవరకొండ రామకృష్ణ, ఐ.ఎ.ఎస్.గారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని వెలువరించడంలో చేదోడువాదోడుగ నిలిచిన దేవస్థానాల పౌరసంబంధాల అధికారి సుబాష్‌గౌడ్‌గారికి, ప్రెస్‌మేనేజర్ లక్ష్మణరావుగారికి,

అసిస్టెంట్ ప్రెస్‌మేనేజర్ గోవిందరాజులుగారికి, శ్రీ గౌరిపెద్దివారి పరిష్కర ణకు సహాయకుడైన జూలకంటి బాలసుబ్రహ్మణ్యంగారికి నా ధన్యవాదాలు.

"చిక్కని మాటలాడేవు శ్రీనివాస। మా
చిక్కెల్లా బాసెను నేఁడు శ్రీనివాస"

శ్రీ వేంకటగిరి శ్రీనివాసునికి అన్నమయ్య మాటల్లో మనవిచేసే

భవదీయుడు, విధేయుడు,
**కామిశెట్టి శ్రీనివాసులు**
డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర రికార్డింగ్ ప్రాజెక్టు,
తిరుపతి.

11-10-97.

శ్రీరస్తు

# శ్రీ తాళ్లపాక

# అన్నమాచార్యుల శృంగారసంకీర్తనలు

## 27వ సంపుటము

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేఁటి క్రోధిసంవత్సరమందు, తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను, అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు ౧౪౨౪ అగు నేఁటి దుందుభిసంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ నిరుధానకు.[1] తిరువేంగళనాథుని మీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార సంకీర్తనలు.

రేకు 1701 దేసాళం

అన్నిటా నేర్పరులైతి రౌనయ్యా
పన్ని పానుపుమీఁదటఁ బవళించరయ్యా ॥ పల్లవి ॥

పెనఁగఁగఁ బెనఁగఁగఁ బెంజెమటలు గారీని
మనసు లొక్కటులాయ మానరయ్యా
వనితకు నీకును వలపులు సరిదాఁకె
ననుపు లొనగూడెను నవ్వరయ్యా ॥ అన్ని ॥

తగులఁగఁ దగులఁగ తమకములు రేఁగెను
తగు నిద్దరికి సిగ్గు దాఁచుకోరయ్యా
మొగముల నీకు నీకు ముంచె నివె కళలెల్లా
తగవాయ వేడుకలఁ దనివందరయ్యా ॥ అన్ని ॥

---

[1] ద్వాదశి దాక, పర్యంతము అని తాత్పర్యము. విశేష వివరణకు చూ. శృం. సంకీ. సం. 32.

కూడఁగఁ గూడఁగ కూరిములు నిండుకొనె
జోడాయ మీతనువులు చొక్కరయ్యా
తోడనె శ్రీవేంకటేశ దొరసె మీరతులెల్లా
పాడితో నేకాలమునుఁ బాయకుండరయ్యా ॥ అన్ని ॥ 1 ॥

వరాళి

ఏమిసుద్దు లడిగేవు ఇంకా మమ్ము
గామిడివైతి వనఁగా కడఁగి మెచ్చితిమి ॥ పల్లవి ॥

వాడలలోనెల్లా నీవు వలపు చల్లితివని
వేడుకగా మాటలెల్లా వింటిమి నేము
వాడికతో నీకు నన్నివావు లొక్కటాయనని
ఆడుకోఁగా నేము వెరగందితి మిందరము ॥ ఏమి ॥

కోరికతో నీవు పెండ్లికొడుకవై యుండఁగాను
చేరి సంతోసాలెల్లాఁ జూచితిమి నేము
దూరుగా నీమోవి గొల్లదోమటాయ ననఁగాను
నారుకొన్న ప్రేమతోడ నవ్వితి మిందరము ॥ ఏమి ॥

[1]సుదతులకెల్లాను చుట్టమవైనందుకు
కెలసి యానందానఁ జొక్కితిమి నేము
యెలమి శ్రీవేంకటేశ యేలితివి మమ్ము నేఁడు
కలసినరతులఁ బొగడితి మిందరము ॥ ఏమి ॥ 2 ॥

---

1 ప్రాసభంగము. సవరిస్తే యతితో గూడ సవరించవలసినదే. "లలనలకెల్లాను వలపు వెలవైనందుకు" కావచ్చు.

## పాడి

ఆఁటదానిఁ గంటేఁజాలు అట్టె లోలుఁడ వౌదువు
మాఁటల నాపెతోఁ గూడ మరచివచ్చితివా ‖ పల్లవి ‖

తలిలోడ నీ విప్పుడు తన ఇంటికి రావంటా
సతి నిన్నుఁ గొసరీని సముకానను
మితిలేనివాడలెల్లా మెట్టివచ్చితి విందాఁకా
వెతదీర నాడకుఁబో వేళ లేదాయనా ‖ ఆఁట ‖

సారెఁ దనతో సరసములాడవైతివంటా
వూరకె తప్పలెంచీ నీవొద్దనే వుండి
నేరుపుతో కతలెల్లా నేరిచినవాఁడవు
యీరీతి నీపెవలపు యెరఁగలేవైతివా ‖ ఆఁట ‖

అన్నిటాను తన్నుఁగూడి ఆయా లంటవైతివంటా
కన్నుల సన్నలు చేసీ కాఁగిటిలోను
ఇన్నిటా శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
తిన్నఁగా నాపెవలపు తెలుసుకోవైతివా ‖ ఆఁట ‖ 3 ‖

## శ్రీరాగం

సుదతి నీచరితలు చూచీఁగాక
యెదిరించి పైకొంటే నేమనేవు ‖ పల్లవి ‖

సింగారించుకొని వచ్చి చెలి నిలుచుండఁగాను
అంగవించి వద్దికి రమ్మని యనవు
కొంగువట్టి తీసి నిన్నుఁ గూరిమిగొసరి మోవి
యెంగిలి చేసితే నాపె నేమనేవు ‖ సుద ‖

కలువలు గానుకిచ్చి కాంత నీమోము చూడఁగ
పిలిచి యాపెఁగూచుండఁబెట్టు మనవు
బలిమి విన్నుఁ బరపుపైఁ బవళించఁజేసి
యెలమి నాపె మీరితే నేమనేవు ॥ సుద ॥

అట్టె గందవొడి చల్లి అలమేలుమంగ నవ్వఁగా
దిట్టవై సిగ్గులుదేరఁ దెరవేయువు
గుట్టున శ్రీ వేంకటేశ కూడె విన్ను నీకె యిఁక
యెట్టు దమకించినాను యేమనేవు ॥ సుద ॥ 4 ॥

## శుద్ధవసంతం

ఊరకున్నయాఁటదాని నొకటాడేవు
మేర మీరేనా నిన్ను మెరయించెఁగాక ॥ పల్లవి ॥

రామలతో నీసుద్దులు రాఁపుగాఁ జెప్పెనా యింతి
బూము లెరఁగఁగ నిన్నుఁ బొగడెఁగాక
చేముట్టి నీమేన నిండాఁజేఁతలెల్లాఁజేసెనా
సాములు నేరుతువని జరపెఁగాక ॥ ఊర ॥

కినిసి నీపైఁ జెలి కేరడము నెరపెనా
ననుపు చేసుక కొంత నవ్వెఁగాక
యెనలేక నిన్నుఁ గదు యెంగిలి సేసెనా నేఁడు
చనవున మోవితేనె చవిచూపెఁగాక ॥ ఊర ॥

అలమేలుమంగ నిను నలమటఁ బెట్టెనా
సొలపులరతి నీకుఁ జూపెఁగాక
యెలమి శ్రీవేంకటేశ యీపె గోర నూఁదెనా
కళలనేర్పులు నీకుఁ దెలిపెఁగాక ॥ ఊర ॥ 5 ॥

## మధ్యమావతి

మీరైనా బుద్ధి చెప్పరే మెలుఁతలాల
యీరీతివానితో నే నేమనఁగఁగలనే ‖ పల్లవి ‖

యేకతానఁ దాను నాపె యింటిలోన నుండఁగా మిమ్ము
సాకిరివెట్టుతరేదా సతులాల
దీకొని సాదించవచ్చి తిరిగి తిరిగి నాతో
యీకడ నీతని నే నేమనఁగఁగలనే ‖ మీరై ‖

మనసిచ్చి తానుఁదాను మాటలాడుకొనఁగాను
వినిపించనా మీకు వెలఁదులాల
పనివడి యీమాటకు పరాకులు సేసీని
యెనసి యిట్టివానితో నేమనఁగఁగలనే ‖ మీరై ‖

అన్నిటాఁ దాము జాజాలాడుకొనఁగా మీకు
సన్నలఁ జూపుటరేదా సకియలాల
చిన్నియలమేల్మంగను శ్రీ వేంకటేశుఁడు గూడె
యెన్నఁగ నన్నూ నేలె నేమనఁగఁగలనే ‖ మీరై ‖ 6 ‖

రేకు 1702

## శుద్ధవసంతం

రమణుఁడ నామన సరయవు గాక
సముకాననే సేసచల్లఁగ వద్దనేనా ‖ పల్లవి ‖

యెమ్మెల వూరకే బయలీఁదించవద్దు గాని
కమ్మి నీ వింటికిరాఁగాఁ గాదనేనా
నమ్మికల కూరకే నవ్వు నవ్వవద్దు గాని
చిమ్ముచు బత్తితో నేమి సేసినా వద్దనేనా ‖ రమ ‖

అగడుగా యెడమాట లాడించవద్దు గాని
తగిలి చన్నులంటఁగాఁ దగదనేనా
సొగిసి యాసలఁబెట్టి జోలిసేయువద్దు గాని
వొగి నెంత పెనఁగినా నోపననేనా ॥ రమ ॥

ఇచ్చకములాడి నన్ను యెలయించవద్దుగాని
కొచ్చి యిట్టె యేలితివి కూడదనేనా
అచ్చపు శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
నిచ్చా సేవసేయుమంటే నేర ననేనా ॥ రమ ॥ 7 ॥

## ఆహిరి

ఓరుచుక గుట్టుతోడ నుందానఁ గాక
సారె నేఁ దడవితేను చండిసేసీ ననవా ॥ పల్లవి ॥

కూరిములు చల్లఁగాను కోపగించరాదు గాక
నేరము లెంచేనంటే నీ యందు లేవా
తారుకాణించవచ్చేవు తగవులు నెరపేవు
నేరుపు లిందేమున్నవి నీ మన సెరఁగదా ॥ ఓరు ॥

యేకాంతమాడ రాఁగా యేమీననరాదు గాక
కాకు చేసితే మారాడఁగలవా నీవు
నీకు నీవే బిగిసేవు నిజములు చేసేవు
వాకుచ్చనేఁటికి నిన్ను వాడవా రెరఁగరా ॥ ఓరు ॥

చనవిచ్చి కూడఁగాను సాదించరాదు గాక
వెనకటి నీ సుద్దులు వినవచ్చునా
నిను శ్రీ వేంకటేశుఁడ నే నలమేలుమంగను
పెనఁగినా మనలోన భేద మున్నదా ॥ ఓరు ॥ 8 ॥

## వరాళి

నీకేమి యిందరిలో నేనే రట్టైతిఁ గాక
చేకొని మగవాఁ డేమిసేసినాఁ జెల్లును ॥ పల్లవి ॥

వెగటుగా నేను నీవెంటవెంటఁదిరుగఁగా
నగుఁబాటులాయఁగా నా వలపు
నిగిడి కట్టు గామక నీవాకిట నుండఁగాను
నగరు వుట్టెఁగా నేఁడు నావలపు ॥ నీకే ॥

నేను నీవుఁ గూడుక నిందుసరసాలాడఁగ
నానాటఁ బెరిగెఁగా నా వలపు
పేని పట్టి నీతోడ బెనఁగులాడఁగాను
నానెఁగా చెమటల నా వలపు ॥ నీకే ॥

కూరిములు నీమీఁద కొసరి నేఁ జల్లఁగాను
నారుకొని బలిసెఁగా నా వలపు
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నారతురె తెలిపెఁగా నావలపు ॥ నీకే ॥ 9 ॥

## వరాళి

ఏల నన్ను గబ్బియనే విందుకుగాను
చాలా నవ్వితిఁగాక చలమా నీతోను ॥ పల్లవి ॥

తెరలోఁ దురుమువట్టితీసి దూరురెల్లా దూరి
సరసమాడితిఁ గాక చలమా నీతో
వొరయుచుఁ గాతరాన వొడివట్టితీసి రతి--
సరవి చూపితిఁగాక చలమా నీతోను ॥ ఏల ॥

బలిమిఁ జన్నుల నొత్తి పంతముతోడఁబెనఁగి
చలివాపితిఁగాక చలమా నీతో
ములువాఁడి కొనగోర నూఁది మోవిమీఁద గంటిసేసి
సలిగె చూపితిఁగాక చలమా నీతోను ॥ ఏల ॥

కవగూడి యేకతాన కాఁగిటిలోఁ జొక్కించి
జవళిఁ బైకొంటిఁగాక చలమా నీతో
ఇవల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
చవులు చూపితిఁగాక చలమా నీతోను ॥ ఏల ॥ 10 ॥

గౌళ

తానేల లోఁగీ విదె తనలోఁదాను
వూనిన పంతములకు వొరసేనా నేను ॥ పల్లవి ॥

పోరచిసతులతోను బొందు లెంతసేసినాను
తారుకాణించవచ్చేనా తనతో నేను
సారె సారె విన్నపాలు సతులచే వింటేను
ఆరసి చెప్పమనుచు నడిగేనా నేను ॥ తానే ॥

చక్కఁదనా లెవ్వరివి చవులుగాఁ బొగడినా
కక్కసించి వద్దనేనా కమ్మటి నేను
కిక్కిరియ మరి నెంత కిందుపడి గూడినాను
చిక్కించు కెవ్వరికైనాఁ జెప్పేనా నేను ॥ తానే ॥

చెలులచే నేమేమి సేవలు సేయించుకొన్నా
చెలరేఁగి యాగడాలు సేసేనా నేను
యెలమి శ్రీవేంకటేశుఁడేలినాఁడు తానె నన్ను
చలము లేమిటికైనా సాదించేనా నేను ॥ తానే ॥ 11 ॥

## రామక్రియ

ఈకెకు నీకు నింకా నేమి ప్రియము
కైకొను మిందులో నీకుఁగలవెల్లాఁ బ్రియము ‖ పల్లవి ‖

తగులైన రతులకు తలపోఁతలే ప్రియము
నగవుఁ జూపులకు సన్నలే ప్రియము
తెగని కోరికెలకు తియ్యమోవులే ప్రియము
[1]పలుకుఁ జేఁతలకును పలుకులే ప్రియము ‖ ఈకె ‖

జట్టి గొన్నమోహాలకు సరసములే ప్రియము
చుట్టరికములకు మెచ్చులే ప్రియము
నెట్టుకొన్న యాసలకు నిలుకడలే ప్రియము
గట్టియైనపొందులకు గర్వములే ప్రియము ‖ ఈకె ‖

మంతనాన నున్నందుకు మంద (దె?) మేళాలే ప్రియము
పొంతనేరుపులకు నోర్పులే ప్రియము
ఇంతట శ్రీ వేంకటేశ యేలితివి చెలియను
సంతతపు కూటమికి చనవులే ప్రియము ‖ ఈకె ‖ 12 ‖

రేకు 1703

## సామంతం

కంటిమి మీసరితలు కందువగాను
ఇంటికి రావయ్యా యీడనేల చెనకేవు ‖ పల్లవి ‖

మగువయు నీవును మాటలాడుకొనఁగాను
చిగురాకు మోవులపై విల్లులాయను
నగవులు లోలోనె నవ్వఁగాను దట్టములై
ఒగువుఁ జెక్కుల మీఁదఁ బేంట్లాయను ‖ కంటి ‖

---

1 ప్రాసభంగము. 'పగటుఁజేఁతలకును' కావచ్చు.

తనియక వొండొరులు తమకాన( బెన(గ(గా
తనువున చెమటలు ధారలాయను
గొనకొని మీ(ద మీ(ద( గొచ్చి కొచ్చి చూడ(గాను
పొను(గక మెడలకు పూదండలాయను ॥ కంటి ॥

చెల(గి మీరిద్దరు( బై చేతులు చా(చుకొన(గా
పులకలు నిలువుల( బోగులాయను
యెలమి శ్రీ వేంకటేశ ఇంతలో నన్నేలితివి
తలకొన్న వలపులు తారుమారులాయను ॥ కంటి ॥ 13 ॥

## పాడి

అట్టె కాచుకున్నదాన నప్పటనుండి
గట్టువాయతనమేల కరుణించరాదా ॥ పల్లవి ॥

వాసితో నీసేవ సేయవచ్చి నే( గాచుకుండ(గా
ఆసలనే పెట్టేవు అప్పటనుండి
సేస నీపై నే( బెట్ట(గా చెమరించె నామేను
గాసి( బెట్ట కి(కనైనా( గరుణించరాదా ॥ అట్టె ॥

పాయలేక నీకొంగుపట్టి నే( బెన(గ(గాను
ఆయితాలే సేసేవు అప్పటనుండి
చేయి నీపై( జా(చ(గాను చిమ్మిరే(గె మై(గాక
కాయకపు మాటలేల కరుణించరాదా ॥ అట్టె ॥

కందువనుండి నే నిన్ను( గా(గిట (టి?)కి( బిలిచితే
అందాలుగా నవ్వు నవ్వే వప్పటనుండి
పొందితి విప్పుడు నన్ను పొస(గ శ్రీవేంకటేశ
కందుదేరె ని(క నిట్టె కరుణించరాదా ॥ అట్టె ॥ 14 ॥

## బౌళి

కూడినవేళ గుణము కొత్తలాయను
వేడుక వెదచల్లితే వెరగాయ నీకు ॥ పల్లవి ॥

చాయల నాపెకు నీకు జగడము దిద్ది నేను
నాయముచెప్పితే నేఁడు నవ్వులాయను
కాయజకేలిని నీవు కళదాఁకి చొక్కఁగాను
చేయివట్టి తీసితేను సిగ్గులాయ నీకు ॥ కూడి ॥

వున్నతి మీరిదుకొన్న వొట్లు వద్దని నేను
విన్నవించి మొక్కితేను వింతలాయను
కన్నెపాయపుమదాన కదు వెరగందఁగాను
పన్నలనే మెచ్చితేఁ దచ్చనలాయ నీకు ॥ కూడి ॥

మిమ్ముఁ జాయలకుఁ దెచ్చి మెరయఁ గూడించితేను
సమ్మతి శ్రీవేంకటేశ చవులాయను
ఇమ్ముల నన్నేలితివి ఇంతలోనే వలపులు
కుమ్మరించితే రతులు గురులాయ నీకు ॥ కూడి ॥ 15 ॥

## సాళంగనాట

కాఁగిటికి వచ్చి నీవు కలసినప్పుడుగాక
మాఁగిన మోవి చూపఁగ మరి లాభమేమి ॥ పల్లవి ॥

జట్టిగొని నాతోను సరసములాడేవు
వట్టి జోలి దవ్వఁగాను వచ్చేదేమి
చుట్టే చుట్టి యప్పటిని చుట్టరికాలు చెప్పేవు
బట్టబయ లందులో పనిగొనే దేమి ॥ కాఁగి ॥

నానఁబెట్టి నీవు నాతో నవ్వులెల్లా నవ్వఁగాను
పూనిపట్టి ఇంతలోనే పొందేదేమి
మానలేక పైపై యెడమాట లిట్టె యాడించఁగా
కానిమ్మని ఇఁక మరి కట్టుకొనే దేమి ॥ కాఁగి ॥

తేరకొని నాదిక్కే దిష్టించి చూడఁగాను
మేరమీరి నాపంతము మెరసేదేమి
గారవించి నన్నేలితి గక్కన శ్రీవేంకటేశ
కోరికె చెల్లెను యింకాఁ గొసరేదేమి ॥ కాఁగి ॥ 16 ॥

## మంగళకౌసిక

ఏల వూరకుందానవు యిట్టే నివ్వెరగుతో
మూలఁ బొద్దు వుచ్చితేను ముచ్చట వాసీనా ॥ పల్లవి ॥

మంతన మాడేవేళనే మాటలు వెలుమకొని
కాంతుని చిత్తమెల్లాను కనుకోరాదా
సంతసతులలో (తో?) నెన్ని జాణతనా లాడినాను
యెంతైనా రతికేలికి నీడు వచ్చీనా ॥ ఏల ॥

పెనఁగేటి వేళనే ప్రియునిచేఁదుకొని
చెనకి సేఁతకు సేఁత సేయరాదా
యెనయక రచ్చలోన యెంత చేయి ముట్టినాను
తనువులు సోఁకినట్లు దప్పిదేరీనా ॥ ఏల ॥

భావించి కూడేవేళనే పైపైఁ బ్రియాలు చెప్పి
శ్రీవేంకటేశు చనవు చేకొనరాదా
వావరిలోఁగూచుండి వుపమ నెంత నవ్వినా
తావిమోకాఁగిటివలె తనివి నొందీనా ॥ ఏల ॥ 17 ॥

## దేశి

ఏల సేసేవు మాయలు యెందాఁకానైనాను
చాలుఁ జాలు నాపె కిట్టె చనవియ్యరాదా ॥ పల్లవి ॥

చేరఁడేసి కన్నులాపె చేరి నిన్నుఁ జూడఁగాను
దారకపు నీచేఁతలు దాఁచఁగలవా
గోరగీరి వలపులయేరులు పైఁబరపఁగా
ఆరితేరే నీమనసు అడ్డపెట్టఁగలవా ॥ ఏల ॥

తీవెలవంటి చేతులవెఱవ నిన్నంటఁగాను
ఆవలికి నీకోరికె లంపఁగలవా
మోవి తీపు నాములెల్లా ముంచి తలకెక్కఁగాను
కావరపు నీమరులు కదు దించఁగలవా ॥ ఏల ॥

కొండలంతలు చన్నులకొమ్మ నిన్నుఁ గూడఁగాను
అండ శ్రీవేంకటేశ పాయఁగఁగలవా
దండి వేదుకల సంపదలు మీఁదఁ గప్పఁగాను
మెండెన పరవశాలు మీరఁగఁ గలవా ॥ ఏల ॥ 18 ॥

రేకు 1704 దేవగాంధారి

తానేల సిగ్గువడీని తనతో నే నేమనేను
పూనిపట్టి చెలులాల బుద్ది చెప్పఁగదరే ॥ పల్లవి ॥

చిప్పిలఁ దానూ నేనుఁ జేసుకొన్న బాసలకు
తప్పులెంచ నున్నదా తనపై నేను
కుప్పళించి పెంజెమటఁ గురియఁగా నే మొక్కితేను
పిప్పిగట్టఁ బెదవులఁ బిలువరే విభుని ॥ తానే ॥

సొగసి ఇద్దరికిని చుట్టరికమైనందుకు
తగదని కోపించేదా తనతో నేను
నిగిడి నిట్టూర్పులు నిండఁగా నేఁ బెనఁగేను
జిగి నన్ను నేలుమని సేయరే సేవలు ॥ తానే ॥

బెరసి మేనవారమై పెండ్లాడినయందుకు
వొరసి గోరగీరేనా వొళ్లిపై నేను
ఇరవై శ్రీవేంకటేశు నిన్నిటా నేఁ బొగడేను
నిరతపు మన్ననలు నించుమనఁగదరే ॥ తానే ॥ 19 ॥

భూపాళం

ఏమేమి నేర్చెనో యీరమణి నీకును
వేమరు నాకె బుద్దుల వెంసేవు నీవు ॥ పల్లవి ॥

నెట్టన నిందాఁకా నాతో నిజములు పచరించి
ముట్టివచ్చితే నాపె మోము చూచేవు
గట్టిగా [1]నేర్చుకొనింకాఁ గొన్ని గలిగితే
అట్టె మరఁగునఁ బోఇ అడుగఁగరాదా ॥ ఏమే ॥

జోకగా నప్పటనుండి చుట్టరికములే చూపి
దీకొంటే నాపెఁ దోడుదెచ్చుకొనేవు
మేకొని యాపె బలిమి మెరఇంచవలసితే
యేకతాన నుండి సాము లెరుఁగుకోరాదా ॥ ఏమే ॥

అంకెల నీవివి (నీవి?)ప్పు డిట్టె ఆసతోడ నన్నుఁగూడి
జంకించితే నీ వాపెకు సన్నసేసేవు
ఇంకా శ్రీవేంకటేశ నేఁ డీఁడు చూపవలసితే
కొంకక నీయింట నిడుకొని వుండరాదా ॥ ఏమే ॥ 20 ॥

1 నేర్చుకొని+ఇంకా.

## లలిత

విచారించుకోవుగాక వేదుకకాఁడవు నీవు
పచారించఁ బోతేను నీపై నిట్టె మోవదా ॥ పల్లవి ॥

సొలసి మాటలాడేటి సుదతిని విభుఁడవు
పలుకులలో నెగ్గులు పట్టఁదగునా
వలపించితి వాకెను వద్దనుండనినేరమి
నెలకొని వెదకితే నీ వొళ్లిదే కాదా ॥ విచా ॥

కొసరి చేతులు వాఁచే కోమలివేఁతలకుఁగా
యెసఁగ వాసులువంతు లెంచవచ్చునా
వెసఁ బెండ్లాడితి వేవేల కోర్కుకుండితే
అసుదుగా నిన్నె దూరి అందరూను నాడరా ॥ విచా ॥

కందువ నిన్నుఁగూడిన కాంతను శ్రీ వేంకటేశ
పొందుల రతులయలపులు మాతురా
సందడిఁ బెనఁగితివి సారె మెచ్చకమానితే
కిందటి పనులకు నీకె దయవుట్టదా ॥ విచా ॥ 21 ॥

## బౌళి

సేయఁగలట్టల్లా నీవు సేతువు గాక
పాయపు మదమువానిఁ బనిగొనవసమా ॥ పల్లవి ॥

చెనకి యెవ్వతెకైనాఁ జేతులు చాఁచేవు నీవు
మనసు మర్మము లేమీ మరి యెంచవు
ఘనుఁడైన మగవాఁడు కడు మిలిమీరితేను
చనవున నెవ్వరికిఁ జక్కఁబెట్ట వచ్చునా ॥ సేయఁ ॥

నంటున నెవ్వతెఁ గన్నా నవ్వులు నవ్వేవు నీవు
అంట ముట్టఁ దగువేళ లవి చూడవు
కంటులేని బలుదొర కక్కూరితి సేసితేను
యింటికాడ సతులెల్లా నిఁక దిద్దఁ గలరా ॥ సేయఁ ॥

గక్కన నెవ్వతెఁ గన్నా కాఁగిటఁ గూడేవు నీవు
తక్కిన నేరుపు లేమీఁ దలపోయవు
యిక్కడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
యెక్కడా జాణైనవాని నెలయించనగునా ॥ సేయఁ ॥ 22 ॥

## కాంబోది

ఏమిసేతు నన్ను నేనే యేమనుకొందును
ఆముకొని నీపై మోహ మడ్డ పెట్టఁ జాలను ॥ పల్లవి ॥

చలములకోపనూ సాదించ నోపను
వలవ నోపుదు నీకు వాసితోను
మొలకలు చన్నులూ మొగమెల్లాఁ గన్నులూ
సొలసి సొలసి నిన్నుఁ జూడకుండఁ జాలను ॥ ఏమి ॥

మాయలేమీ నేరనూ మచ్చరించ నేరను
పాయకుండ నేరుతు నీ పాదాల వద్ద
అ(ఆ?)యాలు దాఁకె సిగ్గులు అంటె నవ్వులముగ్గులు
చాయలా సన్నలా సరసము లాఁపఁజాలను ॥ ఏమి ॥

వేసాలు నేఁ జేయను వెస నిందవేయను
సేవ వేతు నీమీఁద శ్రీవేంకటేశ
రాసి నీవే కొనగోళ్లు రతులు వెన్నెల పోళ్లు
బాసలిచ్చి కూడితివి పచ్చి సేయఁజాలను ॥ ఏమి ॥ 23 ॥

## వరాళి

అన్నియు నేనెఱుఁగుదు ననుకోనేలా
కన్న విన్నవెల్లా నీ కతలే కదా ॥ పల్లవి ॥

పెచ్చురేఁగి సారె సారె ప్రియములెంత చెప్పినా
మచ్చిక గరఁగేది నీమనసే కదా
ముచ్చటతో నిట్టె నే మొక్కు లెన్ని మొక్కినాను
కచ్చుపెట్టి చూచేవి నీ కన్నులే కదా ॥ అన్ని ॥

బోరన వేఁడుకొనుచు బుద్ధు లిన్ని చెప్పినాను
కోరి మంచిదయ్యేది నీ గుణమేకదా
గారవించి నేనెంత కరములు చాఁచినాను
మేరతో లోనయ్యేది నీ మేనేకదా ॥ అన్ని ॥

తలపోసి తలపోసి తమి యెంత రేఁచినాను
కలసి వుండేది నీ కాఁగిలే కదా
యెలమి శ్రీవేంకటేశ యేలితివి నన్నీ నేఁడు
నెలకొన్నవాఁడవు నీవే కదా ॥ అన్ని ॥ 24 ॥

రేకు 1705 ## ఆహిరి

అద్దో యెక్కుడిసుద్ది అంతేసి కోపఁగలనా
గద్దించ నీతో నాకుఁ బెద్దరికమా ॥ పల్లవి ॥

చెలఁగి నీవేమి చేసినాఁ జేసితివి గాక
వలములు సాదించ సరిదాననా
పెలవుల నవ్వేవు నీ చిత్తము కొలఁది గాక
మలపి నే మారునవ్వ మందెమేళమా ॥ అద్దో ॥

కొచ్చి కొచ్చి నీ వెంత కొంగువట్టి తీసినాను
పచ్చిదేరఁ బెనఁగ కోపపుదాననా
యెచ్చరించి సారె సారె నిక్కువ లంటేవు నీవు
గచ్చుల నేనూ నౌరయుఁ గండ గర్వమా ॥ అద్దో ॥

యిక్కువ శ్రీవేంకటేశ యేలితివంటా నేను
నిక్కి యెమ్మె సేయ నీతో నీటుదాననా
మక్కువచేసి నన్ను మన్నించితివి రతుల
అక్కరతోఁ గొసరఁగ ఆసోదమా ॥ అద్దో ॥ 25 ॥

## నారాయణి

నమ్మవే చెలి ఇందుకు నాపూఁట
వుమ్మడిఁ దలవంచుక వూరకుండనేలే ॥ పల్లవి ॥

తప్పక చూచినవాఁడు తానే యింటికి రాఁడటె
దప్పులఁ బొరలి యేల తమకించేవే
కప్పురాన వేసి తాను కాఁగిటఁ బొందకుండీనా
చిప్పిలుఁగాఁకల నీకుఁ జిన్నఁబోనేలే ॥ నమ్మ ॥

మాటలాడినవాఁడు మర్మము సోఁకించఁడటె
గాఁటపు విరహమునఁ గలఁగకువే
తేటగా నవ్విన తాను తేనెమోవి యొసఁగఁడా
చీటికి మాటికి నీకుఁ జింతించనేలే ॥ నమ్మ ॥

సేసలు వెట్టినవాఁడు సిగ్గులు దేరుచఁడటె
వేసాలకు నీవేల వెరగందేవే
ఆసల శ్రీవేంకటేశుఁడంతలో నిన్నిట్టె కూడె
రాసికెక్కె వలపు వెరవు లెంచనేలే ॥ నమ్మ ॥ 26 ॥

## భైరవి

పాయక నన్నేలుమని పడఁతులాల
నాయకునితోడుత విన్నపములు సేయరే ॥ పల్లవి ॥

చింతలు వెల్లివిరిసెఁ జెక్కుపైకిఁ జేయి వచ్చె
ఇంతసేసె నా మన సేమి సేతునే
మంతనాన నుండరాదు మరేమిటాఁ బొద్దువోదు
పంతగాఁ డితనితోఁ దప్పక చెప్పరే ॥ పాయ ॥

పొదరె నిట్టూరుపులు పొందె నడియాసలు
యెదురెక్కె నా వలపు యేమిసేతునే
పదరితేఁ జవి గాదు పాసివుండఁ బనిలేదు
వుదుటువాఁ డితనికి నొడఁబడఁ జెప్పరే ॥ పాయ ॥

తనువెల్లాఁ బులకించె తతిగొనెఁ జెమటలు
యినుమడించెఁ దమక మేమి సేతునే
చెనకి యింకేలవాదు శ్రీవేంకటేశుఁడు సొదు
కొనబువాఁ డితఁ డిట్టె కూడుమని చెప్పరే ॥ పాయ ॥ 27 ॥

## గౌళ

ఎట్టు సేసినాఁ జేయి యేమనఁగఁగల నిన్ను
పట్టినవ్రతము నీకే పాలుపెట్టేఁగాక ॥ పల్లవి ॥

అలుకల సొలయుచు నట్టె నీతోఁ బెనఁగుచు
చలము సాదించేనా సారెసారెకు
తొలుత నమ్మించితివి దోసముఁబుణ్యము నీది
మెలఁగి పాయము నీకే మీఁదుకట్టేఁగాక ॥ ఎట్టు ॥

పొంతల చన్నులనొత్తి బొమ్మలను జంకించి
పంతము నీచేఁ గొనేనా బలిమితోను
చింతతో నన్నేలిన సిగ్గుపట్టెల్లా నీది
బంతి నాయాసలు నీపై వేసేఁగాక ॥ ఎట్టు ॥

నెట్టన నిన్నుఁ గూడితి నేరుపులెల్లాఁ జూపితి
అట్టె నిన్నలయించేనా ఆరడిగాను
కట్టుకో శ్రీవేంకటేశ కడుఁ గిరితెల్లా నీది
జట్టిగొని యిఁక నీ కిచ్చకమాడేఁగాక ॥ ఎట్టు ॥ 28 ॥

## శోకవరాళి

నన్ను నెంత మన్నించెనే నా రమణుఁడు
చన్నుల నొత్తఁగానైనా సరిగాఁబెనఁగెఁగా ॥ పల్లవి ॥

అలయిచు నేఁ దన్ను నాడరాని మాటలను
సొలయఁగనైనా మోము చూచెఁగా నేఁడు
బలిమితో నప్పటిని పైకొని కానుకలిచ్చి
పిలువఁగనైనాను ప్రియము చేకొనెఁగా ॥ నన్ను ॥

కక్కసించి తనవేళఁ గాచుకుండి వినయాన
మొక్కఁగానైనా పాదము మోచెఁగా నేఁడు
చిక్కించుక సేయరానిసేవలెల్లాఁ జేసి చేసి
చెక్కు నొక్కఁగానైనా చిత్తమిటు వచ్చెఁగా ॥ నన్ను ॥

పసగా నేకతమునఁ బానుపుపై నేనిట్టె
కొసరఁగానైనాను కూడెఁగా నేఁడు
యెసగ శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నే రతుల
వెస భోగించఁగనైనా వేడుకతో నవ్వెఁగా ॥ నన్ను ॥ 29 ॥

లలిత

[1]ఎటువంటి నీపై బత్తో యీకెకు నేఁడు
తటుకన నీ సుద్దుల తాలిమిఁ బొందీని ॥ పల్లవి ॥

సెలవుల నవ్వు నవ్వి చేతులు నీపైఁ జాఁచి
తలపోఁతలనే కడుఁదనిపొందీని
పిలుపుల నొకకొంత పెనఁగులాటలఁగొంత
చెలరేఁగి తనుఁదానె సేదదేరీని ॥ ఎటు ॥

అనువుగా మాటలాడి అండ నిట్టె కూచుండి
మనసులో తమకము మందలించీని
వినయపు సేవచేత వేమారు సన్నలచేత
నినుపు సంతోసాలు నించుకొనీని ॥ ఎటు ॥

సూటిగా నీమోము చూచి సొమ్ములు చేతఁ దడవి
వాఁటపు విరహమెల్లా వారించీని
యీటున శ్రీవేంకటేశ యింతి నిట్టె యేలితివి
తాటించి నీరతులను దైవారీని ॥ ఎటు ॥ 30 ॥

రేకు 1706 వరాళి

వసివాడ నీకేల వనితలలో నెల్లా
సుసరాన నీ చేతనె సూడువట్టించెను ॥ పల్లవి ॥

దప్పిదేరే మోముతోడ దగదొట్టి వున్నాఁడవు
యిప్పు డిట్టియాపె (డిట్టె యాపె?) నిన్ను యేమిచేసెనో
చెప్పరాదా నీకేఁటికి పిగ్గులు వడఁగ నేఁడు
చొప్పుగా నీచేతనె సూడువట్టించెను ॥ వసి ॥



[1] 'నీపై ఎటువంటి బత్తో' అనుట సహజము. లేక 'ఎటువంటి నీపై' అనియైనా విగ్రహించుకొనవచ్చు. కాని 'బత్తి' నిర్విశేషణముగ ఈ కూర్పులో నుండుట బాగా?

పలుచెమటలతోడ భ్రమసివున్నాఁడవ్వ(వు?)
అలివేణి నిన్నెంత అలఇంచెనో
తెలివి దెచ్చుకోరాదా దీమసము మాతోనేల
సులభాన నీచేతనే సూదువట్టించెను ॥ వసి ॥

గుట్టుతోడ లోలోనే గుబ్బతిల్లి వున్నాఁడవు
పట్టపుదేవి నిన్నెంత పనిగొనెనో
ఇట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నాకె
చుట్టి చుట్టి నీ చేతనే సూదు వట్టించెను ॥ వసి ॥ 31 ॥

## ముఖారి

తనకు లేకున్నా నేను తనపై [1]బత్తి గలఁగా
తనంతనే నామీఁద దయుదలఁచీనే ॥ పల్లవి ॥

తలఁపుగలితేఁ గదా తా నిందుకు విచ్చేసు
వలవంతఁ గొసరఁగా వచ్చేదేమే
పిలువక రానంటా పెనఁగీఁ దా రమణుఁడు
వలపు గలంతే కాక వడి నెక్కుడౌనా ॥ తన ॥

చేతికిలోనైతేఁ గదా చెప్పి నట్టెల్లాఁ జేసు
కాతరించి యేమనినాఁ గరఁగీనటే
యేతులఁజేసేనంటా ఇప్పుదు దా నన్నడిగీ
రీతిఁ దన తమకము రేఁచవచ్చునటవే ॥ తన ॥

ఇతవై యుండితేఁగదా ఇన్నిటికి నిచ్చగించీ
తతిగొని పైకొనఁగా తనిసేదేమే
సతమై శ్రీవేంకటేశ్వరుఁ డిట్టె నన్ను నేలె
రతులలో ప్రియములు రవ్వసేయఁ దగవా ॥ తన ॥ 32 ॥

---

1 బత్తిగలఁగా=బత్తి కలనుకదా.

## పాడి

చేరి మొక్కరే నామారు చెలులాల ఆతనికి
ఆరజము సేయరాదు అవుననరాదు ॥ పల్లవి ॥

వెల్లవిరాయఁ బనులు వేడుకతోఁ దన్నుఁ జూచి
కొల్లున నవ్వఁగరాదు కొసరా రాదు
పెల్లునఁ దా నింత చేసి ప్రియములు చెప్పఁగాను
పల్లదమాడఁగరాదు పైకొనరాదు ॥ చేరి ॥

పయ్యదపైఁ జేఇ వేసి బాసలెల్లా నియ్యఁగాను
ఇయ్యకొనరాదు మరి యేఁచఁగరాదు
కొయ్యకాఁడై నాకుఁ గోరి మోవి యొసఁగఁగా
సయ్యాటమాడఁగరాదు జరయ రాదు ॥ చేరి ॥

ఇంతలో శ్రీవేంకటేశుఁ డేలి నన్నుఁ బొగడఁగ
సంతోసించుకొనరాదు సాదించరాదు
పొంతనే నాతో నెంగిలి పొత్తు దాఁ గలయఁగాను
పంతములాడఁగరాదు పాయఁగరాదు ॥ చేరి ॥ 33 ॥

## కాంబోది

నీవంటి చుట్టము నాకు నిందు నిధానము గాదా
పూవుల నీ పాదములు పూజింతుఁగాక ॥ పల్లవి ॥

చెనకి నీ వేమితప్పచేసి వచ్చితివో నేఁడు
వినయములనే నన్ను వేఁడుకొనేవు
కినిసేనా నేనేమైనా కెలసి ఇందుకుఁగాను
చనవున నన్నిటికి సమ్మతింతుగాక ॥ నీవం ॥

తిలకించి యెవ్వతెనుఁ దెచ్చుకొంటివో నీవు
పలువిధముల నాపై బత్తిసేసేవు
నెలకొని యీ పనికి నేరమి నీపై వేసేనా
పొలసి నిన్నిందరిలోఁ బొగడుదుఁగాక ॥ నీవం ॥

పొందుల నెక్కడి తలపోఁతల నున్నాఁడవో
కందువ నన్నుఁగంటానే కాఁగిలించేవు
యెందైనా శ్రీవేంకటేశ యెగసక్కెమాడేనా
అందపు రతుల నిన్ను నాదరింతుఁ గాక ॥ నీవం ॥ 34 ॥

## సౌరాష్ట్రం

రచ్చల నన్నెలయించీ రమ్మనవే యిటు నేఁడు
మచ్చిక నాకు ఘనము మరి యేమి సేతునే ॥ పల్లవి ॥

వుడివోని మాటలూ వుల్లాసపుఁ బాటలూ
యెడనెడఁ బచరించీ యేమిసేతునే
విడువదు మదము విరహమే వుమ్మదము
జడిసీ నామేన నిదె సరి నేమి సేతునే ॥ రచ్చ ॥

పచ్చి వెచ్చి చేఁతలు బట్టబయలీఁతలు
యెచ్చరించీ నాకు నిఁక నేమిసేతునే
వచ్చె నాకిచ్చిన బాస వదలదు నాయాస
కొచ్చీ నిదె నావలపు కోరి కేమిసేతునే ॥ రచ్చ ॥

సేసీనే నెపము సిగ్గులకేదే రపము
యే సుద్దులును నెరఁగఁ డేమిసేతునే
రాసికెక్క శ్రీవేంకటరమణుఁడు దా నేలె
పోసరించీ నా ముదము పొంచి యేమిసేతునే ॥ రచ్చ ॥ 35 ॥

## దేశాక్షి

ఎంతమేలు గట్టుకొన్నా యిదె నీ చిత్తము కొద్ది
సంతోసములెల్లా నాయ సమ్మతించే నిఁకను ॥ పల్లవి ॥

నన్ను నీ వెఱుఁగుదువు నాకు నీపై బత్తి గద్దు
న్నవించ నేమున్నది వేఁగినంతాను
మన్నించితి వన్నిటాను మనసొక్కటాయ నేఁడు
సన్నల నేమి సేసినా సమ్మతించే నిఁకను ॥ ఎంత ॥

యేలుకొంటి విటు నన్ను ఇన్నిటా నమ్మితి నిన్ను
జోలితోఁ బెనఁగనేల చుట్టి చుట్టి
లాలన మీవల్లఁ గద్దు లాగాయ నా బతుకిది
చాలా నీ పొందులకెల్లా సమ్మతించే నిఁకను ॥ ఎంత ॥

నీవు నన్నుఁ గూడితివి నేఁ దొల్లె నీ సొమ్మనయితి
వావులు చెప్పఁగనేల వరుసతోను
శ్రీవేంకటేశ నీకు చెలఁగి దేవుల నైతి
సావి వోరాదు వలపు సమ్మతించే నిఁకను ॥ ఎంత ॥ 36 ॥

## రేకు 1707 కురంజి

చాలుఁ జాలు నీవేల సాదించేవే
నీ లాగు లన్నియును నే నెఱుఁగనటవే ॥ పల్లవి ॥

చెంతల నాతఁడు నాకుఁ జెప్పినట్టు సేయఁగాను
పంతము లేలాడేవే పనిలేదు
కాంతలెదుట ముద్దుటుంగరము నాకిచ్చినాఁడు
వంతుకు నాతో బెనఁగవచ్చునటవే ॥ చాలు ॥

పనివడి యీతఁడు నాపరపుపై నుండఁగాను
చనవున నేలంటేవే చవిగాదు
చెనకి నా చన్నులపై చేతులు వేసుకున్నాఁడు
గునిసి నన్నీదువెట్టుకొనవచ్చునటవే ॥ చాలు ॥

శ్రీవేంకటేశుఁడు నన్నుఁ జేరి కూడివుండఁగాను
చేవమీర నేమిటికి చెప్పకోరాదు
భావించి నన్ను రతులఁ బట్టము గట్టినవాఁడు
సేవించితి నిఁక వింతసేయువచ్చునటవే ॥ చాలు ॥ 37 ॥

## ముఖారి

సంతోసించే అందు కిట్టె సవతినైతే నేమి
చింతలేక చెప్పవయ్యా సిగ్గువడ నేఁటికి ॥ పల్లవి ॥

ఆసలు సేసేవు నీవు ఆపె నీకుఁ జుట్టమా
సేసలు వెట్టితివా చేతుల కొద్ది
పోసరించి యన్నిటాను పొంతనాలు గూడెనా
మోసపోక చెప్పవయ్యా మూసి దాఁచనేఁటికి ॥ సంతో ॥

వలపులు చల్లేవు వావులు గలసెనా
లలిఁ బోఁక ముడిచిరా లలనలెల్లా
కలిమి మెరసి నేఁడు కంత నడపించితివా
వెలయఁగఁ జెప్పవయ్యా వెరవఁగ నేఁటికి ॥ సంతో ।

సుదతిఁ గూడితి విట్టె సోబానఁ బాడించితివా
పొదలుచు మోవితేనె బువ్వా లంటెనా
ఇదివో శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
పొది గాకెఁ జెప్పవయ్యా బొంక నిఁక నేఁటికి ॥ సంతో ॥ 38 ।

## పాడి

ఏమనేము నిన్ను యెగసక్కెఁడ విన్నిటా
ఆముకొన్న సటకాఁడ వౌదువయ్యా ॥ పల్లవి ॥

మాటలాడవచ్చుఁగాక మనసులో కాఁతాళము
మూటగట్టవచ్చునా ముందరఁ దెచ్చి
సూటిచేసి నావలపు చూపుమనే వెదుటను
నీటు జాణతనాలు నేర్తువయ్యా నీవు ॥ ఏమ ॥

మొక్కు మొక్కవచ్చుఁ గాక మొగముపై నగవులు
మక్కు వేయ వచ్చునా మాపుదాఁకాను
అక్కరైన నావలపు లంగడిఁ బెట్టేవు నీవు
దిక్కులెరిఁగినయట్టి దిట్టవయ్యా నీవు ॥ ఏమ ॥

పొంది కూడవచ్చుఁ గాక పొంచి పొంచి మోవితేనె
బిందెఁ బోయవచ్చునా పెక్కుమాటలు (ల?)
ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి
కందు వెరిఁగిన యందఁగాఁడవయ్యా నీవు ॥ ఏమ ॥ 39 ॥

## సామంతం

ఇంకా నెవ్వరూ వినరు యేఁటికి సిగ్గువడేవు
పంకించ కిందరి నొడఁబరచే నే నిపుడు ॥ పల్లవి ॥

ముంచె మైఁ జెమటవాన మోవి నదె తేనె సోన
మంచముపైఁ బెనఁగితే మగువకును
వంచకు నీవు మోము వద్దనేమా నిన్ను నేము
ఇంచు కించుకే నీ సుద్దు లెరిఁగితి మిపుదు ॥ ఇంకా ॥

కరఁగెఁ గస్తూరి పూఁత కలిగె నూర్పులమోత
పొరిది నీతో నుండఁగా సుదతికిని
వెరవు గలవు నీవు వెస నిది నాకు లావు
పరిపాటి నీ చేఁతలు బయలాయ నిపుడు ॥ ఇంకా ॥

హెచ్చెఁ గాఁగిటిరతులు ఎరవాయ సంగతులు
వచ్చి నిన్నుఁ గూడఁగాను వనితకును
ఇచ్చల శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మచ్చికతో నీ పొందులు మరిగితి మిపుడు ॥ ఇంకా ॥ 40 ॥

## లలిత

ఇప్పుడు గలుగు బుద్ధి అప్పుడు లేదా
తప్పక మెలఁగితేను తగునని ఆడరా ॥ పల్లవి ॥

వొద్దనుండి యాకె నిన్ను వొకటొకటె ఆడఁగా
గద్దించేవు బొమ్మలను కాంతను నీవు
కొద్దిమీర మింతేసి కోపకాఁడవు తొల్లె
వొద్దికైన వోజతోడ నుండఁగరాదా ॥ ఇప్పు ॥

నంటున నీ మోము చూచి నవ్వులెల్లా నవ్వఁగాను
కంటగించి కసరేవు కాంతను నీవు
ఇంటిలోనఁ బంతములు ఇంత నెరపేవాఁడవు
జంటవై అందరు మెచ్చ చక్కనుండరాదా ॥ ఇప్పు ॥

శ్రీవేంకటేశ నిన్నుఁ జేరి కాఁగిలించుకోఁగా
కావరించి వొరపేవు కాంతను నీవు
యీవల నన్నేలితివి ఇంతగలవాఁడవు
మా వాఁడ వింతరి నడుమనే వుండరాదా ॥ ఇప్పు ॥ 41 ॥

## గౌళ

ఏమిటికి నప్పటిని వెలయించీని
కామించి యన్నియు నేనే కనుగొంటినే ॥ పల్లవి ॥

సిగ్గువడ నేర్చునట పెలవి నవ్వనేరఁడా
అగ్గమై తనకు నన్నీ యమరినవే
వెగ్గళించ నిఁకనేలే వేడుకకాఁడన్నిటాను
యెగ్గులెంచ తనలాగు తెలుఁగుదునే ॥ ఏమి ॥

మాటలాడనోపునట మచ్చిక చూపనోపఁడా
బూటకాలన్నీఁ దనకు పొసఁగినవే
చాటిచెప్ప మరియేలే జాణఁడు యీపనులకు
యీటులేని తనసుద్దు లియ్యకొంటినే ॥ ఏమి ॥

పేసచల్లఁగలఁడట పెలఁగి కూడఁగలేఁడా
దోసములే దన్నియును దొరపినవే
వేసరనేలే తానే శ్రీవేంకటేశుఁ డేలె నన్ను
పోసరించి రతులనుఁ బొసఁగింతునే ॥ ఏమి ॥ 42 ॥

రేకు 1708

## శుద్ధవసంతం

తగు నీకూ నాపెకును తమకించి పెనఁగఁగ
మొగములు చూచుకోఁగా మొరయనేలే ॥ పల్లవి ॥

చనవు గలిగినాపె సారె సారె నీతోను
మనవులు చెప్పఁగాను మచ్చరమేల
ననిచి యప్పటి నీతో నవ్వులెల్లా నవ్వఁగాను
కొన చూపులనుఁ జూచి కోపగించనేల ॥ తగు ॥

చిత్తము వచ్చిన యాపె చేరి నిన్నుఁ జెనకఁగా
హత్తుకొని నిన్ను వెంగేలాడఁగ నేల
బత్తిగలిగినది నీపైఁ బన్నీరు చల్లఁగా
కొత్త కొత్త మాటలను కొసర నేల ॥ తగు ॥

చుట్టమై యుండిన యాపె సొరిది నిన్నుఁ గూడఁగా
బట్ట బయలీఁదించి పంగించనేలా
యిట్టె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
గుట్టు వేసుకొందుఁగాక గురిచూపనేలా ॥ తగు ॥ 43 ॥

## దేశాక్షి

కదుగోల యీ చెలి కరుణించు మిఁక నీవు
అడియాలపు నవ్వులే అచ్చివచ్చు మీకును ॥ పల్లవి ॥

వింత సేయవద్దుగాని వేడుకతో నాఁటదాని--
నెంత సోఁకఁ బలికినా ఇతవే కాదా
ఇంతటివాఁడవు నీవు ఇంటికి వచ్చితేఁ జాలు
దొంతి నున్న వలపులే తోడయ్యీ మీకును ॥ కదు ॥

సిగ్గు వడవద్దుగాని సేసకు లోనైనదాని
అగ్గల మెంత నవ్వినా అరుదే కాదా
కగ్గులేని చుట్టమవు కాయము ముట్టితేఁ జాలు
వొగ్గి తమకములే మేలొనరించీ మీకును ॥ కదు ॥

మఱవఁగవద్దు గాని మనసువచ్చినదాని
తఱి నెంతఁగూడినాను తగవే కాదా
యెఱిఁగి శ్రీ వేంకటేశ యేలితివి మా చెలిని
జఱసి జాణతనాలే చవి చూపె మీకును ॥ కదు ॥ 44 ॥

## ఆహిరి

ఇంతిఁ గనుఁగొనవయ్యా యెటువంటి మోహమో
బంతి మోవితేనియల బచ్చి దేరీని ॥ పల్లవి ॥

చన్నులపై పయ్యద జారినదీ నెరఁగదు
నిన్నుఁ జూచే వేడుకను నివ్వెర గంది
వన్నెలఁ జెక్కుచెమట వడిసేది దలఁచదు
వున్నతపుఁ దమకాన నుమ్మగిలీని ॥ ఇంతి ॥

వీఁపునఁ దనతురుము వీడినదీఁ దెలియదు
పైపై నీతో మాటలాడే పరాకునను
రాఁపుల నిట్టూర్పుల రవళి నాలించదు
యేపునఁ బరవశాన నీఁదులాడీని ॥ ఇంతి ॥

వరుసతోఁ బోఁకముడి వదలినదీ నెంచదు
గరిమ సరసమాడే కాతరానను
యిరవై శ్రీ వేంకటేశ యేలితి వీకెను నేఁడు
సిరుల సంతోసానఁ జిమ్మి రేఁగీని ॥ ఇంతి ॥ 45 ॥

## దేసాళం

నీ జాడలెల్లాఁ దొల్లే నే నెరఁగనా
వోజతో నీ సుద్దులెల్లా వొప్పగొనేఁగాక ॥ పల్లవి ॥

మొనసి వొకరిమీఁద మోహమున్నదా నీకు
మనసు చూడవలసి మాటలాడేవు
చెనకి ఇంతలోననే చెల్లునా మందెమేళము
వొనర నేమనినాను వూఁకొనేఁగాక ॥ నీజా ॥

సమ్మతించి ఇంతులను సరకుగొనేవా నీవు
నమ్మికల కూరకైనా నవ్వు నవ్వేవు
పమ్మి ఇంతటిలోననే బలిమి చూపవచ్చునా
ఇమ్ముల నీకతలెల్లా నియ్యకొనేఁగాక ॥ నీజా ॥

అందపు గాంతలు నీకు నబ్బురమా యేమైనా
కందువల నన్ను నిట్టె కాఁగిలించేవు
అందుకు నింతలోననే ఆడేనా శ్రీవేంకటేశ
సందడిలో నీకూటమి సంతోసించేఁ గాక ॥ నీజా ॥ 46 ॥

## హిందోళం

ఏమయ్యా ఇంతటిలోనే యేల లోఁగేవు
ఆముకొన్న నీవేడుక కడ్డగించేనా ॥ పల్లవి ॥

వేరఁడేసి కన్నులాపె వెంగలించి చూడఁగాను
కూరిముతోఁ దలవంచుకొందురా నీవు
చేరి నన్నుఁ గని యేల సిగ్గువడే వింతలోన
తారుకాణ చేసి నీపైఁ దప్పు వేసేనా ॥ ఏమ ॥

వుంగరాల చేతులాకె వొడివట్టి తియ్యఁగాను
సంగతి గాదనుచు సన్న సేసేవు
వెంగట నే నుండఁగాను వెల్లఁబో యేల కొంకేవు
అంగడిఁబెట్టి వలపు లారడి చేసేనా ॥ ఏమ ॥

మొలకచన్నుల యాపె ముంచి కాఁగిలించుకోఁగా
వెలఁగి వాతో నేమి వెప్పవచ్చేవు
అలరి శ్రీవేంకటేశ అట్టె నన్ను నేలితివి
వెలకొన్న పనులకు నిన్ను నవ్వేనా ॥ ఏమ ॥ 47 ॥

### ఆహిరి

కటకటా వట్టిదూరు కట్టుకొందురా
పటలు సేయఁగనేలే జవరాలికి ॥ పల్లవి ॥

అలుకలేమి గల్లాను అప్పటి కప్పుడే కాక
చలపాధ్ధి తనమేలే సతికి
బలిమి నొడఁబరచే పతిమాఁట వింటకాక
పెలుచుఁ దనము లేలే ప్రియురాలికి ॥ కట ॥

వొట్టిదుకొండే వెనక నోజకు వచ్చుటగాక
గట్టువాయుతనమేలే కామినికి
మట్టమైన పతిమోము మాచితే లోఁగుట కాక
వెట్టఁ బొరలఁగనేలే వెలఁదికిని ॥ కట ॥

పంతములాడుకొండేను పైఁకొని మెచ్చుటగాక
వంతులు వాసులు నేలే వనితకు
బంతినే శ్రీ వేంకటాద్రి పతి నిన్నుఁ గూడె నిదె
పొంతనా లింకా నేలె పొలఁతికిని ॥ కట ॥ 48 ॥

రేకు 1709

### భైరవి

మా యింటికి రావయ్యా మాటలేఁటికి
చాయలా పన్నలా నీపై సంతోసమేనాకును ॥ పల్లవి ॥

మోమునఁ గళలు దేరీ ముక్కున నిట్టూర్పు లూరీ
నీ మతకపు చేఁతకు నే నేమనేను
గామిడి వనఁగరాదు కల్ల మోపఁబనిలేదు
యేమైనా నీ పనులు ఇయ్యకోలే నాకును ॥ మాయిం ॥

చెక్కులఁ జెమట మించీ పెలవి నవ్వులు ముంచీ
నెకొన్ననీ యెమ్మెలకు నే నేమనేను
కక్కసించి నిఁక వద్దు కడువేగె నిదె పొద్దు
యెక్కడనుండి వచ్చినా ఇయ్యకోలే నాకును ॥ మాయిం ॥

మోవిపైఁ గెంపులు రాఁగీ భావమెల్లాఁ జిమ్మిరేఁగీ
నీవెంత కాకుసేసినా నేనేమనేను
శ్రీ వేంకటేశ ముందు చేకొను రతులవిందు
యీవేళ నన్నేలితివి ఇయ్యకోలే నాకును ॥ మాయిం ॥ 49 ॥

గౌళ

నీ వాపెకు మగఁడవు నేరుపరివి
సేవ లాపె చేసినవి చేకొనఁగరాదా ॥ పల్లవి ॥

సరసమాడఁగఁబోతే చన్నులపై కొంగు జారె
కరముల మొక్కితే కంకణాలు జారె
శిరసు వంచి యందుకు సిగ్గువడి వున్న దిదె
తరుణి నుపచరించ దండకు రారాదా ॥ నీవా ॥

పొంచి కానుకియ్యఁగాను పోఁక ముడి వదలెను
కొంచక పాదాలొత్తఁగా కొప్పు గదలె
అంచెల నంతలోననే అలసి నివ్వెరగొందె
చెంచెలాక్షి సేదదేర్చి చనవియ్యరాదా ॥ నీవా ॥

గందము నీకుఁ బూయఁగా కాఁగిటిలోనఁ దగిలె
సందడిఁ బల్కఁగా మోవిచవులు రేఁగె
అంది శ్రీవేంకటేశుఁడ ఆనందించుకొన్నది
ఇందుముఖిబాలఁ జిక్కి* ఇంపు చూపరాదా ॥ నీవా ॥ 50 ॥

---

* 'చిక్కి' (కా.శ్రీ.)

బౌళి

వరుసకు నీమగఁడు వచ్చీఁగాక
సరసురాలగు నీకుఁ జలపట్టనేఁటికి ॥ పల్లవి ॥

వాసితోడఁ బతిమీఁద వలపు గలదానికి
వేసరఁగనేఁటికే వేమారును
రాసి కెక్కె నేఁడు సింగారమున నుండి నీకు
సేసకొప్పు వేఁకమంటాఁ జింతించనేఁటికే ॥ వరు ॥

పనివడి నాయకునిఁ బాయలేని దానికి
పెనఁగఁగ నేఁటికే బిగియుచును
వెనుకొని జవ్వనాన విఱ్ఱవీఁగే యట్టి నీకు
వనుఁగవ గట్టి యంటా జడియఁగ నేఁటికే ॥ వరు ॥

అన్నిటా శ్రీ వేంకటేశునాలవైన దానికి
సన్నసేయనేఁటికే సముకమున
వెన్నెల నవ్వులతోడ *వేడక పడే నీకు
కన్నులివి గొప్పలంటా కావరించ నేఁటికే ॥ వరు ॥ 51 ॥

వరాళి

ఏల కిందుపడేవు నాకెంత ప్రియాలు చెప్పేవు
యేలాగు నడచినా యెదురేది నీకును ॥ పల్లవి ॥

కల్లలాడవద్దు గాని కడఁ బొందుసేసి వచ్చి
చల్లఁగా నాతోఁ జెప్పితే సంతోసించనా
చెల్లదా నీకేమైనా చేసిన చేఁతలెల్లా
బల్లిదుఁడవు లౌలుతే భయమేల నీకును ॥ ఏల ॥

* 'వేడుక పడే' (కా.ప్రీ.)

మూసి దాఁచవద్దుగాని మోహమెందు గలిగినా
ఆసతి దోడి తెమ్మంటే నౌఁగాదనేనా
దోసమెంచేరా నిన్ను దొరవు గావా నీవు
బాస ఇచ్చి ఇఁక సిగ్గువడనేల నీకును ॥ ఏల ॥

వాదించ వద్దుగాని వాడవారిఁ గూడినాను
సాదవై నావద్దనుంటే సమ్మతించనా
యీడెస శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
ఆదుకొన రతులబ్బె నలపేల మీకును ॥ ఏల ॥ 52 ॥

## దేసాళం

ఇందుకే పెండ్లాడితివి యెరిఁగి మమ్ము
చెంది మావూడిగాలైనా జేకొనఁగవలదా ॥ పల్లవి ॥

జలజాక్షితో నీవు సరసములాడి యాడి
అలసేవు కమ్మటిని అంతలోననే
వెలినున్న మా చేత విసరించుకొనరాదా
పలుమారు నేము సేసే పని యేమి నీకు ॥ ఇందు ॥

అప్పుడే యాపె పొత్తున ఆరగించి యారగించి
దప్పిఁ బొరలేవు కడుఁదమకమున
ఇప్పించుకొనరాదా వీడె మేతులకు మాచేత
వొప్పుగా నేమి చెప్పినా నోపమనేమా ॥ ఇందు ॥

సరిగా మీరిద్దరును సాములు చేసి చేసి
పొరలుచుఁ బానుపుపై బుసకొట్టేవు

బెరసి మమ్మేలితివి [1]పిసికించుకొనరాదా
సిరుల శ్రీ వేంకటేశ సేవచేసే మిపుడు ॥ ఇందు ॥ 53 ॥

## ఆహిరి

మేలయ్యా నీ సుద్దులకు మెచ్చితి నేను
నీలాగు లొరసితే నేఁడు గొత్తయ్యీనా ॥ పల్లవి ॥

చనవున నాపె నీతో జాణతనాలాడెనంటా
పెనగొని యెన్నేసి ఓరా లాడేవు
మనసుర... ...ల మంచితనాలు సేసితే
యెనసినంతేకాక యెక్కుడయ్యీనా ॥ మేల ॥

వొద్దనుండి యాకె నిన్ను వొడివట్టి తీసెనంటా
గద్దించి యెందాఁకా ఓంకాలు చూపేవు
పెద్దరికానకు నెంత ప్రియముతో మొక్కినాను
తిద్దుకొనే మంచేను చేతికి లోనయ్యీనా ॥ మేల ॥

కమ్మర నప్పటి నాపె కాఁగిలించుకొనెనంటా
నమ్మించి బాసలు మిన్నక చేసేవు
ఇమ్ముల శ్రీ వేంకటేశ యేలితివి మా చెలిని
సమ్మతాయ నిఁక మరి జంట వాసీనా ॥ మేల ॥ 54 ॥

రేకు 1710

## శ్రీరాగం

పిలువవే రమణునిఁ బ్రియము తోడ
నెలఁతవు యీలాగవు నీ వెఱఁగవా ॥ పల్లవి ॥

---

[1] 'పిసికించుకొనరాదా' ఈ క్రియకు పాదములో దేహమో కర్మగా అధ్యాహరించుకొనవలెను కాబోలు.

మనసు రంజిల్లఁ జేసి మగనిఁ బైకొంట కాక
    చనవు గలిగితేను సాదింతురా
ననుపు చేసుకొని నవ్వులే నేరుపుకాక
    కినిసి వెంగెములాడి కెరలింతురా ॥ పిలు ॥

వల్లని మాటలాడి జట్టిగొనవలెఁగాక
    చెల్లుబడిగలదంటా చెనకుదురా
మెల్లనే సేవచేసి మెప్పించవలెఁగాక
    పల్లదాన నేరాలెంచి పంగింతురా ॥ పిలు ॥

కందువలఁ జెఇ వాఁచి కాఁగిలించవలెఁగాక
    మందె మేళమాయనంటా మారుకొందురా
యిందునె శ్రీ వేంకటేశుఁ డీతఁ డిట్టె నిన్నుఁ గూడె
    అందపు మోవిపై కెంపు లంరింతురా ॥ పిలు ॥ 55 ॥

ఆందోళి

ఎట్టు మఱవఁగవచ్చు యిటువంటి చేఁతలు నా--
    గుట్టు చేకొంటివిగా నీ కుచ్చితానను ॥ పల్లవి ॥

నవ్వులే సారెకు నవ్వి నావలపు లిందరిలో
    రవ్వలఁ బెట్టితివిగా రాజసానను
పువ్వులనే వేసివేసి పొద్దులు గడపి యాస--
    లువ్విళ్లూరించితిగా వుదుటునను ॥ ఎట్టు ॥

మాటలే ఇందాఁకా నాడి మర్మములు గరఁగించి
    నాటకమే మాపేవుగా నమ్మికతోను
పాటించి సేవలుగొని బయలీఁతలనే పెట్టి
    [1]జూటవై మించితివిగా మట్టరికముననను ॥ ఎట్టు ॥

---

1 'జూటు' ఇది ధర్మ ధర్మి ఉభయ వాచకమా?

చేతులు పైఁ జాఁచి చాఁచి సిగ్గులు వడఁగఁజేసి
జాతులఁ బెట్టితివిగా సరసానను
యేతుల శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
కాతరాన మీరేవుగా కాఁగిటిలోను ॥ ఎట్టు ॥ 56 ॥

## గౌళ

క్షితి నిట్టినేరుపు సీతాదేవికిఁ గలిగె
తతితోడ దశరథ తనయుని యెడను ॥ పల్లవి ॥

పతి చిత్త మెరిఁగి తప్పక వూడిగము చేసి
అతనినే తన దైవమని తలఁచి
సతమై యనేక వుపచారములఁబోషించి
వ్రతము గైకొని యుండవలయు సతికిని ॥ క్షితి ॥

పరపురుషుఁ జూడక ప్రాణేశ్వరునే కోరి
సరవితో నతని ప్రసాద జీవియై
దొరసి యెడవాయక తోడు నీడయై యుండి
వరుస మీరక యుండవలయు సతికిని ॥ క్షితి ॥

యెదురాడక శ్రీ వేంకటేశ్వరు కిందిరవలె
కదిసి యతని కిచ్చకముగ గూడి
అదనెరిఁగి యేపొద్దు నంకెకు లోనైవుండి
వదలక బత్తిసేయవలయు సతికిని ॥ క్షితి ॥ 57 ॥

## రామక్రియ

ఊరకె గుట్టు చేసుక వుండుట గాక
వారి వీరివలె దూరవచ్చునా నాకును ॥ పల్లవి ॥

యెప్పుడుఁ దా నాడా నీడా నేమిసేసి వచ్చినాను
తప్పులెంచవచ్చునా తనతో నాకు
చిప్పిలఁ దనవెక్కుల చెమట లెంత గారినా
చొప్పులెత్తవచ్చునా చూచి చూచి నాకును ॥ ఊర ॥

సిగ్గువడక తా నెంత చిమ్మిరేఁగి వుండినాను
యెగ్గు పట్టవచ్చునా యిదివో నాకు
అగ్గమై తా నందరిలో నటు సరస మాడినా
వెగ్గళించవచ్చునా వింతలుగా నాకును ॥ ఊర ॥

కాంతుఁడు తా నెటువలె కాఁగిటఁ బెనఁగినాను
పంతమాడవచ్చునా పక్కన నాకు
ఇంతటఁ శ్రీ వేంకటేశుఁ డిదె తానె నన్నుఁ గూడె
వంతులు వెట్టవచ్చునా వలపులు నాకును ॥ ఊర ॥ 58 ॥

## నాగవరాళి

తొల్లి ఇంత నేరుతువా దొరవైతే నౌదుగాక
చల్లఁగా నిన్ను రేఁచేది జాణ ఆపెకాదా ॥ పల్లవి ॥

తగవులు చెప్పేది తమకము వుట్టించేది
అగపడి నీకేపొద్దు నాపె కాదా
నగవులు నవ్వేది ననుపులు పేసేది
నిగిడి యన్నిటా దిద్దె నిన్ను నాపె కాదా ॥ తొల్లి ॥

గుట్టు నీకుఁ జెప్పేది కొలువులు సేయించేది
అట్టె నిన్నుఁ బనిగొనే దాపె కాదా
చుట్టరికము చేసేది సొరిది గద్దె యెక్కేది
పట్టపు దేవులైన దిప్పటి టాపె కాదా ॥ తొల్లి ॥

కదు నిన్ను మెచ్చినది కాఁగిటఁ జొక్కించినది
అడియాలాలు చేసిన దాపె కాదా
యెడయక శ్రీ వేంకటేశ నన్ను నేలితివి
వొడఁబరచెను నిన్నిప్పుడు నాపె కాదా ॥ తొల్లి ॥ 59 ॥

## నాదరామక్రియ

మాటలాడవచ్చుఁగాని మరి లేదనఁగరాదు
సూటి దప్పకుండా నిట్టె మామకొమ్మీ పనులు ॥ పల్లవి ॥

నెచ్చెలి తోడుతఁ దన నేరాలు నీవెంచఁగాను
విచ్చనవిడి నాతఁడే వింటా నున్నాఁడు
యెచ్చరించ వచ్చితి నీ కితవరి దాననై
కచ్చు పెట్టి మీఁదబెత్తు గనుకొమ్మీ యిఁకను ॥ మాట ॥

పలుమారు నందరితో పంతాలు నీవాడఁగాను
నలిరేఁగి తెరమాటుననే వున్నాఁడు
తెలిసి దాఁచఁగరాదు తెగ నీచుట్టమ నేను
యెలమి నందుకుఁ దగ నెంచుకొమ్మీ బుద్దులు ॥ మాట ॥

ప్రమదాన నీతో నేమో పలుకుచు నుండఁగాను
తమితోడఁ బానుపుమీఁదనే వున్నాఁడు
సుముఖుఁడై యేలె నిన్నుఁజూచి శ్రీవేంకటేశుఁడు
తెమలక విన్నవించే దిద్దుకొమ్మీ సుద్దులు ॥ మాట ॥ 60 ॥

రేకు 1711

## దేవక్రియ

నీ వేడుక చెల్లించేదే నేరుపు నాకు
భావించుకొనలేక పదరేవు గనక ॥ పల్లవి ॥

హత్తి నీతో నవ్వఁ జుమీ ఆపె వద్ద నుండఁగాను
చిత్తములోపలను కొంచేవు గనక
పొత్తుల నారగించఁగా పొంచి తొంగిచూడఁ జుమీ
మత్తిలి సిబ్బితితోడ మానేవు గనక ॥ నీవే ॥

కొంగువట్టి తియ్యఁ జుమీకొ ఘ్మతో మాటాడఁగాను
వెంగట నీవటు చింతించేవు గనక
పొంగి విడే లందుకోగా పోరచి యదుగఁ జుమీ
సంగ తెఱఁగక నీవు జారేవు గనక ॥ నీవే ॥

వెక్కు నొక్కఁజుమ్మీ నిన్ను వెలిమోవి యానగాను
చిక్కి చిన్నఁబోయి యలసేవు గనక
ఇక్కడ శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
కక్కసించఁజుమ్మీ యాపెఁ గాదనేవు గనక ॥ నీవే ॥ 61 ॥

## పాడి

పొద్దువోక నే నూరకే పొదిగేఁగాక
తిద్దరాని గుణములు తీరువడీనా ॥ పల్లవి ॥

పొరలింపు మాట లాడి పొద్దుగడపేవాని
కరకరిఁబెట్టఁగాను కలిగేదేమీ
గొరబైన వలపులు కుప్పచేసి రమణుని
దరవులు వెట్టఁగాను తనివయ్యీనా ॥ పొద్దు ॥

చుట్టరికములే చూపి చొక్కులఁబెట్టేవాని
నెట్టుకొని సొలయఁగా నిలిచేదేమి
బట్టబయలు నవ్వులు పచరించి రమణుని
జట్టిగొని పెనఁగఁగా సవులయ్యీనా ॥ పొద్దు ॥

ఆయము లూరకే యంటి ఆసలఁబెట్టేవాని
చేయిచాఁచి వెనకఁగా చేరేదేమి
యియ్యెడ శ్రీవేంకటేశుఁ డీతఁడే నన్నుఁగూడె
వేయైనాఁ దనకు నిఁక వేసటయ్యీనా ॥ పొద్దు ॥ 62 ॥

బౌళి

నవ్వేవారి నెఱఁగఁడు నలువంకఁ దన్నుఁ జూచి
దివ్వెలెత్తుఁబొద్దుకాడ తివిరీ నిదేఁటికే ॥ పల్లవి ॥

చెక్కులవెంటాను పెంజెమటలు గారఁగాను
యెక్కడనుండి వచ్చెనే ఇప్పుడితఁడు
పుక్కిటిబంటియైన బుసకొట్ల తోడుత
మక్కళించి యెటువంటి మాట లాడీనే ॥ నవ్వే ॥

విరులు కొప్పుననుండి విడి విడి రాలఁగాను
బిరుదుతో తా నెంత పెనఁగాడీనే
గరిమతో నిద్దురలు కన్నులనే తేరఁగాను
పరగ పాన్పుపై నెట్టు పవళించీనే ॥ నవ్వే ॥

అలపులు తనమేన నటు తొట్రు కొనఁగాను
పిలిచి కాఁగిట నెంత బిగియించీనే
యెలమి శ్రీవేంకటేశుఁడీతఁడే తా నన్నుఁ గూడె
కొలువులోపల నెంత కొనియాడీనే ॥ నవ్వే ॥ 63 ॥

ఆందోళి

ఏమీనన వూరకుండి యేమి గట్టుకొనీ నేఁడు
నా మీఁదఁ జేఇ వేయవద్దా నవ్వేవాఁడుతాను ॥ పల్లవి ॥

వలపు రేఁచినవాఁడు వాడుదేర్చి బుజ్జగించి
కలయఁగ వద్దటవే కాఁగిట నేఁడు
పిలువనంపినవాఁడు పెనగొన్న సిగ్గుల
చలి వాపవద్దటవే సారెకుఁ దాను ‖ ఏమి‖

సరసమాడినవాఁడు చవిగొన మోవి ఇచ్చి
ఇరవుకోవద్దటవే ఇంతలో నేఁడు
శిరసువట్టినవాఁడు చేసన్నలకు లోనై
మరుగఁగవద్దటవే మంచివాఁడు తాను ‖ ఏమి‖

పానుపు చేరినవాఁడు బలిమైన నాచన్నులు
ఆనుకొనవద్దటవే అంకెల నేఁడు
సేనగా రతులఁగూడె శ్రీ వేంకటేశుఁడు నన్ను
యీ నేర్పు చూపవద్దా యిన్నాళ్లు తాను ‖ ఏమి‖ 64 ‖

## దేసాళం

అందుకేమి దోసమా అన్ని పనులుసుఁ దేరీ
[1]చెందుచు నావేఁతలెల్లాఁ జేసి చూపె నిఁకను ‖ పల్లవి ‖

పానుపుపైఁ బవళించి పాదాలు నాపైఁ జాఁచి
మానలేక సతితోడ మాటలాడేవు
కానీరా నీతలపులు కానవచ్చె నాకు నేఁడు
నేనాపెఁ జెనకకుండా నెపము చేసితివి ‖ అందు ‖

కోరి పచ్చడము గప్పి కుచములు నావి వట్టి
నారుకొన కాంతతోడ నవ్వు నవ్వేవు
నేరుతువౌరా మేలు నే నాపె దడవకుండా
వూరటగా నిదియొక వుపమ చేసితివి ‖ అందు ‖

---

[1] చెందుచున్+ ఆవేఁతలెల్లా

తెరలోననే వుండి తియ్యని నామోవి యాని
గరిమతో నంగనను కాఁగిలించేవు
యిరవై శ్రీ వేంకటేశ యే నాపెఁ గారించకుండా
సరవితో నిటువంటి చందము చేసితివి ॥ అందు ॥ 65 ॥

## సౌరాష్ట్రం

[1]విచా (చా?) రించుకొమ్మనవే విభునిఁ దనలోఁదానె
పచారించితే వలపు పైపైనే వున్నది ॥ పల్లవి ॥

మొక్కలీఁడైనవాఁడు మోహములు చల్లితేను
వెక్కసములై మించదు వెలఁదికిని
చొక్కి వినయపు పతి సొలపుల దిట్టితేను
అక్కర గలుగు పతి కమృతమై తోఁచును ॥ విచా ॥

పల్లదీఁ డైనవాఁడు పచ్చిమాటలాడితేను
వుల్లములో నుడి (దు?) కెత్త దువిదకును
మెల్లనే నయగారైనమెలుఁత వెంగెమాడితే
చల్లఁగా నాయకునికి చవులై పరగును ॥ విచా ॥

కాతరీఁడైనవాఁడు కన్నులను మొక్కితేను
ఘాతలై వేసరించవు కామినికిని
యీతల శ్రీ వేంకటేశుఁ డీతఁ డిట్టె నన్నుఁగూడె
రాతిరిఁ బగలు నాకు రతికెక్కె ముదము ॥ విచా ॥ 66 ॥

రేకు 1712

## సామంతం

ఏమి నేరుచుకొంటివి యెగసక్కెలు
నీమతకమంతయును నీకే తెలుసును ॥ పల్లవి ॥

---

[1] ప్రాసభంగము.

వలపులు మున్ను రేఁచి వద్దికి వచ్చితే మరి
వలములు సాదింతురా సకియలను
పిలిచి పేరుకొనఁగా ప్రియమున నూఁకొంటే
పలుకకుండుదురా పంతముతోను ॥ ఏమి ॥

అగ్గలముగా నవ్వి ఆయములు గరఁగితే
సిగ్గులు వరతురా చెలువలను
వొగ్గి యాసలు వుట్టించి వూరకే కాలుదొక్కితే
యెగ్గులు వట్టుదురా ఇంతలోనను ॥ ఏమి ॥

జట్టిగాఁ గాఁగిటఁ గూడి సమరతిఁ గొసరితే
తిట్టులు దిట్టుదురా తెఱవలను
ఇట్టె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
గుట్టు సేతురా ఇఁకఁ గూరిమితోను ॥ ఏమి ॥ 67 ॥

## దేశాక్షి

ఏమి చెప్పే రిఁక నీకు యెంత లేదీ సంతోసము
వేమరు నిన్నాపె ఇంత వెలయించెఁగా ॥ పల్లవి ॥

మనసు రంజిల్లఁ జేసి మంతనము నీతో నాడి
తినివిఁ బొందించెఁగా తరుణి నేఁడు
చనుఁగవ దాఁకించి సంగడినే కూచుండి
పెనుపొందని మోహము పెడరేఁచెఁగా ॥ ఏమి ॥

సెలవుల నవ్వు నవ్వి చేరి నీకుఁ బాదాలొత్తి
అలపెల్లాఁ దేర్చెఁగా అంగన నేఁడు
సొలపుఁ జూపులఁ జూచి సురటి నటువిసరి
యెలమి నీకోరికె లీడేర్చెఁగా ॥ ఏమి ॥

కప్పురపు విడెమిచ్చి కాఁగిట నిన్నుఁ గుచ్చి
నుప్పిరిఁ జొక్కించెఁగా ముదిత నేఁడు
ఇప్పుడె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నీవు
తప్పక నిన్నాపె యింత తమిరేఁచెఁగా ॥ 68 ॥

## వరాళి

తలఁచి యిటువంటివే తప్పించుకొనఁ బట్టె
చెలులాల విభునికిఁ జేరి విన్నవించరే ॥ పల్లవి ॥

వొగ్గి నేఁడు తా నాపె నొడివట్టఁగాఁ జూచితి
సిగ్గులు వడదుఁగదా చెలువుఁడు
అగ్గలమై ఇందుకుఁగా అట్టె తన్ను దూరితి
యెగ్గులు వట్టఁడుగదా ఇప్పు డితఁడు ॥ తలఁ ॥

యెనసి యిద్దరుండఁగా నింటిలోనికి వచ్చితి
మనసు నొవ్వదుగదా మరి తనకు
యెనలేని తమజాడ లెరుకలుచేసుకొంటి
వెనకతియ్యఁడుగదా వెఱపున నితఁడు ॥ తలఁ ॥

కమ్మ పెట్టి యాపె కూడిగము సేయఁగా వద్దంటి
మచ్చరించుకోఁడుగదా మగఁడు తాను
తచ్చి శ్రీవేంకటేశుఁడు తను నేఁ బెండ్లియాడితి
రచ్చలఁ బెట్టఁడుగదా రతులెల్లాను ॥ తలఁ ॥ 69 ॥

## లలిత

ఇప్పటనుండి మాటలేల నీతోను
తప్ప మోపకుండితేను శారుకాణించరాదా ॥ పల్లవి ॥

సన్నలనే నీగుణము చాయకుఁ దేకుండితేను
నన్నుఁజూచి నీ వప్పుడు నగరాదా
చిన్ననాటి నా పంతాలు చెల్లించుకోకుండితేను
వున్నతితోఁ బెట్టరాని వొట్టు వెట్టరాదా ॥ ఇప్ప ॥

చుట్టరికాననే నిన్ను సూదు వట్ట కుండితేను
అట్టే నన్ను యెగసక్కే లాడరాదా
రట్టు సేసి నిన్నింటికి ఇట్టె రప్పించకుండితే
పట్టిన చలాన సిగ్గుపరచఁగరాదా ॥ ఇప్ప ॥

పచ్చిగా రతులఁ గిందుపడఁ జేయకుండితేను
కచ్చుపెట్టి మరి నీవు కాదనరాదా
ఇచ్చట శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మచ్చికలు చూపి నాతో మారుకొనరాదా ॥ ఇప్ప ॥ 70 ॥

## శుద్ధ దేశి

నిన్నుఁ జూచి వెరగయ్యీ నేఁడు మాకిందరికిని
యెన్నికె కెక్కినవాఁడ వింత సేయఁదగునా ॥ పల్లవి ॥

సిగ్గువడఁగానే చెలిఁ జేయివట్టి తీసేవు
యెగ్గనొ యెవ్వరుంటా నెఱఁగవు
అగ్గలము మోహమైతే నాడేవారిఁ జూడవద్దా
వొగ్గి మగవాఁడ వింత కొడిగట్టఁదగునా ॥ నిన్నుఁ ॥

తప్పించుకొనఁగానే తరుణి చన్ను లంటేవు
ఇప్పుడేఁటి కనవు నీ యెమ్మె మానవు
ముప్పిరిఁ జుట్టమవైతే ముందువెన కెంచవద్దా
చెప్పరాని దొరవైతే చేఁత సేయఁదగునా ॥ నిన్నుఁ ॥

తెరవేసుకొనఁగానే దీకొని ఇంతిఁ గూడేవు
అరిదిపడవు సారె నంటువాయువు
ఇరవై శ్రీ వేంకటేశ యేలితివి మమ్మునెల్లా
సరసుఁడ వింతేపి వేసాలు సేయఁదగునా ॥ నిన్నుఁ ॥ 71 ॥

## కాంబోది

పవ్వళించు మిపుడిట్టె పానుపుమీఁద
దవ్వులనే యీవేళ తలవంచేవయ్యా ॥ పల్లవి ॥

రవ్వలాయ నామోహము రచ్చకెక్కె నీ తగవు
నవ్వినటులనే వుండి(డె?) నాకు నీకును
పువ్వువంటి జవ్వనము పూఁచరాదు దాఁచరాదు
చివ్వన నీవేఁటికి సిగ్గువడేవయ్యా ॥ పవ్వ ॥

మేర మీరె నావేడుక మెరసెను నీచలము
నారుకొనెఁ గోరికెలు నాకు నీకును
భారమైన తమకము పట్టరాదు ముట్టరాదు
దారకాన నీవేల తలపోసేవయ్యా ॥ పవ్వ ॥

కదు మించె నా కాగిలి కానవచ్చె నీగుణము
నదుమఁ బంతము దక్కె నాకు నీకును
యెడయక శ్రీ వేంకటేశ యేలితివి నన్ను
తడఁబడి నీవేల దప్పిదేరేవయ్యా ॥ పవ్వ ॥ 72 ॥

రేకు 1713

## ముఖారి

ఇన్నిటా జాణవు నీకు యెవ్వరు గుద్ది చెప్పేరు
యెన్నికె కెక్కిన నీ ఇంటిలోనివారము ॥ పల్లవి ॥

అక్కరతోడఁ బొరుగాపె నిన్నుఁ జెనకఁగా
చెక్కు నొక్కి నన్ను నెంత చిమ్మిరేఁచేవు

పుక్కిటిబంటి వలపు పోరచి నీకురాఁగాను
పిక్కటిల్ల నిందు వెలవెట్టి కొనవలెనా ॥ ఇన్ని ॥

వేడుకతో నాపె నేఁడు విందు నీకుఁ జెప్పఁగాను
యీడ నిట్టె మాపొత్తుకు నేల వచ్చేవు
వీడని మట్టరికము వెంట వెంటఁ దగులఁగా
యీడు వెట్టి మాపొందుల కేఁకరఁగవలెనా ॥ ఇన్ని ॥

కూరిమితోడుత నాపె కొంగువట్టుకుండఁగాను
గారవించి నన్ను నెంత కాఁగిలించేవు
ఆరీతి శ్రీవేంకటేశ అందుఁదరితీపు లూరె
ఆరసి మామోవితేనె లడుగఁగ వలెనా ॥ ఇన్ని ॥ 73 ॥

## గౌళ

వేగిరింతునా 3యెంతవేసట గలిగినాను
వేగదేరితే వలపు చిమ్మి రేఁగీఁగాక ॥ పల్లవి ॥

యెక్కడనైనాఁ బతి యేమిసేసి వచ్చినాను
వెక్కసాలాడవచ్చునా వెలఁదికిని
పెక్కులాఁగులఁ బెనఁగి ప్రియములు చెప్పఁగాను
మక్కువ నాతఁడే మరి మన్నించీఁగాక ॥ వేగి ॥

నెట్టన నాతని మేన నిండా గురుతు లుండినా
పట్టి చూపవచ్చునా పడఁతికిని
గుట్టుతోడనే వుండి కొలువులు సేయఁగాను
జట్టిగొని యాతఁడే చనవిచ్చీఁగాక ॥ వేగి ॥

యెలమి శ్రీ వేంకటేశుఁ డెంత రతిఁ గదిమినా
అలఇంచవచ్చునా అంగనకును

మెలఁగి నావలెఁ గూడి మేర మీరకుండఁగాను
వలువఁగాఁ దానే మోవి చవిచూపీఁగాక ॥ వేగి ॥ 74 ॥

## పాడి

పరిణాములాయ నాకు పంతము లీడేరెను
ఇరవై మాదీవెన లింకా నేలు సతుల ॥ పల్లవి ॥

మొనసి నీతో సరసములాడఁగా నేఁడు నాకు
వనవిచ్చితివిగా సముకాననను
మనసిచ్చి యప్పటిని మాటలాడేయట్టుగాను
ననుపు నటించి ఇట్టె నవ్వించితివిగా ॥ పరి ॥

సన్నసేసి ఇప్పుడు నీసంగడిఁ గూచుండే యట్టు
మన్నించితివిగా మక్కువతోను
వన్నెల నీతో నేను వాడిక నవ్వు నవ్వఁగా
యెన్నికఁగా బెద్దరికమిచ్చితివిగా ॥ పరి ॥

మేడలోన నన్నుఁ గూడి మేనరికపు వావులను
గూడి కెక్కించితివిగా వేడుకతోను
తోడనె శ్రీ వేంకటేశ దొరఁజేసి యిందరిలో
యీడేరించితివిగా యిన్నిటా నన్ను ॥ పరి ॥ 75 ॥

## పళవంజరం

ఎటువంటిజాణవు నిన్నేమనేది
తటుకన నిందు కెంత తమకించే విపుడు ॥ పల్లవి ॥

కందువ నాపె నీవుఁ గాఁపురాలు సేయఁగాను
సందడి సరసమాడ సంగతా నాకు
విందువెట్టి ఆపె నీకు విడెము వేతికియ్యఁగా—
నందుకొని నేను నీకు నాకుమడిచిత్తునా



వువ్విళ్లూర నీవు నాపె వొక్క పాన్పుపై నుండఁగా
చివ్వన వలపు చల్లఁ జెల్లునా నాకు
నివ్వటిల్లఁ బొంచి యాపె నీమోము మూడఁగాను
నవ్వులు నవ్వుదునా నడుమ నేను ॥ ఎటు ॥

రట్టుగా నాపె నీవు ఇట్టె రతిసేయఁగాను
వెట్టి కూడిగాలుసేయ వేడుకా నాకు
ఇట్టె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మట్టమ నయినమీఁద చొప్పరెత్తనేఁటికి ॥ ఎటు ॥ 76 ॥

## సాళంగం

చేసినట్టల్లా మీకుఁ జెల్లఁగాక
బాస చేసుకొన్న మిమ్ముఁ బచారించఁగలమా ॥ పల్లవి ॥

బలిమికాఁడవు నీవు పట్టపుదేవు లాపె
యెలమి సాకిరులు నే మెట్టుచెప్పేము
వలపెల్లా నీ సొమ్ము వాసులెల్లా నింతిపాలు
కలిగినట్లనే తగవు దిద్దవసమా ॥ చేసి ॥

చక్కని జాణవు నీవు వదురులాఁడి యాపె
పక్కన మిమ్మెట్టు వొడఁబరచేము
యిక్కువ లెఱుఁగుదువు యియ్యకొనెనాపె తొల్లె
యెక్కువ తక్కువ లేక యిచ్చలాడ నోపేమా ॥ చేసి ॥

శ్రీ వేంకటేశుఁడవు చెలియ భావజు తల్లి
చేవదేర నే మెట్టు సిగ్గు వాపేము
కైవశ మాపెకు నీవు కాదన దాకె నీమాట
వేవేలకుఁ గూడితిరి వినుతించఁదరమా ॥ చేసి ॥ 77 ॥

## సాళంగనాట

ఎఱుకమాలినదాని నేమనేది
అఱమఱలేక నీవు నందె కూడుకొంటివి ॥ పల్లవి ॥

చన్నులపైఁ బయ్యర చక్కఁబెట్టుకొంటాను
సన్నలనే మాటలాడీ సతి నీతోను
యెన్ని నేర్చె వెడమాయలివి నీకుఁ బ్రియమాయ
కన్నవారెల్లా నవ్వేది కటకటా మాడదు ॥ ఎఱు ॥

మలయుమఁ బుక్కిటి తములము మారుచుకొంటా
పెలవుల నవ్వు నవ్వీఁ జెలి నీతోను
నిలువెల్లా వేసాలే నీవందుకు భ్రమతువు
చెలులు గేలిగొనేది చెల్లఁబో యెరఁగదు ॥ ఎఱు ॥

వాఁడినకెమ్మోవి తేనెవాసనలు చల్లుకొంటా
కూడీని శ్రీ వేంకటేశ కొమ్మ నీతోను
జాడలీపె విట్లానే; సరి నన్ను నేలితివి
ఆడవారు సంతోసించే దయ్యయ్యో తా మెచ్చదు ॥ఎఱు॥ 78 ॥

రేకు 1714 ## ఆహిరి

అలయికెరఁగవద్దా అఁటదాని యెడలను
యెలుఁగెత్తి తిట్టితేను యేమిసేసే విఁకను ॥ పలవి ॥

మొక్కి మొక్కి చేతులెత్తి ముదిత వొడ్డించుకోఁగా
కక్కసించి చెనకేవు కాతరానను
జక్కవలఁ బోలిన మునుముక్కులు
ఇక్కడ నిన్ను నాటితే నేమిసేసేవిఁకను ॥ అల ॥

చుట్టి ముట్టి పాదాలపై సుదతి యానవెట్టఁగా
ఒట్టుగాఁ గాఁగిలించే వాఁడుడిగా నీవు
దిట్టలయిన చకోరాల తీరుల కన్నుల చూపు--
లిట్టె నిన్ను సొంపితే నేమిసేసేవిఁకను ॥ అల ॥

మల్లి మల్లి రతులను మగువ నిన్నుఁ గూడఁగా
పల్లదాన నవ్వేవు పచ్చిదేరను
మెల్లనె వజ్రాలవంటి మెరుఁగు గోరు లంటితే
యెల్లగా శ్రీ వేంకటేశ యేమిసేసే విఁకను ॥ అల ॥ 79 ॥

## కన్నడగౌళ

చిత్తగించరాదా ఈ చెలి భావము
బత్తిగలవారము చెప్పకపోదు నీకును ॥ పల్లవి ॥

కలికి నీయింటికి రాఁగా యెదురుతాఁనై
తళుకున నిన్నుఁజూచి తలవంచెను
వెలలేని వలపుల విన్నపము సేయఁబోయి
సెలవుల నవ్వుదేర సిగ్గువడె నదివో ॥ చిత్త ॥

అంగన కానుక నీకియ్యఁగ చేయిఁ జేయి దాఁకి
చెంగటనే కళరేఁగి చెమరించెను
సంగతిగా మూడిగాలు సారెకుఁ జేయఁగ వచ్చి
అంగవించి పరవశమంది వున్న దిదివో ॥ చిత్త ॥

పొలఁతి సేసలు చల్లఁబూని మీకుఁ దారుకాణై
తలఁపు లొక్కటులై తమకించెను
యెలమి శ్రీ వేంకటేశ ఇప్పుడె నిన్నుఁగూడి
బలిమి నీతోఁ బెనఁగి పచ్చిదేరె నదివో ॥ చిత్త ॥ 80 ॥

## గౌళ

తలఁచుకో మీఁదపెట్టు తత్తరపడవలదు
చలములు మాని ఇఁకఁ జక్కనుండరాదా ॥ పల్లవి ॥

కాంత తోడుత నీవు కాఁతాళించి పెనఁగేవు
అంతేసి కోపుదువా అప్పుడు నీవు
పంతమాడవచ్చుఁగాని బలిమి చూపు టరుదు
సంతమై మీలో మీరు చక్కనుండరాదా ॥ తలఁ ॥

మగువ పిలువఁగాను మారుకొని ఓగి సేవు
అగడు కోపుదువా అప్పుడు నీవు
నగవచ్చుఁగాని వెనక వేఁడుకోరాదు
జగడాలు మాని ఇఁకఁ జక్కనుండరాదా ॥ తలఁ ॥

కలికి పానుపుమీఁద కాఁగిటిలో మించేవు
అలయనోపుదువా అప్పుడు నీవు
చెలఁగి శ్రీ వేంకటేశ చెప్పవచ్చుఁ జూపరాదు
సలిగె మెరసి మీరు చక్కనుండరాదా ॥ తలఁ ॥ 81 ॥

## సౌరాష్ట్రం

సేసినట్టెల్లా నీకుఁ జెల్లదా నేఁడు
సేస పాలెల్లాఁ జిందీ చేరి నవ్వకిఁకను ॥ పల్లవి ॥

చొప్పు లెత్తనేల నాకు పోదించనేఁటికి నిన్ను
యెప్పుడు నీవోజలు నే నెరిఁగినవే
తప్పించుకో నెట్టు వప్పు లారుకాణలైనచోట
పిప్పిగట్టీ మోవి యూనవెట్టుకోకు మిఁకను ॥ సేసి ॥

పంగించగా నేమివచ్చీ పంతమాడాఁ బనిలేదు
సంగతి నీవలపులు సాజమే నీకు
ముంగిట వేసుకోరాదు మూలనున్న సిగ్గులు
వెంగెమయ్యీ సారె సారె వెసఁ జూడ కిఁకను ॥ సేసి ॥

పెనఁగఁగవద్దు నీతో బెట్టు నిన్ను దూరనోప
ఘనమైనయాస నీకు గలిగినదె
యెనసి శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిదె
తనివయ్యీ రతులను తమకించ కిఁకను ॥ సేసి ॥ 82 ॥

## కాంబోది

కాచుకున్న దిందుల కీ కలికి యప్పటినుండి
యేచి చనవియ్యరాదా ఇఁకనేల లోఁగను ॥ పల్లవి ॥

చెప్పరాదా కతలెల్లా చెవులొగ్గి వినీ నాపె
కప్పురపు వాసనల గాఁకదేరను
వొప్పి కాఁగిలించరాదా వొడివట్టితీసీ నాపె
చిప్పిలుఁ బెంజెమటలచే నలపారను ॥ కాచు ॥

చేరి విడెమియ్యరాదా చేతులు చాఁచీ నాపె
సారెకు మైసోఁకుల చలివాయను
నేరుపుతో నవ్వరాదా నీ దిక్కు చూచీనాపె
వూరేటి మోవితీపుల నొగి దప్పి వాయను ॥ కాచు ॥

పంతముతోఁ జాఁచరాదా పాదములొత్తీ నాపె
మంతనపుఁజేఁతల మనసారను
ఇంతలో శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
సంతోసమే పెంచరాదా వవులెల్లా రేఁగలు ॥ కాచు ॥ 83 ॥

## గుజ్జరి

అప్పుడే నీ వానతియ్యవైతివి గాక
చెప్పరాని పనులైతే చెవులొగ్గి వినేనా ॥ పల్లవి ॥

మక్కువ నీవు చూపఁగా మాటలాడితిఁగాక
కక్కసమై తోఁచితేను గాసిఁబెట్టనా
తక్కక లాలించఁగాను దండనుండితిఁగాక
మిక్కిలి వేసటలైతే మేరతోనే వుండనా ॥ అప్ప ॥

చనవు నీ వియ్యఁగాను సంగడిఁ కూచుంటిఁగాక
మనసు రాకుండితేను మల్లు వోరేనా
వినఁగానే నీ కన్నియు విన్నవించితిఁగాక
ననుచకుండితే గుట్టుననే నీకు మొక్కనా ॥ అప్ప ॥

కందువకు రాఁగాను కాఁగిటఁ గూడితిఁగాక
మందటలాడఁబోతేను మత్సరించేనా
ఇందరిలో శ్రీ వేంకటేశ నన్ను నేలితివి
అందగారితనమైతే నట్టె నిన్ను నవ్వనా ॥ అప్ప ॥ 84 ॥

రేకు 1715 ## కాంబోది

రమణుఁడు నన్ను నెంత రవ్వచేసీనే
అమరఁగఁ జెలులాల అట్టె విన్నవించరే ॥ పల్లవి ॥

సరసమాడితేనేమి సంగడి నుండితేనేమి
గరిమఁ గూడినట్ల కాంక్షఁ దీరీనా
సరులు దిద్దితేనేమి సన్నలు చేసితేనేమి
అరిదిఁ బెండ్లాడినట్లు లక్కర వాసీనా ॥ రమ ॥

పయ్యెద ముట్టితేనేమి భావించి చూచితేనేమి
తియ్యని మో విచ్చినట్టు దిష్టమయ్యీనా
వొయ్యనే నవ్వితేనేమి వొడివట్టితేనేమి
ఇయ్యెడఁ గాఁగిలించిన ట్లిచ్చకమయ్యీనా ॥ రమ ॥

పొత్తుకు వచ్చితేనేమి పూవుల వేసితేనేమి
హత్తి వినోదించిన ట్లందమయ్యీనా
ఇత్తల శ్రీ వేంకటేశుఁ డేలీ నన్ను నిట్లానే
బత్తి సేసీ నిఁకఁ దనుఁ బంగించవచ్చీనా ॥ రమ ॥ 85 ॥

## దేసాళం

అన్నిటా భాగ్యవంతుఁడ వౌదువయ్యా
కన్నులెదిటి నిధులు కాంతలు నీ కెప్పుడు ॥ పల్లవి ॥

సందడిఁ బాదము దొక్కి సరిఁ బెండ్లాడితినంటా
ముందు ముందే మట్టరికములు చెప్పేవు
యెందరిఁ గైకొంటివో యిటువలెనే తొల్లి
అందుకోలువావు లిట్లు లబ్బె నీకు నిపుడు ॥ అన్ని ॥

చెలఁగి పోచిళ్లు చల్లి సేసలు వెట్టితినంటా
మలసి పెండ్లివిడేలు మాకుఁ బెట్టేవు
ఇలపై నెవ్వరెవ్వరి నిట్లాఁ జేసుకొంటివో
లలిఁ బొరుగు నేస్తాలు లాభించె నిపుడు ॥ అన్ని ॥

మెచ్చి కాఁగిలించుకొని మేనదాననని
కుచ్చి పెండ్లికూఁతురంటా గురిసేసేవు
ఇచ్చట శ్రీ వేంకటేశ ఇది నీకు నలవాటో
చెచ్చెర నీ కోరికలు సిద్ధించె నిపుడు ॥ అన్ని ॥ 86 ॥

## వరాళి

నే నెప్పుడు నున్నదాన నీపాలిటిదానను
పూనిమీఁదెత్తిని వలపులు చేకొనరాదా ॥ పల్లవి ॥

మొనగోర నిన్ను నూఁది మోహ మాకె పైఁ జల్లి
కనుసన్నలఁ బిలిచీఁ గందువలకు
ననునేల చెనకేవు నాతో నేమి నవ్వేవు
మనసుపెట్టి నాపెను మన్నించరాదా ॥ నేనె ॥

కెలసి సరసాలాడి కెలు గేలఁ గీలించి
సొలయుచుఁ బెనఁగీ నీసురతానకు
బలిమేల చేసేవు పట్టవేల నావెరఁగు
కలయవచ్చినాపెను కాఁగిలించరాదా ॥ నేనె ॥

చిగురు మోవి చూపి సిగ్గులెల్లాఁ గూడపెట్టి
తగిలి చేయి చాచీ నీతములానకు
అగపడి శ్రీ వేంకటాధిప నన్నేలితివి
జిగి నేఁకరేయాపెను చేతనంటరాదా ॥ నేనె ॥ 87 ॥

## మంగళకౌసిక

సిగ్గువిడిచినమీఁద చెల్లదు పోదు
యెగ్గుగాదు తనకుఁ జెయ్యెత్తి మొక్కే ననెరే ॥ పల్లవి ॥

వలపు వెగ్గళమైతే వాదించఁబనిలేదు
చలమెప్పుడైతే వంచన చెల్లదు
కెలయుఁ జొచ్చితే మరి కిందుమీదు లెంచరాదు
తలఁచుకొమ్మనవే యీ తగవు లాతనిని ॥ సిగ్గు ॥

ననుపు లోనగూడితే నమ్మిక లడుగవద్దు
మనసు రాకుండేను మాటలేఁటికి
పెనఁగు లాడఁబోఁతే ప్రియములు చవిగావు
కనుఁగొనమనరే యీ గతులు తా నెరుఁగు ॥ సిగ్గు ॥

చుట్టరికమెనసితే చెప్పలెత్త మరియేల
వెట్టి నవ్వునవ్వితేను వేదుకేడది
ఇట్టె శ్రీ వేంకటేశుఁడేలినాఁడు నన్ను నేఁడు
గుట్టుతో నుండుమనవే గుణమెల్లాఁగంటిని ॥ సిగ్గు ॥ 88 ॥

## అమరసింధు

తగవెంచుకొన వలదా తరుణికిని
మగఁడై కైకొన్నవాఁడు మరి యేమి సేసునే ॥ పల్లవి ॥

జక్కవలవంటి నీ చన్నులు విసికెనంటా
వెక్కసా లాడే వదేమే విభునితోను
మిక్కిలి మరుబాణాలు మేలు గదురేఁ చఁగాను
మక్కువ గలుగువాఁడు మరి యేమిసేసునే ॥ తగ ॥

చెంతనుండి నీ తురుము చేతఁ బట్టి తీసెనంటా
పంతము లాడేవేమే పతితోను
వింత వింతలై వయసు వేదుకలు వుట్టించఁగా
మంతనాన వున్నవాఁడు మరి యేమి సేసునే ॥ తగ ॥

చనవుతో నిప్పు డిట్టె సరసము లాడె నంటా
యెనసేవేమే శ్రీ వేంకటేశ్వరుతోను
తనువులో తమకము తతిగొని నుండఁగాను
మనసు పెట్టినవాఁడు మరి యేమి సేసునే ॥ తగ ॥ 89 ॥

## బౌళి

అందరు నొక్కసరిగా నాడకు నీవు
మందలించి మమ్ము నిట్టె మన్నింతువు గాని ॥ పల్లవి ॥

ప్రియ మెరిఁగినకాంత ఓగియుదు పిలిచితే
నయగారి దెప్పుడు నానలు వెట్టదు
నియతిగలిగినది నేరము లేమీ నెంచదు
క్రియ దెలిసినదెందూ గినుకకుఁ జొరదు ॥ అంద ॥

గుట్టుతోడిదైతేను కూరిములు గొసరదు
చుట్టరికమైనది యూసులు రేఁచదు
నెట్టన వలఁచినది నిందలు పైవేయదు
దిట్టయైనది గక్కనఁ దెగువలు మాపదు ॥ అంద ॥

ఇచ్చకమై యుండేది యెరవులు సేయదు
వొచ్చములేనిది తగవులఁ బెట్టదు
యిచ్చట శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మచ్చిక సేసినది వేమరు నెదురాడదు ॥ అంద ॥ 90 ॥

రేకు 1716 కొండమలహరి

ఇయ్యకొంటి రావయ్యా యీడకు నీవు
పయ్యెదలో చన్నులంటి బాససేయ నేఁటికి ॥ పల్లవి ॥

వనితలెందరు నీపై వలపులు వల్లినాను
మనసుగలవోఁగాక మాటలాడేవా
వినయ మప్పటి నీకు వేమారుఁ జేసినాను
ననుపైనచోటఁగాక నవ్వు నవ్వేవా ॥ ఇయ్య ॥

నియతాన మరెందరు నిన్నుఁ బెండ్లాడినాను
దయగలచోటఁ గాక తమకించేవా
రయమునఁ దాము నిన్ను రతి కెంత దీసినాను
ప్రియము గలచోఁగాక బెరసి కూడేవా || ఇయ్యె ||

నిగిడి ఇందరు నిట్టె నిన్నుఁ గాఁగిలించుకొన్నా
తగులు గలచోఁగాక తనివందేవా
జిగి నన్నుఁగూడితివి శ్రీ వేంకటేశ్వరుఁడవు
సొగసిన చోటఁగాక సొంపు నెరపేవా || ఇయ్యె || 91 ||

పాడి

పడఁతు లిందరిలోనా బత్తి నాకే నెరపీని
వుడివోనివేఁతల నన్నోడించవలెనా || పల్లవి ||

ఆమని తనరతుల నలసి నే నుండఁగాను
యేమిటికి వేడుకొనీ నింకాఁ దాను
ప్రియము గలవాఁడవు ప్రియ మెంత వేసీని
సోమించి ఇప్పుడే నాకుఁ జూపఁగవలెనా || పడఁ ||

ముట్టి తన చెనకుల ములుకుమునుండఁగాను
అట్టె యేల తడవీని అప్పటిఁ దాను
దిట్ట తానే ఇన్నిటాను తెలిసి రిందరు నేఁడు
మెటి(ట్టి?) తన ఓరాలు మెరయఁగ వలెనా || పడఁ ||

నను పైన సరసాన నవ్వుతా నేనుండఁగాను
పెనఁగి యెంత కూడీనే బెరసి తాను
ఘనుఁడైన శ్రీ వేంకటపతి తానౌను
చనవిచ్చి యీవేళనే జట్టిగొనవలెనా || పడఁ || 92 ||

## తోండి

నాతో నేమి చెప్పేరు నాటకపు మీ సుద్దులు
నీతితో మిమ్ము మట్టున నిలిపేనా నేఁను ॥ పల్లవి ॥

యెగసక్కెపు మాటలు మీరిద్దరు నాడుకోఁగా
తగవులు చెప్పేనా దండ నే వుండి
అగపడి పెట్టరాని ఆనరెల్లాఁ బెట్టుకోఁగా
మగటిమి మెరసి నే మానిపేనా మిమ్మును ॥ నాతో ॥

పైకొని మీరిద్దరును బాసలు వేసుకొనఁగా
సాకిరై నే నుండేనా [1]సందుసుడిని
వాకులు దెరచి లోలో వావులు దెలుపుకోఁగా
ఆకడీకడనుండి మిమ్మోఁగాదనగలనా ॥ నాతో ॥

కలసి యాకె నీవుఁ గడు నివ్వెరగందఁగా
యెలమి నే గోర నొత్తి యెచ్చరించేనా
అలమి శ్రీ వేంకటేశ అట్టె నన్ను నేలితివి
బలిమిచేసి నేను పంతము లాడేనా ॥ నాతో ॥ 93 ॥

## వరాళి

ఏమిఁ గట్టుకొంటివి నీ విందువంకను
కామించినమే లొక్కటే కట్టుకొనరాదా ॥ పల్లవి ॥

కలువపువ్వుల వేసి కాఁకలు మీఁదటఁ జల్లి
చలువకు వేఁడికి సరిచేసేవు
తలుపు గొబ్బున మూసి తనువుఁ దనువురాసి
చెలరేఁగి వలపులు చిమ్మిరేఁచేవు ॥ ఏమిఁ ॥

---

[1] సందుసుడిని= నడుమన్. దీనిపై తద్ధితమే 'సందుసుడికత్తె'=అవకాశము చూచుకొనినడుమ దూరునది. సమాసము 'సందుసుడిమాటలు' = నడుమ చొచ్చుకొని మాటలాడు మాటలు.

నెయ్యమున నవ్వు నవ్వి నిమ్మపండ్లనే రువ్వి
చయ్యాటాల రెండు సరిచేసేవు
పయ్యాడి శిరసు దువ్వి పంతములు లోలోఁదవ్వి
వుయ్యాలమంచముమీఁద వొల వేసేవు ॥ ఏమి ॥

కప్పురము నోరికిచ్చి కనుఁగొనలనే కొచ్చి
చప్పచారుసరసాల సరిచేసేవు
యిప్పుడె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
వుప్పతిల్లుఁ దమకముఁ లోనఁగూరిచేవు ॥ ఏమి ॥ 94 ॥

## ముఖారి

ఊరకే వుండఁగరాదుఁ వొరసి యడుగరాదు
తారుకాణించుకోవలె తప్పులు లేకుండాను ॥ పల్లవి ॥

కొలువులోపల నుండి కొమ్మ నీతో నవ్వఁగాను
చెలరేఁగి నీవెంత సిగ్గువడేవు
యలమి మీలో నవి యెటువంటి మర్మములో
తెలుసుకోవలె మాకు తేటతెల్లమిగను ॥ ఊర ॥

పగటున మోహించి పడఁతి సన్నసేయఁగా
మొగము చూచి నీవెంత మూసి ధాఁచేవు
వొగి మీలో నివి యెట్టి వొడఁబాటు సుద్దులో
తగ విచారించవలె తనియుదీరఁగను ॥ ఊర ॥

ముందు ముందుగా నీకు ముదిత మోవియ్యఁగాను
సందడిలోననే వుండి చవి గొనేవు
అంది శ్రీ వేంకటేశుఁడ అట్టె నన్ను నేలితివి
పొందులు చూడఁగవలె పొందొక వింతలుగా ॥ ఊర ॥ 95 ॥

## పాడి

చూడనే మంచివాఁడవు సుద్దులెన్నైనాఁ గలవు
వాడికెనే చొక్కింతురా వంతున నీవు ॥ పల్లవి ॥

క్రియలెఱుఁగుదునంటా కేరి నవ్వనేర్తునంటా
బయలీఁదింతురా నీవు పడఁతులను
దయఁగలవాడనంటా తప్పులెంచ నేనంటా
నయాననే సాదింతురా నడుమ నీవు ॥ చూడ ॥

సోఁకించితి గోరనంటా మట్టమనయితి నంటా
చీఁకటి దవ్వింతురా చెలువలను
వాఁకమాయ వంపంటా వన్నెకాఁడ నేనంటా
[1]యాఁకట నలయింతురా అప్పుడే నీవు ॥ చూడ ॥

యిట్టె కూడితినంటా యిన్నిటా జాణఁడ నంటా
గుట్టు విడిపింతురా కొమ్మల నీవు
కట్టుగా శ్రీ వేంకటేశ నెట్టన నన్నేలితివి
మట్టుమీర మన్నింతురా మక్కువతో నీవు ॥ చూడ ॥ 96 ॥

రేకు 1717

## రీతిగౌళ

ఇద్దరము నున్నారము యిదివో నేము
బుద్దులు మీరు చెప్పితే పొసఁగేమునేము ॥ పల్లవి ॥

పగటులదాన నేను పంతములవాఁడు తాను
తగవులు దేర్చరే తరుణులాల
చిగురులవేటు నాది సేవంతివాటు తనది
జగడాలు దిద్దరే సతులాల వొరసేటిదాన నేను ॥ ఇద్ద ॥

---

[1] యాఁకట = 'ఏఁకరు' ధాతువు వ్యావహారికముగా 'యాఁకరు, యాఁకట'గా మారినట్లున్నది. యతిగూడ 'య'కారముననే కూర్చినారు.

వుద్దండపువాఁడు తాను సర
సరవులు చెప్పరే సకియలాల
గౌరబైనమాట నాది కొసరుమాట తనది
వరుసఁ గూరచరే వనితలాల ॥ ఇద్ద ॥

చెలఁగి శ్రీ సతి నేను శ్రీ వేంకటేశుఁడు తాను
అలుకలు మానుపరే యంగనలాల
తలపోఁత యిది నాది తమకమెల్లాఁదనది
కలసితిమి మెచ్చరే కామినులాల ॥ ఇద్ద ॥ 97 ॥

## ఆహిరినాట

ఇంక నిన్ను నేమనేది యెరిఁగితి నీ గుణాలు
అంకెలనే తమిరేఁచి యెలయఁజేసితివి ॥ పల్లవి ॥

నగేవంటా నుంటిఁగాని నాలిసేసె పొద్దువుచ్చి
పగలు సాదించేది భావించనైతి
యెగసక్కేల నేమినెఱఁగనిఁదాన నన్ను
తెగరానిబాసలిచ్చే తెల్లవారించితివి ॥ ఇంక ॥

మెచ్చేవంటా నుంటిఁగాని మేకులకు మాటలాడి
గచ్చులఁబెట్టేది యెరఁగలేనైతి
బచ్చన పరసముల పయ్యదలో చేయి వాఁచి
తచ్చనమైసోఁకులనే తనివందించితివి ॥ ఇంక ॥

కూడేవంటా నుంటిఁగాక కోక గప్పి నిద్ర వుచ్చి
యీడ గేలిసేసేది యెంచనైతి
తోడనే శ్రీ వేంకటేశ దొరయు నన్నేలితివి
వీడెమిచ్చి యున్నటాను వెలయఁజూచితివి ॥ ఇంక ॥ 98 ॥

## దేసాళం

మాపుదాఁకా మాతోడి(డ?) మాటలేఁటికి
తీపులఁబెట్టి యాపె తెమలించీ నిన్నును ॥ పల్లవి ॥

మనసు వచ్చిన మాట మరి విన నింపౌను
చనవు గలుగు మాట చవివుట్టును
వినయము తోటి మాట వేడుకలు కదు రేఁచు
వినవయ్య నీకు నేఁడు విన్నవించీ నాకె ॥ మాపు ॥

వొడఁబాటైన మాట వుల్లము గరఁగఁజేయు
వుడివోనిమేలుమాట వొద్దికైవుండు
అడియాలమైనమాట ఆసలెల్లాఁ బొడమించు
విడువని తమకాన విన్నవించీనాకె ॥ మాపు ॥

తారుకాణలైనమాట తలఁపించు మర్మములు
నేరుపుతోడిమాట నించు వలపు
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్నునేఁడు
చేరి చేరి కాఁగిలించి చెప్పి మాపీ నాకె ॥ మాపు ॥ 99 ॥

## మాళవిగౌళ

ఇయ్యకొంటి రావయ్యా యీడకే నీవు
పయ్యద నీవంటఁగా పదరనేమిటికి ॥ పల్లవి ॥

వలపు గలిఁగితేఁగాక వంతులకు సారె సారె
చలము సాదించఁబోతే చవిపుట్టీనా
అలరి ఇంకానేల ఆ సుద్దులు దడవఁగా
అలమి పైకొనేనీతో నలుఁగనేమిటికి ॥ ఇయ్య ॥

చిత్తము వచ్చినఁగాక చేయివట్టి నీతోను
వొత్తి విన్నవించఁబోతే వొడఁబడేనా
తత్తరించనేమిటికి తలఁచిన పనులాయ
కొత్తలుగా నవ్వఁగాను కొసరనేమిటికి ॥ ఇయ్య ॥

ఆదరించితేఁగాక ఆసోదానఁ గాఁగిలించి
ఆదుకొని పెనఁగితే నందమయ్యీనా
యీదెస శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
సాదవై యుండిన నన్ను జంకించనేమిటికి ॥ ఇయ్య ॥ 100 ॥

## రామక్రియ

ఓరుపుతో వట్టువలె నుండుఁగాక
[1]ఆరజీఁడైనవానికి నొఁగాము లేదని ॥ పల్లవి ॥

యేడలేని వనితలు యెన్నిమాట లాడినాను
వేడుకకానికి మరివెత యేడదే
పాడి దప్పి యప్పటిని పైకొని గుంపించినాను
కోడెకాఁడైనవానికి కోపమేడది ॥ ఓరు ॥

చేగదేరి యందరును చేతులు పై చాఁచినాను
వేగిరకానికి మరి వెరపేడదే
వేగి నంతాఁ గాఁక చల్లి వేసటలఁ బెట్టినాను
ఆగడపువానికి నటు సిగ్గులేదని ॥ ఓరు ॥

పడఁతులెందరు గూడి బలిమిఁ బెనఁగినాను
గడుసరివానికి పొంకము లేదవి
అడరి శ్రీ వేంకటేశుఁ డంతలోనె నన్నుఁగూడె
యెడయనివానికి నెగ్గులేదవి ॥ ఓరు ॥ 101 ॥

---

1 'ఆరజము' శబ్దముపై మతుబర్థమున తద్ధితప్రత్యయము వచ్చి ఆరజము+ ఈఁడు='ఆరజీఁడు' కావచ్చు.

మంగళ కౌసిక

మే మింతేసి కోపము మీకు మీకే యలవాటు
ఆ మొరగులెల్లా మీకు నలవాటు ‖ పల్లవి ‖

కాకరిమాటలును కాఁతాళపు సొలపులు
ఆకెకు నీకు నవి యలవాటు
రాకపోక తరితీపు రచ్చలలో యెమ్మెలును
ఆకొలఁది కాకొలఁది యలవాటు ‖ మేమిం ‖

కేరి కేరి నవ్వులును కేఁకరించే సన్నలును
ఆరజము లవియే మీకలవాటు
బీరపు బొమ్మ జంకెయ ఓగిసేటి ప్రియముల--
నారి తేరితిరి లోలో నలవాటు ‖ మేమిం ‖

విడుముడిమంతనాలు విమ్మిరేఁగే పెనఁగులు
అడియాలా లెప్పుడూ మీకలవాటు
యెడయక శ్రీ వేంకటేశ మమ్ము నేలితివి
అడరే మీగుణాలు మీకలవాటు ‖ మేమిం ‖ 102 ‖

రేకు 1718 ధన్నాసి

చెప్పి పంపవలెనటె చెలువుఁడు నా వొద్దికి
వొప్పుగొంటి రమ్మనవే వొద్దనేనా తన్నును ‖ పల్లవి ‖

మనసులే కలసితే మరి యెడమాటలేల
గొనకొన్న సంతోసానఁ గూడుటఁగాక
చనవు వెగ్గళమైతే జగడాలు మరియేల
ననివి వేసటలేక నవ్వుట గాక ‖ చెప్పి ‖

కూరిములే కలిగితే గుణాలు వెదకనేల
నేరుపు లొండొరులపై నింపుటగాక
కోరికె లీడేరితేను కొసరఁగ నిఁకనేం
మేరతోడి చేఁతలకే మెచ్చుటగాక ॥ చెప్పి ॥

చేతికి లోనైతేను సిగ్గులు వడఁగ నేల
కాతరాన రతులెల్లా గైకొంటగాక
యీతల శ్రీ వేంకటేశుఁడిదె తానే నన్నుఁ గూడె
కోతరపుఁ బ్రియముఁ బొసఁగుటగాక ॥ చెప్పి ॥ 103 ॥

## దేశాక్షి

ప్రేమముతో నిందరిని బెండ్లాడితివి
కామించి యేరీతి నేలి కరుణించేవయ్యా ॥ పల్లవి ॥

కలికి కాఁగిటిలోనే కాఁపురము సేయఁగాను
వెలఁదులకెల్లా నిఁక వేళ యేదది
చలపట్టి యేపొద్దు సరసము లాడఁగాను
మలసి ఇతరులకు మరి వేళ యేదది ॥ ప్రేమ ॥

వనవున నాపె మించి సారె మోవి యానఁగాను
వెనకటిసతులకు వేళ యేదది
కనుఁగొని యట్టె తనకతలే నీకుఁ జెప్పఁగా
మనవి చెప్పేవారికి మరి వేళ యేదది ॥ ప్రేమ ॥

చెంత నీ శిరసుమీఁద సేస లాపె వెట్టఁగాను
వింత సవతులకెల్లా వేళ యేదది
ఇంతలో శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మంతనపు చుట్టాలకు మరివేళ యేదది ॥ ప్రేమ ॥ 104 ॥

## దేసాళం

ఇంతటివాఁడవు నిన్ను యేమని పొగడేము
బంతినే నాపాలిటి భాగ్య ఫలమవు ‖ పల్లవి ‖

తగవు దప్పక యేలే తగుమగవాని పొందు
జగములో పతికి సంసారఫలము
మొగమోటగలవాని ముచ్చట మాటల చవి
తెగని తంగేటి జుంటి తేనెలలో తేట ‖ ఇంత ‖

సరవితో మనిపేటి సరసునికాఁగిలి
నిరతిఁగాంతకు నిందు నిధానము
నిరతపుజాణకానినెయ్యముతోడి నవ్వు
సురతపు మర్మముల సొబగుల సోన ‖ ఇంత ‖

భావమెరిఁగి కూడేటి ప్రాణేశు కూటమి
కైవశమై ఫలియించే కల్పతరువు
యీవేళ శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
చేవదేరిన వలపు చేతిలో మాణికము ‖ ఇంత ‖ 105 ‖

## వరాళి

నీవేమిసేతువు నిన్ననఁగఁ బనిలేదు
చేవదేరఁ జేసినవి సిగ్గులే కావా ‖ పల్లవి ‖

వుడివోనియట్టి యాస లోకటొకటె రేఁచి
బడలించినది నాప్రాయమే కాదా
అడరి నీ మోము చూపి ఆయములు గరఁగించి
తడఁబరచినది నా తమకమే కాదా ‖ నీవే ‖

తనువుపైఁ గాఁకరేఁచి తరితీపు చేసినది
మొనసిన నాలోని మోహమే కాదా
వొనర నీరతులకు నుడిగట్టఁజేసినది
వెనువెంటఁ దిరిగే నావేడుకే కాదా ॥ నీవే ॥

నా యిచ్చ కొలఁదినే నన్ను నిన్నుఁ గూడించి
పాయనీకుండినది నాభాగ్యమే కాదా
యీయెడ శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
చాయకుఁ దెచ్చినది యీ సరసమే కాదా ॥ నీవే ॥ 106 ॥

## హిందోళ వసంతం

ఇంతులాల చూడరే యెటువంటివాఁ డితఁడు
అంతటిలో నేమిటికి నానవెట్టుకొనీనే ॥ పల్లవి ॥

తగవులు చెప్పఁగాను తనిసి వూఁకొంటిఁగాక
యెగసక్కేము చేసేనా యెంతైనాను
మగువనైతేనే తనమర్మము నేనెఱఁగనా
జిగిమించ తానేల సిగ్గువడీనే ॥ ఇంతు ॥

దండనే కూచుండఁగాను తప్పక చూచితిఁగాక
చండిపెట్టి వెంగెముగా సాదించితినా
నిండిన జవ్వనినైతేనే తన్ను జంకించేనా
దండిగలవాఁడిందుకు తలవంచనేఁటికి ॥ ఇంతు ॥

చనవిచ్చి కూడఁగాను చన్నుల నొత్తితిఁగాక
మొనలు పైఁ జూపేనా మొక్కలానను
వనిత నేనైతేనే వాసులకు మీరేనా
యెనసె శ్రీ వేంకటేశుఁ డేల వేఁడుకొనీనే ॥ ఇంతు ॥ 107 ॥

## తెలుఁగుఁగాంబోది

విన్నవించరే వెలయ నీతనికి
సన్నలాఁ జాయలా జరగదు పొందు* ॥ పల్లవి ॥

కనుగొన మాపులఁ గాంక్షలు దీరవు
కినియనిరతి బెనఁగినఁగాని
మనవులు చెప్పిన మర్మము గరఁగదు
పెనఁ(పెన?) గొని తనువులు బెరసినఁగాని ॥ విన్న ॥

యేతులఁ నవ్వుల నెనయదు కాఁగిలి
చేతులు పైఁజాఁచినఁగాని
దూతికల కతనఁ దొలఁగవు వలపులు
నీతి వినయములు నెరపినఁగాని ॥ విన్న ॥

సేసలు వెట్టిన సిగ్గులు వీడవు
రేసులులేక మీరినఁగాని
యీసరి శ్రీ వేంకటేశుఁడే నన్నేలె
ఆసలు విడువవు అలపులే కాని ॥ విన్న ॥ 108 ॥

రేకు 1719 ## భూపాళం

మెచ్చాయనయ్యా నేఁడు మీ యిద్దరివినోదాలు
పచ్చి దేరేనవ్వులతో భామ సిగ్గువడెను ॥ పల్లవి ॥

మలఁగుపై [1]నొరగుండి మగువ కిన్నెరలోన
వంచి నీపై గీతాలు వాయించఁగాను
వలిపె తెరమాటున తలవూఁచి మెచ్చితివి
అలరి యానీడ గని యాపె సిగ్గువడెను ॥ మెచ్చా ॥

* పొందు (కా.శ్రీ.)
1 ఒరగి+ఉండి

వుప్పతిల్లి యేకతాన నుండి నాటకసాలలో--
నప్పుడు నీపై చిందుల కాపె యాడఁగా
చొప్పులు సోరణగండ్లఁ జూచి నీవు చెలితోడఁ
జెప్పఁగాఁ జప్పుడు విని జిగి సిగ్గు వడెను ॥ మెచ్చ ॥

పొద్దువోక నీరూపు వూఁచి చిత్ర పలకపై
కొద్దిమీర వ్రాసి పరాకున నుండఁగా
వొద్దికతో శ్రీవేంకటోత్తమ కాఁగిలించితి--
వద్దరిపాటున దానూ నటు సిగ్గువడెను ॥ మెచ్చ ॥ 109 ॥

బంగాళం

ఏమి సేయవచ్చు నందుకేమి చింతించకు
సాములనాతోడి పొందు చక్కదిద్దఁ బనులు ॥ పల్లవి ॥

వేగిలే చెవ్వతెమో[1] వెసఁ జూచి వచ్చితివో
చేగదేర నాగోరు నీచెక్కు దాఁకెను
వాగమై యెవ్వతె నీకు వచ్చినవేళ గుణమో
ఆగడపు మాటలకు నటు గురియైతివి ॥ ఏమి ॥

యెక్కడ నెవ్వతె మోవియెంగి లంటిన దోసమో
నిక్కి నాపలుసోఁకులు నీసందులంటె
కక్కసాన నెవ్వతెను కాఁగిలించి వచ్చిన ఫలమో
తొక్కుల నీమేను నాచేతోదోపులఁ జిక్కెను ॥ ఏమి ॥

తొరవి యెవ్వతెకాలు దొక్కిన భాగ్యమహిమో
వొరసి నా చన్నులు నీవురము నాఁటె
ఇరవై శ్రీ వేంకటేశ యెవ్వతెమేలు వంకనో
పరగ నా ఇంటఁ గూడి పాయక నీవుంటివి ॥ ఏమి ॥ 110 ॥

1 'ఎవ్వతెమో' వ్రయుసగాని తప్పు.

## ఆహిరి

వట్టి సిగ్గు లిఁకనేల వలపులు దైవారె
జట్టిగొని నవ్వేదే జాణతన మిఁకను ॥ పల్లవి ॥

సంగడిఁ గూచున్నదాకె వన్నుల నొత్తీనాపె
ఇంగిత మెఱఁగవు నీ కేడ పరాకు
వుంగరము వేలఁ బెట్టి వొడఁబడ మాటలాడి
సంగతిగా మన్నించుమదే జాణతన మిఁకను ॥ వట్టి ॥

వెనకి నవ్వీనాపె సేసలు వెట్టీనాపె
యెనసివుండఁగా నీకేడ సిగ్గులు
మనసు రంజిల్లఁజేసి మర్మములు సారె నంటి
చనవిచ్చి మన్నించుమదే జాణతన మిఁకను ॥ వట్టి ॥

కలువల వేసీ నాపె కాఁగిటఁ గూడీ నాపె
యెలమిఁ బెండ్లాడఁగా నీకేడ వెరగు
అలమి శ్రీవేంకటేశ అట్టె సంతోసించఁ జేసి
సలిగె యిచ్చి మెచ్చుదే జాణతన మిఁకను ॥ వట్టి ॥ 111 ॥

## వరాళి

వేగిరించఁ బనిలేదు విభునితోను
చేగదేర నవ్వితేనే చేతఁ జిక్కు నితఁడు ॥ పల్లవి ॥

వాసులెల్లా రేఁచీని వంపుల లోఁచీని
వేసరకువే నీవు విభునితోను
ఆసలు నీకు [1]గనము ఆతఁడు నీపై బత్తి--
సేసినట్టు సేసితేను చేతఁ జిక్కు నితఁడు ॥ వేగి ॥

---

[1] 'ఘన' శబ్దభవము కావచ్చు.

మంతనాలెల్లా నాడీని మనసులు సోదించీని
 వింత లేఁకఁ జేయకువే విభునితోను
పంతము నీ విచ్చితివి పాయరేఁడు నిన్నతఁడు
 చెంతనే కాఁచుకుండితే చేఁతఁ జిక్కు నతఁడు ॥ వేగి ॥

సరసములాడీని సారె నిన్నుఁ గూడీని
 విరసాలేవే శ్రీవేంకటేశుతో
మరిగిన దేవులవు మగఁడు నీకు నతఁడు
 శిరసువంచి మొక్కితే చేతఁజిక్కు నతఁడు ॥ వేగి ॥ 112 ॥

## నాదరామక్రియ

ఒద్ద నిద్దరున్నారు వొడ్డోంగమై వున్నాఁడు
 కొద్దిమీరి లోకమేలే గుణవంతుఁ డతఁడు ॥ పల్లవి ॥

తమకమే కలిగితే తానే నాయింటికి వచ్చీ
 రమణుని దూరకురే రామలాల
సముకమున నే నుండే వనవు తానే యిచ్చీ
 తిమురుచు నీతనితో దీకొనఁగ వచ్చునా ॥ ఒద్ద ॥

మన్నించవలసితే మాటలు తానే యాడీ
 సన్నల నాడించకురే సతులాల
పన్ని నే సేవసేయఁగా భావము దానే కరఁగీ
 విన్నపము లిట్టె చేసి వేఁగిరించవచ్చునా ॥ ఒద్ద ॥

కరుణ గలిగితేను కాఁగిటఁ దానే కూడీ
 పరుసా లాడకురే పడఁతులాల
గరవై శ్రీ వేంకటేశుఁ డీతఁడిదె నన్ను నేఁడె
 అరుదై పెనఁగఁగాను అవుఁగాదనవచ్చునా ॥ ఒద్ద ॥ 113 ॥

## హిందోళవసంతం

ఎక్కడ పరాకు నీకు నేఁటికి వచ్చి సిగ్గులు
మక్కువ నీపైఁ జల్లీ మాఁటలాడవయ్యా ॥ పల్లవి ॥

సొనఁబట్టిన చూపులు సతి నీపై వెదచల్లి
కానుకలిచ్చీ నిదె కైకొనవయ్యా
వానల చెమటలు మైవడియంగఁ దనచన్ను
లానుకొని విన్నవించీ నాలకించవయ్యా ॥ ఎక్క ॥

సెలవుల నగవులు చిదుముడిఁ బచారించి
పలుమారు పాదాలొత్తీ పైఁజాఁచవయ్యా
లలిఁ దొడలకాంతులు వలిపెములోఁ జూపట్టు
కొలువుసేసీ యిదె చే కొనఁగదవయ్యా ॥ ఎక్క ॥

కొనగోరి తాఁకులు గురుతై ఆయములంట
యెనసి కాఁగిట నించీ నేలుకోవయ్యా
ననిచి శ్రీవేంకటేశ నంటున సేసలు వెటీ(ట్టీ?)
వనిత యిన్నిటాఁ జనవరిఁ జేయువయ్యా ॥ ఎక్క ॥ 114 ॥

రేకు 1720 గౌళ

ఎంత సేసే వేమయ్యా ఇంతలోననే
మంతనములాడితేనే మలసేటిదాననా ॥ పల్లవి ॥

వాఁడి గోరఁ జెక్కునొక్కి వదనము చేతనెత్తి
వేఁడుకొనే విట్టె నన్ను వింతదాననా
పోఁడిమి నండకు వచ్చి పొత్తునఁబెట్టుకొంటివి
నేఁడు నన్ను మన్నించితే నీ సరిదాననా ॥ ఎంత ॥

చుట్టరికములు చెప్పి చొక్కులఁబెట్టి తగిలి
అట్టె పొదిగేవు నీవియ్యపుదాననా
బెట్టుగా సరసమాడి ప్రేమఁజన్నులంటితివి
నెట్టుకొని నవ్వితేనే నీటు మాపేదాననా ॥ ఎంత ॥

గరిమఁ దప్పక మావి కాఁగిటిలోపలఁగూడి
తొరలించేవు రతులు దొమ్మిదాననా
ఇరవై శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిపుడు
మరిగించినంతలోనే మర్మమెత్తేదాననా ॥ ఎంత ॥ 115 ॥

## వరాళి

నీ గుణమంతయుఁ దొల్లి నే నెరుఁగుదు
చేగదేరె వలపులు చెప్పకుమీ సుద్దులు ॥ పల్లవి ॥

చనవరి గనక యీసతి జాణతనాలాడీ
వినరాదా ఇపుడు నీ వీనులారను
పనిమాలిన పరాకు పచారించే విదియేల
వనితల ముందరను వద్దు సుమ్మీ యెమ్మెలు ॥ నీగు ॥

పెండిలాడెఁగనక ముప్పిరి గొనఁ బొంపీని
దండఁబెట్టుకొనరాదా తమితోడను
మెండుకొన్న గర్వము మెరయించ నిఁకనేల
పండెను నీ మనసిదె పట్టకుమీ యెగ్గులు ॥ నీగు ॥

పట్టపుదేవి గనక పైకొని నిన్నుఁ గూడీ
గుట్టుతో నేలుకోరాదా కొంకుదేరను
నెట్టన శ్రీవేంకటేశ నేరుపులు దాఁచనేల
దట్టమాయఁ గోరికలు తప్పకుమీబాసలు ॥ నీగు ॥ 116 ॥

## లలిత

ఎదురుబడి వున్నారు ఇద్దరు మీరు
సుదతి భావము రెంచి చూచుకొనవయ్యా ॥ పల్లవి ॥

చెక్కునఁ జేఇ మాటుచేసి చిమ్ముఁజూపులనుఁజూచి
చొక్కిఁ దనలోఁదానే సుదతి
ముక్కర గదలఁగాను ముచ్చటాడి వెలికిని
దిక్కు చూపీఁ గమ్మటిని తెలుసుకోవయ్యా ॥ ఎదు ॥

బలువుగాఁ గొప్పవెట్టి పాపట దువ్వుకొంటాను
కొలువు సేసీ నీకుఁ గోమలి
పలువరుస మెరువఁ బదాలు నీపైఁ బాడి
కలువల నిన్ను వేసీఁ గనుకొనవయ్యా ॥ ఎదు ॥

పరగ నొత్తిలి నీ పాదముపైఁ జేయి వాఁచి
మరుకేలి నిన్నుఁ గూడి మగువ
నిరతి శ్రీ వేంకటేశ నీకిదె కానుకలిచ్చి
సరిఁ దన వన్ను లివె సారె మెచ్చవయ్యా ॥ ఎదు ॥ 117 ॥

## శంకరాభరణం

నీవు మాకు బిరిగాక నేరము లిందేమున్నది
ఆవటించి మనసులో నొఁగాము లున్నవా ॥ పల్లవి ॥

శ్రీ పతివైన నీవు చేపట్టి నన్నేలితివి
యేపనులు చెప్పినాను యేమాయను
వోపి నీకు మొదలనే వూడిగపువారమట
యేపొద్దు చూచిన మాకు నెగ్గుపట్టనున్నదా ॥ నీవు ॥

దేవుఁడవైన నీవు తేనెమోవి ఇచ్చితివి
భావించి నీచేమనినా పంగెమున్నదా
చేవమీరి నీకు నేను చేతిరోని దాననట
కావరించి నీతో మాకు కాఁతాళించనున్నదా ॥ నీవు ॥

గక్కన శ్రీ వేంకటేశ కాఁగిలించి కూడితివి
యెక్కుడు నిన్నుఁ గొసర నేమున్నది
చిక్కని నవ్వుల తోడిసేసపాలదాననట
పక్కన నేఁ డేఁక నీతో పంతమాడనున్నదా ॥ నీవు ॥ 118 ॥

## నట్టనారాయణి

ననిచి మరిఁ గొంత నవ్వేవు గాక
కొనముట్ట నేము నీతోఁ గోపగించేమా ॥ పల్లవి ॥

చనవు సేసుక నీతో సారె సారె నవ్వితేను
కనలి తప్పక చూచి కాఁతాళించేవు
పెనఁగి నీవింతేసి ఒరుదు లెక్కించుకొంటే
వనితలమింతే నీతో వాదురాడేమా ॥ నని ॥

కాయముపైఁ జేయివేసి కందువ లంటితేను
ఆయములు సోఁక నాతో నానవెట్టేవు
వాయలకు నీవింత వలము సాదించితేను
పాయపు వారము నేము పంగించేమా ॥ నని ॥

నేరుపున నిన్నుఁ గూడి నివ్వెరగు నొందితేను
గోరికొన నెచ్చరించి గురిపేసేవు
యీరీతి శ్రీ వేంకటేశ యెంత పంతమాడినాను
మేరతోడి వారము మితిమీరేమా ॥ నని ॥ 119 ॥

### పాడి

అంతే పని గలితే నానతీవయ్యా
　　వింతవారమా నేము వెలుపేలయ్యా　　॥ పల్లవి ॥

తలఁపు లేకమురైతే తగవుకుఁ బనిలేదు
　　చెలులసాకిరులేల చెప్పేవయ్యా
　　నిలుచున్నాఁడ వప్పటి నీకెంత పనిగద్దో
　　యెలమి మాతో జోలి యెందాఁకానయ్యా　　॥ అంతే ॥

బాసలే నిజమురైతే పదరఁగఁ బనిలేదు
　　గోసనాసగా వేఁడుకొన నేలయ్యా
　　*ఆసపడ్డాఁడవు నీవు అడ్డమాడ దోసము
　　సేసపాలదాన నీ చిత్తమిఁకనయ్యా　　॥ అంతే ॥

కూడిన యిప్పటిమీఁద కొసరఁగఁ బనిలేదు
　　నోడలఁ బెట్టుచుఁ జెక్కునొక్కనేలయ్యా
　　యీడనె శ్రీ వేంకటేశ యెనసితివి పాయపు
　　[1]వీడెమిచ్చెంసితివి వేగినంతానయ్యా　　॥ అంతే ॥ 120 ॥

రేకు 1721　　　లలిత

పొద్దువోని చెలులెల్ల బొమ్మలఁ గాటుక వెట్టే
　　రద్దము చూచుకో నీవు అదివో తగవు　　॥ పల్లవి ॥

నేరుపుగలయమ్మ నిక్కి నిక్కి చూచితేను
　　వోరుపుగలయమ్మ వొడివట్టితీసీ నిన్ను
　　యీరీతి నిన్నుఁ దిట్ట యెవ్వరి కేమి గారణ
　　మారసి వచ్చినవాఁడ వదివో తగవు　　॥ పొద్దు ॥

---

* ఆసపడ్డ + వాఁడవు (కా.శ్రీ.)
1 వీడెము + ఇచ్చి + అలసితివి.

వేడుక నొక్కసతి విందుకుఁ జెప్పితేను
వాడికె గలయాపె వడ్డించె మోవి తేనెలు
ఆడుకో నీకునేల అందగాఁడవు నీవైతే
ఆడనీడఁ జెల్లఁబెట్టె వదివో నీ తగవు ॥ పొద్దు ॥

మనువుకు వచ్చినాపె మంచానకుఁ బిలిచితే
చనవు గలిగినాపె సంగడిఁ గూచుండె నిదె
యెనసితి వొక్కమాటే యిద్దరి శ్రీవేంకటేశ
అనువాయనన్నిటా నీ కదివో తగవు ॥ పొద్దు ॥ 121 ॥

## సాళంగనాట

వద్దు వద్దు నీ వంతేసి వైతాళాలు నీ--
సుద్దులెల్లా నెఱుఁగుదు సోద్యపడనేఁటికి ॥ పల్లవి ॥

వెక్కులేల గిల్లేవు చేరి వేఁదుకొనేనంటా
వక్కణించి నీవు మంచివాని వలెనే
కక్కసమేల పెట్టేవు కాఁగిలించుకొనేనంటా
వెక్కసమై నిన్నుఁ గడు వెగ్గళించే దాననా ॥ వద్దు ॥

ముందలేల పట్టేవు ముడిచేనంటాఁ బూవులు
చెంది నాకు నితవరి చేఁతవలెనే
సందడిఁ బెనఁగనేల సరసములాడేయట్టు
కందువ నీతో నేను కపటాలదాననా ॥ వద్దు ॥

ఆయములేల అంటేవు అంగవించికూడేనంటా
చాయల నాకు దక్కిన సాదువలెనే
యీయెడ శ్రీ వేంకటేశ యెనసితి విటు నన్ను
వోయయ్య నిన్ను మెచ్చక వొరసేటి దాననా ॥ వద్దు ॥ 122 ॥

## తోండి

[1]అవురవురా (ఔరౌరా?)బాలుఁడా ఆయమంటే వింతలోనె
సారెసారె ముద్దులెల్లా వల్లేవేరా బాలుఁడ(డా?) ॥ పల్లవి ॥

ముంగిటనున్నవారి మూలకుఁ బిలిచి నీవు
యెంగిలి సేసేవు మోవి యేరా బాలుఁడ (డా?)
అంగవించి బెట్టిమాట లాడెనంటా నోరుమూసి
వుంగరాలవేళ్లనేల వూఁచేవేరా బాలుఁడ (డా?) ॥ అవు ॥

యేకతమాడేనంటా యేడేడో బూతుమాటలు
పైకొని ఆడేవేరా పసిబాలుఁడ (డా?)
కాకుసేయకు మనుచు కమ్మర పరాకుగాను
కేకిసలై గిలిగించి కేరేవేరా బాలుఁడా ॥ అవు ॥

[2]అప్ప లప్ప లాడే నంటా నంతలోనె కాఁగిలించి
విప్పిలఁ గూడితి వవురా చిన్నిబాలుఁడా
మెప్పించి శ్రీ వేంకటాద్రిమీఁద నన్ను నురమున
తెప్పలఁదేలించితివి దిమ్మరి వోబాలుఁడా ॥ అవు ॥ 123 ॥

## పళవంజరం

ఆకెకు నీకుఁ దెలుసు నన్నిపనులు
యీకడ మమ్ము నట్టె యేమి చూచేవయ్యా ॥ పల్లవి ॥

కతకఱవిన మాట కలికి నీతో నాడె
యితవుగా నవ్వితివి ఇందుకు నీవు
రతికెక్కితిరి మీరు రచ్చల నిన్నిటా నేఁడు
చతురత మమ్ము నేమి సారెఁ జూచేవయ్యా ॥ ఆకె ॥

---

1 ప్రాసభంగము.
2 అప్పాలు తిరుగుటయా? ఇదియొక క్రీడావిశేషము.

సేయరాని చేఁత నీ వెక్కుల నట్టె సేసె
వాయలకు నీవవి సమ్మతించితి
బాయిటఁ బడెను మీపైపై వలపులెల్లా
మీయెడ నీవు మమ్ము నేమి చూచేవయ్యా ॥ ఆకె ॥

కనురెప్ప మఱఁగైతే కాఁగిలించుకొనె నాపె
మనసిచ్చి, కరఁగె నీ మర్మములు
ననిచి శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి యిట్టె
యినుమడించెను మోహ మేమి చూచేవయ్యా ॥ ఆకె ॥ 124 ॥

## ఆహిరినాట

అనకువే నీవు నన్ను అవుఁగాదనుచు నేఁడు
కనుగిరుపులసేఁత కంటివటే నీవు ॥ పల్లవి ॥

తియ్యని మాఁటలలోనే తెరమరఁగులు వేసీ
వొయ్యనే వినవే నీవు వోచెలియ
వెయ్యంటి కొకటి నేను విచ్చిచెప్పఁబోతేను
కయ్యములకుఁ దిరిగీ కంటివటే నీవు ॥ అన ॥

సెలవినవ్వులలోనే వెనకులు వెదచల్లీ
తలఁచుకుండవే యిది తరుణి నీవు
చలివాపి నేనిది సాఁకిరివెట్టఁగఁబోతే
కలపీఁ దన పంతాలు కంటివటే నీవు ॥ అన ॥

కందువ సిగ్గులలోనే కాఁగిటను నన్నుఁ గూడె
అందియ్యఁ గదవే విడె మలివ నీవు
విందులమో విచ్చితి శ్రీవేంకటేశుఁ డితనికి
గందము పూసీ నిదె కంటివటె నీవు ॥ అన ॥ 125 ॥

## నాదరామక్రియ

అటని మానఁగలేవు అన్నిటాను నీ పొందు
యెటువలెఁ జేసినాను యియ్యకొంటి మిపుడు ॥ పల్లవి ॥

చనవునఁ దిరిగేము సారెసారె నీ వద్ద
మనసుమర్మ [1]మెఱఁగ మరిగితిని
వెనకటి నీ చెలులు వేమారు నేమందురో
తనిసి వున్నారము నీ తగవులచేతను ॥ అట ॥

సలిగెకుఁ బెనఁగేము సంగతిగా నీకు లోనై
కొలచిన గుణముల కొలఁది చూడ
పెలుచు నీ వేఁతల ప్రియ మెట్లా నున్నదో
పొలసితి మిపుడు మా పోఁగల కన్నులను ॥ అట ॥

ఆసలనే కూడితిని అరమరపుల నిన్ను
వాసుల నీరతులలో వైపు దెలియు
సేసవెట్టితివి నాకు శ్రీవేంకటేశ్వర నీవు
రాసికక్క(కెక్క?) నీవలపు రచ్చఁ బెట్టితిమి ॥ అట ॥ 126 ॥

రేకు 1722 సామంతం

మొదలివారము నేము మోహమెపుడు గలదే
మదమత్సరము లిఁక మాకేఁటికే ॥ పల్లవి ॥

కొత్తపెండ్లికూఁతురవు కోరి వెంగేలాడఁ జెల్లు
వొత్తి నేమైతే నింతేసి కోపమమ్మా

---

[1] 'మెఱఁగక మరిగితిమి' కావచ్చు. అట్లైనచో ఒక మాత్ర ఎక్కువేమో; కాకున్నచో, వచనక్రమము, వాక్యక్రమము తప్పుచున్నది.

హత్తిన వింతొకమాపు అందురు [1]వేఁడొకచవి
మత్తిలి నీ వోజలు మాకేఁటికే ॥ మొద ॥

యిగురు వలపులాన వేమైనఁ జేయఁజెల్లు
యెగసక్కె లింతేసి కెరఁగమమ్మా
చిగురు పాన్పు మెత్తన చెలఁగి ననలు వాఁడి
మగువ నీమతకాలు మాకేఁటికే ॥ మొద ॥

వేడుకకత్తెవు నీవు వేమారుఁ గూడఁజెల్లు
జాడతో వేసరించఁగఁజాలమమ్మా
యీడుతో శ్రీ వేంకటేశుఁ డిద్దరి నొక్కటఁగూడె
మాడుపుటింటిలో, సిగ్గు మాకేఁటికే ॥ మొద ॥ 127 ॥

## పూర్వగౌళ

రావయ్య మా ఇంటికి రవ్వలో నుండఁగనేల
కైవసమైతివి నాకుఁ గలఁగకు మిఁకను ॥ పల్లవి ॥

నవ్వుల కేమనినాను నమ్ముదు నీమాటలెల్లా
మవ్వపు నీ చేఁతలును మంచి వందును
యెవ్వరేమి చెప్పినా నీ కెదురు పూనుకవత్తు
ఇవ్వల నా మోము చూచి యేల లోఁగేవయ్యా ॥ రావ ॥

చెనకిన చెనకులు చెలరేఁగి ఇచ్చగింతు
పెనఁగినా వేఁడుకొని ప్రియము రేఁతు
మనసు మరచినాను మర్మములు దలఁపింతు
ననిచి సిగ్గుల మించ నాతోను వలెనా ॥ రావ ॥

---

1 వేడి + ఒకచవి.

చప్పనై కలసినాను చవులట్టి వుట్టింతు
తప్పులు గలిగినాను దాఁతు నన్నియు
ఇప్పుడు శ్రీవేంకటేశ ఇచ్చగించి కూడితివి
ముప్పిరిఁ దొంటిపనికి మొక్కఁగ నేమిటికి ॥ రావ ॥ 128 ॥

## ముఖారి

ఎదిటి పంతము రేల ఇంటిలోనికి రారాదా
కదియఁగ మెచ్చుకుంటే [1]గడుసవనేను ॥ పల్లవి ॥

నిన్ను నేను చెనకఁగ నేమపుమాట లాడేవు
యెన్నికటాస లెవ్వతె కిచ్చినాఁడవో
చన్నుల నొత్తి చూడఁగ పరుపఁ గరఁగకుంటే
వన్నెల రాయివంటివాఁడవనే నపుడు ॥ ఎది ॥

ఆయములు బుట్టితేను ఆచారాలు చెప్పేవు
యేయెడ నెంత చదివి యెరిఁగితివో
సోయగపుమో వియ్యఁగా చొక్కి లోను గాకుండితే
చాయల మాకువంటిజడుఁడ వనేను ॥ ఎది ॥

మలసి కాఁగిలించితే మంచిపొద్దు వెదకేవు
బలు శ్రీవేంకటేశుఁడ పంతమెట్టిదో
వెలయ నేఁ గూడితి వేసా లిఁకఁ జెప్పకొంటే
తొలఁగుచుమొరసేటితుమ్మిద వనేను ॥ ఎది ॥ 129 ॥

## ముఖారి

సేసినపాపము నేఁడు చెప్పకపోదు
నీ సుద్దులు నాగుణము నీకే తెలుసును ॥ పల్లవి ॥

---

[1] గడుసవు + అనేను.

మచ్చికనీచెలులతో మాటలే యాడుదుఁగాని
మచ్చరము మతినైతే మానదు
ఇచ్చకమాడుదు నీతో యెడనెడ వెంగేలు
విచ్చనవిడి నాడక విడువను ‖ సేసి ‖

వాడిక నీ చెలులతో వంతుకు నంపుదుగాని
యేడలేనికోపమెల్లా ఇందుకొందును
వీడెము నీవిచ్చితేను వేడుకఁగైకొందుఁగాని
యేడదోయనుచు లోలో నెంచుకొందును ‖ సేసి ‖

నీ కాంతలు మొక్కితేను నేనూ మొక్కుదుఁగాని
రాకలఁబోకల రారాఁపుసేతును
యీకడ శ్రీ వేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
కైకొంటిఁగాని నీరతి కమ్మటిఁ బోలుదును ‖ సేసి ‖ 130 ‖

## కాంబోది

ఎఱఁగక దగ్గరితే [1]నెడ్డనందురు
వెఱవక నాకిందుకు వివరించు విభుఁడా ‖ పల్లవి ‖

నున్నని చెక్కులమీఁద నూఁగురేఁగెఁ బులకలు
సన్నపు చెమట మేన జాలువారెను
అన్నియు నాకుఁగానొ అవ్వల వేరొకతెకొ
యెన్నికవలపు నాకు నెఱిఁగించు విభుఁడా ‖ ఎఱఁ

తెలుపెక్కెఁ గన్నులను [2]తేరకొనప్పటనుండి
కళలెక్కె మోమునను కదుఁగదును

---

1 ఎడ్డ + అవి + అందురు.
2 తేరకొని + అప్పటినుండి

తలఁపు నామీఁద నుందో దవ్వుల నెక్కడనుందో
యెలమి నీవేదుక నాకెఱిఁగించు విభుఁడా ॥ ఎఱఁ ॥

నవ్వులు సెలవులను నారుకొనె మీఁదమీఁద
రవ్వఁగా శ్రీ వేంకటేశ రతిఁ గూడితి
యివ్వల నాపై మన్ననో యెవ్వరైనాఁ జెప్పిరో
పవ్వళించితివి నాపై పచారించు విభుఁడా ॥ ఎఱఁ ॥ 131 ॥

## తోండి

మా తోడి గొడవేల మాపుదాఁకా నీకును
యీతలఁ జింతనసేయు మింకా నీ విపుడు ॥ పల్లవి ॥

చెలరేఁగి యాపె నీకుఁ జెప్పిన బుద్దులెల్లా
తలఁచి తలఁచి నీకు దాఁటరాదుగా
వలమున నాపె నీకు చదివించినవొజ్జలు
నెలవుల యిఁకఁ గొన్ని నేరుమకో ఇపుడు ॥ మాతో ॥

వొద్దనుండి యాపె నీకు వుపదేశించినదెల్లా
తిద్దరానివేదములై తిరమాయఁగా
పొద్దు వొద్దు నీకు నాపె బోదించిన గురువు
సుద్దులెల్లా మరవక చొక్కుము నీవిపుడు ॥ మాతో ॥

చెక్కు నొక్కి కూడి యాపె నేసినట్టి విన్నపాలు
చక్కనై మదనరహస్యములాయఁగా
యిక్కువ శ్రీ వేంకటేశ యెనసితి విటునన్ను
తక్క కాపె అప్పణించె దైవము నీకిపుడు ॥ మాతో ॥ 132 ॥

రేకు 1723 దేసాళం

చాలుఁ జాలు మాతోను సటలేఁటికి
కోలు ముందుగా మాతో గుట్టు సేయవలెనా ॥ పల్లవి ॥

పంతగాఁడవు నీమోవి పచ్చి ఇంతేటికాయ
చింతలేనివాఁడవేల చెమరించేవు
బంతినున్నా రిద్దరును భావములు గానవచ్చె
కొంత గొంత మాతోను గుట్టుసేయవలెనా ॥ చాలుఁ ॥

మనసుగలవాఁడవు మాటలేఁటికాఁడవు
కినిసినవాఁడవేల కిందుపడేవు
పెనఁగేరు మీలోని ప్రియమెల్లఁగానవచ్చె
కొనబుఁజేఁతల మాతో గుట్టు సేయవలెనా ॥ చాలుఁ ॥

తమకించనివాఁడవు తగవులేల పెట్టేవు
తెమలనివాడవేల తేరి చూచేవు
అమర శ్రీవేంకటేశ ఆపె నన్నుఁ గూడితివి
గుమతాన మాతో నింత గుట్టు సేయవలెనా ॥ చాలుఁ ॥ 133 ॥

మాళవి

ఏఁటికి సిగ్గువడేవు ఇంకా నీవు
'గాఁటపు నీమోహనము కడగురుతులేదే ॥ పల్లవి ॥

బలిమి నీజవ్వనమే పట్టఁగరాదుగాని
అల నీ చన్నులు వట్టే దదేమి దొడ్డే
చలపట్టి పంతములు సారె నాడరాదుగాని
మలసి నీ మర్మముల మాట లాడవచ్చునే ॥ ఏఁటి

వల పింతంతని చెప్పవశముగాదుగాని
కొలఁదివట్టేనే నీయెక్కువ పిరుఁదు
విలువ వెట్టఁగరాదు వేయైనా నీవేదుకకు
తులఁదూఁచవచ్చు మనదొమ్మి సమరతులు. ॥ ఏఁటి ॥

పెనఁగేటి నీగుట్టు భేదించరాదుగాని
చెనకి పోఁకముడి మచ్చికఁ దీసేనే
యెనసితి శ్రీ వేంకటేశుఁడ నయిన నాకు
చనవిచ్చితివి ఇన్ని సాదించవచ్చునే ॥ ఏఁటి ॥ 134 ॥

## పాడి

ఊరకే వున్నాఁ డితఁడు వోరుపుతోడ
ఆరీతి మాటలాడ అరుహమా ఇపుడు ॥ పల్లవి ॥

మంతనము లాడెనంటా మగువతో నీవతని--
నెంతకెంత పేసేవే ఇప్పుడు నీవు
వంతులు దప్పకవుండవచ్చీఁ గాక రమణుఁడు
అంతేసి మాటలకు నరహమా ఇతఁడు ॥ ఊర ॥

అంగనచేతి విడెమాకు నందుకొనె నంటా
యెంగిలి మాటాడకువే యెగసక్కేన
జంగిలిలో నీతోడ సరసము నాడీఁగాక
అంగమంటి ఇంతసేయ నరుహమా ఇతఁడు ॥ ఊర ॥

మేడమీఁదనున్న చెలి మేలమాడి కూడెనంటా
ఆడుకొనే వింతలోనె అందరితోడ
వోడక శ్రీవేంకటేశుఁ డొడివట్టి నిన్నుఁగూడె
ఆడ నీడా గేలిసేయ నరుహమా ఇతఁడు ॥ ఊర ॥ 135 ॥

వరాళి

ఆపె గలిగుండఁగాను అనుమానాలిఁక నేల
 కోపగించేమా నేము కొంకనేల నీకును ॥ పల్లవి

పూసగుచ్చినట్టు నీకు బుద్దులు చెప్పీ నాపె
 వేసరక వినవయ్య వేమారును
 ఆసలాసలఁ దిరిగే మంతనింత నీవెంట
 వీసమంత మమ్ముఁ జూచి వెఱపేల నీకును ॥ ఆపె ॥

తెమలించి నీగుణాలు తిద్దుకవచ్చీ నాపె
 అమర నడవవయ్య ఔఁ గాదనక
 తమకించి నీ యింట తావై వుండేము నేము
 విమలపు మమ్ముఁ జూచి వెఱపేల నీకును ॥ ఆపె

నెయ్యమున నిన్నుఁగూడి నేరుపరిఁ జేసీ నాపె
 ఇయ్యకోలు గొనవయ్య ఇందరిలోన
 చయ్యనఁ గూడితిమి ఇప్పటనే శ్రీవేంకటేశ
 వెయ్యయినా మమ్ముఁ జూచి వెఱపేల నీకును ॥ ఆపె ॥ 136

దేసాళం

దేవర విన్నిటా నీకు దేవుల నేను
 నీవనిత నెప్పుడూను నేర మెంచకువయ్యా ॥ పల్లవి

చెక్కు నొక్కి నీకు నేను సేసినట్టి వినయాలు
 వక్కణగా నీ మనసు వచ్చునా నేఁడు
 కక్కసించఁగదా నీకుఁ గప్పురవిడె మిచ్చితి
 దక్కివున్నదానను నాతప్పు లెంచకువయ్యా ॥ దేవ

పాదము లొత్తి నే నీపనుల నుండిన మేలు
యీదెస నీవూడిగాల కెక్కెనా నేఁడు
తోదోపులు గావుగదా దొమ్ములుగా నే మొక్కితి
ఆదినుండి నిన్నే కోరే మోఁగాదనకు వయ్యా ॥ దేవ ॥

కందువనీకాఁగిటను కలసిన భోగములు
చెంది నీకు నిన్నిటాను సెలవా నేఁడు
సందడి సేయఁగదా నీ సరుస శ్రీవేంకటేశ
యెందును నీ మేనవార మెరవుగాకువయ్యా ॥ దేవ ॥ 137 ॥

## గౌళ

మీఁటితే నవిసీ నవె మిక్కిలి మీపాయములు
వాఁటమై నవ్వఁగదవే వాసులేఁటికి ॥ పల్లవి ॥

మొగము చూచిన మీఁద మోనము లేమిటికే
తగినమాటాడవే ఆతని తోడను
* వొగరాయ నలుకలు వొడిని (నిం?) డె వలపులు
చిగురు మోవియ్యఁగదే సిగ్గులేఁటికి ॥ మీఁటి॥

తనువులు సోఁకె నిఁక తలవంపు లేఁటికే
మనసియ్యఁగదవే రమణునికిని
కొనసాగెఁ దమకము గురులేసె మదనుఁడు
చెనకి కాఁగిలించవే చింతలేఁటికి ॥ మీఁటి॥

ఆయములు గరఁగెను అనుమానాలేఁటికే
చేయిచాఁచి కూడవే శ్రీవేంకటేశు
రేయాయఁ బగలెల్ల రివ్వలాయ మీరతుల
చాయకు వచ్చితి విఁక సటలేఁటికే ॥ మీఁటి ॥ 138 ॥

---

వగరు । ఒగరు రెండు రూపాలు కద్దు (కా. శ్రీ.)

రేకు 1724 సాళంగనాట

ఏరా నీ గుట్టెల్ల నే నెఱఁగనిదా
తేరి చూడరాదా మమ్ము తెఱవలలోనను ॥ పల్లవి ॥

తోడనే వెలితౌనా నీ దొరతనమునకును
నీడల నావద్ద నిట్టె నిలుచుండేను
జాడ దప్పీనా నీ జవ్వనమదమునకు
వీడెము నా కందిచ్చితే వెలఁదులలోనను ॥ ఏరా ॥

ఇంచుకంత దరగీనా యిప్పటి నీ సత్తువలో
పంచల నాచెప్పినట్టి పని సేసితే
నించిన నీ చలములో నెరుసులు దొరలీనా
మంచముపైఁ గూచుండి మాఁటలాడితేను ॥ ఏరా ॥

వూరకె నీవు వెట్టిన వొట్టు నీపై మోఁచీనా
యేరా నాకుఁ బంతము లిచ్చితే నీవు
ఆరీతి శ్రీవేంకటేశ అంతలో నన్నుఁగూడితి
తారుకాణౌనా నాతో తమకించితేను ॥ ఏరా ॥ 139

ఆహిరి

ఎంతకు నెంతేకాక యెక్కుడేఁటికి
మంతనాన బుద్ది చెప్పి మన్నించరాదా ॥ పల్లవి

కన్నుల నీవు చూచితే కామిని యందుకుఁ బతి
చన్నుల నొత్తినదె సరియాయను
సన్నల నింకానేల చలములు సాదించేవు
కిన్నెర యదిగో మీఁటి గిలిగించరాదా ॥ ఎం

పలుకుల నవ్వితేను పడఁతి యందుకు నీతో
 సెలవుల నవ్వినదే సెలవాయను
 మలసి యప్పటి నేల మారుకొనఁ దలఁచేవు
 వలపు చిత్తరువున వా(వ్రా?)సిచూపరాదా ॥ ఎంత ॥

ముట్టి నీవు చెనకితే మోహము రెట్టించ నాపె
 పట్టి పెనఁగినదే బలువాయను
 యిట్టె శ్రీవేంకటేశ యిరవై యిఁకఁ బాయఁవు
 గట్టిగా తలఁపు దీర కప్పర మీరాదా ॥ ఎంత ॥ 140 ॥

## బౌళి

అంగనమోహము నీపై నటువంటిదా
 యింగిత మెఱఁగవా నీ వింత దొరవు ॥ పల్లవి ॥

సిగ్గువడి యాపె నీతో శిరసు వంచుకుండఁగా
 దగ్గర లోఁగే వదేమి దంటవాఁడవు
 యెగ్గున నీ వలఁ(ల్లఁ?) దప్పు యేమైనాఁ గలదోనేఁడు
 వొగ్గి నీకు ఆపె యిందు వొరటులాడీనా ॥ అంగ ॥

కన్నెపాయ మటుగాన కాంత పలుకఁగ వుండే
 పన్ని యేల పైఁకొనవు [1]ప్రౌఢవాఁడవు
 యెన్నికలు యేమైనా యెంచుకొన్నవిఁగలవో
 అన్నిటా నీ వేమనినా అవుఁగాదనీనా ॥ అంగ ॥

నెలఁత నిన్నుఁ గలసి నివ్వెరగైయుండఁగాను
 యెలయించకు శ్రీ వేంకటేశ్వరుఁడవు
 అలుకదేరి కూడితి వాస లేమైనాఁ గలవో
 చెలియ నీ చెప్పినట్లు సేయకమానీనా ॥ అంగ ॥ 141 ॥

---

[1] ప్రౌఢవాఁడవు ఇట్టి ప్రయోగము లిపదవాఙ్మయమున కలంకారము.

## వరాళి

[1]ఏది వాటి నీ మాటల కెదురాడేమా
సాదవౌదు విన్నిటాను సతిఁగూడరాదా ॥ పల్లవి

మొలకచన్నుల చెలి మొనలు నాటించితేను
బలు గబ్బి యిదియంటాఁ బంతమాఁడేవు
సెలవి నవ్వుల దిది సిగ్గులు పైఁ బూసితేను
అలరుచు గేలిసేసెనని యాడేవు ॥ ఏది

చెందమ్మిగోళ్ల చెలి చెక్కు లిట్టె నొక్కితేను
కందువ లంటించెనంటా గద్దించేవు
మందయాన యిది నిన్ను మలసి కాలుదొక్కితే
మందె మేళమనుచును మత్సరించేవు ॥ ఏది ॥

ఆయ మెరిఁగిన చెలి యట్టె కాఁగిలించుకొంటే
చేయి ముంచెనంటా నీవే చిమ్మిరేఁగేవు
యీయెడ శ్రీ వేంకటేశ ఇట్టె యీపెఁగూడితివి
మాయలాడి యిదియంటా మన్నించేవు ॥ ఏది ॥ 142

## మాళవిగౌళ

ఏఁటికి చెక్కు నొక్కేవు యింకా నీవు
మాఁటికి మాఁటికి నీకు మంచిదాననా ॥ పల్లవి

తీపుల మోవులనే తేనెలు గారఁగ నాపె
మాపుదాఁకా నీతోను మాఁటలాడీని
కోపము రేఁగి నేనైతే గొణఁగి తిట్టితి నిన్ను
మా పొందే సేసే వప్పటి మంచిదాననా ॥ ఏఁటి

---

[1] ఏది + పాటి = ఏదివాటి.

సోఁగలకన్నులనే సోద్యాలు సేసి చేసి
తీగెలుసాగఁగా నాపె తేరి చూచీని
ఆగడములు సేసి నిన్ను అదలించితి రెప్పల
మాగురుతులే మెచ్చేవు మంచిదాననా ॥ ఏఁటి ॥

చిగురుఁ జేతుల నాపె శ్రీవేంకటేశ్వర నిన్ను
తగిలి కాఁగిటఁ గూడె తమకానను
వొగరుఁగుచములను వొత్తి నే నిన్నుఁగూడితి
మగటిమినే నీకు మంచిదాననా ॥ ఏఁటి ॥ 143 ॥

## నాదరామక్రియ

ఒడివట్టితియ్యకు నే నోప నందుకు
చిడుముడిఁ బెనఁగేవా చిన్నదాన నేను ॥ పల్లవి ॥

నీకు మోహించితి నేను నీ వప్పటి నెవ్వతెకు
యేకడ మోహింతువో యెవ్వఁడెఱుఁగు
ఆకెను నన్నొకటి కమ్మనుముఁ గూడఁగట్టేవు
మాకేల నీకేకాక మానినుల గొడవ ॥ ఒడి ॥

నీతో నవ్వితి నేను నీ వప్పటి నెవ్వతెతో
యేతులకు నవ్వుదువో యెవ్వఁడెఱుఁగు
చేతులువట్టించే వాపెచేతను నే నిక్కఁగాను
నీతితో నీవే బతుకు నేరము నేమంతేసి ॥ ఒడి ॥

నిన్ను నేఁ గూడితి నిదె నీ వప్పటి నెవ్వతెను
యెన్నికతోఁ గూడుదువో యెవ్వఁడెఱుఁగు
యిన్నిటా శ్రీవేంకటేశ యిద్దర మొక్కటైతిమి
మన్నించవయ్యా మమ్ము మతకాలెఱఁగము ॥ ఒడి ॥ 144 ॥

రేకు 1725 దేసాళం

నేరుతువు కరియమాణిక్కె దేవుఁడా
 నీరపము కరియమాణిక్కె దేవుఁడా ॥ పల్లవి ॥

మక్కువ నాతోఁ బెనఁగి మంచానకుఁ దీసేవు
 నిక్కమా కరియమాణిక్కె దేవుఁడా
 అక్కరతో బత్తిసేసి ఆయము లంటేవు నాకు
 నిక్కలాయఁ గరియమాణిక్కె దేవుఁడా ॥ నేరు ॥

చేవదేర నీవు నన్నుఁ జేయివట్టి పెనఁగఁగా
 నీవి జారెఁ గరియమాణిక్కె దేవుఁడా
 కైవశమై పాయలేను కప్పురవిడేలకే
 నీవద్దనే కరియమాణిక్కె దేవుఁడా ॥ నేరు ॥

అచ్చపు గురుతులెల్లాఁ ఆనతిచ్చి రప్పించితి
 నెచ్చెలిచేఁ గరియమాణిక్కె దేవుఁడా
 ఇచ్చగించి శ్రీ వేంకటేశుఁడవై కూడితివి
 నిచ్చలునుఁ గరియమాణిక్కె దేవుఁడా ॥ నేరు ॥ 145 ॥

మధ్యమావతి

ఎగ్గుపట్టేవు గనక యెరవా నాకు
 సిగ్గు విడిపించే నింతే చెల్లదా నాకు ॥ పల్లవి ॥

చెన్నుమీర నిన్ను సాముసేఇంచేకొరకుఁగాక
 చన్నుల నొత్తక నీతో చలమా నాకు
 తిన్నని నీగుణ మిట్టె దిద్దుకొనే మింతే కాక
 పన్ని నిన్ను జంకించఁ బంతమా నాకు ॥ ఎగ్గ ॥

దక్కిన పెండ్లినాటి తగవు నేరిపేఁగాక
 గక్కనఁ గాలు దాఁకించ గర్వమా నాకు
 లక్కవలె గరఁగించి లావులు నెరపేఁగాక
 పెక్కుమారులు వెనఁగ బిగువా నాకు ॥ ఎగ్గు ॥

యెంగిలి పొత్తు గలసి యెనసే కొరకుఁగాక
 సంగతిగా మోవియ్య రాజసమా నాకు
 కుంగక శ్రీవేంకటేశ కూడితి మేలుకే కాక
 అంగమెల్లా నలయించ నంతపగా నాకు ॥ ఎగ్గు ॥ 146 ॥

వరాళి

నే మెరిఁగిన పనికి నిజము నెరపనేల
 భామలను వింతవారి భ్రమయించరాదా ॥ పల్లవి ॥

మచ్చికల మనసుకు మనసే తారుకాణ
 ఇచ్చల నీమోహము నాకేల చెప్పేవు
 యెచ్చుకుందు లేమిగల్లా యెరఁగనివానితోనే
 పచ్చిగాఁ దెలిపి చెప్పి పచారించరాదా ॥ నేమె ॥

[1]చేసినట్టి చేఁతలెల్లా చేతికిఁ జేయే దిష్టము
 యీతల నీసన్న లింకానేల సేసేవు
 ఘాతల నీ చెనకులు కడమవారిమీఁదనే
 యేతులకు చూపి మోపి యెలయించరాదా ॥ నేమె ॥

---

1 'చేతఁజేసే చేఁతకెల్లా' అని వుండవచ్చు లేకున్న ప్రాసభంగము. వాక్యాన్వయ 'షము. 'చేఁతకెల్లా' అనుటచే కారకము సుఘటితమగును.

[1]కందువయిన కాఁగిటి కాఁగిలే ముయికిముయి
విందువలె నన్నునేల వేఁడుకొనేవు
చెంది కూడితివి నన్ను శ్రీ వేంకటేశ్వర
పొందులు వొద్దివారితో బోదించరాదా ॥ నేమె ॥ 147 ॥

## శుద్ధవసంతం

ఇందువంక నేమి వచ్చీ నేల తలవంచేవు
పందెములు వేసి వేసి పైకొందువుగాక ॥ పల్లవి ॥

సరసములాడఁగాను వలము సాదింతురా
వొరసి విభునితో నవ్వుదురుగాక
శిరసువట్టుకుండఁగా సేసేదేమి నీ విఁక
సరిగా నీకుచముల సాదింతువుగాక ॥ ఇందు ॥

వావు లిట్టె చెప్పఁగాను వాదులకు వత్తురా
సేవలెల్లా నాతనికిఁ జేతురుగాక
మోవ నాతఁడాడఁగాను ముందరిమాటేఁకనేది
కావరపుఁదిట్లను కరఁగింతు గాక ॥ ఇందు ॥

పట్టి కాఁగిలించుకోఁగా బలుములు సేతురా
వొట్టుక కాఁగిట గూడివుందువుగాక
గట్టిగాఁ గలసె శ్రీ వేంకటపతి పాయరాదు
జట్టి గొన్న రతులలో జంకింతువు గాక ॥ ఇందు ॥ 148 ॥

1 'కాఁగిటికి కాఁగిలే' అనివుండవచ్చు.

## బౌళి

నీకే భారము మా నేరుపు లేమున్న విఁక
వాకుచ్చి విన్నవించేటి వైపు లెట్టోకాని ॥ పల్లవి ॥

చెలఁగి పెనఁగేఁగాని సేసవెట్టుతానే చేతు--
లలసెఁ గొలిపీనాకా ఆయమంటితే
తలఁపెల్ల భ్రమసెను దగ్గరి నిన్నుఁ జూచి
యెలమి నీ రతు లె ట్లెరిఁగీనో కాని ॥ నీకే ॥

సరసములాడేఁగాని సరి నీతో నవ్వుతానే
కరఁగె నాయములెల్లాఁ గడమ లెట్టో
పరగెను పులకలు పైకొని నిన్నంటితేనే
తరవాతి పనులెట్టు దైవారీనోకాని ॥ నీకే ॥

వుపమలెంచీ(చేఁ?)గాని వొగి నిన్నుఁ గూడఁగానే
తపము ఫలించె నాకు దైవికమెటో(ట్టో?)
రపమాయ శ్రీ వేంకటరాయ మనకిద్దరికి--
నపురూపా లిఁక నెట్లయ్యీనో కాని ॥ నీకే ॥ 149 ॥

## శ్రీరాగం

ఎందాఁకా విన్నపాలు యేమి సేసేవు
కందువలు చూపఁగానే కరఁగీ నీ మనసు ॥ పల్లవి ॥

యిచ్చకములే నీకు నెటువలె నాడవచ్చు
వెచ్చని వలపులే యెట్టు వేయవచ్చును
పచ్చికస్తూరి నూరి పట్టువెట్టుకొని వచ్చి
తచ్చి నీవద్దనుండఁగా దయవుట్టీఁ దానె ॥ ఎందాఁ ॥

కూరిములే సారె సారెఁ గొసరఁగ నెట్టు వచ్చు
ఆరీతిఁ గన్ను లెట్టార్చవచ్చును
గారవాన నిమ్మ పండు కాంతవట్టుకవుండే
నేరుపులు మించఁ గరుణించేవు నీవే ॥ ఎందాఁ ॥

నయగారాల కెందాఁకా నవ్వులు నవ్వఁగవచ్చు
క్రియెఱిఁగిన నిన్నెట్టు గెలువవచ్చు
నియతి శ్రీ వేంకటేశ నిన్ను నేఁ గూడివుందాన
జయముగా రతులెల్లా చవివుట్టె నిపుడె ॥ ఎందాఁ ॥ 150 ॥

రేకు 1726 రీతిగౌళ

ఇన్నిటా భోగి తుగాక ఇఁక నెన్నఁడు
యెన్నికలు సమకూడె నియ్యకొనవయ్యా ॥ పల్లవి ॥

చెలరేఁగి చెలరేఁగి చెప్పీ నాపె నీతోను
వెలఁది విన్నపములు వినవయ్యా
కులికి కులికి నిన్నుఁ కుచములఁ గుమ్మియెత్తీ
కలికి చేఁతలకుఁ గరఁగవయ్యా ॥ ఇన్ని ॥

సారె సారె నిన్నుఁ జూచి సన్నలెల్లాఁ జేసీ నాపె
తేరకొనఁ జూచి నీవు తెలియవయ్యా
కేరి కేరి నవ్వుతాను గీరీఁ జెక్కులు గోర
కూరిములన్నియునుఁ జేకొనవయ్యా ॥ ఇన్ని ॥

నిక్కి నిక్కి చూచి నిన్ను నెయ్యపుఁగాఁగిటఁ గూడె
యిక్కువ లంటుచుఁ జనవీయవయ్యా
అక్కరతో శ్రీవేంకటాధిప నీరతి యింతి
దక్కగొనె నీమేలు చక్కఁగొనవయ్యా ॥ ఇన్ని ॥ 151 ॥

## బౌళి

ఏఁటికి జాగులుసేసే వెందాఁకా సరసాలు
వాఁటము సేసీ యీపెపై వంచరాదా నవ్వులు ॥ పల్లవి ॥

పంతము నీమీఁద వేసి పాదాన నేలయి వ్రాసి
చింతతోడ నున్న దదె చెలియ
వంతతో మారలుగక వద్దికి వచ్చి ఆపె
సంతోసపు మాటలాడీ చల్లరాదా వలపు ॥ ఏఁటి ॥

కెంపుఁగనుఁగవ మీర గీరునామము జార
తెంపుతోడ నున్నదదె తెల(ఌ?)వ*
ముంపున నెగ్గుపట్టక ముచ్చటలు బుజ్జగించి
ఇంపులనే చెక్కునొక్కి ఇయ్యరాదా చనవు ॥ ఏఁటి ॥

కాయమెల్లాఁ బులకించి కాఁకలు నీమీఁద నించి
చేయిచాఁచె నీకుఁగానే చెలియ
యీయెడ శ్రీవేంకటేశ ఇంతి నిట్టె కూడితివి
తీయనిమోవి ఇచ్చీ తిప్పరాదా చలము ॥ ఏఁటి ॥ 152 ॥

## పాడి

అంతనేరుపరి మాయుంగన నీతో నేఁడు
యింతసేసి దిష్టముగా నిటు మాపవలెఁబో ॥ పల్లవి ॥

పలికినంతనే పోదు పాయుపు బీరాలు నిన్నుఁ
గలసి కాఁగిటఁగూడి ఘాత మాపక
చలపట్టి నంతఁ బోదు సారపు నేర్పులు వల్లి
వలపించి వలచి భావము మాపక ॥ అంత ॥

---

* రాగి రేకు మీద అక్షరం మెలచడంలో పొరపాటు (కా. శ్రీ.) 'ఌ' 'అ'

చెంతఁ జూచినంతఁ బోదు చెనకి మర్మాలు కొచ్చి
పంతములు నెరపుచు పైకొనక
రంతుసేసినంతఁ బోదు రాసి వన్నులు నురము
వింతలుగ మెరయుచు వీడుజోడైయుండక ॥ అంత ॥

దగ్గరినంతనే పోదు తలఁపుఁదలఁపుఁ గూడ
నిగ్గుదేర రతిసేసి నీటుచూపక
అగ్గమై శ్రీ వేంకటేశ అతివ నీవుఁగూడితి--
యెగ్గులెల్లాఁ దీర నిట్టె యియ్యకొనక ॥ అంత ॥ 153 ॥

## భల్లాటి

ఇటువంటినే నీకు యేవి[1]బాఁతెని వచ్చేవు
యెటువంటి నేర్పరివి యేమని నుతింతును ॥ పల్లవి ॥

మనసు మర్మ మెరిఁగి మాటలాడనేర్చు నాపె
నిను వెంగేలాడనేర్తు నేనైతేను
పెనఁగక నీతో నాపె ప్రియము చెప్పఁగనేర్తు
చనవుసేసుక నేను సాదించ నేర్తును ॥ ఇటు ॥

మిక్కిలి విత్తమెరిఁగి మెలఁగఁగనేర్చు నాపె
పిక్కటిల్లుఁ జన్నులు పైఁబెట్టనోపుదు
గుక్కక నీ చేఁతలెల్ల గుట్టుసేయ నోపు నాకె
వెక్కసపు నీమోవి వెలయిచ్చ(వెలయించ?) నోపుదు ॥ ఇటు॥

ననుపుసేసుక నీతో నవ్వ నాపె కదు జాణ
నిను నెచ్చరించి కూడ నే జాణను
యెనసితి శ్రీ వేంకటేశ్వర మమ్మిద్దరిని
యినుమడి నీవంక నిద్దరు జాణలము ॥ ఇటు ॥ 154 ॥

---

[1] బాఁతి + అని.

## ముఖారి

ఇచ్చితిమి కానుక యింతక తొలుతే నీకు
తచ్చేము మా సిగ్గు దగ్గరిరావయ్యా ॥ పల్లవి ॥

పంతము లేమీనాడరు పడఁతులయినవారు
చింతలనే వలపించి చిక్కింతురు
అంత నేరుపరివైతే అందుకేమి దోసమా
దొంతినున్నది మా గుట్టు దోసిలొగ్గవయ్యా ॥ ఇచ్చి ॥

యెగసక్కెము సేయరు ఇంతులైన యట్టివారు
తగులాయములు చూపి దక్కఁగొందురు
నగ నీవు దొరకొంటే నాకు నీకు దోసమా
చిగిరించె మాకోరికె చేఇ చాఁచవయ్యా ॥ ఇచ్చి ॥

కక్కసించి పెనఁగరు కాంతలయినవారు
గక్కనఁ గెమ్మోవి ఇచ్చి కాఁగిలింతురు
యెక్కువ శ్రీ వేంకటేశ ఇటు నన్నుఁ గలసితి
పిక్కటిల్లె మా చన్నులు బిగిఇంచవయ్యా ॥ ఇచ్చి ॥ 155 ॥

## లలిత

దొరవాదు విన్నిటాను దోసమెరఁగవుగాని
తెరమఱఁగేసుమ్మీ తెలిసె నన్నియును ॥ పల్లవి ॥

నగితినా నీతోను నాలోని ప్రియములు
చిగురై వెడలెఁగాక సెలవులను
మొగము చూచి నీమోవినే యేల తిట్టేవు
వొగరే పులుసుగాదా వొరయుకు నీవు ॥ దొర ॥

జంకించితినా నిన్ను చనవు మనవులెల్లా
వుంకువలై నిండెఁగాక వొగి బొమ్మల
కొంకక దగ్గరి మమ్ము కొంగులేల పట్టేవు
సుంకులే పొలుకొనవా సుద్దులేల మాతోను ॥ దొర ॥

కాఁగిట బిగించితినా గక్కన శ్రీవేంకటేశ
చేఁగలవలపులే చిక్కించెఁగాక
రాఁగి నీవు మమ్ము నేల రచ్చలఁబెట్టి కూడితి--
వాఁగి కెరుగునఁగాదా అట్టె వెన్న వుట్టేది ॥ దొర ॥ 156 ॥

రేకు 1727 పళవంజరం

ఏలయ్యా నీకు నాకు యిన్నేసిమాటలు
మేలుగలదంతయును మెరయుఁగాక ॥ పల్లవి ॥

తగులు గలుగువారు తగవులెంచనున్నదా
వెగటు లేమి సేసినా వెలయుఁగాక
తెగువలు గలవారు దిక్కులు మూడ నున్నదా
పగటులుగలవెల్లాఁ బచ్చి దేరుఁగాక ॥ ఏల ॥

మనసునమ్మినవారు మతకమెంచ నున్నదా
చనవులన్నియు లోలో జరఁగుగాక
వినయముగలవారు వెక్కసాలాడనున్నదా
పెనఁగినంతవడి బీరములౌఁగాక ॥ ఏల ॥

కాఁగిలించుకొన్నవారు కడమవెట్టనున్నదా
చేఁగదేరఁ గూడితిమి చెల్లుఁగాక
మూఁగుచు శ్రీ వేంకటేశ ముంచి మనవంటివారు
తోఁగుఁజమటలచేత దొమ్మియౌటఁగాక ॥ ఏల ॥ 157 ॥

## సాళంగం

ఆపె ఆతనిబుద్ది అందాలకుఁదెచ్చీఁగాని
కోపుల సారెసారెఁ గొసరకురే ॥ పల్లవి ॥

మొగము చూచినప్పుడు మోహము రెట్టించీఁగాని
జిగి నందాఁకాఁ గక్కసించకురమ్మ
నగిన యప్పుడు తానే నయానకు వచ్చీఁగాని
పగటు బలిమిచూచి పంతములాడకురే ॥ ఆపె ॥

మాఁటలాడినప్పుడే మంకులు మానీఁగాని
గాఁటానఁ జేయివట్టి పెనఁగకురమ్మ
కూటమివేళనే మేలు కొనలుసాగీగాని
పాటించి సారె సారెకు బలిమిసేయకురే ॥ ఆపె ॥

యేకాంతమయినప్పుడే ఇయ్యకోలయ్యీఁగాని
చేకొని ఇంతేసి రట్టు సేయకురమ్మ
యీకడ శ్రీవేంకటేశుఁ డింతని గక్కునఁ గూడె
వాకిచ్చి మారేమి నిఁక వంతులు వెట్టకురే ॥ ఆపె ॥ 158 ॥

## పాడి

పంతములేఁటికి పడఁతితోడ నీ--
సంతసములే పైఁజల్లఁగదయ్యా ॥ పల్లవి ॥

అనఁగుచుఁ బెనఁగుచు ఆయములంటుచు
చనవులు మెరసీ జవరాలు
కినియక యిఁక నీకేలు వాఁచి సతి--
మనవులు చేకొని మన్నించవయ్యా ॥ పంత ॥

మొక్కుచు నిక్కుచు మొఱఁగులు మాపుచు
దక్కఁగొనీ నిను దరలాక్షి
తక్కులఁ బెట్టక దయతో నవ్వుచు
చెక్కునొక్కి రక్షించఁగదయ్యా ॥ పంత ॥

కప్పుచుఁ బయ్యెద కాఁగిట బిగియుచు
పిప్పిసేసె నినుఁ బ్రియురాలు
యిప్పుడె శ్రీ వేంకటేశ కూడితివి
తప్పదీర దయ దలఁచఁగదయ్యా ॥ పంత ॥ 159 ॥

## సామంతం

ఇచ్చితివా కానికె తా నేమనీనే
తచ్చి తచ్చి తనమాఁట దలఁచుకొమ్మనవే ॥ పల్లవి ॥

చిగిరించెఁ జిత్తము చెమరించె నామేను
యెగెసక్కెపు విభుఁడు యేమనీనే
నగవులాయ వలపు నావంటివారిలోనెల్లా
తగవైన తనబాస తలఁచుకొమ్మనవే ॥ ఇచ్చి ॥

చిమ్మిరేఁగే వయసుచే చేవదేరీ నాయాసలు
యెమ్మెలరమణుఁడు తానేమనీనే
వుమ్మడి నున్నది గుట్టు వూరెల్లాఁబెనురట్టు
తమ్మిరేకు తనవాఁ(వ్రా?) త తలఁచుకొమ్మనవే ॥ ఇచ్చి ॥

వెలిఁబడె సిగ్గులు వెరగాయరతులు
యెలమి శ్రీ వేంకటేశుఁ డేమనీనే
కలసెఁ దనకు నాకు కాఁగిటనే వావులు
తలపోసి యీ చేఁతలు తలఁచుకొమ్మనవే ॥ ఇచ్చి ॥ 160 ॥

## సౌరాష్ట్రం

ఏమి నవ్వేవే నాతో నింకా నీవు
వాములాయ వలపులు వట్టి జోలేతే ॥ పల్లవి ॥

సరసము లాడఁగానే జాముపోయ నిదివో
తెరమరఁగుననే తెల్లవారెను
యెరవులేక విభుఁడు యేమీ ననఁజాలఁడు
వరవాత నీకసైనా వచ్చేవో రావో ॥ ఏమి ॥

ముంగురులు దిద్దగానే మొనలెక్కెఁ గొనగోరు
సింగారించుకోఁగానే సిగ్గుముంచెను
సంగతెఱిఁగినపతి చలములు సాదించఁడు
యింగిత మెఱిఁగి మోవి ఇచ్చేవో యీయవో ॥ ఏమి ॥

చేతులు పైఁజాఁచఁగానే సెలవుల నవ్వు ముంచె
గాతలఁ గాఁగిలించఁగ కాఁక దీరెను
యీతల శ్రీ వేంకటేశుఁ డిచ్చేరిఁగి నిన్నుఁగూడె
యేతుల యీవుపకార మెంచేవో యెంచవో ॥ ఏమి ॥ 161 ॥

## లలిత

నీవు సేసే చేఁతలకు నేఁడు నాకు
తావున వూరకేవుండి తలవంచఁదగదా ॥ పల్లవి ॥

తెలిపి చెప్పినదాఁకాఁ దెరఁదీసితినింతే
తలపోఁతే తెరగాదా వరవాతను
మొలకనవ్వులూరకె ముంచీఁగాక
సెలవుల చెలుల మోము చూచితే సిగ్గువడఁదగదా ॥ నీవు ॥

మనసువచ్చినదాఁకా మాటలాడితినింతే
కనుచూపే మాటగాదా కడు గుట్టున
ఘనమై చెక్కుల వెంటఁ గళలుదేరీ నేలో
వనిత లిందరిలోన వాసి నుండఁదగదా ॥ నీవు ॥

రతుల మెచ్చినదాఁకా రాజసాననుంటి మింతే
అతిరాజసము గాదా అరమరపు
యితవై శ్రీ వేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
మితిమీరవలదా మెలఁతుల వొద్దను ॥ నీవు ॥ 162 ॥

రేకు 1728 భైరవి

ఏమరిపాటున నింతి నింతసేతురా
దోమటాయ వలపులు తోడఁదోడ మాకును ॥ పల్లవి ॥

నివ్వెరగుతోడఁ జెలి నిలుచుఁ(చుం?) దుండఁగాఁ జూచి
రవ్వై వుంటవింటఁ గప్పురాన వేసేవు
దవ్వుల [1]నిన్ను నాపె అదరిపడి నిన్నుఁ జూచె
పువ్వుటమ్ములై తాకె పొంచి నీమర్మములు ॥ ఏమ ॥

చింతతోడఁ గడుఁ జెలి శిరసు వంచుకుండఁగా
పంతాన నాపెను పూబంతి వేసేవు
అంతలో చేతఁ దట్టితే నాపె గోరు నిన్ను సోఁకె
[2]కంతునికై తప్పలాయ గక్కున నీమేనను ॥ ఏమ ॥

సిగ్గువడివున్న చెలిఁ జఱఁగువట్టి తీసేవు
బగ్గన నాపె గుబ్బలు పై మోపెను

1 ఇవిపునరుక్తులు. ఇట్టి పక్కడక్కడ గలవు.
2 కంతుని కైతప్ప = మన్మధవికారము కావచ్చు.

యెగ్గనక శ్రీ వేంకటేశ మీరు గూడితిరి
వెగ్గళపురతులను వేవేలాయ వలపు ॥ ఏమ ॥ 163 ॥

## ఆహిరి

ఇంతిని మన్నించుటకు నిదేవేళ
వింత సేయక లోనికి విచ్చేయరాదా ॥ పల్లవి ॥

రచ్చలఁబడె వలపు రాసులై నిండె వలపు
యిచ్చట నాయకుడవు యేమి సేసేవు
పచ్చకప్పురపు ధూళిపాలాయ విరహము
తచ్చిచూచి ఇఁక దయఁతలఁచరాదా ॥ ఇంతి ॥

దొంతులు నిండెఁ గోరిక దొడ్డు వొచ్చెఁగోరిక
ఇంతు లిందరిలో నీవు యేమి సేసేవు
చింత చెక్కిటిచేఁతికి సెలవాయ జవ్వనము
కాంతుఁడ వీపె నింతటఁ గరుణించరాదా ॥ ఇంతి ॥

అడియాలమాయ రతి ఆయములంటెను రతి
యెడయకు మక్కడ నీవేమి సేసేవు
విడుముడి గూడితివి శ్రీ వేంకటేశ సతిని
పిడికిటిపాలఁ గృపపెట్టఁగరాదా ॥ ఇంతి ॥ 164 ॥

## గౌళ

పెక్కు సతులు గలుగు పెండ్లి కొడుకవు
దిక్కని నమ్మితి నిన్ను దేవరవు నీవు ॥ పల్లవి ॥

నవ్వులవలె నున్నవి నయాగారి నీమాఁటలు
పువ్వులవలె నున్నవి బూటకములు

జవ్వనపు దాన నేను సమ్మతింతు నెందుకైనా
యువ్వఁడెఱుఁగు నీగుణ మేమిసేసేవో ॥ పెక్కు ॥

మేడలపొడవులాయ మెచ్చేటి నీ ప్రియములు
గోడకంటె దట్టము నీగుట్టు చేఁతలు
నీడవంటిదాన నేను నీ చెప్పినట్టె సేతును
పాడిబంతమెఱఁగను భాగ్యము నీ చేతిది ॥ పెక్కు ॥

గుంపులు గుంపులు గట్టె కూడిన నీ భోగములు
దింపరాని మోపులు నీ తీగెమొక్కులు
ముంపుల శ్రీ వేంకటేశ ముంచి నే నిన్నుఁగూడితి
అంపలేను నే నిన్ను అడ్డమాడ కిఁకను ॥ పెక్కు ॥ 165 ॥

వరాళి

[1]ఎంత మందె మేళమని యెంచవద్దు నన్నును
పంతమున నుండితేను బయలు పరతును ॥ పల్లవి ॥

మచ్చము పైఁబెట్టుకొని మౌనముతో నుండనేల
కొచ్చి పిడిచితే తలగుట్టుకొందురా
ముచ్చట నింతాఁ దిరిగి మొకము సుక్కించుకొంటే
పచ్చిగాఁ గఁ(గం?)బముమాటు బయలు పరతును ॥ ఎంత ॥

కపటాలు పైవేసుక కడఁ జేఇ చాఁచనేల
చపలుఁడవై కోపము సారె నేఁటికి
వుపమలు వెదకేవు వొద్దనుండే ఇట్టయితే
అపుడే నీముచ్చిమి బయలుపరపుదును ॥ ఎంత ॥

---

1 ఇందు దశావతార సమన్వయము కలదు.

ఇన్నియు బోధించి వచ్చి ఇట్టె సిగ్గువడనేల
వన్నెల మొక్కితే రాయివలె నుండేవు
నన్ను శ్రీ వేంకటేశుఁడ ననుపునఁ గూడితివి
పన్నిన నీ గుట్టెల్లా బయలుపరతును ॥ ఎంత ॥ 166 ॥

## గౌళ

మోము చూచితిఁ గనక మొక్కితి నింతే
సాములు సేయకువయ్యా చాటిచెప్పే నీకు ॥ పల్లవి ॥

నిన్ను నేల తడవేను నీవాపెవద్దనుండఁగా
వన్నె నీమాఁటప్పగించ వచ్చితిఁగాక
సన్నలేల సేసేవు సారెకునేల లోఁగేవు
పన్ని వెఱవకువయ్యా బాసయిచ్చే నీకు ॥ మోము ॥

అందుకే యేల నవ్వే నాపె నీ చెక్కు నొక్కఁగా
చెందిన నీవోజ సంతసించితిఁగాక
కిందుపడనేమిటికి గేలిసేయఁ గలంగకు
పందెము వేసినట్టె బాస ఇచ్చే నీకు ॥ మోము ॥

కయ్యానకేల వచ్చేను కాంత నీ సొమ్మయి వుండఁగా
వొయ్యనే కాఁగిలి నీ కొప్పించేఁగాక
ఇయ్యెడ శ్రీ వేంకటేశ ఇద్దరముఁగూడితిమి
పయ్యెది నీపైఁ గప్పి బాసయిచ్చే నీకు ॥ మోము ॥ 167 ॥

## దేసాళం

కైకొనేఁగాక నేనిట్టె కాదనక
దీకొని నీసుద్దులు నేఁ దెలియనివా ॥ పల్లవి ॥

పువ్వువలె నాపె నీ పొంత నుండితేఁజాలు
యెవ్వరితోడి సడ్డ యేలనాకు
పవ్వళించి మాతో పని పయిపచారము లింతే
నివ్వటిల్లు నీతో పొందు నేనెఱఁగనా ॥ కైకొ ॥

మొక్కి మొక్కి యాపె నీమోము మాచితేఁజాలు
యెక్కడెక్కడిసతులు యెంత లేదు
మొక్కలపు మాకొలువు మూకపాపులకు నింతే
చొక్కపు నీ గుణములు సోదించనివా ॥ కైకొ ॥

వుడివోక ఆపె నీవురముపై నుంటేఁజాలు
యెడపుల వారెల్లా నేమి బాఁతి
నడుమ శ్రీ వేంకటేశ నన్ను నిట్టె కూడితివి
తడవి నీమేలు నేఁ దలఁచనిదా ॥ కైకొ ॥ 168 ॥

రేకు 1729 బంగాళం

ఆతఁడు నీకుఁ దగు నాతనికి నీవు దగు
గాతలఁ జెలులమెల్లఁ గంటిమి యీనేర్పులు ॥ పల్లవి ॥

కన్నులవాఁడి చూపేవు కమ్మనిమోవి ఇచ్చేవు
పన్నేవు మాయలు రెంటా బతితోను
నున్నని చెక్కులు నొక్కి నోటనే ప్రియాలు చెప్పి
మన్నించె నిన్ను నాతఁడు మారుకు మారుకును ॥ ఆతఁ ॥

నాటించేవు చన్నులను నవ్వేవు సెలవులను
యేఁటికే యీ పగటులు ఇరుదెసలా
కూటములు పచరించి గురుతులు సోఁకించి
చాటీ వలపతఁడు సరికి బేసికిని ॥ ఆతఁ ॥

కప్పురపు బాగాలిచ్చేవు కాఁగిట బిగించేవు
వొప్పించేవు దారా మోనా నొక్క చోటనే
ఇప్పుడే శ్రీ వేంకటేశుఁ డీఁడువెట్టుకొని కూడె
తొప్పదోఁగి ముదముల తులదూఁగె నితఁడు ॥ అతఁ ॥ 169 ॥

## గౌళ

ఆపెకు నమరునా ఆరడి నీపనులు
వోపికగలవాఁడవు వోయమ్మ వెరవవు ॥ పల్లవి ॥

సిగ్గువడివున్న చెలిఁ జెక్కు నొక్కఁబోతే
అగ్గలము గాదా అందరిలోన
యెగ్గులేని ప్రోడదొర వెఱఁగరాదు నీకైతే
వొగ్గేవు నీవెందుకైనా వోయమ్మ వెరవవు ॥ ఆపె ॥

పాయపుఁ గోమలితోడఁ బట్టి వెనఁగఁగఁబోతే
రాయడివలె నుండదా రచ్చలోనను
మాయదారి మగఁడవు మఱఁగులేదు నీకైతే
వోయయ్య ఆడికలకు నోయమ్మ వెరవవు ॥ ఆపె ॥

గుట్టుతోడి వనితను కొంగువట్టి తియ్యఁబోతే
దిట్టతనమై వుండదా తెఱవలలో
ఇట్టె శ్రీ వేంకటేశ యీపె నిట్టె కూడితివి
వొట్టు సత్యములకును వోయమ్మ వెఱవవు ॥ ఆపె ॥ 170 ॥

## పాడి

ఇంతి నిన్ను గదిమితే నేమనేవయ్య
వంతులెల్లానెంచుకొంటా వద్దఁగాచుకుండెను ॥ పల్లవి ॥

మిక్కుటముగా నప్పుడు మీరు మీరుఁ బెట్టుకొన్న-
యెక్కువ తక్కువ వొట్లేమాయను?
ఇక్కడికి విచ్చేసితి వింతలోనె తప్పించుక
వెక్కసమై యాపె నిన్ను వెతకుతానుండెను ॥ ఇంతి ॥

నగుతా నప్పుడు మీరు నంటుసేసి యాడుకొన్న-
యెగసక్కెపు బీరము లేమాయను
పగటున నామీఁదిపరాకున నున్నాఁడవు
తగిలి యాడకు వచ్చే దానంటా నుండెను ॥ ఇంతి ॥

కూడి మావాకిట-మీరు కొప్పులు వట్టి తీసిన-
యాడుజోడు సరసము లేమాయను
యీడ నన్నుఁ గలసితి వింతలో శ్రీ వేంకటేశ
మోడా మోడితనమున మొక్కేనంటా నుండెను ॥ ఇంతి ॥171॥

లలిత

ఆయనాయ రావయ్య అంగనతోఁ గూడవయ్య
కాయజకేలిని వొక్కకత చెప్పవయ్యా ॥ పల్లవి ॥

పువ్వువంటివలపు బుజముల దాఁకా మోఁచి
జవ్వనికుచములై జడిసీనిదె
నవ్వులనే పిండిరాలి నాములు మాపులఁ బారి
ఇవ్వల రచ్చల సేసే విది యేఁటిదయ్యా ॥ ఆయ ॥

చిగురువంటి మదము చెంపలవెంటా జారి
మగువకుఁ దురుమై మలసీనదె
వొగరు చెమటై వెల్లి వుదుట పులక లుబ్బి
యెగసక్కేలేల చూపే విది యేఁటిదయ్యా ॥ ఆయ ॥

పండులవంటిరతుల పొగరు మెగానకుబ్బి
దిండు కట్టి చెలిమోవై తేనెగారీని
అండనె శ్రీ వేంకటేశ ఆయమంటి కూడితివి
యిందులెల్లా నిండెఁ దమి ఇఁక నేఁటిదయ్యా ॥ ఆయ ॥ 172 ॥

## గౌళ

రాకు రాకు నీ వంత రవ్వసేయను
చేకాని పంతములు నాచేతిగోరనున్నవి ॥ పల్లవి ॥

చలము సాదించఁగానె సరసములాడైన-
నలయించకేలమానే నాసుద్దికి
నిలువున వినయాలు నీవెంత సేసినాను
కులికి నా కోపము గుండెలోనే వున్నది ॥ రాకు ॥

గుఱిగా నలుగఁగాని గుంపెనమొక్కులనైన
యెఱఁగించే నీగుణాలు యీ నీ వేఁతకు
తఱితోడ నీవెంత దయవుట్టఁ బెనఁగినా
మఱియును బీరాలు మా పెదవి నున్నవి ॥ రాకు ॥

కొసరి నే దిట్టఁగాని కూడినకూటమినైన
పసచూపే నీ మోహపు పంతములకు
యెసగి శ్రీ వేంకటేశ ఇట్టె నన్నుఁ గలసితి-
వసదు నీ వలపు నా ఆతుమలో నున్నది ॥ రాకు ॥ 173 ॥

## హిజ్జిజి

నీకేల ప్రియము చెప్ప నెలఁతల కెవ్వరికి
వాకైనవారేకా నీ వనితలు ॥ పల్లవి ॥

బింకమాడేయట్టి వేళ ప్రియములు చెప్పి నీకు
వంక లొత్తఁగలరుగా వద్దివారు
జంకించేటి సతులతో సందిమాటలాడియాడి
లంకెలు సేసేరుగా నీ లలనలు ॥ నీకే ॥

తప్పు మోఁచినట్టి వేళ తగవులెల్లా నెరపి
వొప్పులు సేతురుగా నీ వొద్దివారు
అప్పటప్పటికి నింతు లలిగి వుండేవేళ
కప్పురవిడే లూడిగాలవారిత్తురుగా ॥ నీకే ॥

వెగ్గళించినట్టి వేళ వేసాలెల్లా నీకుఁజూపి
వొగ్గి నిన్ను మెత్తురుగా వొద్దివారు
యెగ్గుదీర శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
సిగ్గులు వాపేరుగా నీ చెలిమికత్తియలు ॥ నీకే ॥ 174 ॥

రేకు 1730 గౌళ

ఏమి విన్నవించేము యెందాఁకా నీతోను
[1]నాలి(ము?) సేయకెంతటను నవ్వు నవ్వవయ్యా ॥ పల్లవి ॥

వలపులు తలు(ల?) మూపె వనిత కుచములను
బలు విరహపు వేళ పయ్యెదెడలి
చలివాపె సిగ్గులెల్ల జవ్వనమదమునను
తెలిఁగన్నులను సతిదిక్కుఁజూడవయ్యా ॥ ఏమి ॥

వయసు దైలువారె వనిత నెఱిఁగురుల
రయమునఁ గాఁకలెల్ల రారాఁపులె(లై?)
ప్రియమైన తేనెపందు బేఁటులెత్తీ నూర్పులను
దయతోడ నీ యింతిదండ చేరవయ్యా ॥ ఏమి ॥

1 ప్రాసభంగము. 'నాముకొనకెంతటను' కూడ కావచ్చు.

వన్నెలు తళుకుచూపె వనితమొగమునను
　మొన్న శ్రీ వేంకటేశ నీవిట్టె కూడఁగా
　పన్నపు జెమటలను జడివట్టి జాలువారె
　కన్నియ కిటువలెనే కపురమీవయ్యా　　|| ఏమి || 175 ||

## దేపాళం

ఎంతవడి నీయలుక యెందాఁకా వొట్లు
　పంతపు నీరమణుఁడు పైకొనీ నిదివో　　|| పల్లవి ||

చిలుకుఁదేరెను మోవిఁ జిందీ ననుచు నీవు
　పలుకవదేమే పతితోను
　కులుకుఁ గుచాల వుబ్బు కుంగీననుచు నిట్టె
　అలమ విదేమే ఆతనిని　　|| ఎంత ||

నునువాఁడి కొనగోరు నాగిలీ ననుచు నీవు
　చెనకవదేమే చెలువునిని
　అనుఁగు నీకనుచూపు లంటీ ననుచు నిట్టె
　యెనయఁ జూడవేలే యాతనిని　　|| ఎంత ||

పాయపునీజవ్వనము[1]పచ్చ గందీనని నీవు
　చేయిచ్చి దగ్గరవేమే శ్రీ వేంకటేశు
　యీయెడ నాతఁడే వచ్చి యిటు నిన్ను నేఁడు గూడె
　నీయంత నెఱఁగవేమే నిందుదంటతనము　　|| ఎంత || 176 ||

## పాళంగం

ఎక్కినవానికిఁ జూడ యేనిగె గుజ్జనుమాట
　నిక్కముగా భువిలోన నీవల్ల గంటిమి　　|| పల్లవి ||

---

[1] పచ్చ = పసిమి కావచ్చు.

మొగము చూడఁగానే మూటమూటలాడేవు
తగునా ఆతనితోడ దంటతనము
నగేవానితోడ నీవు నంటుసేసి గొణగేవు
అగపడితేఁ బతి అలసతే నీకు ॥ ఎక్క ।

దగ్గరి రాఁగానే నీవు తలవంచుకొనియేవు
యెగ్గా ఆతఁడు నీకు యేమైనాను
వొగ్గి చేయిచాఁచేవాని నొడ్డుకొంటా బెనఁగేవు
వెగ్గళించకుండితేనే వింతవాఁడా ఇతఁడు ॥ ఎక్కి ॥

కొంగువట్టి తియ్యఁగానే గొబ్బున సిగ్గువడేవు
సంగతా [1]ఇద్దరి మీసరసవేళ
యింగితాన శ్రీ వేంకటేశుఁడిట్టె నిన్నుఁగూడె
ముంగిట నిలుచుంటేనే ముచ్చటలు చెల్లెనా ॥ ఎక్కి ॥ 177 ॥

## ముఖారి

వద్దు వద్దు కోపము వదినె నింతే నీకు
సుద్దులేల చెప్పేవు సొంసితి విన్నును ॥ పల్లవి ॥

మారుకొన్న దానఁగాను మాటాడినదానఁగాను
యేరా నాతోనేల యెగ్గు పట్టేవు
గీరితి నింతే గోర కెలని పరాకు రాఁగా
కూరిమి నిట్టే వేఁడుకొనేను నిన్నును ॥ వద్దు ॥

గుంపించినదానఁ గాను గొణఁగిన దానఁ గాను
తెంపున నేరా నన్ను దీకొనేవు
చెంపల చెమట జార చేఁతఁదుడిచితి నింతే
అంపలేను ఆయుమంటి ఆదరించే నిన్నును ॥ వద్దు ॥

---

[1] 'మీఇద్దరి సరసవేళ' అనుట సహజము.

పాపివున్నదానఁ గాను పదరినదానఁగాను
వేసరక నన్నునేల వెడ్డువెట్టేవు
ఆసల శ్రీ వేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
మోపలేదు నీకునాకు మొక్కమెచ్చే నిన్నును ॥ వద్దు ॥ 178 ॥

## ఆహిరి

కానీవయ్యా అందుకేమి కాదనేనా
మోనాన నుండఁగ నిన్ను మోవ·నాడేనా ॥ పల్లవి ॥

పొత్తుల మాఁటలలోనే బువ్వమారగించితిరి
అత్తి మోవులనే విడే లందుకొంటిరి
యెత్తిన చలముతోడ యేల నాతో బొంకేవు
కొత్తలుగ వేరే నిన్నుఁ గోపగించేనా ॥ కానీ ॥

తెలినవ్వు పిగ్గులనే తెరలు వట్టించితివి
తలఁబాలు వోసితివి తమకముల
చలము సాదించి యేల సారె నానలు వెట్టేవు
వెలినుండి వేరే నిన్ను వెంగెమాడేనా ॥ కానీ ॥

గొప్పకుచముల బూజకుండలునుఁ బట్టితివి
పిప్పిఁగాఁగ రతులను పెండ్లాడితివి
ఇప్పుడే శ్రీ వేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
నెప్పున నాపెకు నీకు నింద గట్టేనా ॥ కానీ ॥ 179 ॥

## పాళంగం

ఇక్కడ నిందరిలోన నేల లోఁగేవు
పక్కన పిగ్గువిడిచి, పదరాదా లోనికి ॥ పల్లవి ॥

కొప్పు దువ్వేనంటా నాపెఁ గు(గొ?)మ్ముడి వట్టి తీసేవు
కప్పుర మిచ్చేనంటా కాలుదొక్కేవు
ముప్పిరి మీ యిద్దరిలో మూసిమంతనము లేల
యిప్పుడే నోటఁ బిలిచి యేఁగరాదా లోనికి ॥ ఇక్క ॥

కతలు చెప్పేనంటా కనుసన్నలు సేసేవు
[1]పతివెట్టేనంటాఁ జేయిపట్టి తీసేవు
యితవైతే మాముందర నింతేసి వగలేల
రతికేలి కాపె నీవు రారాదా లోనికి ॥ ఇక్క ॥

పందేలు వేసేనంటా బలుములు సేసేవు
కందువలు చూపెనంటా గాఁగిలించేవు
యిందుకుఁగా శ్రీ వేంకటేశ నన్నుఁగూడితివి
దిందుపడ నాపె నింకాఁ దియ్యరాదా లోనికి ॥ ఇక్క ॥ 180 ॥

రేకు 1731 వరాళి

కాదని తొలఁగరాదు కైకొని మెలఁగరాదు
వీదరవెల్లి పొందులు విందులై వుండును ॥ పల్లవి ॥

వలపుఁదేనెలమోవి వంచి నీవు మాటాడితే
తెలిసినవారికెల్లా తియ్యనుండును
కలసేటి నీ కాఁగిటి కాంతలకుఁ జూచితేను
యెలమిఁ బదారువేల యెంగిలై వుండును ॥ కాద ॥

చల్లనిమేనితో నీవు సారెఁ గాఁగిలించుకొంటే
యెల్లవారికినిఁ జూడ ఇంపై వుండును
పొల్లుగానినీ పతులు భోగించదొరకొంటే
గొల్లెతల మానముల గురుతులై వుండును ॥ కాద ॥

---

[1] పతి = బదులు. 'ప్రతి'శబ్ద భవముకావచ్చు.

సింగారపుఁ గొనగోళ్లచేయి నీవు వేసితేను
అంగజముద్రలు వేవేలై వుండును
ఇంగితపు శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
సంగతి నీవే నాకు సమ్మతులై వుండును ॥ కాద ॥ 181 ॥

## ముఖారి

కందువ కాఁగిటఁ గూడి కరఁగుచుందువుగాక
నిందలేని నీబోటికి నివ్వెరగు చెల్లునా ॥ పల్లవి ॥

చనవరికత్తెలము జగడాలడుతుమా
చెనకి నీకే ప్రియాలు చెప్పేము కాక
పెనఁగుచు నీకునీవే బింకములు నెరపేవు
వనితలతోడ మగవానికింత గలదా ॥ కందు ॥

పట్టపుదేవులమింత పంతాలాడుదుమా
వొట్టుక నీవద్దఁ గాచుకుందుముగాక
వట్టినవ్వులు నవ్వేవు వాసులకుఁదిరిగేవు
దిట్టమగువలతోడ దీమసము వలెనా ॥ కందు ॥

వూడిగాలు సేసేవార మొరటులు పట్టుదుమా
వేడుకఁ గూడి [1]బారము వేతుముగాక
యీడనె శ్రీ వేంకటేశ ఇటు నన్నుఁగలసితి
జాడతోడి మాతోడ చలము సాదింతురా ॥ కందు ॥ 182 ॥

## బౌళి

అందుకందుకును సరి ఆతఁడే జాణ
మందెమేళమున నిన్ను మన్నించెఁగదవే ॥ పల్లవి ॥

---

[1] 'భారము' కావచ్చు.

మంచముపై నీవుండి మచ్చిక నాతఁడు రాఁగా
ఇంచుకంతఖన లేవ విది యేఁటిదే
పంచ నాతఁడు దిగువ పరపుపైఁగూచుండి
వంచుకొని నిన్నుఁ దవవద్దికిఁ దీపెఁగదే ॥ అందు ॥

వుద్దాలు మెట్టుకొని వొద్దికి నాతఁడు రాఁగా
వుద్దండాన నవి కడకూరుచవేమే
చద్దికి వేఁడికి నిన్ను జలకేళికిఁ దీపి
గద్దించి అంతలో నిన్ను గాఁగిలించెగదవే ॥ అందు ॥

వోరవాకిలి పేపె వొంటి నీవు లోన నుండి
రారమ్మన్నా నెదురుగా రావు గదవే
యీ రీతి శ్రీ వేంకటేశుఁ డిట్టె నిన్ను నేఁడు గూడె
తారుకాణ రతులెల్ల తలఁపించెఁగదవే ॥ అందు ॥ 183 ॥

## సామంతం

రవ్వలైనా నాయఁగాని రాఁపైనా నైతిఁగాని
రివ్వల నీమోవితేనె రేఁచవద్దా ఇందుకు ॥ పల్లవి ॥

చివ్వన నెందుండో వచ్చి చేముట్టి తీసి నీవు
నవ్వఁగా నీతో నేను నవ్వవద్దా
దువ్వటపుఁ బయ్యెదను తుడిచేవు నీచెమట
జవ్వనమదము నీపైఁ జల్లవద్దా ఇందుకు ॥ రవ్వ ॥

వొల్లనే వద్దఁ గూచుండి వొడివట్టి రమ్మంటా
గిల్లఁగా నేనూ నందుకు గిల్లవద్దా
మొల్లలు నీ కొప్పువెల్లా ముడిచేవు నా కొప్పున
పెల్లున నాతమ్ములము పెట్టవద్దా ఇందుకు ॥ రవ్వ ॥

గక్కునను నీవు నన్నుఁ గాఁగిలించుకొనఁగానే
పుక్కువంటి నా చన్నుల నొత్తవద్దా
ఇక్కువ శ్రీ వేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
మొక్కలములెల్లా మాని మొక్కవద్దా యిందుకు ॥ రవ్వ ॥ 184 ॥

## పాళంగనాట

కడు నేరుపరినంటా గర్వించేవు
జడియక యీవలపుసంగ తెరిఁగించవే ॥ పల్లవి ॥

మాటలాడనేరుతువు మనసుకు మర్మమేదే
ఆఁటదాన విదెఱఁగనంటేఁ గొరత
యీటున నాతఁడు నీవు నిద్దరొ(రు?) వొక్కరై
కూటపు నీ భావములగుఱుతెరిఁగించవే ॥ కడు ॥

సుద్దులన్ని నేరుతువు చూపులకు సూటేదే
కొద్దిమీరి ఇదెఱఁగకుంటే గొరత
చద్దిపండో వేఁడిపండో సరుస మీమోవులు
తిద్దుకొని నన్ను సమ్మతించఁ జేయవే ॥ కడు ॥

ముదురు జాణవు నీవు మోహానకుఁ జోటేదే
ఇది యెఱఁగకవుంటే ఇంతాఁ గొరత
కదిసి కూడె శ్రీ వేంకటేశుఁడు నిన్ను నన్ను
విదియ చందురులకు వేళ చెప్పవే ॥ కడు ॥ 185 ॥

## ఆహిరి

గయ్యాళితనము నేర ఘనుఁడవు నీ విన్నిటా
నెయ్యములు చూపి మాపై నేరుపులు చల్లుమీ ॥ పల్లవి ॥

ముసి ముసి నవ్వులతో ముందర నిలుచుందాన
యెసగి యేమానాఁ జేయు మిప్పుడు నీవు
వసముగాక నీతో వాదులడువఁగ లేదు
పస ఇంతే కలది నాపడఁతి తనమున ॥ గయ్యా ॥

చిఱుజెమటలతోడ చేయివట్టుకున్నదాన
యెఱఁగి పాలిచ్చుకొమ్ము ఇప్పుడు నీవు
మఱఁగులదానఁ గాను మాట ఇంతేసాడనోప
గుఱి ఇదె కలది నాగుణములోపలను ॥ గయ్యా ॥

తూలని ఆసలతోడ తొడమీఁద నున్నదాన
యీలీలఁ గలసితివి ఇప్పుడు నీవు
ఆలరితనము నేర అన్నిటా శ్రీ వేంకటేశ
వేళ యిదె నీకు నాకు విన్నవించుకొనను ॥ గయ్యా ॥ 186 ॥

రేకు 1732 ఆహిరి

పరి నెఱఁగించవయ్యా జాడతో నడచేఁగాని
కరుణానిధివి నీకుఁ గన్నుల మొక్కేను ॥ పల్లవి ॥

తెగరాని చుట్టాలకు దీమస మెంతైనాఁ గద్దు
నగవుల చుట్టాలకు నాలే కలది
పగతోడి చుట్టాలకు పట్టినదెల్లాఁ బంతము
సొగిసి ఇందులో నీవే చుట్టమవు నాకు ॥ సరి ॥

ఆసపడ్డవారికి నడ్డాఁకలే లేవు
వాసులు దలఁచుకొంటే వట్టినేరాలే
వేసరేటివారికి వింతలే లోకములెల్లా
యీసరి నెన్నుకొంటేను యెవ్వరు నీవు నాకు ॥ సరి ॥

కూడివట్టి నీకు నాకు గుణములే మీఁద మీఁద
వాడు దేరేవారికి వలవంతలే
యీడనే శ్రీ వేంకటేశ యెనసితి విటు నన్ను
పాడితో నున్నవారికి భాగభోగ్యాలే ॥ సరి ॥ 187 ॥

## కాంబోది

ఉన్నదాన నేనూ వొకరీతి నిప్పుడు
తన్నుఁదానే అయ్యీఁగాని తమకించకురే ॥ పల్లవి ॥

చనవులేని దాని చల మేఁటిచలమే
పెనఁగఁబోతేఁ గడుఁ బిరితీసును
నను వేల పొగడేవే నావిభుని ముందరను
వెనక నన్నీఁ జెప్పే వేగిరించకురే ॥ ఉన్న ॥

సరసమాడనిదాని సలి గేఁటి సలిగే
వొరయఁ బోతే నది వొల్లఁ బెట్టవును
సరవులేలడిగేరే సారె సారె నన్నిపుడు
తెరదీసే నిటమీఁద తీదీపులు మానరే ॥ ఉన్న ॥

చెల్లుబడిలేని దాని చెలి మేఁటిచెలిమే
మల్లాడఁబోతేను మట్టు మీరును
యిల్లిదె శ్రీ వేంకటేశు నిట్టె కూడించితివి
వెల్లవిరు లిఁకఁ జేసే వేడుకతో నుండరే ॥ ఉన్న ॥ 188 ॥

## హిందోళం

దానికేమి దోసమా తాను నేను నొకటయితే
మోనాననుండి చూచితే మొద లేరుపడదు ॥ పల్లవి ॥

చలములేనివలపు పాదించవసమా
అలయిక బెట్టనుచు నందురుగాక
తెలిసినవారికే దిష్టమై వుండఁగాను
కొలఁది వెట్టఁగఁ బోతే గురిగా దొకటియు ॥ దాని ॥

ననుపుగాని పొందు నవ్వించవసమా
అనఁగి పెనఁగుమని యందురు గాక
విన నేర్చినవారే పనిగొన నేర్తురు
కినిసి మొక్కఁగఁబోతే కిందుపడు బనులు ॥ దాని ॥

గక్కనఁ గూడినమీఁద కాతరించవసమా
అక్కరదీర[1]వలెనవెందురు గాక
యిక్కువ శ్రీ వేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
తక్కినవి దడవితే తడఁబడీ మనసు ॥ దాని ॥ 189 ॥

## ఆహిరి

ఎందాఁకా నెడమాట లేఁటికి తలవంపులు
ముందర నుండితేఁ జాలు ముచ్చటెల్లఁ బాసును ॥ పల్లవి ॥

నెఱజాణ రమణుఁడ నీకేమి బుద్ది లేదా
మఱి పొరిగింతికైనా మానములేదా
మఱగేల మీలోన మాటలాడే అందుకుఁగా
తెఱవల నడిగితే తేటతెల్లమౌను ॥ ఎందాఁ ॥

అంగజగురుఁడ నీవైనా మరచితివా
అంగనైనా దలఁచుక ఆడవద్దా
వుంగిటెల్ల నీలోన వొందివవే అందుకుఁగా
ముంగిట నుండితేఁ జాలు మోహమెల్లా రేఁగును ॥ ఎందాఁ ॥

1 వలె + అని + అందురు.

శ్రీ వేంకటేశ నీకైన చిత్తము నేఁడు వచ్చెనా
 వావిరి నేఁ డాపెకైన వరుసాయునా
యీవల గూడితిరి మీరిద్దరును నొక్కమాఁటే
 భావించుకొనుఁడు మీపంతమెల్ల దక్కెను ॥ ఎందాఁ ॥ 190 ॥

## లలిత

నలుగడఁ దనయెమ్మె నాముందరనే యేల
 సొలసి కొలిమిఁగూఁట సూదులమ్మవలెనా ॥ పల్లవి ॥

పంతమాడనోపఁగాని బలిమెంతయినా గలదు
 చెంతఁ దా నాతోనేల చెనకీనే
వంతులకు రాఁగా నీవలపెల్లా నాసొమ్మే
 వింతవారి వద్దఁ దనవిద్య చూపుమనవే ॥ నలు ॥

ఆనవెట్టఁ జాలఁగాని అన్నిటాను నిజమరినే
 పానిపట్టి నన్ను నేల పచారించీనే
నానఁబెట్టఁగాని నా నవ్వులే పెలవులెల్ల
 తానెందైనా సతులతో తమకించుమనవే ॥ నలు ॥

మత్సరించి పెంచఁగాని మంకులెల్లా నా సొమ్మే
 ఇచ్చగించి నాతోనేల ఇయ్యకొనీనే
అచ్చపు శ్రీ వేంకటేశుఁడన్నిటాను నన్నుఁ గూడె
 విచ్చి చెప్పి ఇందరికి వినిపించుమనవే ॥ నలు ॥ 191 ॥

## బౌళి

ఆ మీఁది పనులు నన్నడుగనేల
 చేముట్టి మీకు బుద్ది చెప్పితి నంతే ॥ పల్లవి ॥

కాదనేదానఁగాను కైకొలిపేదానఁగాను
గీద పోరి యేల సాకిరి గోరేవు
వాదదువకుఁ డనుచు వద్దనుండి నీవు నీవు
తోదోపు లాడఁగాను దొబ్బితి నింతే ॥ ఆమీఁ ॥

ఒట్టయి మీతగవు దిద్ద ఱాతిగుండెదానఁగాను
వట్టియానలేల నాకుఁ బెట్టేరు మీరు
చెట్టవట్టి మీరిద్దరు సేసేఁమీలోని-
చిట్టకాలు పాదమునఁ జిమ్మితి నింతే ॥ ఆమీఁ ॥

లోచి వెలిదానను లోనయినదానను
యీచాయ నన్నుఁగూడి యీ యింతిఁ గూడేవు
చే చేతఁ బెనఁగఁగ శ్రీ వేంకటేశుఁడ మిమ్ము
చూచి చూచి మీనేరుపు సోదించితి నింతే ॥ ఆమీఁ ॥ 192 ॥

రేకు 1733 దేశాక్షి

ఇన్ని విన్నపములును ఇందులోనె వున్నవి
అన్నిటాను చెలియ పుణ్యము నీచే నున్నది ॥ పల్లవి ॥

వలవ నేర్చినవారు వాదులాడనేరరు
పలుక నేర్చినవారు పగ నేరరు
వలవేసి పతిమీఁద వట్టి దూరులు గట్టకు
నిలువుఁ బతిమవలె నీముందర నున్నది ॥ ఇన్ని ॥

తగవు గలుగువారు దంటమాట లాడరు
మొగమోట గలవారు మొరఁగలేరు
బిగిసి కామినిమీఁద పెనఁగఁగఁ బనిలేదు
నిగిడి చిలుకవలె నీచేతిలో నున్నది ॥ ఇన్ని ॥

కూటమిగలుగువారు కొరతలే యెంచరు
మాట పట్టు గలవారు మచ్చరించరు
యీటున శ్రీ వేంకటేశ యీపె నీవుఁ గూడఁగాను
గాఁటపుఁ బెన్నిధివలె కాఁగిటలో నున్నది ॥ ఇన్ని ॥ 193 ॥

## మాళవిగౌళ

వద్దు వెలవకు తోడు వచ్చేఁగాని నీకు
యిద్దరిలో నాకుఁగా నీ వింతసేసేవా ॥ పల్లవి ॥

కొనగోరు దాఁకించితే కోపగించుకొనేవు
చనవు సేసుక నిన్ను జరసితిని
వెనక నొక్కితె నిన్ను వెంగె మాడీనంటాను
తనువు రేకలకే తల్లడించేవు ॥ వద్దు ॥

గందము నేఁ బూసితేను కదు నలఁచివేసేవు
పొందులు సేసుక నిన్నుఁ బొదిగితిని
నిందవేసి యవ్వతైనా నిన్నుఁ దిట్టీనంటాను
విందుల సింగారాలకే వెరచి లోఁగేవు ॥ వద్దు ॥

తగిలి నేఁ గూడితేను తమకించితి విప్పుడు
మొగచాటుకాకుండా మోవి ఇచ్చితి
నగితి శ్రీ వేంకటేశ నమ్మించితివి యింతిని
దగదొట్టి పయిపైనే తలవంచేవు ॥ వద్దు ॥ 194 ॥

## పాడి

ఏమే విచారించే [1]వెంతవని గద్దు నీకు
నాములువార నవ్వేటిననుపు కత్తెలము ॥ పల్లవి ॥

అగ్గమై కంబము మాటునందు గొలువుసేయఁగ
వెగ్గళించి యెవ్వరంటా విచారించేవు
నిగ్గుల నీవెఱఁగవా నీతో సరసమాడి
సిగ్గులు విడిపించేటి చెలిమికత్తెలము ॥ ఏమే ॥

వెనకదిక్కునఁనుండి వింజామర వేయఁగాను
మొనపి యదరిపాటు మోము చూచేవు
ననుపు మఱచితివా నయగారాల నీచేత
పనులు సేఇంచుకొన్న పంతగత్తెలము ॥ ఏమే ॥

కడనుండి వచ్చి నిన్నుఁ గాఁగిట నేఁ గూడఁగాను
వెడమోవి లంచమిచ్చి వేఁడుకొనేవు
తడవి శ్రీ వేంకటేశ తగవు నీవెఱఁగవా
అడరి నీవు మన్నించే యాసోదకత్తెలము ॥ ఏమే ॥ 195 ॥

## భైరవి

ఇంకనైనా నుపకార మెఱుఁగుకొమ్మీ
తెంకి నాగుణాలిట్టే తెలుసుకొమ్మీ ॥ పల్లవి ॥

తప్పులు వట్టింతునా తరుణులచేతనెల్ల
చిప్పిల నందుకేమీఁ జిన్నఁబోకుమీ
కప్పింతునా నీమేని ఘాతలు కస్తూరివూసి
చప్పఁగాక ఇందుకైనా సంతోసించుమీ ॥ ఇంక ॥

---

[1] వెంత + పవి.

కొంగులు వట్టింతునా గురుతైనవారిచేత
అంగవించి సిగ్గువడి అలయకుమీ
ముంగిట నాడింతునా ముందే నిజమరివని
చెంగట నాపంతములు చిత్తగించుమీ ॥ ఇంక ॥

నవ్వులు నవ్వింతునా నావంటివారిచేత
జవ్వనమదముచేత జడియకుమీ
ఇవ్వల శ్రీ వేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
నివ్వటిల్లు నా మోహము నీ వెఱుఁగుమీ ॥ ఇంక ॥ 196 ॥

## ముఖారి

ఇందాఁకా నాపని యిటమీఁద నీపని
చెంది నిన్ను నిఁక రట్టుసేయఁ జుమ్మీ యిపుడు ॥ పల్లవి ॥

చిత్తము వచ్చినదాఁకాఁ జేసితిని వూడిగము
పొత్తుకు వచ్చినదాఁకాఁ బొదిగితిని
కొత్తరతులను నన్నుఁ గొసరేవప్పటి నీవు
వొత్తి నిన్ను నలయించనోపఁ జుమ్మీ ఇపుడు ॥ ఇందాఁ ॥

మొగము చూచినదాఁకా ముందు ముందే మాటాడి
తగిలినదాఁకా నీతోఁ దమకించితి
బిగువుఁగాఁగిట నాతోఁ బెనఁగే విందుకుఁ బతి
వొగరుగాఁజన్నులను వొత్తుఁ(త్తఁ?)జుమ్మీ ఇపుడు ॥ ఇందాఁ ॥

యేకతమైనదాఁకా యియ్యకొంటిఁ బనులెల్ల
కైకొని కలయుదాఁకాఁ గదిమితిని
మేకుల శ్రీ వేంకటేశ మెచ్చి నన్నుఁ గూడితివి
ఆకడి వెంగేలు నిన్ను ఆడఁ జుమ్మీ ఇపుడు ॥ ఇందాఁ ॥ 197 ॥

బౌళి

పంతములిచ్చిన మీఁదా బలిమేల
   పంతకూటముల పొందు చవిచెప్పఁ జూతురా ॥ పల్లవి ॥

చిగురాయఁ జిత్తము శిరసుకు[1] (కొ?)మ్ముడి జారె
   మగుడి మాతో నవ్వులు మానరాదా
   యెగసక్కె లింతేసి యెవ్వతె నేరిపె నీకు
   వొగరైతే వలపులు వొడిఁ బెట్టుకొందురా ॥ పంత ॥

గొప్పలాయఁ జన్నులు కొనగోరు గురులాయ
   దప్పిదేర మమ్ము దయదలఁచరాదా
   ఇప్పటినీవోజలు యెన్నాళ్లు చదివితివి
   పిప్పి గట్టితే వయసు పిండి వేతురా ॥ పంత ॥

తేనె గారెఁ గెమ్మోవి తేటలాయఁ గనుచూపు
   మోనాన నీపాద మిట్టె మోపరాదా
   యీనయాన శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
   నానితేనే రతులను నలి నలి సేతురా ॥ పంత ॥ 198 ॥

రేకు 1734 సౌరాష్ట్రం

ఆయనాయఁ జాలుఁ జాలు అంత మాకేల
   పాయక పవతులకు పంతములు రేఁగవా ॥ పల్లవి ॥

ననిచిన చెలి నీతో నవ్వులు నవ్వెనంటా
   పనివడి మమ్ము నవ్వఁ బాలుపెట్టేవు
   వెనుకొని నీకునంత వేడుకైతే నాయఁగాక
   గువిసే పవతులకు కోపములు రేఁగవా ॥ ఆయ ॥

---

1 కుఱు + ముడి = 'కుమ్ముడి' కావచ్చు.

చెలియ నీమాటలకు శిరసు వూఁచీనంటా
వొలిసి మమ్మును శిరసూఁచుమనేవు
వలసిన నీకు నివి వైపైతే నాయఁగాక
పెలుచు సవతులకు బిగువులు వట్టవా ॥ ఆయ ॥

అంగన నీవోజలకు నట్టె చొక్కీనంటా
సుంగుల మమ్మూ నట్టె చొక్కుమనేవు
ముంగిట శ్రీ వేంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
వెంగలి సవతులకు విరహాలు నిండవా ॥ ఆయ ॥ 199 ॥

## పాళంగం

నేనూ [1]నాపెఁ గలిగిన నెరజాణవు
కానుకగా మీఁదపెత్తు కనుకొనవయ్యా ॥ పల్లవి ॥

సగము ముసుఁగువెట్టి సతి నిన్నుఁ దొంగి చూచి
నగి నగి యేమో సన్నలు సేసెను
చిగురుఁ బెదవి వట్టి చిక్కించుక వున్నదాన
తగవెట్టు నెరపేవు తలఁచుకోవయ్యా ॥ నేనూ ॥

దోమతెర గొంత యెత్తి దొమ్మిఁ జేతులు దూరిచి
కామిని వ్రాసిచూపి కాఁక చల్లెను
ఆమని నీరతి నేను అల్లుకొని వున్నదాన
యేమిసేసే విఁక బుద్ధి యెంచుకొనవయ్యా ॥ నేనూ ॥

చన్నులు వీఁపున నొత్తి సంగడివారి మొరఁగి
కన్నియ నిన్నిటువలెఁ గాఁగిలించెను
ఇన్నిటా శ్రీ వేంకటేశ ఇద్దరి నే నలముక
యెన్నికఁ గూడితి విఁక నెట్టు బొంకేవయ్యా ॥ నేనూ ॥ 200 ॥

---

[1] 'ఆపెన్ = ఆపెయును' అని సముచ్చయము కావచ్చు.

## శుద్ధ వసంతం

మమ్మేమి చెప్పేవు మానినులము
వుమ్మగిల నాపె నీ వొడివట్టి తీసును ॥ పల్లవి ॥

నీకు మోహించినయట్టి నెలఁతదే భాగ్యము
కాకరితనాన నీకాలు దొక్కను
రాకొట్టులు గొట్టులు సాజసము చూపి మోపి
దాకొని నీవదనానఁ దమ్ములము వెట్టును ॥ మమ్మే ॥

తక్కక నీ సేవసేసే తరుణిదే భాగ్యము
చెక్కుమీఁదఁ జేయివేసి సేదదేర్చును
చుక్కలువలె మోవిపై సూదివాట్లంటించును
గుక్కక పూవులు చెక్కుఁ గొప్పవట్టి తీసును ॥ మమ్మే ॥

వావి నీకుఁ గలసిన వనితదే భాగ్యము
బూవపు టెంగిలి పొత్తు పొసఁగించును
యీవేళ శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
ఆవలి యీవలి వారితో నాపె నిన్నుఁ దిట్టును॥ మమ్మే ॥ 201 ॥

## దేసాళం

నీవే ఆతఁడు గావా నేటిదాఁకా
వావిలి నాతనిలోని వలపు చేకొనవే ॥ పల్లవి ॥

పంతములాడఁ జూచితే పలుకులిన్ని లేవు
చింతించఁ జూచితేను చిక్కెంత లేదు
యింతటికి సెలవు నీ యింటికి వచ్చె నాతఁడు
వింతలేక మనసుతో వేడుక చెలించవే ॥ నీవే ॥

వాసులెంచఁ బోతేను వక్కణ లెన్ని లేవు
పాసితేను విరహతాప మెంత లేదు
ఆసపడి విభుఁడు నీయలుక దేరిచెనేఁడు
తాసువలె సరిదూఁగి తలఁపీడేరించవే ॥ నీవే ॥

తగవులఁ బెట్టఁబోతే తప్పులెన్నేసి లేవు
చిగిరించి నవ్వఁబోతే సిగ్గెంతలేదు
అగపడి శ్రీ వేంకటాధిపతి నిన్నుఁగూడె
మొగమోడి రతులలో ముచ్చటలు చెప్పవే ॥ నీవే ॥ 202 ॥

## ఆహిరి

యేమని విన్నవించేము యెవ్వరినిఁ గాదనేము
కోమటిసాకిరులాయ గొబ్బున మామాఁటలు ॥ పల్లవి ॥

పరసము లాడఁగానే జాముహోయఁ దెల్లవారె
తరవులు వెట్టి మాకు దగదొట్టెను
శిరసు వట్టి చెనకఁగఁ జెనకఁగ
తరుణి సిగ్గులువడి తలవంచె నదివో ॥ యేమ ॥

యెగసక్కేలాడఁ గానే యెండగాపె నీడవచ్చె
తగవులు చెప్పి మాకుఁ దడవాయను
బిగువెక్కెఁ గుచములు పిలువఁగఁ బిలువఁగ
మగువ జవ్వనమున మదమెత్తెనదివో ॥ యేమ ॥

చేతులు చాఁచఁగానే చీఁకటెల్లా వెన్నలాయ
నీతులు బోదించ మాకు నెపమాయను
యేతుల శ్రీ వేంకటేశ ఇట్టె నీవు గూడఁ గూడ
యీ తరుణి వురముపై నిరవాయ నిదివో ॥ యేమ ॥ 203 ॥

దేశి

ఆఁటదాని వేఁటిదే ఆయపుఁగాఁపురమెల్లా
నీటున నీకన్నియును నేరుపఁగవలదా ॥ పల్లవి ॥

నిన్ను దూరఁదగవా నీతోఁ బొందు సేసిన-
వన్నెల సతుల దూరవచ్చుఁగాక
మిన్నక దొరతనాన మించి మత్తుడవై యుండే
తినఁగాఁ దామెల్లా నిన్ను దిద్ది తీర్చవలదా ॥ ఆఁట ॥

అలుగ నీతోఁ దగునా అండనున్న నీ సతుల-
నలిని యేమిసేసినా నమరుఁగాక
కలసేటి జవ్వనపు గజరు నీకుఁ బట్టితే
తెలిపి నిన్నుఁ జాయకుఁదెచ్చుకొనవలదా ॥ ఆఁట ॥

కొంగవట్టి నీగుణాలు కొసరితే నమరునా
సంగడి నీ ఇంతులఁ గొసరుట గాక
ముంగిట శ్రీ వేంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
వుంగిటిగొన్న నిన్నుఁ దామొరయుఁగ వలదా ॥ ఆఁట ॥ 204 ॥

రేకు 1735 గుజ్జరి

మాతోడఁ దనకేల మచ్చరములు
పోతరించి తానేల పుల్లసిలీనే ॥ పల్లవి ॥

మలపి మమ్మేల దూరీ మగఁడైనవానిఁ దానే
వలపించవలదా వనితైతేను
వెలయు నాతఁడు నావెంటవెంటఁ దిరిగితే
కలికి తానేల యింత కాఁకరేఁగీనే ॥ మాతో ॥

సవతులఁ దానేల సాదించీ నాతనినే
యేవలఁ బోకుండా భ్రమయింపించరాదా
రవళి నాచెప్పినట్లు రమణుఁడు సేసితేను
చివుకునఁ దానేల చిమ్మిరేఁగీనే

అండనున్నవారినేల అద్దలించీ నాయకుని
బందు బందు సేసి యట్టె పట్టుకోరాదా
దండి శ్రీ వేంకటేశుఁడు తానే నన్నిటు గూడె
బెండుపడి తానేల పెచ్చురేఁగీనే ॥ మాతో ॥ 205 ॥

ముఖారి

ఎవ్వరి మాటలు నేనేల వినేను
దివ్వెలెత్త నియ్యవయ్య తేనెలు నించేను ॥ పల్లవి ॥

నవ్వులకుఁ గడమా నాకు నీవు గలిగుండి
రవ్వలుగ మీఁద మీఁద రాఁపు సేయఁగా
పువ్వువంటిదాన నేను పూఁపవంటి విభుఁడవు
బువ్వానకు రావయ్యా బుద్దిచెప్పే నేను ॥ ఎవ్వ ॥

సంతోసాలు బాఁతే సారె నీవిందరిలోనా
చింతదీర వేఁడుకొని చెక్కు నొక్కఁగా
పొంత నిదె నావలపు పొరుగే పోసీవావి
మంతనాన వినవయ్య మాట చెప్పే నేను ॥ ఎవ్వ ॥

ఆసకు లెక్కవున్నదా ఆయాలు మోవఁగ నీవు
సేసవెట్టి పెండ్లాడి చేరి కూడఁగా
వాసి నలమేల్మంగను వడి శ్రీవేంకటేశుఁడ
యీసులేక కూడితివి యెనశుండే నేను ॥ ఎవ్వ ॥ 206 ॥

## బౌళి

ఇప్పే నే నెఱఁగనా యీపాటి నేను
[1]అప్పారాన నడచేనా అన్నిటా నేను ॥ పల్లవి ॥

కేరి కేరి నీవద్ద గెలసి నవ్వుదుఁగాక
నేరములెంచేనా నీతో నేను
ఆరీతినే కొనగోర నాయము లంటుదుఁగాక
బీరము లాడేనా పెనఁగుతా నేను ॥ ఇప్పే ॥

చన్నుమొనల నరసి చవులు వుట్టింతుఁగాక
నిన్ను నానవెట్టేనా నీతో నేను
వన్నెలు చూపి మోపి వలపు చల్లుదుఁగాక
కన్నుల జంకించేనా కసరుతా నేను ॥ ఇప్పే ॥

గక్కన నిట్టె నిన్నుఁ గాఁగిటఁ గూడుదుఁగాక
నిక్కి నిక్కి చూచేనా నీతో నేను
యిక్కువ శ్రీ వేంకటేశ యిరవైతి విటు నాకు
తక్కుల నలయించేనా దక్కఁగొంటి నేను ॥ ఇప్పే ॥ 207 ॥

## రామక్రియ

ఏకతాన నీ వుండు టెవ్వఁ డెఱుఁగు
ఆకడ నీవే వచ్చేవని యంటా నుంటిని ॥ పల్లవి ॥

తెర వేసివుండఁగాను తిరిగివచ్చితి నేను
యిరవైన నీగుట్టు లెవ్వఁడెఱుఁగు

---

[1] 'విప్పార' పాఠ్యశ్యముతో వాడిన 'అప్పార (అపార)' ఇది, యతిప్రాసలతో ముడివడి యుండుటచే దుశ్చికిత్స్యము.

బెరపి నీకు నింతులు పెక్కు గలరు గనక
అరసి నీకు వేళగాదనియంటా నుంటిని ॥ ఏక ॥

పానుపుపై నీవుండఁగా పలుకకుండితి నేను
యీనెపాన నీ మన సెవ్వఁడెఱుఁగు
వీనుల నీ సుద్దులెల్లా వింటానుంటిమి గనక
పూని యింతులతో రతిఁబొందేవని వుంటిని ॥ ఏక ॥

చేతులు నీవు చాఁచఁగ సిగ్గుతోఁ దలవంచితి
యేతుల నీవలపులు యెవ్వఁడెఱుఁగు
యీతల శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
రాతిరి వచ్చేవంటా రాజసాన నుంటిని ॥ ఏక ॥ 208 ॥

## పాడి

వింటేఁ గోపమురేఁగీ విన్నవారికి
దంటవౌదు వన్నిటాను తడవకు మిఁకను ॥ పల్లవి ॥

మొగమోటలోనున్నది మోహము
నగినందులో నున్నది నను పెల్లాను
చిగురుబాపలు నాకుఁ జేయనేఁటికి నీకే
తగునా సుద్దులు మరి తడవకు మిఁకను ॥ వింటేఁ ॥

దట్టపుఁ జూపులలో నుంది తగులెల్లాను
గుట్టులోపల నున్నది గుణమెల్లాను
అట్టె మాతోనేల ఆనలు
దట్టమాయ నీవేసాలు తడవకు మిఁకను ॥ వింటేఁ ॥

కూడినందులో నున్నది కోరికె మాట
జాడలలోనే వున్నది చనవెల్లాను

యీడనె నన్ను శ్రీవేంకటేశ కూడితి
తాడుమీఁది తపసులు తడవకుమీఁకను ॥ వింటేఁ ॥ 209 ॥

## శుద్ధవసంతం

మాతో నేల లేదనేవు మాటిమాటికి
చేత దిష్టవై వుండఁగా చిత్తమునఁ బెట్టవు ॥ పల్లవి ॥

చన్నుల నొరసె నాపె సారె గొప్ప దువ్వేనంటా
సన్న సేసి మాటలాడె [1]సంగడి నంటా
యెన్నికతో నీకాపె యిఁక నేమి సేయవలె
చెన్నుమీర నింకా నీవు చిత్తమునఁ బెట్టవు ॥ మాతో ॥

కదిసి కూచుండేనంటా కాలు దొక్కె నంతలోనె
వదినెనంటా నీతో వావి చెప్పెను
యెదుట నీకు దనివి యెంతట గాని నిండదు
చెదరదీవలపింకా చిత్తమునఁ బెట్టవు ॥ మాతో ॥

ఆకు మడిచిచ్చే నంటా ఆయములెల్లా ముట్టి
చేకొనే వూడిగాలంటాఁజేరికూడెను
యీకడ శ్రీవేంకటేశ యీడా నన్నుఁ గూడితివి
చీకాకు లాపెరతి చిత్తానఁ బెట్టవు ॥ మాతో ॥ 210 ॥

రేకు 1736 బౌళి

ఆనతీవయ్య నాతోను అల్లదివో చెలియ
పూని నీ మన్నన లెట్టు పాపఁగించేవయ్యా ॥ పల్లవి ॥

---

[1] 'సంగడికత్తె' అనునర్థమున ప్రయోగించినట్లున్నది.

దప్పిదేరే మోముతోడ తరుణి నిన్నుఁ బిలిచీ
అప్పుడాడిన మాట కేమంటివయ్యా
చిప్పిలుఁ జెమటతోడ చేసన్నసేసి నందుకు
ఇప్పుడు నీచిత్తములో నెట్టున్నదయ్యా ॥ ఆన ॥

సిగ్గుతోడఁ దలవంచీ చెలులచేతనంపిన--
అగ్గవుఁగానుక లేమ నందితివయ్యా
వెగ్గళించి ఆపె విన్ను వేసినపూల చెండు
దగ్గరి నీకళ యేడ దాఁకెనయ్యా ॥ ఆన ॥

కొంగువట్టి తీసి తానే కూరిమి గొసరితేను
వుంగిటి నీమొగ మెట్టోడివయ్యా
ఇంగితాన శ్రీ వేంకటేశ కూడితి రిద్దరు
పొంగేటి వలపు లెందు వోసేవయ్యా ॥ ఆన ॥ 211 ॥

## మంగళకౌసిక

అందుకేమి నీతో నే మాడుకోము
చందముగాఁ బెనఁగితే సమ్మతించఁజేతుము ॥ పల్లవి ॥

పంతమెల్ల నీదేరె నీ పడఁతికి
కాంతుఁడవు నీ కరుణ గలుగఁగాను
వంతులేల పెట్టేవు మావారి సంది । నీ--
వింత మన్నించితే నే మెంతకైనా గలము ॥ అందు ॥

చలమెల్లఁ జెల్లెను యీసతికి నేఁడు
బలువుఁడ విట్టె చేపట్టఁగాను

పిలువకు మిద్దరిని [1]పేరువేర
వలచితే వలపులు వడ్డికిఁ బారింతుము ॥ అందు ॥

దొరతనమెల్ల వచ్చె దొయ్యలికి
పరుసఁ బెట్టుక నీవు చనవియ్యఁగా
యిరవై శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
నిరతి నీవుండితేను నిన్నే మెప్పింతుము ॥ అందు ॥ 212 ॥

గౌళ

నీగుణమే ఆతని నిలువెల్లాను
చేగదేరెఁ బనులెల్లా చిత్తగించు మీఁకను ॥ పల్లవి ॥

కాటుకకన్నులతోడికలికి నీ చూపులు
నాటఁగా నాతనిమేను నల్లనాయను
తేటలనీ యధరపుతేనె లిచ్చినయందుకు
యీటులేకాతనిమోవి యెఱ్ఱనాయను ॥ నీగు ॥

చేరి నీవు నవ్వఁగాను చెమట ముత్తేలు రేఁగి
తేరి యాతనిభావము తెల్లనాయను
వూరట నీమేని పస పారయఁగా నాతని
గారవపుఁబచ్చడము కడుఁ బసిమాయను ॥ నీగు ॥

కోకొమ్మని నీవు నీకొప్పుదవన మాతని--
కాకడ ముదువఁగా నంటి పచ్చాయ
యీకడ వేంకటేశు కీమంజిష్టి నీ పయ్యెద
పైకొని కప్పి కూడఁగా పంచవన్నె నాయను ॥ నీగు ॥ 213 ॥

---

1 పేరు + పేర

## వరాళి

చెలి జాణగాకుండితే చేతుల బట్టఁగరాదు
యెలమి నీనానుడి యెఱఁగరా తాము ॥ పల్లవి ॥

జట్టిగాని నీవు నాకు చనవియ్యఁగాఁ జూమీ
కట్టఁగడవారికెల్ల కాఁకరేఁగెను
వొట్టి వొకరినోములు వొకరికి వచ్చునా
దట్టమైనతమవెట్టితన మింతేకాక ॥ చెలి ॥

వుప్పటించి యింతలోనే వూరఁగలవారెల్ల
కప్పురమిచ్చితివంటా కాఁతాళించేరు
చిప్పిలి విత్తొకటియుఁ జెట్టొకటీ నౌనా
తప్పులెంచే తమ యెడ్డతన మింతే కాక ॥ చెలి ॥

శ్రీవేంకటేశ నీవు చేరి నన్నుఁ గూడితేను
యీవల సవతులెల్లా యిచ్చలాడేవు
చేవదేర రాజు వలచినదే దేవులు గాదా
తావులను తమమంకుదన మింతేకాక ॥ చెలి ॥ 214 ॥

## హిందోళం

నేనేమీ నెఱఁగఁజుమ్మీ మీచేఁతలు
పూనిపట్టి నీవేమి బుద్దిదలఁచితివో ॥ పల్లవి ॥

పంతములాడక నిన్ను బళియని మెచ్చితే
చింతతోడఁ దలవంచి సిగ్గువడేవు
వంతుకెక్కిన[1]వెంగె మామరేమైనా నంటినా
కొంత గొంత నీవేఁటికిఁ గొంకేవోకాక ॥ నేనే ॥

[1] వెంగెము + ఆ + మరి + ఏమైనా; ఆమరి = ఆ తరువాత కావచ్చు.

వాసులెల్లా నెంచక నీ వద్దికి నే వచ్చితేను
  వోసరించి మొకమోడి వొద్దుకొనేవు
  నీ సుద్దులు దడవేనా నిన్ను నే సోదించేనా
  వీసమంత పనికేల విచారించుకొనేవో ॥ వేనే ॥

కన్నుల జంకించక కాఁగిట నే నించితేనే
  [1]వెన్నెకాఁడవై కడు వెరగందేవు
  యిన్నిటా శ్రీవేంకటేశ యెరవు నీకుఁ జేసేనా
  మన్ననలు నీవెంత మాకియ్య నున్నాఁడవో ॥ నేనే ॥ 215 ॥

నాదరామక్రియ

బట్టబయలాయ నేఁడు పనులెల్లాను
  గుట్టుతోడితమకము కోరి యెందాఁకానే ॥ పల్లవి ॥

సేసపాల వలపులు వెంపలవెంటఁ గారి
  లేసులాయఁ జెమటలు లేదనేవేమే
  వాసికెక్కి కోరికలు వడ్డివారీఁ బతిమీఁద
  మూసి మంతనాలు నాముందర నీకేఁటికే ॥ బట్ట ॥

సిగ్గుతోడి చెలుములు పీరవెంటఁ గారీని
  కగ్గదేరి మోముకళ కాదనేవేమే
  బెగ్గోలు మొగమోట పేరడాయ నాతనికి
  ముగ్గువంటి నవ్వులు నాముందర నీకేఁటికే ॥ బట్ట ॥

జవ్వనపు వేడుకలు వన్నులవెంటఁగారీ
  నివ్వటిల్లీఁ గూటములు నివ్వెరగేలే
  చివ్వన మనకూటాలు శ్రీ వేంకటేశ్వరు కబ్బె
  మువ్వంక పంతాలు నామందర నీకేఁటికే ॥ బట్ట ॥ 216 ॥

---

1 'వన్నె'కు 'వెన్నె' వ్యావహారికము కావచ్చు.

రేకు 1737 శుద్ధవసంతం

ఏడకేడ నీ బలువు యెంతవాఁడవు
యీడనె అన్నియుఁ గంటి మెంతవాఁడవు ॥ పల్లవి ॥

కొమ్మ నీకుఁగలిగిన గుణము లడిగితేను
యెమ్మెలెల్లా నాడుకొంటి వెంతవాఁడవు
తమ్మిరేరు(కుఁ?) గన్నులను తరుణి నిన్నుఁ జూచితే
ఇమ్ములను విఱ్ఱవీఁగే వెంతవాఁడవు ॥ ఏడ ॥

అందముగా మేలు మేలని నిన్నుఁ బొగడితే
ఇందరిలో విఱ్ఱవీఁగే వెంతవాఁడవు
పందెగాఁడ వౌదువంటే పంతములు నెరపేవు
యెందుకని నిన్ను మెచ్చే వెంతవాఁడవు ॥ ఏడ ॥

పచ్చిదేరే నిన్నుఁ జూచి పాదాలకు మొక్కితేను
ఇచ్చగించి ఇయ్యకొనే వెంతవాఁడవు
మెచ్చుల శ్రీ వేంకటేశ మించి నన్నుఁ గూడితివి
యెచ్చుకుందులెల్లాఁదేరె నెంతవాఁడవు ॥ ఏడ ॥ 217 ॥

కాంబోది

ఓరిచేను నీసుద్దులు వొడఁబడ్డదాఁకాను
జీరవారెఁ జెక్కుమీఁదఁ జేయువయ్య్య చేఁతలు ॥ పలవి ॥

తప్పక చూచినందుకే తగవులఁ బెట్టేవు
ఇప్పుడు గొంగు వట్టితే నేమిసేతువో
కుప్పలై యిరుగు పొరుగులవారు చూచి చూచి
చెప్పేరు నీకు బుద్ది సేయువయ్య్య చేఁతలు ॥ ఓరి ॥

మాటలాడినందుకే మంకుఁదనాలు రేఁగేవు
యీటున వెంగెమాడితే యేమిసేతువో
జూటరిచెలులు నీ చుట్టాలయ్యే నవ్వేరు
చీటికి మాటికి నీవు సేయువయ్యా చేఁతలు ॥ ఓరి ॥

చేయి చాఁచినందుకే సిగ్గులతోఁ బెనఁగేవు
యీయెడఁ గాఁగిలించితే నేమి సేతువో
పాయక శ్రీవేంకటేశ పైకొని కూడితి నన్ను
చేయిమీఁదాయఁ బనులు సేయువయ్యా చేఁతలు॥ ఓరి ॥ 218 ॥

## లలిత

ఇంతకుమిక్కిలిసుద్దు లెరఁగము నేమైతే
బంతుల నున్నవి నీపైఁ బాయపుఁగోరికలు ॥ పల్లవి ॥

మెలుఁత చూపులనే మీల నెదురెక్కించే--
వలవేసితివి నీవు వలపులను
పెలవుల నవ్వులనే చెలమలు దవ్వె నాపె
యెలఇంపు మాటల నీ వీఁదులాడితివి ॥ ఇంత ॥

సతి చన్నుమొనలనే జక్కవపిట్టల రేఁచే--
తతి నురు లొడ్డితివి తమకముల
కతకారి మాటలనే కణఁజాలు గట్టెనాపె
రతిరాజు బండారాలు రతుల నించితివి ॥ ఇంత ॥

యింతి దననడపుల యేనుగల దీకొలిపె
దొంతి కూటాల వయ్యాళి దోలితివి
యింతలో శ్రీవేంకటేశ యిద్దరముఁ గూడితిమి
వింత చుట్టరికముల వియ్యా లందితివి ॥ ఇంత ॥ 219 ॥

## పాళంగం

ఎంత పాప జాతినో యెఱఁగనైతి
చింతదీర నిన్నిటికి చేరి మొక్కేఁ జమ్మీ ‖ పల్లవి ‖

మొక్కలాన నీవద్ద ముసుఁగు వెట్టుకవుండి
పక్కనఁ బిలిచినాను పలుకనైతి
చెక్కునొక్కి నీవు నన్ను సేదలు దేర్చినాను
తెక్కులతో నేడలేని తిట్టులు దిట్టితిని ‖ ఎంత ‖

శిరసువట్టుక నీవు చేతులు చాఁచినాను
కురులంటకుమనుచు కోపగించితి
పరసమాడుచు నాతో చల్లఁగా నీవు నవ్వినా
అరగన్నుల జంకించి యానలు వెట్టితిని ‖ ఎంత ‖

వొడివట్టి తీసి నీవు వొడఁబరచినా నేను
విడుమని కాతరాన వేసారుకొంటి
అడరి శ్రీ వేంకటేశ అట్టె నన్నుఁగూడితివి
తొడిఁబడ నిన్ను రతి దొమ్మి సేసితిని ‖ ఎంత ‖ 220 ‖

## పాళంగనాట

మీటితే వారికెదురా మీఁదుఁగిందు నెంచికొక
ఆఱడయ్యీఁ జమ్మీ తాను [1]ఆడనేలున్నాఁడే ‖ పల్లవి ‖

తానేమి సేసీనే లోన, తరుణులు వాకిటను
కానుకలు దెచ్చుకొని కాచుకుండఁగా
లోనికేవత్తురు వారు లోకులు మెచ్చవలసి
మానవతులు గనక మట్టున నున్నారు ‖ మీటి ‖

---

[1] ఆడన్ + ఏల + ఉన్నాఁడే

చప్పుడేమి సేసీనే సతులెల్ల దనచేఁత
కప్పురపు వోళ్ల నాడఁ గాచుకుండఁగా
వుప్పతించనేరరా వూరెల్ల మెచ్చవలసి
ముప్పిరి విల్లాండ్లుగాన మోమోట నున్నారు ॥ మిూఁటి ॥

నన్నేలొడఁబరచీనే నాతులెల్లా గుంపుగట్టి
కన్నెపాయా లొప్పగించఁ గాచుకుండఁగా
నన్నుఁగూడె శ్రీవేంకటనాయకుఁడు నే మెచ్చఁగా
చన్నల తామునుఁ గూడి సమ్మతించున్నారు ॥ మిూఁటి ॥ 221 ॥

## పాడి

ఎఱఁగవు నామనసు యెట్టిదౌతా నింకాను
తెలియ నింతే నీతో దీకొనేనా ॥ పల్లవి ॥

వేసాలో నిజమో వేఁడుకొనే విటు నన్ను
ఆసపడేదాన నీతో నలిగేనా
పాసివున్నవాఁడవై పలుమారుఁబొదిగేవు
వీసమంత పనికిఁగా విసిగేనా ॥ ఎఱఁ ॥

చలమో బత్తిగలిగో చాఁచేవు నాపయిఁజేయి
వలచినదాన నేను వద్దనేనా
యెలయించినవాఁడవై యిచ్చకాలు సేసేవు
వెలుచుఁ బనికిఁగాను విగిసేనా ॥ ఎఱఁ ॥

నగవులో తగవులో నన్ను నిట్టె కూడితివి
మొగమోటదాన నేను మొఱఁగేనా
పొగరు శ్రీవేంకటేశ బొంకి యాన వెట్టేవు
తగిన పనికిఁగాను తమకించేనా ॥ ఎఱఁ ॥ 222 ॥

1738 పాళంగనాట

నేరుపులు పచరించ నే నీతోనా
ఆరితేరిన పనుల కమ్మరో నీతోనా ॥ పల్లవి ॥

దిట్టవై మాటలాడేవు తెలుపుమంటా వచ్చేవు
నెట్టన జగడాలకు నే నీతోనా
పట్టిన చలముతో యీ పనులకే తిరిగేవు
మట్టుమీరి మాటలాడ మరి నీతోనా ॥ నేరు ॥

పన్ని విందు లడిగేవు పంతములాడ వచ్చేవు
నిన్ను రమ్మని పిలువ నే నీతోనా
ఇన్నేసి నేరకుండితే యింతవాఁడవేలయ్యేవు
పన్నుల నే నవ్వు నవ్వ సరి నీతోనా ॥ నేరు ॥

బద్దులకుఁ బవళించి పాదాలు గుద్దుమనేవు
నిద్దుర వట్టించ నేఁడు నే నీతోనా
గద్దరి శ్రీవేంకటేశ కాఁగిటఁ గూడితి నన్ను
కొద్దిమీరి రతుల దీకొన నీతోనా ॥ నేరు ॥ 223 ॥

సింధురామక్రియ

వేగిర మేఁటికి నాకు వేయైనాను
చేగదేర నీవే దయసేసేవు గాక ॥ పల్లవి ॥

పంతాలు నీతో నేను పచారించే దాననా
పొంతపుఁ జూపులఁ జూచి గుడిసేఁ గాక
వంతులు నే నాడేనా వలపులు చల్లఁగాను
వెంతల నీవే దయసేసేవు గాక ॥ వేగి ॥

చెనకితే నీకు మారు చేయి చాఁచేదానవా
కొనగోరి తాఁకులను కొసరేఁగాక
పెనఁగేనా నీతోను ప్రేమములు నీమీఁద
చినుకఁగా నీవే దయసేసేవు గాక ॥ వేగి ॥

మిక్కిలి నీ రతులను మీరేటి దానవా
వొక్కటై ముయికిముయి వొప్పించే గాక
వెక్కసాలాడేనా శ్రీవేంకటేశ నిన్నుఁ గూడి
చెక్కు నొక్కఁగాను దయసేసేవు గాక ॥ వేగి ॥ 224

## పూర్వగౌళ

పటకాఁడు మిక్కిలిని పరసుఁ డీతఁ డిన్నిటా
తటుకన వలపించి దక్కించుకొనవే ॥ పల్లవి ॥

పిగ్గులు వడకువే చెఱగువట్టీ నతఁడు
అగ్గలపువట్టి జాగు ఆదియూఁ గొంత
వొగ్గి యాతని మెల్లనే వొత్తుక వచ్చితి మిందు
వెగ్గళించి నీ యిల్లిఁక వెళ్లఁగ నియ్యకువే ॥ పట

నవ్వులు నవ్వకువే ననుపు సేసీ నతఁడు
అవ్వల నీ తరితీపు ఆదియూఁ గొంత
యెవ్వరు నెఱఁగకుండా నెలయించి తెచ్చితిమి
పవ్వళించే యింటిలోన బావ సేయించుకోవే ॥ పట

తలవంచుకోకువే దగ్గరనున్నాఁ డతఁడు
అలసివుండిన భావ మదియూఁ గొంత
యెలమి శ్రీ వేంకటేశు నిటు గూర్చితి వే విన్ను
మలసి నీ కాఁగిటనే మరిగించుకొనవే ॥ పట ॥ 225

## మంగళ కౌశిక

కపటము లింకనేలే కన్ను లెదుట నున్నాఁడు
 నెపములు వేసి యెంత నీటు చూపేవే ॥ పల్లవి ॥

మంతనాలు గొంతవడి మాటలనుఁ గొంతవడి
 యెంతవడి వట్టి జాగు లేమి సేసేవే
వంతుకు నాతఁడు వచ్చి వద్దఁ గాచుకున్నవాఁడు
 కొంతపుఁ జూపులనేల కొచ్చి చూచేవే ॥ కప ॥

నవ్వులనే కొంతవడి నటనలఁ గొంతవడి
 యెవ్వతె మాటలు వింటి విది యేఁటిదే
బువ్వాన నాతఁడు నిన్ను బోంసేతము రమ్మంటే
 పువ్వులవాటులనేల పూఁచి వేసేవే ॥ కప ॥

సిగ్గులనే కొంతవడి సింగారాలఁ గొంతవడి
 యెగ్గులుఁ దప్పులుఁ బట్టి నిందులో నేదే
అగ్గమై శ్రీవేంకటేశుఁ డాతఁడే తా నిన్నుఁగూడె
 వెగ్గళించి మఱి నేల విఱ్ఱవీఁగేవే ॥ కప ॥ 226 ॥

## పాడి

ఏడ సుద్ది నన్నుఁ జూచి యేల కొంకేవు
 ఆడా నీడా నిన్నొరయ నంకకత్తెనా ॥ పల్లవి ॥

యిచ్చక మాడేదాన యెగ్గులు వట్టేనా
 విచ్చన విడుల మీకు వెఱపేఁటికి
చెచ్చెర నింకా నీవు సేసినట్టె సేతుగాక
 వచ్చి తిట్టు దిట్ట నీతో వంతగత్తెనా ॥ ఏడ ॥

లోనైవుండినదాన లోఁగి రట్టు సేసేనా
 పేనిపట్టి మాఁట మఱపించనేఁటికి
 నేనీడనుండఁగానే నీవే మన్నింతువుగాక
 ఆనవెట్టి పెనఁగ నే నాపకత్తెనా ॥ ఏడ ॥

గక్కనఁ గూడినదాన కడమ వెట్టేనా
 [1]చెక్కు చేతితోడనీకుఁ జింత యేఁటికి
 యిక్కడ శ్రీ వేంకటేశ యిరవై వుందువుగాక
 పెక్కు బుద్దిచెప్ప నీకుఁ బెల్లి కత్తెనా ॥ ఏడ ॥ 227 ॥

## నాదరామక్రియ

ఏమనినా నవ్వుదురు యిరుగుపొరుగువారు
 తామసించఁ బనిలేదు తగులాయఁ బనులు ॥ పల్లవి ॥

తెగువలేఁటికి పని తేటతెల్లమైనమీఁద
 నగవులేకాక నాకు నీకు
 మొగములు చూచితిమి మొక్కులునుఁజేకొంటిమి
 తగునిఁక జెప్పవయ్య తఱవాతి పనులు ॥ ఏమ ॥

చెంచలము లేమిటి కిచ్చటఁ జేతికి లోనైతే
 మంచివే కాక మనమాటలెల్లాను
 మంచమెక్కితిమి తెరమఱుగును వేసితిమి
 యెంచనేమున్నది మరి యిటమీఁది పనులు ॥ ఏమ ॥

కనుసన్న లేమిటికి కాఁగిటఁ గూడియుండఁగ
 మనసులేకమే మనకు నేఁడు
 ననిచే శ్రీవేంకటేశ నమ్మికలు చేకొంటిమి
 కొనలుసాగేమే యీ కూడినట్టి పనులు ॥ ఏమ ॥ 228 ॥

---

1 'చెక్కుచేతితోడ' చింతించుట నాయకునికి గూడ గలదనిపించుచున్నది.

1739 పాడి

ఇరుమొనసూదివైతి వేమందు నిన్ను
 తొరలీ సిగ్గులు నీ దొరతనము చూచి ॥ పల్లవి ॥

చిగురువంటిమోవిని చేవదేరేవలపులు
 మగువ నీకుఁజూపీ మాటలలోనె
 తగిలే వప్పటి నన్ను తల రాయిసేసుకొని
 నగవు వచ్చీ నాకు నన్ను నిన్నుఁజూచి ॥ ఇరు ॥

పువ్వులవంటి చేతుల పూఁపలవంటి వయసు
 జవ్వని నీకుఁ జూపీ సన్నలలోనె
 రవ్వగా నన్ను నంటేవు రాజసము చేసుకొని
 నివ్వెరగయ్యీ నాకు నీ గుణము చూచి ॥ ఇరు ॥

చక్కెరవంటి మేనఁ జందమామ గుటుకలు
 గక్కన నీకింతి చూపీ కాఁగిటిలోన
 యెక్కువ శ్రీ వేంకటేశ యిటు నన్నుఁగూడితివి
 నెక్కొని వేడుకవుట్టీ నీరతులు చూచి ॥ ఇరు ॥ 229 ॥

హిజ్జిజి

ఇంతకు నోపుదుమా ఇయ్యకొనఁగలమా
 బంతులను వలపులు పచ్చివెచ్చై వుండును ॥ పల్లవి ॥

తెరమఱఁగు మాటలు తీపులు దంపతులకు
 గరిసించి యడిగితే గసిగట్టును
 దొరవు నీతోడిపొందు తొలుతనే ప్రియములు
 గెరసుదాటితేనే గిజిగిజై తోఁచును ॥ ఇంత ॥

మూఁకలోని నగవులు ముంగిటిపైఁడై వుండు
కాఁకలు వుట్టించఁబోతే కసుగందును
ఆఁకల నీఅడియాస అండనుంటే దమిరేఁచు
చీఁకటివడితే నదె చిందువంద్రై జారును ॥ ఇంత ॥

పెండిలిలో పెనఁగులు ప్రియములై కదు మించు
గండి గడచితే నది కలఇకౌను
కొండలా శ్రీ వేంకటేశ కూడిన నీవారతులు
చండియై కొసరఁబోతే పదమదమౌను ॥ ఇంత ॥ 230 ॥

బౌళి

ఇందుకే పో నిన్ను దూరే దెప్పుడు నోయి
దిందుపడ నీగుణాలు తెలుసుకో వోఇ ॥ పల్లవి ॥

చెట్టవట్టి తియ్యఁగాను చేసన్న సేయఁగాను
వట్టి పరాకులు నేఁడు వలదోయి
నెట్టన నే నవ్వఁగాను నేరుపులు చూపఁగాను
[1]కట్టగడ వారితోడి కత లేలోయి ॥ ఇందు ॥

చెక్కులు నే నొక్కఁగాను చిగురుమో వియ్యఁగాను
యెక్కడ చూచేవు చిత్తమెందున్నదోఇ
మొక్కులు నే మొక్కఁగాను మోహములు చల్లఁగాను
మక్కళించి చెలులతో మాటలేఁటికోయి ॥ ఇందు ॥

కమ్మర జంకించఁగాను కాఁగిలించుకొనఁగాను
యెమ్మెలునేతులు నింకా నేఁటికోఇ

---

1 'కట్టగడ'లో ఇక్కడ అరసున్న లేదు. ఈ రేకుల వ్రాతలో పలుతావుల 'కట్టఁగడ' అనియే గలదు. అదియూ వింతే.

వెమ్మది శ్రీవేంకటేశ నీవే నన్నుఁగూడితివి
చిమ్ముల నావయసు నీచేతిది గదోయి ॥ ఇందు ॥ 231 ॥

## సౌరాష్ట్రం

సంగడిఁ గూచుండ నీ పరివారమా
చెంగట నున్నాఁడవు నీ చిత్తమింతేకాక ॥ పల్లవి ॥

కాంతలము నేము నీతో కాఁతాళించేవారమా
పంతములిచ్చిన మీఁదఁ బగలేఁటికి
కొంతపుఁ జూపుల జూచి గోలదాన నేమిసేసే
రంతుల విభుఁడవు నీరపమింతేకాక ॥ సంగ ॥

కోమలుల మిటు నిన్ను కొసరేటివారమా
చేముట్టి మొక్కిన మీద సిగ్గులేఁటికి
మోము వంచుకొని నిన్ను ముద్దరాల నేమిసేసే
కోమలపువాఁడవు నీగుణ మింతే కాక ॥ సంగ ॥

వనితల మిటు నిన్ను వడిఁబెట్టేవారమా
చనవు చేకొన్నమీఁద సడియేఁటికి
యెనసితివి శ్రీవేంకటేశ నన్నింతటిలోనె
ఘనుఁడవు నీ వలపు కడు మించెఁగాక ॥ సంగ ॥ 232 ॥

## వరాళి

ఇందాఁకా రావైతివంటా యేల గరిసించేవే
మందెమేలమేల మంచిమాట లాడవే ॥ పల్లవి ॥

వంకలాడవలెఁగాక వలచిన పతితోడ
అంకకత్తెవలెనేల అట్టిదిమేవే

మంకులాడఁదగునా మగవానితోడ నీకు
కంకణాల చేత నిట్టె కాఁగిలించవే ॥ ఇందాఁ ॥

చేరి నవ్వవలెఁగాక సిగ్గువడ్డ పతితోడ
తేరకత్తెవలెనేల తేలనాడేవే
బీరము చూపఁదగునా ప్రియునిముందట నీకు
గోరికొన కొంత సోఁక కొంగువట్టి తియ్యవే ॥ ఇందాఁ ॥

చెక్కు నొక్కవలెఁగాక శ్రీవేంకటపతితోడ
పుక్కటికత్తెవై యేల పొంచుకుండేవే
వొక్కటై యాతఁడు నిన్ను వురమునఁబెట్టుకొనె
దక్కఁగొని మదనముద్రలు నించవే ॥ ఇందాఁ ॥ 233 ॥

లలిత

ఉండనుండఁ జవులౌను వువిదల వలపులు
మెండుగ నాపె నీతో మేలమాడీఁ గాని ॥ పల్లవి ॥

పలుకకుండఁగ నీతోఁ బంతమా ఆపె కేమి
తలపోఁత పరాకునఁ దగిలున్నది
బలిమికాఁడవు నీవు పట్టి పెనఁగఁగరాదా
మలసి యాపె నీతో మాఁటలాడీఁగాని ॥ ఉండ ॥

యెదురుకొనక నీతో నెమ్మెలా యాపెకేమి
పుదుటు మదమునను వోలలాడీని
చదురుకాఁడవు నీవు చనవులియ్యఁగరాదా
పొదిగి యాపె నీతో భోగించీఁగాని ॥ ఉండ

సేవలు సేయక నీతో సిగ్గులా ఆపెకేమి
నీవిధాలు దెలుసుకో నిలుచున్నది

భావించి శ్రీవేంకటేశ పడఁతిఁ గూడితి విట్టె
వేవేలుగా నాపై విన్ను వెలయించీఁగాని ॥ ఉండ ॥ 234 ॥

రేకు 1740 సామంతము

ఎవ్వరికి నేమి వోదు యెదురాడేమా
నివ్వటిల్లఁ జేసేవారు నీవారే సుమ్మీ ॥ పల్లవి ॥

నగవులు నీమాటలు నన్ను నేమి యడిగేవు
తగిలితేఁ జెప్పేరు యీతరుణులే
యెగసక్కెములు గావు యియ్యకోలు సేసే నింతే
నెగులుదీరిచేవారు నీవారే సుమ్మీ ॥ ఎవ్వ ॥

నాటకాలు నీచేఁతలు నామోమే చూచేవు
పాటించితే తెలిపే రీపడఁతులే
యీటు వెట్టుకొన నీతో యింతా విచారించే నింతే
నీటున నడపేవారు నీవారే సుమ్మీ ॥ ఎవ్వ ॥

నమ్మితి నీపొందు లివె నాకేల బాసపేసేవు
సమ్మతించితే మెచ్చే రీసవతులే
కమ్మక శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
నెమ్మదిఁ బొగడేవారు నీవారే సుమ్మీ ॥ ఎవ్వ ॥ 235 ॥

ఆహిరి

ఎంత నీవు పేసినా నేనేల మానేను
పంతములు నెరపి నేఁ బెకొనేనంటాను ॥ పల్లవి ॥

నెట్టన మొక్కులు మొక్క నేరుచుకుంటివి నీవు
తిట్టులు దిట్టి యేమైనాఁ దెలిపేనంటా

చుట్టమవై నాతోనే సుద్దులు చెప్పేవు నీవు
జట్టిగా నిన్ను జంకించి సాదించేనంటాను ॥ ఎంత ॥

వినయాలు చూపి నాతో వేసాలు పేసేవు నీవు
ననుపు నీచేఁతలకు నవ్వేనంటా
మనసు నమ్మినదాఁకా మందులు నూరేవు నీవు
పెనఁగి నేనిట్లానే చెల్లించే నంటాను ॥ ఎంత ॥

నిలువునఁ గాఁగిలించి నివ్వెరగందేవు నీవు
తలపించి నీ గుణాలు తడవే నంటా
అలర శ్రీ వేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
చెలరేఁగి నిన్ను రట్టుసేపే నంటాను ॥ ఎంత ॥ 236 ॥

కాంబోది

సిగ్గులు విడుతురా చెల్లఁబో యెంతైనా ।
బగ్గన నన్నియు నేఁడు బాయిటనే పడెఁగా ॥ పల్లవి ॥

మంతనాన నీవు నేము మాటలాడినసుద్దులు
అంతయు నాపె చెప్పి నది యేఁటికి
వింతచుట్టా లిటు నీకు వేరే యెంత గలిగిన
పొంతనే రతులలోని భోగాలు చెప్పదురా ॥ సిగ్గ ॥

మొక్కలాన నీకు నేము ముడిచినపువ్వులు
వొక్కట నాపె కొప్పులో నుండ నేఁటికి
తక్కక నీకు వేరే దాఁపిరము గలిగితే
వుక్కున నొకరి యెంగి లొకరికి నిత్తురా ॥ సిగ్గ ॥

కందువ మనయిద్దరి కాఁగిటి పరిమళము
అందమై యాపె చన్నుల నంటఁదగునా

యిందుకుఁగా శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
పొందుల సతులనెల్లా పొత్తు గలపుదురా ॥ పిగ్గ ॥ 237 ॥

## ముఖారి

ఏమిటికయ్య్యె నీవు నన్నేల నిష్ఠూరిఁ జేసేవు
చేముట్టి నీపాదాలసేవ సేసే దానను ॥ పల్లవి ॥

ఆపెవద్ద నుండఁగా అద్దలించనోపుదునా
దాపులను మొగమోటదాన నేను
కోపమెంత గలిగినా గురి నీపైఁ జూపుదునా
తీపుగా నీకు నామోవితేనె వూసేదానను ॥ ఏమి ॥

ఇంతి నిన్నుఁ గూడుండఁగ యెదరు నేఁ జేతునా
చెంత దోసాలకు వెఱచినదానను
పంతపుదాన నేనైతే బలిమి నీకు జూపేనా
యెంతైన నీవద్ద నిచ్చలాడేదానను ॥ ఏమి ॥

సవతై యింట నుండఁగ జగడాలదుతునా
కవగూడి [1]బలఁగము గలదానను
ఇవల శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁ గలసితి
తవిలి నీకు నిట్టె తమకించేదానను ॥ ఏమి ॥ 238 ॥

## తెలుఁగుఁ గాంబోది

ఏమిసేసినా నీచిత్త మింతయు నాభాగ్యము
వేమరు నీతో పొందు విడువలేఁ జుమ్మీ ॥ పల్లవి ॥

కలరు పదారువేలు కాంతలు తొల్లె నీకు
వెలయు నేనలిగితే వెఱచేవా

---

[1] 'బలఁగ' శబ్దములో అరసున్న విచార్యము

నెలవై నాకైతేను నీవే యేడుగడయు
మలసి నీతో పొందు మానలేను సుమ్మీ ॥ ఏమి ॥

చేరి నిన్ను గొల్లెతలు సిగ్గులెల్లా విడిచిరి
వారియాప గద్దు నాచేవాటు వడేవా
కోరిన కోరికకు గుఱుతు నీవే నాకు
భారపడి నిమిషముఁ బాయులేను సుమ్మీ ॥ ఏమి ॥

యిందిరయు భూపతియు నిరువంక నున్నవారు
చెంది నే దూరిన దూరు చెవిఁ బెట్టేవా
కందువ శ్రీ వేంకటేశ కలసితి విటు నన్ను
నిందవేసి ఇఁక నిన్ను నేర మెంచఁజుమ్మీ ॥ ఏమి ॥ 239 ॥

## పళవంజరం

ఎవ్వరేమి బోదింతురో యెఱఁగ నేను
పువ్వువలె నన్నుఁ బొందేవు పుణ్యము నీచేతిది ॥ పల్లవి ॥

తరుణులలో నిన్ను తగవులఁ బెట్ట నోప
వొరసి నిన్ను మెప్పించనోపుదుఁ గాని
[1] నెరతనీఁడవు నీవు నేరనిదాన నేను
పొరసి నన్ను నడపే పుణ్యము నీచేతిది ॥ ఎవ్వ ॥

వుక్కుమీరి నిన్నుఁ గదునొత్తి మాఁటలాడనోప
వొక్కటైతే నొడఁబడనోపుదుఁ గాని
నిక్కి నీవు అట్టడివి నేనైతే గోలదాన
పుక్కట గాక మన్నించే పుణ్యము నీచేతిది ॥ ఎవ్వ ॥

---

1 నెరతనము + ఈఁడు. షష్ఠ్యర్థమున 'ఈఁడు' కావచ్చు.

పలుమారు నీతోను పంతము లాడఁగనోప
వొలిపి ప్రియము చెప్పనోపుదుఁగాని
యెలమి శ్రీవేంకటేశ యిదె నన్నుఁ గూడితివి
పొలసి నన్ను రక్షించే పుణ్యము నీచేతిది ॥ ఎవ్వ ॥ 240 ॥

రేకు 1741 దేపాళం

మాతోనే యాడఁగరాదా మాటలేమి గలిగినా
యేతులు నెమ్మెలు సారె నిఁక నేఁటికి ॥ పల్లవి ॥

పంతము నీ కీడేరె భ్రమసితి నిన్నుఁ జూచి
మంతన మాపెతో నింకా మరి యేఁటికి
చెంత నీ చేఁత మీఁదాయ చేయెత్తి నీకు మొక్కితి
ఇంతకంటె నవ్వు నేఁ డింకా నేఁటికి ॥ మాతో ॥

కోరినట్టె ఆయ నీకు కొలువుదాన నేనైతి
యీరీతి నాపెతో పన్ను లిఁక నేఁటికి
నేరుపరి వొదువు నేనింత యెఱఁగనైతి
యేరా ఆపె మోము చూచే విఁక నేఁటికి ॥ మాతో ॥

మెప్పించుకొంటివి నీవు మేలుదాన నైతి నేను
యెప్పటి కెప్పటి యాన లిఁక నేఁటికి
తప్పక శ్రీవేంకటేశ తగ నన్నుఁ గూడితివి
యిప్పుడే వినయములు ఇఁక నేఁటికి ॥ మాతో ॥ 241 ॥

వరాళి

ఉన్నవారిఁ దడవేనా వూరకె నేను
పన్ని యిట్టె తలపోసి భావించుకోవయ్యా ॥ పల్లవి ॥

నీ యింతిపైఁ గోపించుట నీమీఁది వల పది
ఆయెడ వారిఁ దిట్టుట అది నీనుతి
చేయెత్తి పేసినచేఁత చెక్కులు నీకు నొక్కుట
పాయపు విభుఁడ ఇట్టె భావించుకోవయ్యా ॥ ఉన్న ॥

వెఁగెము నీపతి నాడుట వేడుక నీమీఁదిది
కంగి [1]యాపె కలుగుట కైకొంట నిన్ను
కొంగువట్టి తీసుకెల్లా కూరుములే కొపరుట
పంగెన గా దిపు డిట్టె భావించుకోవయ్యా ॥ ఉన్న ॥

సారె నీకాంత దూరుట సమ్మతి నిన్నుఁ జేసుట
వారిఁ దప్పకచూచుట వాడికె నీది
యీరీతి శ్రీవేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి
భారము వేసుటగాదు భావించుకోవయ్యా ॥ ఉన్న ॥ 242 ॥

ఆహిరి

ముందరెరిగి బదుకుమోహపుదాన నేను
సందడి జాణతనాలు చాలుఁజాలు నిఁకను ॥ పల్లవి ॥

జగడాలదాననా సరసపుదానఁ గాక
యెగసక్కె లింతులచే నే లాడించేవు
నగినట్లనే వుందు నాట దా కొనగోరు
వొగరులు మాతోడ వొద్దు వొద్దు నీకు ॥ ముంద ॥

పంతములదాననా పైకొనేటిదానఁ గాక
వంతులేల పెట్టేవు వాసు లెక్కించి
కాంతుఁడ ముదిరితేను కలియే మేడిదె గాదా
వింత గుణములు ఇఁక విడు విడు నీవు ॥ ముంద ॥

[1] ఆపెకు + అలుగుట

అలుకలదాననా నెయ్యపుదాన నేఁ గాక
పలుకుల నెన్ను నేల భ్రమయించేవు
యెలమి శ్రీవేంకటేశ యెనసితి మిఁక నుప్పు
యిలఁ జిందితే రెట్టించు యేల జోలి మనకు॥ ముంద ॥ 243 ॥

## దేసాళం

అపుడే లోనైతి నీతో నడ్డమాడేనా! నీ--
రపమాయ మమ్ము నిఁక రవ్వసేయనేఁటికి ॥ పల్లవి ॥

మనసొక్కటైతేఁ జాలు మాట లెట్టున్నా నేమి
కొనమొదలేల దిద్దుకొనేవు నీవు
పెనఁగి చూచితి నీతో ప్రియము చెప్పఁ జూచితి
వెనకటి సుద్దులకు వేఁదుకొన నేఁటికి ॥ అపు ॥

ప్రియముగలితేఁ జాలు బిరుదులాడితే నేమి
క్రియెఱిఁగి ఇఁకనేల కిందుపడేవు
దయతోడ నుండితి నీదంటతనాన నుండితి
నియతపు నీసత్యాలు నెరపఁగ నేఁటికి ॥ అపు ॥

కూటమి గలితేఁ జాలు కొసరితేఁ దప్పేమి
మూటగట్టి మాకునేల మొక్కేవు నీవు
గాటపు శ్రీవేంకటేశ కలసితి మెలసితి
పాటించి నీ బాసలు పచరించనేఁటికి ॥ అపు ॥ 244 ॥

## ఆహిరినాట

ఏమనేము నిన్నిఁక యెంత సేసినా
నేమపువారము నేము నీచిత్తము కొలఁది ॥ పల్లవి ॥

మగిడి మగిడి నీతో మాఁటలాడఁగాను నీకు
మొగచాటాయనేమో మోహము నాపై
యెగసక్కేలకు నాతో యెక్కడో వారి సుద్దులు
నిగిడి యానతిచ్చేవు నీచిత్తము కొలఁది ॥ ఏమ ॥

చనవు సేసుక యిట్టె సరసమాడఁగ నీకు
తనిసితి వేమో నాతో తమకముల
పనిమాలిన పనికి పరులసొమ్ములు దెచ్చి
నినుపుగా నాకిచ్చేవు నీచిత్తము కొలఁది ॥ ఏమ ॥

యెరవు లేక నేను యిచ్చకాలాడఁగ నీకు
తరితీపు వుట్టెనేమో తతిరతికి
యిరవై శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
నెరులాపెఁ బోలిచేవు నీచిత్తము కొలఁది ॥ ఏమ ॥ 245 ॥

మాళవిగౌళ

సరసుఁడ విన్నిటాను చలమేఁటికి
యెరపరికములేల యియ్యకొనరాదా ॥ పల్లవి ॥

చేయెత్తి మొక్కితి నిన్నుఁ జెనకిన చేఁతలకు
వాయెత్తి పాడితి నీతో వాదు దీరను
యీయెడ నింకా నీకు నేమి సేయవలె నేను
మాయకాఁడ అలుగక మాటలాడవయ్యా ॥ సర ॥

నవ్వులు నవ్వితి నీతో నానాటి యలపు దీర
పువ్వుల వేసితి సొలపులు దీరను
చివ్వన నింకా నీపైఁ జిత్త మెటువలె వచ్చు
రవ్వకాఁడ మాతోను రాయడించకువయ్యా ॥ సర ॥

శిరసు వంచితి నీతో సిగ్గులు వడినందుకు
కరఁగించితిని నిన్ను కాఁక దీరను
దొరకె నారతి నీకు తుదమొదలే లేదు
నిరతి శ్రీవేంకటేశ నేరుపు చెల్లునయ్యా ॥ సర ॥ 246 ॥

రేకు 1742 శంకరాభరణం

ఊరకే నే గుట్టుపేసుకున్నదానఁ గాక నేఁడు
తేరి తప్పక చూచితే దిష్టము గాదా ॥ పల్లవి ॥

మొగము చూచితే నీవు మొక్కేవు । నాకు
నగవు వచ్చీ నీ నయములకు
వొగరుతో నీవు వుండేవునికికిని । నిన్ను
తగవులఁ బెట్టితేను తప్పు మోవదా ॥ ఊర ॥

చేయివట్టి తీసితేనే సిగ్గువడేవు । నా--
కాయము చెమరించీ నీకతలకును
ఆయముగా నీవు వెట్టే యానలకును । యిట్టె
చాయల దీకొంటేను చలమే కదా ॥ ఊర ॥

కోరి నిన్నుఁ బిలిచితే కొసరేవు నాకు
తారుకాణ లాయను నీతలఁపెల్లాను
కూరిమి శ్రీవేంకటేశ కూడితివి నన్ను
నేరుపుల మెచ్చితేను నీవే నేఁ గానా ॥ ఊర ॥ 247 ॥

నట్టనారాయణి

చూదుమా నీవెఱఁగని సుద్దు లున్నవా
యేడ నున్నదో నీచిత్త మేమందు నీతోను ॥ పల్లవి ॥

నగరాదు నీతోను నన్ను నిది యేఁటికని
అగడుగాఁ జెప్పమంటా నానవెట్టేవు
నిగిడి నీభావము నీకు నీకే తెలుసుకో
యెగసక్కేలాడ నేర యేమందు నీతోను ॥ మాదు ॥

కన్ను సన్న సేయరాదు కాంతలతో నది నీకు
విన్నవించుమని నన్ను వేఁడుకొనేవు
యిన్నియు నీవే యదుగు ఇరుఁగు పొరుగువారి
యెన్ననేర నీగుణాలు యేమందు నీతోను ॥ మాదు ॥

చంగనఁ బొగడరాదు సారె సారె నన్ను నీవు
వెంగెమో నిజమో యంటా విచారించేవు
చెంగటఁ గూడితి విట్టె శ్రీవేంకటేశ నన్ను
యింగితా లలమేల్మంగ నేమందు నీతోను ॥ మాదు ॥ 248 ॥

## సామంతం

అడవి వెంచెతలము అంతేసి నేరము
నడుమ నీగోపికను నవ్వకుండేరా ॥ పల్లవి ॥

పచ్చికస్తూరి గమ్మెట్టు పారిటాకు చీరపట్టు
బచ్చెన పసిఁడి కాకిపైఁడి బొట్టు
వచ్చితివి వలచి మావాకిటికి నీవు నేఁడు
నచ్చులఁ బురసతులు నవ్వకుండేరా ॥ అడ ॥

చిన్ని పొదలమేడలు చిగురాకు గోడలు
మన్ను మెకములలోని మావాడలు
వున్నాఁడవు మావద్ద నొంటి చుట్టరికముల
నన్నే మెచ్చి విన్నిందరు నవ్వకుండేరా ॥ అడ ॥

జంటితేనె మాకూడు సొంపుమాఁకులు మాతోడు
  పంట కోవిలపాట మా పలుకులీడు
  వొంటరి శ్రీవేంకటేశ కూడితివి మమ్ము నేఁడు
  నంటున గొల్లపతులు నవ్వకుండేరా ॥ అడ ॥ 249 ॥

## కాంబోది

ఏమి నేరిచితివి యేడలేని సుద్దు లేం
  వేమారు గొల్లెతలును విడిచిరి సిగ్గులు ॥ పల్లవి ॥

తేనెలుట్టిపడ నీవు తియ్యనిమాట లాడేవు
  వానఁ బెట్టేవు వలపు నయములనె
  లోను గాకెట్టు మాను లోలత నీ చేఁతలకు
  దీనికే పురసతులు తేలిరి నీవాగెకు ॥ ఏమి ॥

వెన్నెల రసాలు గార వేడుకకు నవ్వేవు
  కన్నులనే తరితీపు గాదెఁ బోసేవు
  కన్నవారు విన్నవారు కాకు గాక మానుదురా
  మున్నిందుకే చుప్పనాఁతి మోహించె నీకును ॥ ఏమి ॥

పొలుగారే సిగ్గులను బంతికూళ్లు గుడిపేవు
  కేలు సాఁచి మర్మాలంటి గిలిగించేవు
  యీలీల శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
  అలకించి కుబ్జ నీకు నన్నిటా వలచెను ॥ ఏమి ॥ 250 ॥

## పాళంగవాట

ఎట్టి దేవరవు నీవు యెంతటివాఁడవు మరి
  యిట్టె మమ్ము నీవిఁక యేల తడవేవు ॥ పల్లవి ॥

మచ్చరాలులేనివారి మాఁటలెల్లాఁ జక్కనే
యిచ్చగించి వినేవారి యింపు చక్కన
ముచ్చటలెనసినట్టి మోహమెల్లాఁ జక్కనే
యెచ్చినమా చక్కఁదనా లేల పొగడేవు ॥ ఎట్టి ॥

చనవు గలుగువారి చందాలెల్లాఁ జవులే
ననుపుగలుగుచోట నవ్వు చవులు
పెనఁగనేర్చిన చోటి బిగువెల్లాఁ జవులే
యెనసి మామోవి చవులేల యడిగేవు ॥ ఎట్టి ॥

ఆయాలు సోఁకినవారి ఆసలెల్లా మంచివే
పాయపువారలచేపట్టు మంచిది
వేయిటికి నన్నును శ్రీవేంకటేశ కూడితివి
నీయెడ మామంచితనా లేమి చెప్పే దయ్యా ॥ ఎట్టి ॥ 251 ॥

## శంకరాభరణం

ఎవ్వరిభాగ్యం బెట్టుండునో
జవ్వనభారము చలివేఁడాయ ॥ పల్లవి ॥

తిరుగ నాపె నినుఁ దిట్టులు దిట్టఁగ
పరవుల నీకవి చవులాయ
గిరికొన నీకు మొక్కిన మా మొక్కులు
వెరవున నీకవి వెంగెము లాయ ॥ ఎవ్వ

తగులఁగఁ జెలి నిను తమ్మను వేయఁగ
నగవున నీకది నయమాయ
వొగి నే నప్పుడు వొసఁగిన కానుక
పగటున నీ కవి పంగెములాయ ॥ ఎవ్వ

పడతి నీమీదను పాదము వేయఁగ
యెడయని రతులకు నితవాయ
బడి శ్రీవేంకటపతి నాకూటమి
తొడిఁబడ శుభముల దొంతరలాయ ॥ ఎవ్వ ॥ 252 ॥

రేకు 1743 బౌళి

ఇద్దరము మనలోన నెగ్గు లేదవి
గద్దించకుమీ నిన్ను ఘాతలు సేసితిని ॥ పల్లవి ॥

వాసులకే పెనఁగేము వలచి వలచి నీకు
వేసరుకోకు మెంతైనా విడువరాదు
నీసరిఁ గూచుండుదుము నీవిట్టె మన్నించఁగానే
దోసము లేదనుమీ నేఁ దొక్కితి నీపాదము ॥ ఇద్ద ॥

చనవులే నెరపేము సారెకును సారెకును
మనసు దియ్యకు పొందు మానఁగరాదు
మనవులు చెప్పదుము మాకుఁ బంపుసేయఁగాను
యెనపి కదుగుకో మోవెంగిలి సేసితిని ॥ ఇద్ద ॥

యెమ్మెలే పచరించేము యెరిఁగి యెరిఁగి నీతో
కుమ్మరించకుమీ సిగ్గు కొదువలేదు
దిమ్ముల శ్రీవేంకటేశ తేరి నన్నుఁ గూడితివి
సమ్మతి వోరుచుకొమ్మీ చన్నుల నొత్తితిని ॥ ఇద్ద ॥ 253 ॥

## పాడి

ఇటువంటి సుద్దులకు [1]యెరిఁది సాకిరైవచ్చు
[2]విటకుక్కితనాలెల్ల వెరగందిచూతుము ॥ పల్లవి ॥

తగవెరిఁగినవాఁడు తానే కనక మరి
జగడాలు దిద్దీని సవతులకు
తెగువగలదొకతె తిట్టదాయ నందులోన
[3]పెగడతనాలెల్లఁ బ్రియముతో విందుము ॥ ఇటు ॥

అంకెల నెడమాటలు ఆడనేరుచుఁ గనక
వంక లొత్తి కూరిచీని వనితలను
కొంకలేకందొకతైనా గొబ్బునఁ జెైక మోపదాయ
బింకపు తనలావులు పేరుకొని మెత్తుము ॥ ఇటు ॥

మంతుకెక్కి యీ పనికి మాపటేఁడు తానె కన
పంతము లిప్పించీని పడఁతులకు
వింతఁగా నన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁ డిట్టె వచ్చి
ఇంతవని ఇప్పుడైతే యీడేరింతుఁ బనులు ॥ ఇటు ॥ 254 ॥

## గౌళ

ఎందు వోయే నే నీకు నెప్పుడుఁ గలదానవే
గొందివలపులు చల్లి కూడవయ్య ఆపెను ॥ పల్లవి ॥

కాలుదొక్కి పేసవెట్టి కప్పురము నోటికిచ్చి
జాలిఁబడీ నాపె నీతో సారె సారెకు

---

[1] 'ఏరితి' అని కానీ 'యేరిది' కానీ 'యెరిఁగి' అని కానీ కావచ్చు. రేకుపాఠము అనన్వితము.

[2] విటకుక్కితనాలు = విటులయొక్క సంకుచితమైన లేక నీచములైన భావములు కావచ్చు. సమాసము దుష్టమే.

[3] 'పెగ్గడతనము'నకు వ్యావహారికమా?

ఆలకించ వింతటను ఆఁదుఁగొాల నీకేల
కూళతనములు మాని కూడవయ్యా ఆపెను ॥ ఎందు ॥

కొంగువట్టి కొప్పుదువ్వి గోరికొన దాఁకించి
అంగమిచ్చీ నాపె నిన్ను నంతా నింతాను
ఇంగితమేమి నెరఁగ వింతులగోడు నీకేల
గుంగిలి గేలిసేయక కూడవయ్యా ఆపెను ॥ ఎందు ॥

నవ్వునవ్వి నమ్మికిచ్చి నయముల చవి చూపి
రవ్వసేసీ నాపె నిన్ను రారాఁపుల
యివ్వల శ్రీ వేంకటేశ యెనసితి విటు నన్ను
కువ్వలుగా రతికేలిఁ గూడవయ్యా ఆపెను ॥ ఎందు ॥ 255 ॥

## సామంతం

నే మేమన్నా వెంగెమౌను నీ చిత్తము
నీ మోహము ఆపె సొమ్ము నీ చిత్తము ॥ పల్లవి ॥

మక్కువ నాపెను నీవు మన్నింతువని నేను
నిక్కల గంటిని యిఁక నీ చిత్తము
చెక్కు చేతితో నిన్నే చింతించి నీ రాకలకు
నిక్కిచూచీఁ బలుమారు నీ చిత్తము ॥ నేమే ॥

గాఁటాన మీరిద్దరును కాలుదొక్కి పెండ్లాడఁగ
నీటు పకినములాయ నీచిత్తము
పాటించి లేకలు నీకుఁ బంపెఁ దన సఖులచే
నేఁటి వరుప సుద్దికి నీచిత్తము ॥ నేమే ॥

వచ్చితివి వాకిటికి వనిత లోన నున్నది
నిచ్చ పొంతనాలు గూడె నీ చిత్తము
పచ్చిగా శ్రీవేంకటేశ పడఁతిఁ గూడితి విట్టె
నెచ్చెలు లెల్లా మెచ్చిరి నీ చిత్తము ॥ నేమే ॥ 256 ॥

## ఆహిరినాట

ఔనే నేరుచుకొంటి వప్పుడే నీవు
మౌనాన నాతనితోడ మందెమేళమా ॥ పల్లవి ॥

ఏ..ంకుతోడి వొట్లు మాయదారితిట్లు
యింకా విభునితోడ నేమిటికే
జంకించేవు బొమ్మలను జరపేవు కన్నులను
బింకమున నిందువంకఁ బెద్దరికమా ॥ ఔనే ॥

నయగారి మొక్కలు నాఁటకపునొక్కులు
ప్రియునితో నిప్పు డిట్టె పెంచనేఁటికే
దయఁజూడు మిప్పుడే తప్పులెంచకితని
రయమున నింతలోనే రాజసములా ॥ ఔనే ॥

చేవదేరే సిగ్గులు చిరునవ్వుముక్కులు
శ్రీ వేంకటేశ్వరు మీఁదఁ జిమ్మేవేమే
యీ వల నితఁడే కూడె యియ్యకోలుగా నిన్ను
భావించ నీకిది నేఁడు బలుపంతమా ॥ ఔనే ॥ 257 ॥

## పాడి

ఇంతి గడుముద్దరాలు యిన్నిటా జాణవు నీవు
మంతుకెక్క మెల్లనె సమతుసేయరాదా ॥ పల్లవి ॥

చిగురాకుఁబెదవిమీఁదఁ జేవ దేరీ నదె సిగ్గు
మొగము చూచితేనే మొక్కీఁజెలి
నగుదురా యింతలోనే నంటున నింతసేసితి
వెగటుమాఁటలఁబెట్టి వెద్దు వెట్టరాదా ॥ ఇంతి ॥

అద్దపుఁజెక్కుల మీఁద ఆము కవిసీఁ గళలు
వద్దికి రమ్మంటేఁ దలవంచీసతి
అద్దో పచ్చి సేతురా అన్నియు నీ మహిమరే
పెద్దరికములు సేసి పెనఁగఁగరాదా ॥ ఇంతి ॥

నిట్టూర్పుగములతో నిగ్గులుదేరీ రతి
గుట్టు బయలుసేసితే కొంకీఁగొంత
ఇట్టె శ్రీవేంకటేశ యెనసితి విద్దరును
నెట్టుకొని సంతోసాల నిండుకుండరాదా ॥ ఇంతి ॥ 258 ॥

రేకు 1744 భైరవి

ఎంతవాఁడవు నిన్ను నెవ్వఁడెఱుఁగు
సంతసాలు సేసి మోవి చవి చూపరాదా ॥ పల్లవి ॥

మనసెవ్వఁడెఱుఁగు నీమతక మెవ్వఁడెఱుఁగు
ఘనుఁడ నీచేఁతలే కనేముగాక
పెనఁగేవు రమ్మంటా ప్రియములు చెప్పేవు
ననుఁబాయనని ఇట్టె నమ్మించరాదా ॥ ఎంత ॥

గుఱుతెవ్వఁ డెఱుఁగు నీ గుణమెవ్వఁ డెఱుఁగును
మెఱసే నీసుద్దులకు మెచ్చేము గాక
చెఱఁగు వట్టుకొనేవు చెక్కులు నొక్కవచ్చేవు
మఱఁగుల నీ సిగ్గులు మరి చెప్పరాదా ॥ ఎంత ॥

వలపెవ్వఁ డెఱుఁగు నీ వాడికె యెవ్వఁడెఱుఁగు
కలసిన నీ రతియే కనేము గాక
బలిమి శ్రీ వేంకటేశ పై కొంటివి నన్ను నిట్టె
నలువంకవారు మెచ్చ నమ్మించరాదా ॥ ఎంత ॥ 259 ॥

## ముఖారి

ఆతనికి నాలవైతే నౌదువు గాక
యేతులు వెమ్మెలు మాతో నేమిటికి యిపుడు ॥ పల్లవి ॥

వెయ్యాన నే నాతనిపై వెరుసు వెదకితేను
చయ్యాటాలకు రానేలే సారెకు నీవు
[1]వియ్యంత నేనేరనా నీవే బత్తిగలవా
పుయ్యక దూలతనాల పోరకువే ఇపుడు ॥ ఆత ॥

కోరి వేఁడి నే నాతని గూరిమి గొసరితేను
ఆరీతి నీవిపుడేల అందుకొనేవే
యీరసము నాకున్నదా యింత నీవు చుట్టమవా
[2]వీరుత్తరాలు మాతోను విడువవే ఇఁకను ॥ ఆత ॥

శ్రీవేంకటేశ్వరుని చేకొని నేఁ గూడితేను
కావలించి నీవేల కాఁతాళించేవే
భావించ నే నేరనా పంతగత్తెవా నీవు
పూవుకుఁ దుమ్మిదవలె పొదిగే వేమిటికే ॥ ఆత ॥ 260 ॥

## వరాళి

నీ చేతఁగాని కాదు నెట్టన నీపనులెల్ల
వాచవి తన సుద్దులు వద్దనఁగరాదా ॥ పల్లవి ॥

నాతోడి వరుసదా నాతోడి వంతులదా
యేతులకు నీతో మేల మేల ఆడీని
చేతులు నేఁ జాఁచినాను సిగ్గువడ నేరఁడు
పోతరపు మగఁడవు బుద్ధి చెప్పరాదా ॥ నీచే ॥

---

[1] వీ + అంత = వియంత. ఇదియొక వ్రాతప్రతిక సంధి.
[2] వీర + ఉత్తరాలు = వీరుత్తరాలు = ఘాటైన సమాధానములు.

నేనెంత దా నెంత నేరుపు దన కేదది
వానఁబెట్టి నీతో నేల నవ్వు నవ్వీని
పానఁబట్టి నేఁ జూచితే పన్నకు మేలెఱఁగదు
పూనుకవచ్చి నీవైనా బుద్ధి చెప్పరాదా ॥ నీచే ॥

పెండ్లాడినదా నిన్ను పేరటమాపె యింతే
యిండ్లు దా దొంగిచూడనిది యేఁటికి
కండ్లనే జంకించితి గక్కన శ్రీ వేంకటేశ
ఆండ్లుగల పతివి ఆపె ననరాదా ॥ నీచే ॥ 261 ॥

## దేవ గాంధారి

పట్టకు పట్టకు నన్ను బలిమి నీవు
మట్టుకొని యింత మమ్ము సోఁకఁగ నేమిటికి ॥ పల్లవి ॥

సిగ్గులు నెగ్గులకును శిరసువంపులు దాపు
కగ్గలేని చెక్కులకు కళలుదాపు
నిగ్గులాపెచన్నులకు నీమే నిదియెదాపు
దగ్గరి మాకైదండదాపులు నీకేఁటికి ॥ పట్ట ॥

జలజాక్షి వయసునకు జవ్వనమదమె దాపు
పొంపే పొలపులకు చూపులు దాపు
పలు సోఁకులకు నెల్ల పచ్చి వీమోవె దాపు
తల నిద్రకు మా తొడదాపులు నీకేఁటికే ॥ పట్ట ॥

ననుపులిన్నిటికి నీ నవ్వేటి నవ్వులు దాపు
కనుచూపులకు రతికందువ దాపు
యెనసి శ్రీవేంకటేశ యీడ నన్నుఁగూడితివి
మనసిజ తంత్రాలు మా మంచముదా పేఁటికి ॥ పట్ట ॥ 262 ॥

## శంకరాభరణం

ఇంక నీతలఁపులెట్లానో
మంకునకును నామనను గొలుపదు ॥ పల్లవి ॥

నగి సరసమాడ నాలుక సమకొను
జగడాలదువఁగ సమకొనదు
మొగము చూచితే మొక్కను చేదోయి
తెగువలకైతే తెమలదు నాకు ॥ ఇంక ॥

నయమున నా చూపు ననుచును నీపై
భయపరచఁగ మరి పైకొనదు
ప్రియమునఁ బెనఁగఁగ పెరుగును చనుఁగవ
చేయి వదలదు నీ చెలువపు రతిని ॥ ఇంక ॥

జంకించవు నిను సారెకు బొమ్మలు
పొంకపు సన్నకుఁ బొదలీని
అంకెల శ్రీవేంకటాధిప కూడితి
కంకిగ నలయదు కాయం బిదివో ॥ ఇంక ॥ 263 ॥

## తెలుఁగుఁగాంబోది

ఎంత వేడుకో యిది నీకు
కొంత చెలియ సిగ్గునఁ బొదలీని ॥ పల్లవి ॥

వదనకమల మటు వంచుక నీతో
కదిసి మాఁటాడీఁ గలికి
పెదవులపయి నీవు పెంచిన చేఁతకు
కొదలుచు కడు సిగ్గునఁ బొదలీని ॥ ఎంత ॥

గక్కనఁ బయ్యెద గప్పక నీవద్ద
 పుక్కుచు మెలఁగీ సుదతి
జక్కవ చన్నుల చంద్రుల నించఁగ
గుక్కుచు కడు సిగ్గునఁ బొదలీని ॥ ఎంత ॥

నిట్టూరుపులను నిలిపి నిలిపి నిను
 గుట్టునఁ బొదిగీఁ గోమలి
యిట్టె శ్రీ వేంకటేశ నీ వెనయఁగ
గొట్టు గెలిచి సిగ్గునఁబొదలీని ॥ ఎంత ॥ 264 ॥

## రేకు 1745 భూపాళం

వేరా నాకు నీకు వింతదాననా
 సారె సారెకును నిన్ను సంతోషింతుఁగాక ॥ పల్లవి ॥

బలిమి నీవు నన్నుఁ బచ్చి యెంతసేసినాను
 చలము సాదించేనా జంకించేనా
నెలకొన్న విభుఁడవు నీకు నూడిగపు దాన
చలివాసి నీగుణాలు సారె మెత్తుఁగాక ॥ వేరా ॥

సతినంటా నీవు నాతో జాణతనా లాడితేను
 [1]పతి మాటలాడేనా బాస గొనేనా
మితిమీరి నీకు నే మేనరికమైనదాన
యితవై నీ సుద్దులెల్లా నియ్యకొందుఁగాక ॥ వేరా ॥

సిగ్గుదీర నీవు నాపై చేతు లెంత చాఁచినాను
 వెగ్గళించేనా మరి వేసరేనా
యెగ్గులేక శ్రీవేంకటేశ నీ కూటమిదాన
నిగ్గుల నీతోఁ జనవు నెరపుదుఁగాక ॥ వేరా ॥ 265 ॥

---
[1] 'పతి' ఇది 'ప్రతి' శబ్ద భవము కావచ్చు.

## దేవ గాంధారి

మరిగినమీఁద నయ్యా మనమెంచుకొన్నట్టె
కరి (ర?) కరిఁ బెట్టకురే కడుఁగడు మీరు ॥ పల్లవి ॥

తలఁచఁగఁ దలఁచఁగ తానే యీడకు విచ్చేసె
కలుచ పరచకురే కాంతలాల
నెలకొన్నరమణుని నేనే సాదించేఁగాని
అలరి యప్పటి మాఁటలాడకురే మీరు ॥ మరి ॥

మన మాడేమనఁగానే మాటలాతఁడే యీడె
మనసు విరుచకురే మగువలాల
వెనకముందరికెల్లా వేదుక సేసేఁగాని
చెనకి యీతని రట్టు సేయకురే మీరు ॥ మరి ॥

చెఱఁగు నేఁ బట్టఁగానే చేరి యీతఁడు కూడె
గుఱిగా దూరకురే కొమ్మలాల
తఱి శ్రీ వేంకటేశుఁడు తాను నేను నొక్కటే
యెఱుఁగు నన్నియు నేరా లెంచకురే మీరు ॥ మరి ॥ 266 ॥

## ఆహిరి

ఇంతితో మాటాడవయ్య ఇఁక నేఁటికి
చెంతలఁ జెలి వుండితే సిగ్గు వొయ్యీనా ॥ పల్లవి ॥

తేనెలు గారేటి మోవి తి ట్లాపెఁ(పె?) దిట్టితేను
ధానసే మగతనము తక్కువయ్యీనా
నానఁబెట్టి పెలవుల నవ్వులు నవ్వితేనేమి
కోనలనీ బిరుదుకు కొంచెమయ్యీనా ॥ ఇంతి ॥

వేగలు దేరేటి గోర వెక్కు లాపె నొక్కితేను
సాగిన దొరతనము చవుకయ్యీనా
బాగుగ నీ పాదమునఁ దొక్కితేను
వేగిరపుఁ బంతానకు వెలితయ్యీనా ॥ ఇంతి ॥

పాలుగారే చన్నులను పైకొని యాపె యొత్తితే
మేలిమి నీమనసెల్ల మెత్తనయ్యీనా
యీలీల శ్రీ వేంకటేశ యింతి నిన్నుఁ గూడెనిదె
అలరి నీ వలపులు అంగడికెక్కీనా ॥ ఇంతి ॥ 267 ॥

## కన్నడ గౌళ

నిక్కమైన మాబతుకు నీ చేతిదే
యెక్కడి కెక్కడ మమ్మునేల కొసరేవు ॥ పల్లవి ॥

యిందు రమ్మని పిలువ యేలుకొన్న దాననా
మందటలాడి పెనఁగ మంకుదాననా
విందులు చెప్పఁగ నీకు వియ్యాల దాననా
యెందుదాన మమ్ము నీవు యేలకొసరేవు ॥ నిక్క ॥

అండఁ గాచుకుండేనంటే అద్దికపుదాననా
దుండగానఁ బట్టి తియ్య దొమ్మిదాననా
బందుగా నవ్వులు నవ్వ పల్లదపుదాననా
యెండలెల్లాఁ బాపితివి యేల కొసరేవు ॥ నిక్క ॥

పారె నీకు బుద్ది చెప్ప చదివించే దాననా
మేరలు మీరఁగ నీతో మేనదాననా
ఆరితేరి శ్రీవేంకటాధిప నన్నుఁ గూడితే (తి?)
యీరీతి మొక్కితి నన్ను యేల కొసరేవు ॥ నిక్క ॥ 268 ॥

వరాళి

నమ్మితి నీ మాటలకు నాయ మేలయ్యా
సమ్మతించిన పనికి సాకిరేలయ్యా ॥ పల్లవి ॥

ముచ్చటలు నాడితిరి మొదలనే నవ్వితిరి
తచ్చనలు మాతోడఁ దగదయ్యా
నిచ్చ నిచ్చ నీగుణాలు నే నెఱఁగని వున్నవా
అచ్చుతౌదు రిన్నిటాను ఆనలేలయ్యా ॥ నమ్మి ॥

కను సన్న సేసితిరి కల్లలు నిజా లంటిరి
పిన్నదాన నాతోనేల పెనఁగేవయ్యా
పన్నిన నీ మాయలెల్లా బయలు నేఁ జేయనివా
నున్నని చెక్కులు మావి నొక్కకువయ్యా ॥ నమ్మి ॥

యేకతాలు నాడితిరి ఇందరి మెప్పించితిరి
మాకు మీకు నింత యెడమాఁట లేలయ్యా
కైకొని శ్రీ వేంకటేశ కందువ నన్నుఁ గూడితి-
రేక చిత్తమాయ మీరు ఇట్టె వుండరయ్యా ॥ నమ్మి ॥ 269 ॥

బౌళి

ఏమి చెప్పే నిఁక మరి యెందు మావినాఁ దెగదు
కోమలపు సతులకు గురియైనవాఁడవు ॥ పల్లవి ॥

చేర నీవు రాకుండఁగ చెలులఁ గోపించేనంటే
దూరరానియట్టి బలుదొరవు నీవు
నేరక వలచితిని నేనే అనుకొనేనంటే
సారమైన మేల్లిచ్చి సతమైనవాఁడవు ॥ ఏమి ॥

మది నిన్నుఁ బాసి వుండి మరునిఁ దిట్టేనంటే
వదలని మహిమ దేవరవు నీవు
పదరి నేనైనా గొంత పరాకై వుండేనంటే
యెదలోనఁ బ్రాణమవై ఇరవైన వాఁడవు ॥ ఏమి ॥

శిజాగు నీవు సేయఁగాను సవతుల ననేనంటే
భోగించనేర్చిన వల్లభుఁడవు నీవు
బాగుగ నిన్నుఁ గూడితి పంతములాడేనంటే
చేగలుదేరినయట్టి శ్రీ వేంకటేశుఁడవు ॥ ఏమి ॥ 270 ॥

రేకు 1746 మాళవిగౌళ

నీయందునే కంటిమి నెట్టుకొన్న మంకులెల్ల
వాయెత్తితేఁ గోరుగొనేవారు గలరా ॥ పల్లవి ॥

పంతము లేమిటికే బలువుఁడాతఁడు నీకు
అంతట నింతటనుఁ బ్రియాలు చెప్పఁగా
బంతినే దయదలఁచి పాలుఁగూడుఁ బెట్టితేను
వంతులకు నోకిలించేవారు గలరా ॥ నీయం ॥

కోపము లేమిటికే కోడెకాఁడతఁడు నీకు
చేపట్టి నవ్వులు నవ్వి చెక్కునొక్కఁగా
యేపుల నిధానము యెదురుకట్ల నుంటే
వైపుల మారుమోమయ్యేవారు గలరా ॥ నీయం ॥

పిగ్గులు నీకేఁటికే శ్రీవేంకటేశ్వరుఁడు
దగ్గరి కాఁగిటఁగూడి తమకించఁగా
వొగ్గిన రతులలోన వూరకైనా వలపులు
వగరించి చవిగొనేవారు గలరా ॥ నీయం ॥ 271 ॥

## ఆహిరి

ఇందు నున్న దందూ నున్న దింతా మోహము
కందువలెల్లా నిండె ఘనమైన మోహము ॥ పల్లవి ॥

కన్నుల నిన్నుఁ జూచి కాంక్షలు తనివొందవు
వున్నతి రెప్పలతుద నుంది మోహము
చన్నులను నిన్ను నొత్తి జవ్వనము తనివోదు
పన్ని వురమునందే పాదుకొనె మోహము ॥ ఇందు ॥

పాటించి మాటలాడి భావము తనివందదు
వోటలేక పెదవుల నుంది మోహము
[1]చిటకానఁ జెనకియు చేతులును దనివోవు
వూటువ గూడి గోళ్లకొన నుంది మోహము ॥ ఇందు ॥

నిక్కి నీ సేవలు సేసి నిలువెల్లాఁ దనివోదు
వొక్కటై దేహముమీఁద నుంది మోహము
గుక్కక శ్రీవేంకటేశ కూడి ఇంకాఁ దనివోదు
పెక్కురతి బంధాలఁ బెనఁగొనీ మోహము ॥ ఇందు ॥ 272 ॥

## శ్రీరాగం

ఇచ్చకురాల నీకు నింత సేసేనా
అచ్చువలె నుండ నిన్ను నంత సేసేనా ॥ పల్లవి ॥

తగవులఁబెట్టె నాపె తమకించి తిట్టె నాపె
యెగసక్కెన నేనైతే యింత సేసేనా
నగుతానే వద్దనుండి నాయము దీర్చితిఁగాక
ఆగపడ్డనిన్ను రట్టు అంత సేసేనా ॥ ఇచ్చ ॥

---

1 'చిటకాన', చిట్టకమునకు వ్యావహారికమో? లేక ప్రాసనిర్బంధమో?

సన్నలు సేసె నాపె చలము సాదించె నాపె
యెన్నికలుగా నిన్ను యింత సేసేనా
పన్ని నే నడుమ నిన్నుఁ బట్టుక వుండితిఁగాక
అన్నిటా నాపెకు లోనై అంతసేసేనా ॥ ఇచ్చ ॥

కలికలిఁ బెట్టె నాపె కాఁగిలించుకొనె నాపె
యెలువులు చూపి నిన్ను యింత సేసేనా
వెలువు తోడుతను శ్రీవేంకటేశ నేఁగూడితి
అలిలేక చొక్కి నిన్ను నంత సేసేనా ॥ ఇచ్చ ॥ 273 ॥

## ఆహిరి

నేరుపరినైతే నాఁడే నిన్నిన్నిటా మెప్పించనా
వూరకే నే మొగమోడి నుందానఁ గాక ॥ పల్లవి ॥

మంకుదాననైతే నిన్ను మాటలాడ నిత్తునా
బింకపు దాననైతేను పెచ్చు రేఁచనా
అంకకత్తెనైతే గోర నాయము లంటించనా
పొంక మెఱఁగక నిన్నుఁ బొదిగేఁగాక ॥ నేరు ॥

పంతగత్తెనైతే నీకు బలుములు చూపనా
వింతదాననైతే నిన్ను వేసరించనా
జంతదానివలెనైతే చలము సాదించనా
అంతేసి నేరక నీకు నాలనైతిఁ గాక ॥ నేరు ॥

కపటపు దాన నైతే కాఁకలను ముంచనా
కపురులదాననైతే గతి గూడనా
యిపుడె నన్నుఁ గూడితి వెరిఁగి శ్రీవేంకటేశ
వుపమించి చూడక నే నొక్కటైతిఁ గాక ॥ నేరు ॥ 274 ॥

## రామక్రియ

ఏమి నవ్వేవే నామాట యిది నీవెఱఁగనిదా
చేముంచి పరులకుఁ జేసినదివో యెప్పుడు ॥ పల్లవి ॥

చనవరి వౌదువే సతి నీవు పతికిని
పొనుఁగక నాపై బత్తి కుట్టించరాదా
యెనసి తమకుఁదామే యెవ్వరైనా బతికేరు
ఘనత నొరుల వుపకార మౌటే యెక్కుడు ॥ ఏమి ॥

నేరుపరి వౌదువే నీ విభుని మా ఇంటికి
కోరి వేఁడి తోడితెచ్చి కూడించరాదా
ఆరీతి తాము భోగించిన దెవ్వరెరుఁగుదురు
పేరడిగాఁ జుట్టాలకుఁ బెట్టినదే యెక్కుడు ॥ ఏమి ॥

బలుదాన వౌదువే పక్కన శ్రీవేంకటేశు
గలయించిట్టె మేలు గలుగరాదా
వలవ నేరరా తాము వనితలు లోలోన
వలపొరులకుఁ జవి వడ్డించుటే యెక్కుడు ॥ ఏమి ॥ 275 ॥

## పాళంగం

నీ తలనే వేగెనా నెలఁత యిది
యీతలఁ బతిమాఁటలు యియ్యకొనఁగదవే ॥ పల్లవి ॥

తలపోఁత లెక్కుడైతే తమకము గనమౌను
బలిమిఁ గలిగితేను పంతము రేఁగు
చలములు మిగిలితే సాదింపులు కొనసాగు
వలచినవారి కిది వదలని సాజము ॥ నీత ॥

కాఁకలు దఱచయితే కనుచూపు వాఁడౌను
ఆఁకవిరహములైతే ఆసమించును
వేఁకమైన వయసైతే వెరపులన్నియుఁ బాసు
యేఁకట గలవారికి యెప్పుడును సాజము ॥ నీత ॥

సిగ్గులు దఱచయితే సెలవుల నవ్వు నిండు
వెగ్గళించఁ జూచితేను వేడుక దక్కు
అగ్గమై శ్రీవేంకటేశుఁ డప్పుడే నిన్నిదె కూడె
దగ్గరిన చుట్టాలకు తప్పదు యీసాజము ॥ నీత ॥ 276 ॥

రేకు 1747 గౌళ

ఒద్ద నున్నా రదిగో వూరి వారెల్లా
ముద్ద గట్టి ఆసలెల్లా మోఁపు గట్టుకోరాదా ॥ పల్లవి ॥

పంతములు నీతోనా బలుములు నీతోనా
ఇంతటి దొరవు నీతో నేమనవచ్చు
కాంతలము మమ్ము నేల కదు రట్టు సేసేవు
దొంతి నున్న వలపులు తొడికి తియ్యరాదా ॥ ఒద్ద ॥

చలములు నీతోనా సాదింపులు నీతోనా
యెలమి దేవరవు నిన్నేమన వచ్చు
చెలులము మమ్మునేల సిగ్గులు వరపించేవు
వొలుగులువారీ నవ్వు వొడిగట్టుకోరాదా ॥ ఒద్ద ॥

దిట్టతనము నీతోనా దీమసము నీతోనా
ఇట్టె శ్రీ వేంకటేశ నిన్నేమన వచ్చు
మెట్టుక కూడితి వలమేలుమంగనైన నన్ను
జట్టి గొన్న వేడుకలు జాళెఁ బోసుకోరాదా ॥ ఒద్ద ॥ 277 ॥

## సౌరాష్ట్రం

చెప్పినట్టల్లా నీకుఁ జేసేనయ్యా
తప్పులుఁ దారులు మరి తలఁచకువయ్యా ॥ పల్లవి ॥

చెనకిన దాననై చేరి మొక్కే నదివో
మనసులో చలములు మానవయ్య
పెనఁగినదాననై ప్రియము చెప్పే నేను
యెనలేని బీరములు ఇఁక నేలయ్యా ॥ చెప్పి ॥

తిట్టిన నోరనే దీవించే నిదివో
రట్టు సేయ కిఁక నీ విట్టె రావయ్య
పట్టిన పంతము మేనఁ బనిసేసె నిదివో
ఇట్టు నట్టు మారుమాఁట లిఁకనేలయ్యా ॥ చెప్పి ॥

కదుఁ జాఁచిన చేతనే కాఁగిలించే నిదివో
నడుమఁ గూడితి విట్టె నవ్వవయ్యా
అడరి శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
పడిదీర బొందితిని సంతోసించవయ్యా ॥ చెప్పి ॥ 278 ॥

## లలిత

చూచినవారు నవ్వేరు సుదతి నిన్ను
నీచేత జారినకొప్పు నీవు ముడుచుకోవే ॥ పల్లవి ॥

యెవ్వరి నేరుపులు యెవ్వరికి వచ్చీనే
నవ్వినవారి సొమ్మే నాయకుఁడు
నివ్వటిల్లే చెమటతో నీవేల వెంగెమాడేవే
దువ్వటము పయ్యెదను తుడుచుకోవే ॥ చూచి ॥

తట్టువడ నీవేల తగవులు చెప్పేవే
    వెట్టుకొన్నవారి సొమ్మే నిందు భోగాలు
    నిట్టూర్పుగములతో నీవేల యలసేవు
    వెట్ట దీర సురటిని విసరుకోవే ॥ మావి ॥

మందగించి నీవేల మచ్చికలు చూపేవే
    కందువయివవారి సొమ్మే కాఁగిటి రతి
    అంది శ్రీవేంకటేశుఁడు అలమేలుమంగ నేను
    పొందితిమి యిఁక నీవు బువ్వానకు రావే ॥ మావి ॥ 279 ॥

## వరాళి

ఇందరికి నొకచాలే యీ సుద్దులు
    సందడి వలపు మొగచాటు దోఁచీ నీకు ॥ పల్లవి ॥

చలము సాదించేవారు సారెకు నవ్వుదురా
    అలిగినవారు నీ యుండ నుందురా
    మెలమి గొడవలెల్ల యేల కక్కేవు మామీఁద
    పిలువరా చెప్పించే నీ ప్రియురాండ్ల చేతనే ॥ ఇంద ॥

తప్పలు వట్టేవారు తగిలి వీడెపిత్తురా
    వుప్పటించేవారు నీతో నొద్దికవునురా
    నెప్పున నీవేల మాపై నెపములు వేసేవు
    చెప్పించే పిలువరా నీ చెలువలచేతనే ॥ ఇంద ॥

సొలపేటివారు నిన్ను చెక్కులఁ బెట్టుదురా
    కలసితి నిదె శ్రీవేంకటేశ్వరుఁడ
    అలమేలుమంగ నేను అంత యేల కొసరేవు
    తెలిపేఁ బిలువరా నీ తెలువల చేతనే ॥ ఇంద ॥ 280 ॥

## ముఖారి

ఏల వేగిరపడీనే యింతలోఁ దాను
మేలల్లా నొకరూపైన మెచ్చులాఁడు గాఁడా ॥ పల్లవి ॥

అలిగి మాఁటాడనంటా అందుకే తా వేఁడుకొనీ
తలఁపులోఁ దలఁపది తన్నునే కాదా
పిలిచి పేర్కొన నంటా ప్రియములు చెప్పీని
తలకొన్న పాటలలో తనముద్ర కాదా ॥ ఏల ॥

మొగమిచ్చి చూడనంటా మోహములు చల్లీని
తగిన నా వయసెల్లా తనకే కాదా
నగనంటా నటు నిటు ననుపులు పచరించీ
తెగడే సరసాలలో తేటలు తాఁగాఁడా ॥ ఏల ॥

నేనే పై కొననంటా నెయ్యములు ముంచీని
నానిన తన కాఁగిలే నాది గాదా
తానే శ్రీ వేంకటేశుఁడు నే నలమేలుమంగను
కానుక యీ రతులెల్లా కతలై నిలువవా ॥ ఏల ॥ 281 ॥

## భైరవి

ఇల్లాండ్లేవ్వూరు యీ రసము లేవ్వూరు
చల్లనై నీ యంత నీవే సంతమౌట గాక ॥ పల్లవి ॥

కందువలు దెలిపేనా కాంతలకు నీకును
నిందలాడే వారి మాఁట వే నవేఁగాక
అంది నిన్ను యిందుకుఁగా అపరాదా (ధా?) లనెంచేనా
సంది నీగుణాలు నీవే చక్కనౌట గాక ॥ ఇల్లాం ॥

మచ్చరములు చూపేనా మగవలకును నీకు
పచ్చి చేఁత లెంచేవారిపాటి నేఁగాక
వొచ్చెమని నిన్నిందుకు వొరయఁజూచేనా
యిచ్చలం నీ తగవు నీ వెరుఁగుట గాక ‖ ఇల్లాం ‖

చలములు సాదించేనా సతులకు నీకును
కొలవు వారి పొత్తులు కొసరేఁగాక
యెలమి శ్రీవేంకటేశ యిటు నన్ను ( గూడితివి
బెళకగ నీవే నాకు ప్రియమౌట గాక ‖ ఇల్లాం ‖ 282 ‖

రేకు 1748 హిజ్జిజి

నావల్ల నైనదిది నీవల్ల నయ్యే దేదో
యీ వేడుకలకు వెల యెఱఁగ నే నిఁకను ‖ పల్లవి ‖

మంతనాలు నీతో నాడి మై ముట్టి సరసమాడి
యింతైతి నే రట్టు ఇందరిలోన
దొంతి వెట్టేవు వలపు దోమటి దొడుక వచ్చే-
వెంత సేసేవో నీవు యెఱఁగ నే నిఁకను ‖ నావ ‖

కప్పురవిడే లంది కన్నులఁ గానుకలంది
వుప్పతింపులలోనైతి వొద్దివారిచే
కుప్పలు సేసేవు నవ్వు గోరిమొనలు చూపేవు
యెప్పుడు చనవిచ్చేవే యెఱఁగ నే నిఁకను ‖ నావ ‖

చేతులు నీపై వేసి చెరఁగు నీపై వేసి
యేతులెల్లా నాడుకొంటి యీ వెలులలో
కాతరించి కూడితివి గక్కన శ్రీవేంకటేశ
యీ తరితీపు లెన్నేశో యెఱఁగ నే నిఁకను ‖ నావ ‖ 283 ‖

## బౌళి

నీవంక నేరమేదే విఱుమెంచి చూచితేను
పూవుల మొగ్గలే కావా పూఁపలకు మొదలు ‖ పల్లవి ‖

పడఁతిరో నీ వదేమే పట్టాడే వాతనికిఁగా
యెడమాట లాడఁబోయి యెనసితివా
నడుమ విందారగించే నాలిక యటుండఁగాను
తొడికే చేయేకాదా తొలుతఁ బైకొనును ‖ నీవం ‖

మానిని అదేమే వాని మంకులు చెల్లఁబెట్టేవు
కానుక లియ్యఁగఁబోయి కలసితివా
మానలేక వలచిన మనసట్టే వుండఁగాను
కోనల చూపులే కావా గురి గాఁడి పారును ‖ నీవం ‖

శ్రీవేంకటేశ్వరు నన్నుఁ జేకొని కూడించితివి
నీ వొల్లికడమ నిండ నెలకొంటివా
కైవశపు మేనికిని కాఁగిలి యటుండఁగాను
[1]రావాడే చన్నులే కావా రతికెక్కు నడుమ ‖ నీవం ‖ 284 ‖

## లలిత

ఆపెకు మాకును నేఁడు అంతర మెంత
కాఁపురాలు వేరె వేరె కనుకొంట గాక ‖ పల్లవి ‖

మాటలమందులు నూరి మరిగించుకొనె నాపె
యీటు వెట్టుకోము నేము ఇల్లాండ్లము

---

[1] రాపు+ఆడు=రావాడు=మోహరించు, బిరుసెక్కు, కళకళలాడు, ఆకర్షించు ఇత్యాదులు అర్థము కావచ్చు. 'వాని మొగము రావు గలిగినది' ఇత్యాది వ్యవహారము నేటికిని గలదు.

వీటికి మాటికి నీతో సిగ్గులు వీడిని నాపె
కూటముల నేమైతే గుట్టుగలవారము ॥ ఆపె ॥

చెవిలో మంత్రాలు చెప్పి చే చిక్కించుకొనె నాపె
తివిరి వింతసేయము దేవుళ్లము
చవులుగా మోవి ఇచ్చి చనవులు చూపె నాపె
ఇవల నేమైతే నీకు ఇచ్చకపు వారము ॥ ఆపె ॥

జంగిలి మాయలు సేసి జట్టిగొన (నె?) నిన్ను నాపె
కంగువెట్టుకోము నేము గరితెలము
అంగవించి శ్రీవేంకటాధిప నన్నుఁ గూడితి
సంగతి నీకు నేమైతే సతమైన వారము ॥ ఆపె ॥ 285 ॥

## మంగళ కౌశిక

అది నామేలే కాదా ఆ వనిత నేనే కానా
పోదిగొన న న్నిందు కిపుడే మెచ్చేఁగాక ॥ పల్లవి ॥

దగ్గరి వచ్చెనా ఆపె తమకించెనా నీపై
సిగ్గులు వడక నాతోఁ జెప్పరాదా
వెగ్గళించెనా నిన్ను వెరపు నీకేమిటికి
నిగ్గులఁ బరిణామించి నిందుకొనేఁగాక ॥ అది ॥

అంగన నీతో నవ్వెనా ఆకు మడిచిచ్చెనా
చెంగనేల నాతోఁ గొంత చెప్పరాదా
కంగు వెట్టెనా నీతో కల్ల గుట్టు నీకేఁటికి
పొంగుచు నీ గుణములు పొగడేగాక ॥ అది ॥

కలసితిరా ఇద్దరు కాఁగిలించెనా నిన్ను
చెలరేఁగి నాతో నిట్టె చెప్పరాదా

అలరి శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
చలివాసి యీరెంటికిఁ జనవిచ్చేగాక ॥ అది ॥ 286 ॥

## మాళవిగౌళ

ఎంత సేసేవు నాతోను యెరవులదాననా
వింతలుగాఁ జూచేనా వేడుక నీ పొందులు ॥ పల్లవి ॥

కమ్మరఁగమ్మర నాతోఁ గడు బాసలు సేసేవు
నమ్మనా తొల్లి నిన్ను [1]నాటకీఁడా
కుమ్మరించేవు వలపు గొనకొన్న ప్రియములు
సమ్మతించనా నేను సరి నీ యానతికి ॥ ఎంత ॥

అందు నిందు నిచ్చకము లట్టె యేల మాపేవు
పొంది నిన్నుఁ గోపించేనా [2]బూటకీఁడ
చిందేవు వినయాలు చెక్కుల నొక్కులనే
నిందవేసేనా నీపై నీ మొగము చూచి ॥ ఎంత ॥

లలిఁదేనెగారే మోవి లంచమేల చూపేవు
కలయక మానేనా కాతరీఁడ
యెలమి శ్రీవేంకటేశ యిద్దరముఁ గూడితిమి
అలసేనా నే నిఁక అట్టె నీ రతులను ॥ ఎంత ॥ 287 ॥

## లలిత

ఎచ్చరించవైతివంటా యేల నన్ను దూరేవు యీ-
తచ్చనను గురిసేయఁదగవా నాకు ॥ పల్లవి ॥

---

[1] వాటకము + ఈఁడు. మతుబర్థ తద్ధితము.
[2] 'బూటకీఁడు' కూడ 'వాటకీఁడు' వలెనే.

కన్నె నీకు వద్దనుండి కప్పురమిదె మియ్యఁగ
పన్నలు సేసి పిలువ సంగతే నాకు
పున్నమ వెన్నెలలోన పొందులు మీరు చేయఁగ
పన్ని నే వద్దికి రాను పాడియౌనా నాకు ॥ ఎవ్వ ॥

మంచముపై నాపె నీవు మాటలాడుకొనఁగాను
పంచలఁ గానుకలియ్య భావ్యమా నాకు
మించిన వేడుకతోడ మీరిద్దరు నిద్రించఁగా
అంచెలను లేప నాయమౌనా నాకు ॥ ఎవ్వ ॥

మచ్చికఁ గాంతనుఁ గూడి మా ఇంటికి రాఁగాను
వొచ్చములు మిమ్ము నెంచ వోజా నాకు
ఇచ్చగించి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
రిచ్చల సిగ్గులువడ రీతియౌనా నాకు ॥ ఎవ్వ ॥ 288 ॥

రేకు 1749 ఆహిరి

ఏమి సేసినా నీకు యెదురు విన్నవించము
కామించి మమ్ము మన్నించు కైవశపువాఁడవు ॥ పల్లవి ॥

కారణములేనిమాట కదు నాతో నాడేవు
వూరకే, నామనసైతే వొడఁబడదు
ఆరితేరెఁ బనులు నీయంతె కెల్లా వచ్చితివి
దూరు నీపై వేసుకోకు దొడ్డవాఁడవు ॥ ఏమి ॥

పనిలేని పరపాలు పైపైనే నెరపేవు
ననిచి, నా సెలవుల నగవు రాదు
చనవులు పరివచ్చె పతమై వున్నారము
(?)ను మోవఁజేసుకోకు నిజాలవాఁడవు ॥ ఏమి ॥

చెప్పరాని సిగ్గులెల్లా సెలవుల ముంచేవు
దప్పిదేరి యందువంకఁ దమకించను
అప్పుడే శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
దెప్పరానఁ గూడితివి దీమసపు వాఁడవు ‖ ఏమి ‖ 289 ‖

## బౌళి

మొగమోటదాన నేను మొదలనే, తనతోను
యెగసక్కేనకునైన యేకతము లేదా ‖ పల్లవి ‖

చిత్తములోపలిమాట చెప్పఁజాలకుండితేను
వొత్తువెట్టీ మానఁ దూరకైనాను
పొత్తుల నున్నది కీలు భోగించినవాఁడు తాను
ఇత్తలఁ దనకు గొంత యేకతము లేదా ‖ మొగ ‖

సిగ్గులు మీరిన చేఁత సేయఁ జాలకుండితేను
అగ్గలమై వెరిగించీ నందాఁకాను
వెగ్గళించె వలపులు వెఱపెఱఁగఁడు తాను
యెగ్గులు దీరుచుకోను యేకతము లేదా ‖ మొగ ‖

నను పైన సుద్దులకు నవ్వఁజాలకుండితేను
చెనకి మొగము చూచి చిమ్మిరేఁచీని
అనుగు శ్రీవేంకటేశుఁ డలమేలుమంగ నేను
యెనసె నిప్పుడు తన కేకతము లేదా ‖ మొగ ‖ 290 ‖

## భైరవి

వెరవు లెరుఁగుదువు వేవేగ రావయ్య
ఇరవైన అప్పణ నీ కిచ్చెఁ గదవయ్యా ‖ పల్లవి ‖

దప్పి గొంటి నంటాను తరుణి నీ కెమ్మోవి
కప్పురము మారుగాను కైకొన్నదట
చెప్పె నాకు నానవాలు చేరి నాతో పొందుసేసి
ఇప్పు డిట్టె నాకుఁ జనవియ్యవయ్యా ॥ వెర ॥

చలిగొనీ నంటాను సకియ నీ పచ్చడము
నిలువు గప్పులు గప్పీ నీతో నట
యెలమి నీ కిక్కువగా యీమాటే చెప్పుమనె
వలపుల నన్నుఁగూడి వదలకువయ్యా ॥ వెర ॥

తాను నీవు నొక్కటంటా తరుణి శ్రీవేంకటేశ
నానిన రతులఁ గూడి నవ్వెనట
ఆనెలఁత వావి చెప్పె అలమేలు మంగ నేను
పూని నన్నుఁ గూడితివి పొంతనా లీవయ్యా ॥ వెర ॥ 291 ॥

## రామక్రియ

ఎంతవాఁడవయ్య నీవు యెక్కడెక్కడ
పొంత నీ జాణతనాలు పొగడేము నేము ॥ పల్లవి ॥

మాటలనే తేనెలూరీ మంతనాన నోరూరీ
[1]యేట వెట్టె నీ మహిమ లెక్కడెక్కడ
తేటలు నీచేత విని దేహమెల్లాఁజెమరించె
మూటలుగా నవ్వితిమి మొక్కేము నీకు ॥ ఎంత ॥

---

[1] ఏటవెట్టు=(ప్రకరణముతో) అతిశయించు అను నర్థముగా తోచుచున్నది. ఏఁట='వేట' అనీ ఏట = ప్రధానము వగైరా అర్థమనీ, సూ.ని. దీనియర్థము విచార్యమని 22వ సంపుటము సందిగ్ధపద సమీక్షలో వ్రాసియుంటిని. చూ. 22 సంపుటము 427 పేజి.

చూపులనే వాఁడి రేఁగీ సొలపుల నాసరేఁగీ
యేపున నీయెమ్మె లివి యెక్కడెక్కడ
తీపుల నీపాలఁ జిక్కి తిద్దుపడె గుణమెల్ల
మోపుగా వలచితిమి మొక్కేము నీకు ॥ ఎంత ॥

కందువల దమి వుట్టె కాఁగిట బీరము వుట్టీ
ఇందులోని నీ నేరుపు లెక్కడెక్కడ
పొందితి శ్రీవేంకటేశ భోగము రతులకెక్కె
ముందర నింకొకమాఁటు మొక్కేము నీకు ॥ ఎంత ॥ 292 ॥

## పాళంగం

ఇంత సేసినవాఁడవు యీడేర్చవయ్యా
కొంతైనా నీ దీమసము కొమ్మ కియ్యవయ్యా ॥ పల్లవి ॥

వలపుల వడ దాఁకె వనిత నిన్నుఁ బాయఁగ
అలరి చలి మందుల కప్పణీవయ్యా
నిలువెల్లఁ జెమరించె నీతోడి సరసముల
పొలుపుగ మంచిగందవొడి గూర్చవయ్యా ॥ ఇంత ॥

ఆసల నుంగిటి గొనె అట్టె నీకెదురు చూచి
సేసచల్లుమ వద్దని చెప్పించవయ్యు
రాసికెక్కఁ బులకించె రతి నీయెడ మాటలు
వాసిఁ గుచ్చి ముత్తేలుగాఁ జేసి దాఁచుకోవయ్యా ॥ ఇంత ॥

రతిఁ బరవశమందె రవ్వగ నీవు గూడఁగ
సతిని కొనగోర నెచ్చరించవయ్యా
మతి నన్ను జంకించె నెమ్మదిని శ్రీవేంకటేశ
తతివచ్చె నీ బాసలు దలఁచుకోవయ్యా ॥ ఇంత ॥ 293 ॥

వరాళి

నిజము లొలుకనేల నీకు నీకే మాతోడ
గజిబిజి చేఁతలనే గయ్యాళించే విపుడు ॥ పల్లవి ॥

కపటము లేక మదిఁ గాఁతాళము వొడమదు
నెపము గలితేఁగాని నిందించరాదు
కపురుగ నీ యందె కంటిమి యీరెందు నేఁడు
వుపమ లిందరివలె వూరకుండ విపుడు ॥ నిజ ॥

కన్నుసన్నలు సేయక కందువ నాస వుట్టదు
వెన్నెలు వెట్టితేఁగాని వెంగెముగాదు
ఇన్నియు నందరికి నీ విచ్చిన విద్యలు నేఁడు
విన్న కన్నచోట వెల్లావిరి సేసే విపుడు ॥ నిజ ॥

దగ్గరి కూచున్నఁగాని తమకములు రేఁగవు
సిగ్గు విడిచినఁగాని చెనకరాదు
యెగ్గుదీర శ్రీవేంకటేశ నన్నుఁగూడితివి
వెగ్గళించి రతులలో వెరగందే విపుడు ॥ నిజ ॥ 294 ॥

రేకు 1750 గుజ్జరి

చెప్పకు చెప్పకు నాకు చేరి నీవు వచ్చిసేసి
చొప్పుగా నీవు చూచిన చూపురే గురుతు ॥ పల్లవి ॥

మోహము గలవారికి మొగచాటు గలదా
దాహపుటడియాసలతము (గు?)లే కాక
పోహణించి యేల నాకుఁబుట్టించేవు తరితీపు
యీహల మరునిపూవు టేట్లే గురుతు ॥ చెప్ప ॥

ఇయ్యకోలైనవారికి యెరవులు గలవా
వెయ్యపు సరసములో నేరుపేకాక
వొయ్యనే ఇంతేసి యేల వొప్పగించేవు నీమేలు
ముయ్యక ముందు మొక్కిన మొక్కులే గురుతు ॥ చెప్ప॥

తగులు గలవారికి తచ్చనలు గలవా
నగిన సెలవులలో ననుపేగాక
అగపడి శ్రీవేంకటాధిప నన్నుఁ గూడితి
జిగిమీరఁ జేసినట్టి చేఁతలే గుఱుతు ॥ చెప్ప ॥ 295 ॥

వేళావళి

ఎంత సేసే విందుకుఁగా యేల లోఁగేవు
వింతవారి వలె నిన్ను వేసరించేనా ॥ పల్లవి ॥

పూసగుచ్చినట్టు నిన్నుఁ బొగడేటి దానను
రాసికెక్క నిందరిలో రవ్వసేసేనా
సేస వెట్టి ఇట్టె నీపైఁ జేయి చాఁచే దానను
వీసమంత పనికిఁగా వెంగెమాడేనా ॥ ఎంత ॥

నగుతానే నే నీకు ననుపైనదానను
తగవులఁబెట్టి నేఁడు తమకించేనా
మొగము చూచి సారె మొక్కేటిదానను
పగటుఁదనాలు సేసి పంతము చూపేనా ॥ ఎంత ॥

కొసరి కొసరి నిన్నుఁ గూడినట్టిదానను
కుసి గుంపు నీవలపు గోరసేసేనా
యెసగ శ్రీవేంకటేశ యియ్యకొన్నదానను
మసరి వైతివి నీపైఁ జొప్పులెత్తేనా ॥ ఎంత ॥ 296 ॥

## ముఖారి

ఎలయించే అందులకు నెవ్వరమైతిమేని
పొలసి పూచినమీఁద పూఁపలయ్యీఁగాని || పల్లవి ||

కందువలు నీకుఁ జూపి కాఁకలు మతిలో నించి
సందడిఁ బెట్టేఁగా ఆపె సారె సారెకు
అందుకొని నన్నుఁ జూడు మాపెకంటె భ్రమఇంచి
విందు వెట్టి కాలు దొక్కి వెంట దిప్పీ నిన్నును || ఎల ||

కొంగువట్టి తీసి నిన్ను కొలువులోపల నవ్వి
అంగడిఁ బెట్టేఁగా వల కాపె తొలుతె
సంగడిఁ జూడు నానేర్పు సరి నాపె వలెనే
అంగమంటి మీఁద మీఁద నాసలు రేఁచేను || ఎల ||

కావరించి మొక్కు మొక్కి కాఁగిలించుకొని మెచ్చి
చేవదేర నాపె సేవ సేసేఁగా నీకు
శ్రీ వేంకటేశ నన్నుఁ జేరి కూడితివి చూడు
వేవే లాపెకంటె వెల్లావిరి సేసే నిపుడు || ఎల || 297 ||

## రేవగుప్తి - అటతాళం

కడమ లెక్కడి విఁక కానవచ్చిన పనికి
జడిసి దోమటి విందు చవివుట్టీనా || పల్లవి ||

మానిని మాటలే నీకు మదన రహస్యములు
నానఁగా [1]నిన్న వెడుగ నాకుఁ దగవా
[2]తేనెగారే అధరపు తేనెలు నీ తలకెక్కె
వీనుల (లు?) వూరఁగతలు వినఁగూడీనా || కడ ||

---

[1] విన్నువ్+ అవి+ అడుగవ్= విన్న వెడుగ
[2] 'తేనెగారే అధరపు తేనెలు' ఇందులోని పునరుక్తి రుచిగా లేదు

యింతి కానుకలు నీకు యిచ్చిన సంచకరువు
దొంతులైన వవి మాకు తోయవసమా
చెంతల నెగరవేయ చేతులకు నీకుఁ జిక్కె
యెంతవారు పిలిచినా నియ్యకొనేవా ॥ కడ ॥

పొలిఁతిఁ కాఁగిలి నీకు భోగపు పెండ్లి చవికె
వెలులము మా యెదుట సిగ్గు వడేవా
కలగంపలాయఁ బొందు కడపలోపల నేఁడు
అలరి శ్రీవేంకటేశ అడ్డమాడేవా ॥ కడ ॥ 298 ॥

## నాదరామక్రియ

ఆతఁడే నీవు గావా అందుకేమే
కాతరపు పరసాలు కడురేఁచవలెనా ॥ పల్లవి ॥

తమకపు రమణుఁడు దగ్గరఁ గూచుండితేను
జమళిసిగ్గు లేఁటికి జళిపించేవే
కొమరెవు నిన్నాతఁడు కొంగువట్టి పెనఁగితే
వుమురుకూటపుఁజూపు లుగ్గడించ నేఁటికే ॥ ఆతఁ ॥

నయగారి నీ విభుఁడు నవ్వులు నవ్వితేను
ప్రియమున బింకాలు పెనచనేలే
క్రియయెరిఁగి నీమీఁద కేలు చాఁచి కొసరితే
నియతపుఁబెనువొట్లు నీకేఁటికే ॥ ఆతఁ ॥

శ్రీ వేంకటేశ్వరుఁడు చెక్కులు నిన్ను నొక్కితే
నీవల రతుల భ్రమయించ నేఁటికే
కైవసమై నీవితఁడు కప్పుర విడె మిచ్చితే
వేవేగఁ గూడి మరి వెరగంద నేఁటికే ॥ ఆతఁ ॥ 299 ॥

## సామంతం

మేలు మేలు జాణవౌదు మెచ్చితి నిన్ను
కాలు దాఁకి నంతలోనె కందువ లంటేవు ‖ పల్లవి ‖

నెయ్యపు చేఁతలకెల్ల నేరుపరివంటేను
పయ్యెద కొంగు వట్టేవు పలుమారును
తొయ్యలుల రతికిని దొడ్డవాఁడ వంటేను
తియ్యని మో వడిగేవు తేఁకువ మెరయను ‖ మేలు ‖

నంటున నీమోము చూచి నవ్వులు నవ్వితేను
వెంట వెంటఁ బొదిగేవు వేసారవు
వొంటరి వనుచు నీ కొలువును సేసితేను
అంటిముట్టి సరసములాడఁ జూచేవు ‖ మేలు ‖

సమ్మతించి యిన్నిటాను చనవు చెల్లించితేను
దిమ్మరి విద్యలఁ గూడి తెరవేసేవు
నెమ్మది శ్రీవేంకటేశ నీకు నే నెదురాడేనా
కుమ్మరించి వలపులు గురిసేసేవు ‖ మేలు ‖ 300 ‖

రేకు 1751

## దేసాళం

ఎందాఁకా వట్టి జోలి యెఱఁగనా నేఁ దొల్లి
చందమాయ సుద్దులెల్ల చాలుఁ జాలు నిఁకను ‖ పల్లవి ‖

చెప్పుమంటా నన్ను నేల చేరి [1]వెద్దు వెట్టేవు
తప్పక చూచితేనే తలవంచితి
దప్పిదేరి నీమోవి దగదొట్టీ నిందువంక
చప్పచార్లై యలసేవు చాలుఁ జాలు నిఁకను ‖ఎందాఁ ‖

---

[1] వెద్దు వెట్టుట='నిర్బంధించుట' కావచ్చు.

ప్రియములు చెప్పి యేల పెనఁగ వచ్చేవు నాతో
నయములు చూపఁగాను నవ్వు నవ్వితి
క్రియలెల్లఁ గానవచ్చీ కేలు మీఁదై యిందువంక
జయమాయ వేగిరాలు చాలుఁ జాలు నిఁకను ॥ ఎందాఁ ॥

కొంగువట్టి తీసి యేల కూడితి వింతటిలోనె
ముంగిటికి నీవు రాఁగా మోహించితి
అంగమాయ శ్రీవేంకటాధిపతి ఇందువంక
జంగిలి కొసరు లెల్ల చాలుఁ జాలు నిఁకను ॥ ఎందాఁ ॥ 301 ॥

## పాడి

దయగలవాఁడు తాను తప్పు లేఁటివే
నయగారి తనముల నవ్వింతుఁగాక ॥ పల్లవి ॥

తలఁపెల్లఁ దానె తనకేఁటి విన్నపము
చెలఁగి తాఁ జేసినట్టు చేసుగాక
చెలువలేమి చెప్పేరు చేతఁ జిక్కెనిదెముద్ర
వెలలేని వేడుకల వేగింతు గాక ॥ దయ ॥

పనులెల్లఁ దానె పట్టి పెనఁగేదేది
చనవిచ్చిన కొలఁది జరపుఁగాక
ననుపులేమెంచేము నాలుకమున్నది పేరు
కనుకలి వినుకలిఁ గైకొందుఁ గాక ॥ దయ ॥

కాఁగి లెల్లఁదానె కందువకుఁ దీసేదేమి
మూఁగినమోవితీపులు మరుపుఁగాక
వేఁగ దేరేదేమి తానె శ్రీవేంకటేశుఁడు గూడె
వీఁగనిరతిఁ జొక్కించి వెలయించుఁగాక ॥ దయ ॥ 302 ॥

## గౌళ

ఎంత నీరాజస మిదియేమే నీవు
పంతపుఁ జేఁతల నిన్ను భ్రమఇంచ నేరఁడా ॥ పల్లవి ॥

చక్కని వదనమున సన్నచేసె నాతఁడు
యెక్కడి పరాకు నీకు యేమే నీవు
వెక్కసపు చన్నులతో విఱ్ఱవీఁగేవు గర్వాన
మిక్కిలి రతులనవి మెదుపఁగ నేరఁడా ॥ ఎంత ॥

చిలుకుగోళ్ల చేతుల చెయివట్టె నాతఁడు
యెలమి మారు మలసేవేమే నీవు
నిలువుఁ దురుముతోడ నీవు కపటాలు చూపి
అలరి పంతాలు చూప నాతఁ డింత నేరఁడా ॥ ఎంత ॥

దొంతర సరసముల దొమ్మిచేసె నాతఁడు
యింతలోనె సిగ్గువడేవేమే నీవు
మంతనాన పయ్యదను మఱఁగువెట్టి కూడితి-
వెంతైనా శ్రీవేంకటేశుఁడివి మీర నేరఁడా ॥ ఎంత ॥ 303 ॥

## మాళవిగౌళ

కడు లా వరవు దాను కానమా నేము
యెడపదొడపఁగాగ యెదిరించఁగలమా ॥ పల్లవి ॥

నయగారి పటకాఁడు నన్నువేల తడవీనే
ప్రియురాండ్ల తోనే పెనఁగుఁగాక
క్రియ యంత యెరిఁగితే కిమ్ముల కంబము లేదా
దయతోడిలేమలము తన కోపఁగలమా ॥ కడు

కొత్త కొత్త కోడెకాడు గోళ్లేల రాఁచీనే
చిత్తము వచ్చినవారిఁ జెనకుఁగాక
వొత్తి రాచవలసితే నూరకే రాళ్ళు లేవా
తత్తరపు టింతులము తన కోపఁగలమా ॥ కదు ॥

నీటు శ్రీవేంకటేశుఁడు నేనెట్టు నన్నుఁ గూడెనే
వాఁటమైన వారికే వలచుఁగాక
పాటించి పట్టి బిగించ బయలుకాఁగిట లేదా
తాటించి నిందురతిని తన కోప గలమా ॥ కదు ॥ 304 ॥

పాడి

ఔనే మంచిదాన వౌదువే నీవు
సానఁబట్టి వలపులు జళిపించేవు ॥ పల్లవి ॥

చెలఁగి యాతఁడు నీకుఁ జెప్పేటి ప్రియాలకా
చలపట్టి దగ్గరక జంకించేవు
మొలకనవ్వులు నవ్వి ముంచిన మోహోవకా
వలవని జాగుతోడ వంచేవు శిరసు ॥ ఔనే ॥

చిత్తగించి నీమీఁద జేయి వేసినందుకా
కొత్తలుగా నీవు కొనగోరఁజిమ్మేవు
బత్తిసేసె నీకు మంచి బాగా లిచ్చి నందుకా
యెత్తిన మదముతోడ యీసడించేవు ॥ ఔనే ॥

కుచ్చిపట్టి కాఁగిలించి కూడిన యిందులకా
హెచ్చి శ్రీవేంకటేశ్వరు నెలయించేవు
బచ్చన సరసముల పంతమిచ్చినందుకా
విచ్చనవిడుల నీవు వేసాలు పేసేవు ॥ ఔనే ॥ 305 ॥

ఆహిరి

అవ్వలిమో మే(మేఁ?)టికే అంతవానితో
నవ్వులు నవేటివేళ నవుపులే కాక ॥ పల్లవి ॥

ఆఁటదానికేఁటికే అంతేసి చలములు
పేటగా మగవానితో ప్రియమేకాక
యీటువెట్టి నీకతఁడు యెంత కిందుపడినాను
చీటికి మాటికి సేవ సేయవలెఁగాక ॥ అవ్వ ॥

మగువకు నేఁటికే మాసటీని పంతాలు
మొగము చూచి పన్నల మొక్కులే కాక
జగడము దీర నెంత చనవు నీకిచ్చినాను
మిగుల నీ వినయాలే మించవలె గాక ॥ అవ్వ ॥

సతికి నింతేఁటికే సరిచేసి బింకాలు
యితవైన మనసుల యేకమేకాక
వెత దీర నిన్నును శ్రీవేంకటేశుఁ డిదె కూడె
మితిలే కిందుకే నీవు మెచ్చవలెఁగాక ॥ అవ్వ ॥ 306 ॥

రేకు 1752 శుద్ధదేశి

ఎందు వోయీ నతఁడు యేమనే నేను
చందమాయఁ బనులెల్ల చలమేలే ఇఁకను ॥ పల్లవి ॥

తమకమెల్లాఁ గంటి తలఁపెల్లా నీడేరె
రమణుఁ డన్ని నెఱుఁగు రావే నీవు
కొమరె వయసుగాన కోడెకాఁడన్నిటా దాను
విమలమాయ మనసు విడువవే చెఱఁగు ॥ ఎందు ॥

యీయకొంటేఁ దనసుద్దు లిందరు దన్ను మెచ్చిరి
రాయడించ కాతనిని రావే నీవు
చాయల నడతు నేను సరసుఁడిన్నిటాఁదాను
బాయట నందరుఁ జూడ పట్టకువే ఇఁకను ॥ ఎందు ॥

మతక మిందులో నేదే మచ్చికలు దైవారె
రతుల నన్నిటాఁ గూడె రావే నీవు
తతి శ్రీవేంకటేశుఁడు తాను యీతని ఇంతిని
కత లీతన్నిప్రియాలు కైకొనఁగరాదా ॥ ఎందు ॥ 307 ॥

## పాడి

అనుమానించక మాతో నానతీవయ్యా
పెనఁగి వారి పొందులు పెడరేఁతునా ॥ పల్లవి ॥

చెనకి నవ్వినయాపె చేరి పుస్తరించుఁ గాక
పనిమాలి వేఁడుకోను పరులకేల
మనసు దిగ వేసుక మంతనాన నున్నాఁడవు
మునుపటి సతికే ఇమ్ములనే చెప్పదునా ॥ అను ॥

తిట్టినట్టి యాపె నిన్ను దీవించవలెఁగాక
కట్టఁ గడవారు మొక్కఁగా గారణమేల
వట్టి వేసటతోఁ దలవంచుక నీ వున్నాఁడవు
రట్టు సేసినతివనే ఇట్టె రప్పింతునా ॥ అను ॥

కాలు దొక్కినాపె నిన్ను కాఁగిలించుకొనుగాక
యేల పొరుగువారికి నింతేసి పని
యీలీల శ్రీవేంకటేశ ఇటు నన్నుఁగూడితివి
ములనున్న తొంటి ఇంతిమొకము చూపింతునా ॥ అను ॥ 308 ॥

## బౌళి

మొగమోటదాన నేను మొక్కే నీకు
ఇగురుఁబోఁడిని నేను యెవ్వరి దూరుదును ॥ పల్లవి ॥

సారె సారెఁ బొగడఁగ సన్నలు నీవు సేయఁగ
కోరి నిన్నుఁ దిట్టవచ్చి కొంకితి నేను
నేరములెంచఁగఁబోఁ నీకు లోనాయ మనసు
యీరీతినే వెరగైతి నెవ్వరి దూరుదును ॥ మొగ ॥

ఇచ్చకము నెరపఁగ యెదురుగా నవ్వఁగాను
మచ్చరించవచ్చి యట్టె మానికి నేను
పచ్చిసేయ దొరకొంటి భ్రమయించె నా వయసు
యెచ్చరికె నాకు లేదు యెవ్వరి దూరుదును ॥ మొగ ॥

వంచెనతోఁ గూడఁగాను వైపుగా శ్రీవేంకటేశ
మించఁదలఁచి రతుల మెచ్చితి నిన్ను
కంచము పొత్తుకు వచ్చి కదు నోరూరించెఁ బొందు
ఎంచరాదు తరితీపు లెవ్వరి దూరుదును ॥ మొగ ॥ 309 ॥

## దేసాళం

చిత్తడి చెమటమేని శ్రీనివాసా! కదు-
చిత్తిడి వాఁడవుగ దో శ్రీనివాస ॥ పల్లవి ॥

చెల్లు నీకు నీచేఁతలు శ్రీనివాస! నా-
చెల్లెలితో నవ్వితివి శ్రీనివాస
చెల్లఁబో యింతదొరవు శ్రీనివాస! నీ-
చిల్లర విద్యలు బెట్టు శ్రీనివాస ॥ చిత్త ॥

చేరితిమి నీవద్ద శ్రీనివాస! మేను
 జీరలాయ నింతలోనె శ్రీనివాస
చీరఁగారీ మా వయసు శ్రీనివాస! నీకుఁ
 జేరువగా మా యిల్లు శ్రీనివాస ॥ చిత్త ॥

చిక్కని మాట లాడేవు శ్రీనివాస! మా-
 చిక్కెల్లా బాసెను నేఁడు శ్రీనివాస
చెక్కు నొక్కి కూడితివి శ్రీనివాస! వావి
 చిక్కె శ్రీవేంకటగిరి శ్రీనివాసా ॥ చిత్త ॥ 310 ॥

## నాదరామక్రియ

చెప్పినట్టే సేతుఁగాక చేరి నీకు
 తప్పులుఁ దారులు నెంచతగవేదీ ॥ పల్లవి ॥

నిన్నుఁ జూచి నవ్వు వచ్చె నీమీఁది కోపము దీరె
 అన్నిటా దొడ్డవాఁడవు ఆనలేల
కన్నుల నిన్ను గంటిమి కాయమెల్లాఁ జల్లనాయ
 పన్నేటి మాయల కిఁకఁ బనియేది ॥ చెప్పి ॥

మాఁట నీకుఁగా వెల్లె మంకులెల్లఁ బెడఁబాసె
 చాటువ గెలిచితిమి సాకిరులేల
నేఁటనే తప్పదిఁకను నీవు నేను వున్నారము
 వాఁటాలు సేయఁగ నీవల్లనేది ॥ చెప్పి ॥

కొనగోరు నిన్ను సోఁకె కూటము లందె కలిగె
 పనిమంతుఁడవు వొడఁబాటులేల
ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి విప్పుడిట్టె
 చనవు చేకొనుచోట సాదించ నేది ॥ చెప్పి ॥ 311 ॥

## రామక్రియ

ఇద్దరికి దైవము యెట్టు గూర్చెనో
గద్దరి తనములందె కలిగె కొసరులు ॥ పల్లవి ॥

పొలసి పొలసి నిన్నుఁ జూచి నేనే భ్రమసితి
బలిమి నీ మనసెంత భ్రమసెనో
నలుపులు తెలుపులు నాకన్నులసొజము
తెలిసితే నలుపులుఁ దెలుపు నీ చేఁతలు ॥ ఇద్ద ॥

నలువంక నీతోడ నవ్వి నవ్వి యలసితి
అలరి నీ తనువెంత యలసెనో
మలకలు కొలుకులు మా కురులసొజము
అలరి మలకలు నీ యన్ని గుణములును ॥ ఇద్ద ॥

కావరించి నీ కాఁగిట కలసి నే వెలసితి
వేవేలై నీమోవి [1]యంత వెలసెనో
శ్రీ వేంకటేశుఁడ మాకు సిగ్గులెల్లా సొజము
యీవల నీకు సిగ్గు లెందు వచ్చెనో ॥ ఇద్ద ॥ 312 ॥

## రేకు 1753 కాంబోది

ఇదెఱఁగనైతి నేను యేమిసేతు నాయకుఁడ
చెదరి నీమతి కెంత సిగ్గాయనో ॥ పల్లవి ॥

నిక్కి చూడఁబోతేను నీచేఁత బాయిటఁబడె
మొక్కఁబోతే కొనగోరిమొన దాఁకెను
చెక్కు నొక్కఁబోతేను చెమట చేతికి వచ్చె
చిక్కి నీకు నపుడెంత సిగ్గాయనో ॥ ఇదె ॥

---

1 'ఎంత' కావచ్చు.

కెలపులిట్ల నిన్ను కిందుపరచనేఁటికి
 సెలవినే నవ్వి యాపె చిమ్మిరేఁచదా
 బలిమెఱుఁగవు గాక పడఁతి నిన్ను నేఁచితే
 పలచనిచేఁతలనే భ్రమయించదా ॥ వద్దు ॥

కైవశము సేయు నీతో కతలెల్లా నేఁటికి
 మోవి తేనెలే చూపి మోహింపించదా
 యీవేళ శ్రీవేంకటేశ యింతి నీవు గూడితివి
 వేవేలు పరసముల వెలయించదా ॥ వద్దు ॥ 316 ॥

## అమర సింధు

ఆడనుండి వచ్చి నాకు ఆసపడేవు
 జోడుకూడి నిన్ను రతిఁ జొక్కించదాయనా ॥ పల్లవి ॥

పైపై నన్నుఁ జెనకేవు పొంచి మేనితో వచ్చి
 ఆపె వోపనప్పుడెల్లా నడ్డమా నేను
 కోపము గాదుగా గొబ్బున నిన్నడిగితి
 ఆ పాటి నిన్నుఁ దనివి నందించదాయనా ॥ ఆడ ॥

పట్టి విడె మడిగేవు పరఁగదుపునవచ్చి
 వొట్టి యాపె వూడిగాల కూరటా నేను
 దిట్టతనమున నిన్నుఁ దెలియవలసి యింతె
 బెట్టుగఁ దమ్ములమైనాఁ బెట్టదాయనా ॥ ఆడ ॥

వంచి నామోము చూచేవు వరవాత లేచివచ్చి
 [1]అంచెనాచేఁతను చూడ నడ్డమా నేను
 కొంచక శ్రీవేంకటేశ కూడితివి నన్ను నీకు
 మంచి మొగాలవారి నెమ్మదిఁ జూపదాయనా ॥ ఆడ ॥ 317 ॥

---

1 అంచెన + ఆచేఁతను

వరాళి

కానీ కానీ యందుకేమి కతలేఁటికి
మేనరికమే నీమెడగట్టీ నిఁకను ॥ పల్లవి ॥

బత్తితోడ నేను నీపైఁ జేయి వేసితేను
హత్తి యదరిపడేవు అదేమీ నీవు
రిత్తవలపా నాది రేకకెక్కేఁ గొనగోరు
సత్తెముగలదైతేను జాణ జేసీ నిన్నును ॥ కానీ ॥

తగవు నెరపి నీదగ్గర గూచుండితేను
అగడుగా నట్టె లోగే వదేమీ నీవు
మొగచాటా నా పొందు మొనలాయనా చన్నులు
తెగడి నిజాలదైతే దిట్టఁజేసీ నిన్నును ॥ కానీ ॥

కలఫి మెలపి నిన్నుఁ గాఁగిలించుకొంటేను
అలసి బుసకొట్టే అదేమీ నీవు
మెలగి శ్రీవేంకటేశ మెరసెనా జవ్వనము
బలిమి గలదియైతే బంటుఁ జేసీ నిన్నును ॥ కానీ ॥ 318 ॥

రేకు 1754 సాళంగ నాట

కానీ కానీ యందుకేమి కనేము గాక
మోనాన నీకేవేళ మొక్కేమో నేము ॥ పల్లవి ॥

నెట్టన నీ మగువలు నీతోనే నవ్వఁగాను
చుట్టాలమై యెన్నఁడిఁకఁ జూచేమో నేము
దిట్టలై యందరు నిన్ను తేఁకువతోఁ దిట్టఁగాను
వెట్టికి నేఁగలిమండి వినేమో నేము ॥ కానీ ॥

పాలంతులిందరు నిన్ను బొమ్మల జంకించఁగాను
చెలఁగి సాకి రెన్నఁడు చెప్పేమో నేము
అలగి వారు నీమీఁద నట్టె చేతులు చాఁచఁగ
తెలిపి మీవాదేగతిఁ దీర్చేమో నేము ॥ కానీ ॥

కోరి నీ కొలువు వారు కొంగువట్టి తియ్యఁగాను
మారుకొని యున్నఁడవి మాన్పేమో నేము
యీరీతి శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁగూడితివి
తేరకత్తెల నేగతి దిద్దేమో నేము ॥ కానీ ॥ 319 ॥

## వరాళి

ఏకతములో సుద్దులు ఇందరిముందర నేల
దీకొని రతులలోనే తెలుసుకోరాదా ॥ పల్లవి ॥

చెప్పరాని మాటలకు సిగ్గులు వదుటే గురి
అప్పటి నేలడిగేవు ఆపెను నీవు
దప్పిదేరే మోములోనే తలఁపెల్లఁ గానవచ్చీ
తెప్పలఁదేలి ముచ్చట తెలుసుకోరాదా ॥ ఏక ॥

సేయరాని సేఁతలకు సెలవినవ్వురే గురి
చాయల నేలొరసేవు సారెకు నీవు
కాయముపై కాఁకలనే కందువెల్లఁ గానవచ్చె
తీయనాయ వేడుకలు తెలుసుకోరాదా ॥ ఏక ॥

ముట్టరాని పనులకు మొక్కులు మొక్కుటే గురి
గుట్టులేల విచ్చేవు కొంకక నీవు
ఇట్టె కూడితిరి మీ యెమ్మెలెల్లఁగానవచ్చె
దిట్టవు శ్రీవేంకటేశ తెలుసుకోరాదా ॥ ఏక ॥ 320 ॥

## ఆహిరి

సవతు లిందరు నిన్ను సంతోసించేరిదె
రవళి నౌభళేశుని రాణి వౌదువమ్మా ॥ పల్లవి ॥

ఆతనిమోము చూచితివదె తొడ యెక్కితివి
నీతి నీవెఱుఁగుదువు నీకేమమ్మా
[1]ఆతుమార రమణుని అలుకెల్లఁ దీర్చితివి
రాతిరిఁ బగలు నట్టె రాజ్యమేలవమ్మా ॥ సవ ॥

వాసిఁ బంతాలాడితివి వలపించితి విభుని
నీ సరి గారెవ్వరున్ నీకేమమ్మా
సేస వెట్టి చెప్పినట్టు సేయించుకొంటి పనులు
ఆసఁ బట్టము గట్టుక అండనుండవమ్మా ॥ సవ ॥

ప్రియమునుఁ జెప్పితివి బిగ్గ గాఁగిలించితివి
నియతి నో లకిమమ్మ నీకేమమ్మా
దయతో శ్రీవేంకటాద్రిఁ దమకించి కూడితివి
నయమై నరసింహాసనాన మించవమ్మా ॥ సవ ॥ 321 ॥

## మాళవి గౌళ

వద్దన్నా మానదు చెలి వలపులు తోడంటి
పొద్దున నాపెకు నీకు బుద్ధి చెప్పరాదా ॥ పల్లవి ॥

నీతోడి (డ?) మాటలు నే నెయ్యముతో నాడఁగాను
ఆతలఁ దా నేలాడీ నండ (నడ్డ?) మాఁటలు
చేతులు చాఁచి నిన్ను చెక్కులిట్టె నొక్కఁగాను
ఘాతల తన గోరేల కడలు దాఁకించీని ॥ వద్ద ॥

---

1 'మనసార' వలె ఆతుమార!

సమ్మతించి నీమోము సారె నేనుఁ జూడఁగాను
దొమ్మిఁ దా నప్పటినేల తోఁగి చూచీని
చిమ్ముల సరసములు చేరి నేనూ నాడఁగాను
వుమ్మడిఁ జెనకీ నేల వూరకైనా దాను ॥ వద్ద ॥

కందువ నేను నీవు గాఁగిలించు కొనఁగాను
సందడిఁ గాలేల తొక్కీ జవళి నుండి
ఇందులో శ్రీవేంకటేశ ఇద్దరముఁ గూడితిమి
నింద నీపైనేలవేసీ నిచ్చనిచ్చానవ్వి ॥ వద్ద ॥ 322 ॥

ఆహిరి

చాలు నూరకే రావయ్య సారె సారె రేఁచక
కోలుముందై నీ ప్రియాలు కొంకులుదేరీ నవె ॥ పల్లవి ॥

గరిసించరాదుగాని కాంతకు నీచేఁతలెల్లా
తెరమఱఁగు దీసితే తిద్దరానివే
వరుసతో రావుగాని వన్నెల నీగుణములు
తొరలించుకొంటేను దొమ్మిసేసేవే ॥ చాలు ॥

వెలఇంచరాదుగాని వెలఁదికి నీ నవ్వులు
తెలిపి చెప్పఁగఁబోతే తీగెసాగేవే
తలఁచఁగరాదుగాని తప్పని నీబాసలెల్లా
ములిగి మోవఁగఁబోతే మోఁపెఁడేసిచే ॥ చాలు॥

ఇయ్యకొనరాదుగాని యింతికి నీ కూటములు
చెయ్యారఁ గాఁగిట నేఁడు చేకొన్నవే
ఇయ్యెడ శ్రీవేంకటేశ యిద్దరూ నొక్కటైతిరి
ముయ్యఁబోతే మీఁద మీఁద మొనలు చూపేటివే॥ చాలు ॥ 323॥

## పాడి

నేరుపు చాలక నీవే నేరములెంచేవు గాక
సారె నీవు చెనకితే సరి దాఁ జెనకదా ‖ పల్లవి ‖

వుండనుండ మోహములు వూటనీటి చెలములు
మెండుగాఁ గొసరితేను మీసాలపై తేనైయుండు
దండి సిగ్గుతోఁ జెలి తలవంచితే నేమాయ
అండ నీవు నవ్వితేను ఆపె తానే నవ్వదా ‖ నేరు ‖

సేయఁజేయ జెలుములు చెట్లపై కాయలు
రాయడించి పెనఁగితే రాలుఁబిందెలై వుండు
పాయపు వనిత నీతో పంతమాడితే నేమాయ
ఈయెడఁ జేఇ వేసితేను యీపె నీపై వేయదా ‖ నేరు ‖

కూడఁగూడఁ గూటములు గోరగీరిన యేరులు
వాడికలు లేకుంటే వానవెల్లులై వుండు
జాడతో శ్రీవేంకటేశ సతి మించితే నేమాయ
వీడె మిచ్చెన సితివి వీదుకూళ్లు [1] వెట్టదా ‖ నేరు ‖ 324 ‖

రేకు 1755 **లలిత**

ఆపె నేను సవతుల మామాఁటె నామాట
తీపులు వుట్టించితిని తెలుసుకో ఇపుడు ‖ పల్లవి ‖

---

[1] వీదుకూళ్లు=వీదుటలు కూదుటలు (వీదులు+కూదులు) కావచ్చు, లేదా సాగ-
నంపె విందులు (Send of Dinner) కావచ్చు.

ముందర నున్నది చెలి ముసి ముసి నవ్వులతో
విందులు వెట్టీ మీకు వీడెపుమోవి
చెంది నీకు మేలు సుద్ది చెప్పితి నిదివో నేను
ఇందుకు నాకేమి మెచ్చు ఇచ్చేవో ఇపుడు ॥ ఆపె ॥

చేయి చాఁచీ నాపె నీపై సేసపాల దోసిటితో
చాయల గప్పములిచ్చీ జంటచన్నులు
సోయగపు పగినాలు చూచి చెప్పితి నిదివో
తీయని నారుణ మెట్టు తీర్చేవో ఇపుడు ॥ ఆపె ॥

పొంకక కాఁగిలించీని కొనగోరి పంతాలతో
వుంకువలు వెట్టీఁ జనవుల రతులు
పొంకపు శ్రీవేంకటేశ బుద్ధులు చెప్పి కూడితి
వింకా నాకుఁ జనవు లెట్లిచ్చేవో యిపుడు ॥ ఆపె ॥ 325 ॥

## తోండి

చేరి నీకు నేమెల్లా సేవ సేసేము
చేరఁడేసి కన్నులతో సిగ్గువడకీఁకను ॥ పల్లవి ॥

చెందమ్మి రేకుల వేసె సేవంతిపూవులవేసె
కందువలు చెప్పెనాపె కలవెల్లాను
నిందమోఁచి నీవురాని నీకడము ఇంతేకాని
పొందుల వెలితి లేదు పోరాదా లోనికి ॥ చేరి ॥

పన్నీరు నీపైఁ జల్లె బాగాలునుఁ బెట్టి పంపె
విన్నపాలన్నియుఁ జేసె వెల్లవిరిగా
పన్నులుదెలుసుకోని జాణతనము నీదింతే
పన్ని వున్నది వలపు పదవయ్య లోనికి ॥ చేరి ॥

తెర నీ నడుము మోఁపె తెలిపి లోలోఁగూడె
శిరసీడ గురిచూపె సేసెఁ గతలు
తిరిగి నన్నుఁ గూడితి దిక్కయి శ్రీవేంకటేశ
మరిగితివి రావయ్య మాఇంటిలోనికి ॥ చేరి ॥ 326 ॥

## దేశి

అంతేని మే మెఱఁగము ఆఁడువారము
సంతలో నేరుచుకొని జాణము గారాదా ॥ పల్లవి ॥

కూడిమాడి వుండి నీతోఁ గోపగించితి ననేవు
వాడికెవారి నవ్వులు వచ్చీనా మాకు
వేడుక కాఁడవు నీకు వేగిరము గలితేను
నీడల నూరివారితో నీవు నవ్వరాదా ॥ అంతే ॥

వోముక మారుమొగమై వూరకుందాన ననేవు
దోమటి గొల్లమాటలు తోఁచీనా మాకు
ప్రేమమున నీకు నింత పెక్కులాడవలసితే
నీమాటలు నా మాటలు నీవే యాడరాదా ॥ అంతే ॥

కన్నులఁగంటానే వచ్చి కాఁగిలించుకో ననేవు
నిన్నటివారి నేర్పులు నేర్చేమానేము
అన్నిటా శ్రీవేంకటేశ ఆయములంటి కూడితి-
వెన్ని గలవు నీ పొందు లెనయఁగరాదా ॥ అంతే ॥ 327 ॥

## సామంతం

చిత్తగించు నీ వాపెను చెన్నరాయ! యీపె
చిత్తిణి గొడగుమట్టి చెన్నరాయ ॥ పల్లవి ॥

చిక్కని గుబ్బల మీఁద చేయి నీవు వేసితేనే
 చిక్కెను నీపాల నాపె చెన్నరాయ
చొక్కించి నీవు గోరు సోఁకించఁగా కమ్మటి నీ-
 చెక్కిటిపైఁ జేయివెట్టీ చెన్నరాయ ॥ చిత్త ॥

దిమ్మరి మాటలు యీ తెఱవతో నాడఁగాను
 చెమ్మగిలఁ జెమరించె చెన్నరాయ
తమ్ములము నీ విడఁగ తమకించి యట్టె యాపె
 చిమ్మెను నీమీఁదను సిగ్గు చెన్నరాయ ॥ చిత్త ॥

ఆ రీతుల నేకతాన అలుకలు దేర్చఁగాను
 జీరలు వొళ్లెల్ల నిండె చెన్నరాయ
యీ రీతి శ్రీవేంకటాద్రి నిద్దరు నేకమైతిరి
 చీరకొంగు వదలకు చెన్నరాయ ॥ చిత్త ॥ 328 ॥

నాగవరాళి

ఎట్టు వలసినఁ జేయు మిఁక నీవు
 గుట్టు చక్కనైతేను కోరిక లీడేరును ॥ పల్లవి ॥

చప్పనాయ నీమోవి సతులెల్లా నంజఁగాను
 తెప్పిరి నే నంటఁగాను తియ్యనాయను
వుప్పచాల దీలకూర కొల్లనివేళ నెందురు
 వుప్పొలి కినుమడౌను వొలిసిన వేళను ॥ ఎట్టు ॥

కడుఁ బిప్పాయ నీమేను కాంతలెల్లఁ బొందఁగాను
 వడిసీ రసాలు నే నీవద్ద నుండఁగా

పుడిసెఁడౌను సిగ్గులు [1]పుప్పించుకొనేవేళను
పిడికెడేసి వలపు [2]పెట్టే సేసవేళను ॥ ఎట్టు ॥

బెందుపడె నీ మనసు పెనఁగి యిందరిచేతా
నిందుకొనెఁ దమి నేను నీవుఁ గూడఁగా
గుండె రాయౌ నొకవేళ కోపాన శ్రీవేంకటేశ
కొండలౌను చన్నులివె కొంకుదేరేవేళను ॥ ఎట్టు ॥ 329 ॥

బౌళి

నేమా యెఱఁగ మిందుకు! వేంకటేశ! [3]నేమా యెఱఁగ మిందుకు
నేమము దలఁచుకొని నిలు నిలు మిఁకను ॥ పల్లవి ॥

సారెకు నిన్నుఁ జూచితే జంకించనే బుద్ధిపుట్టీ
చేరి చేరి నీవు నన్నుఁ జేసే చేఁతకు
ధీరత నీవు నవ్వితే తిట్లు నోటికి వచ్చీ
వూరకుండు చాలుఁజాలు వొద్దు వొద్దు ఇఁకను ॥ నేమా ॥

సందడిఁ బెనఁగఁబోతే చన్నులకు వాండెక్కీ
చిందరవందర నీవు సేసే చేఁతకు
అందాలు చెప్పఁగఁబోతే అపనమ్మికలే తోఁచీ
పొందే ఆన లెన్నిలేవు పోకు పోకు మిఁకను ॥ నేమా ॥

కుచ్చి కాఁగిలించుకుంటే కోరికులు దైవారీ
చెచ్చెర నీవు రతులఁ జేసే చేఁతకు
యిచ్చట శ్రీవేంకటేశ యెనసితి మిద్దరము
విచ్చన విడాయ మంకు విడువిడు మిఁకను ॥ నేమా ॥ 330 ॥

---

[1] పుప్పించుకొను = పుప్పిబట్టు.

[2] "సేసవెట్టే వేళను" అనుట సహజము. పుడిసిలికి పిడికిలి రెండింతలని భావించినట్లున్నది.

[3] ఈ రెండవ "నేమా.....ఎందుకు" అనునది పొరపాటున వ్రాతకెక్కినట్లున్నది.

రేకు 1756 మంగళ కౌశిక

దీనికేమే దోసమా తీపు [1]మొగచాటైతే
　　పూనుక నడుమఁ గొంత పులుసును నంజరా ॥ పల్లవి ॥

మంచముపైఁ గూచుండి మాయలెల్లా నటించి
　　కంచము పొత్తు వలపు కలసితివే
　　అంచెల నా మానిసివై అంటుకొంటి వంతలోనె
　　యెంచేదేమి ఇఁక బాసలేల సేసేవే ॥ దీని ॥

వద్దనుండి పాటవాడి వరుసలు వెట్టుకొని
　　చద్దికూటిపై నుమిసి సాదించితివే
　　అద్దుక రాయబారాలు ఆడుతానే మించితివి
　　తిద్దుక ఇంకానేల దిష్టాలు సేసేవే ॥ దీని ॥

అంకెలఁ బాదములొత్తి ఆయములు సోఁకించి
　　కంకి సేసి తగవులు గైకొంటివే
　　వుంకువై శ్రీవేంకటేశుఁ డొనరె నా కాఁగిటను
　　పొంకాన నావశమైతి బుద్దులేల చెప్పేవే ॥ దీని ॥ 331 ॥

గౌళ

మమ్మేల వినుమనేరు మాటలు మీఇద్దరిని
　　నమ్మించి మీ చెలులము నవ్వుదుము గాక ॥ పల్లవి ॥

తగువులు చెప్పనేల తలఁపు లేకములైతే
　　మిగిలేవి కదు మందెమేళాలే కాక

---

[1] మొగచాటు= ఎక్కువ, వెక్కసము అను నర్థములలో వాడినట్లున్నది. 'పరిపడక పోవుట' తాత్పర్యార్థము. పిండఖర్జూర్యాం ఉద్వేజితస్య తింత్రిణ్యాం అభిలాషః అనిన కాళిదాస సూక్తిని జ్ఞప్తికి తెచ్చుచున్నది.

తెగువలు మరియేల తేరెను మీ జగడాలు
మిగుల మిమ్మిద్దరిని మెత్తుము గాక ॥ మమ్మే ॥

వొడఁబరచఁగనేల వునుకొను చక్కనైతే
ఆడియాలములు మేను లమరుగాక
వడఁబడ నిఁకనేల వచ్చెను మీ పంతములు
వుడివోని నుతులను వుబ్బింతువుగాక ॥ మమ్మే ॥

బుద్దులు చెప్పఁగనేల భోగములు గలసితే
కొద్దిలేని చనవులే కూడించుఁగాక
పొద్దున శ్రీవేంకటేశ పొందితిరి సంబటూర
ముద్దుల చెన్నుఁడ మీకు మొక్కుదుముగాక ॥ మమ్మే ॥ 332 ॥

## పాడి

ఎంత లేదు వట్టి సట యీపె నీతోను
బంతిని నీవే సారెఁ బాలార్చేవు ॥ పల్లవి ॥

చేకొని ఇందరిలోన సిగ్గులు వడీఁ జెలి
యేకతాన నుండరాదా ఇయ్యకొనీని
దీకొని వొడఁబరచితే నానలెల్లఁ బెట్టీ
దాకొని కాఁగిలించుమా తానే లోనయ్యీని ॥ ఎంత ॥

తప్పక మాడఁగ నీతోఁ దలవంచుకొనీఁ జెలి
కొప్పు వట్టి తియ్యరాదా కొంకుదేరీని
ముప్పిరిఁ జెనకితేను మొక్కలములెల్ల నాడీ
కప్పుమా పచ్చడ మిట్టె కరఁగీ నిక్కువలు ॥ ఎంత ॥

నానఁబెట్టితే వలపు నవ్వులు నవ్వీఁ జెలి
మానము లంటఁగరాదా మనసిచ్చీని

తానె శ్రీవేంకటేశ దగ్గరి నిన్నుఁ గలసె
కానిమ్మని వినరాదా కతలు చెప్పీని ॥ ఎంత ॥ 333 ॥

## ముఖారి

అంతసేసినట్టి నిన్నే అందుము గాక
యెంతకెంత వలపులు యింకా రేఁచేమా ॥ పల్లవి ॥

వెన్నెల బయుటనుండి వేసవి యెండలనేటి-
కన్నెకు నేమని చెప్పఁగలము నేము
సన్నపుగాలిఁ జూచి [1]జాజరకాఁడనఁగాను
విన్నవించేమా నేము వెలఁదికిని ॥ అంత ॥

ముడిచే పువ్వులు చూచి ముంచి మరునమ్ములనే-
పడఁతి నేమని మట్టుపరచేము
నొడిగే కోవిలఁ జూచి పిడుగుల పక్షియంటే
తడవి యేమి చెప్పేము తరుణితోను ॥ అంత ॥

మలసే తుమ్మిదఁ జూచి మాసటీఁడని భ్రమసే-
పొలితికి నేమని బుద్ధి చెప్పేము
అలరి శ్రీవేంకటేశ అంతలో నీపెఁగూడితి
తెలిసె నిందు వంకనే దేవర చిత్తము ॥ అంత ॥ 334 ॥

## సామవరాళి

ఇంక నేరే కొంకను యిద్దరము నున్నారము
సంకెలెల్ల దేరె నాకు చనవిచ్చుఁగాక ॥ పల్లవి ॥

---

[1] జాజరకాఁడు=దొంగ కావచ్చు. సందర్భమును బట్టి 'గజదొంగ' కూడ కావచ్చు. "ఉన్నబలమువంతా దోచుకువేవాడు" అని తాత్పర్యార్థము. 'తస్కర' శబ్ద భవమవి పించుచున్నది.

మచ్చిక సేసినవాఁడు మనసేమి చూచీనే
　　చెచ్చెర నా చెప్పినట్టు సేసుఁగాక
　　విచ్చన విడైనవాఁడు వెనకముం దేలెచ్చీనే
　　కుచ్చి కుచ్చి నామేలే కొసరు గాక ॥ ఇంక ॥

గక్కన నవ్వినవాఁడు కడమలేల పెట్టీనే
　　వెక్కసపుఁ జన్నులపై వెలయుగాక
　　వొక్కటైనవాఁడు నాతో నూరకే సిగ్గులేలే
　　నిక్కి నిక్కి రతినేర్పు నెరపుఁగాక ॥ ఇంక ॥

మంచముపై నున్నవాఁడు మఱఁగులేల పెట్టీనే
　　కంచపు మోవి యొసఁగి కైకొనుఁగాక
　　యెంచక శ్రీవేంకటేశుఁడీడ నిట్టె నన్నుఁ గూడె
　　మించి మించి నాపొందులే మెరయుఁగాక ॥ ఇంక ॥ 335 ॥

## వేళావళి

మీరు మీరు నేకమే మేమును మీవారమే
కూరిమితో కొసరలు కోపమయ్యీనా ॥ పల్లవి ॥

తెరమఱఁగు దీసితే తేరె మీకు సిగ్గులు
　　వొరసితే వలపులు వొడి నిండెను
　　గరిమ నందరికినిఁ గలిగిన దొక్కచాలే
　　సరసపు జగడాలు సతమయ్యీనా ॥ మీరు ॥

మొగము చూచితేనే మొలచెను నవ్వులు
　　అగపడితే నీడేరె నాసలెల్లాను
　　తగిన వయసువారితలనే వేగె నీపని
　　బిగువుల బింకాలు పేరడయ్యీనా ॥ మీరు ॥

మంతనాన నుండితేనే మనసు లేకము లాయ
సంతసించుకొంటేనే చలము వాసె
యింతలో శ్రీవేంకటేశ యెనసితి రిద్దరును
బంతి నున్న రతివిందు పంగెనయ్యానా ॥ మీరు ॥ 336 ॥

రేకు 1757 సామంతం

ఎన్నటి కెన్నటి సుద్దు లెంచేవా నీవు
కన్ను లెదిటివారినే కరుణింతు గాక ॥ పల్లవి ॥

వొద్దిక రాణివాసాలైవున్నవారిఁ దలఁచేవా
వద్దనున్నవానికే వలతుగాక
తిద్దిని నీగొల్లెత దిక్కు నీవు చూచేవా
పెద్ద మధురసతులే ప్రియమింతే కాక ॥ ఎన్న ॥

వేడుకతో వరుసల వెలఁదుల నీవెంచేవా
వూడిగాలవారు నీవు నుందుదు గాక
యీడఁ బెండ్లాడినయట్టి ఇంతులనే తనిసేవా
కూడగొట్టు వనితలఁ గోరుదువు గాక ॥ ఎన్న ॥

కప్పురపుఁబడివారి కతలు నీవు వినేవా
యిప్పు దురముపైవారి నెనతు గాక
తప్పక శ్రీవేంకటేశ తగ నన్నుఁ గూడితివి
అప్పటి నీతోంటివారి నంటుదువుగాక ॥ ఎన్న ॥ 337 ॥

రామక్రియ

ఉప్పుచిం దునుమడాయ వుండఁగానే నీ బదుకు
లప్పల కస్తూరి పూఁత లాబమాయనయ్య ॥ పల్లవి ॥

నే నీకు మేలుదాన నీవాపె మేలువాఁడవు
సానల నిద్దరిమేలు సరికి బేసి
వానెను చెమట నిట నడుమ నీమేనెల్ల
పానిపట్టి నీవలపు [1]పండవండీనయ్యా ॥ ఉప్ప॥

నవ్వితి నిన్నుజా చాపెనవ్వులకు నీవు లోను
జవ్వన పిద్దరిమేలు సరికి బేసి
పువ్వుల పూజలాయ నీ భోగము మా జంటలను
పవ్వళించి నీకోరికె పలమందెనయ్యా ॥ ఉప్ప॥

కూడితి నే నిన్ను నాపె కూటములు నీకు నచ్చె
జాడల మా కూటములు సరికి బేసి
యీడనె శ్రీవేంకటేశ ఇయ్యకొంటి వీరెంటికి
పాడితో మోవులే నీకు పల్లదొరలయ్యా ॥ ఉప్ప ॥ 338 ॥

## ఆహిరి

నాకొరకు విన్నవించ నన్ను భోగించేటి నీకు
జోకల యీయలమట సోఁకినని కాని ॥ పల్లవి ॥

సవతుల మాటలకు జడిసి నేఁ జిన్నఁబోఁగా
నవకమై నీకెట్ల నవ్వు వచ్చెనో
కవగూడే వప్పటి యీ కతలనే వేఁగినట్టి-
ఇవల నామేనెట్ల నితవాయనో ॥ నా కొర॥

వాడవారి చేఁతలకు వాడుదేరి నేనుండఁగా
జాడ నీకెట్ల సంతసములాయనో

[1] పంట + పండీ

తోడనే పొందేవు యీ విదు(ద్దు?)లఁబడి నిట్టూర్పుల
వీడు పడ్డ నామోవెట్టు ప్రియమాయనో ॥ నా కౌర ॥

దుండగీలసటలకు తోడనే నీ కొప్పించఁగా
గుండె దాఁకెట్లఁ జులుకులు వుట్టెనో
నిండుగ శ్రీవేంకటేశ నేఁడెనసి మన్నించితి
దండి నీకు నాపై నెట్టు దయవుట్టెనో ॥ నా కౌర ॥ 339 ॥

## పాడి

ఇసుక తక్కరి వంటి దీ వలపు
అసము దించక నవ్వే వది నే నెఱఁగనా ॥ పల్లవి ॥

చేరి నేఁ జెనకఁగాను చెనఁకేవు నీవు నన్ను
నీరు కొద్ది దామరాయ నీ వలపు
యీరీతి నెందు వోతివి ఇందాఁకా నే నీకు
నేరుపఁగా నేర్చితివి నే నెఱఁగనా ॥ ఇసు ॥

అండ సరసములు నే నాడినట్టె యాడేవు
నిండు రొంపిలో కంబము నీ వలపు
మెండుగా నేఁ దొలుతనే మేలుబంతి వెట్టియ్యఁగ
కొండసెలవై తూరేవు గుట్టు నే నెఱఁగనా ॥ ఇసు ॥

గుక్కక శ్రీవేంకటేశ కూడినట్టె కూడేవు
నిక్కి యుద్ధములోనీడ నీవలపు
పెక్కురతులు నేఁ దలఁపించఁగాఁ దలఁచుకొని
చొక్కి నన్నుఁ జొక్కించేవు సూటి నే నెఱఁగనా॥ ఇసు ॥ 340 ॥

## బౌళిరామక్రియ

కానీవయ్య నీమేలు గైకొంటిని
సానఁ బట్టిన చూపుల సంతసించే నిఁకను ॥ పల్లవి ॥

చెప్పినట్టల్లా నీవు సేయని వాఁడవా నాకు
చెప్పుడు బుద్దుల యింత సేసేవు గాక
తప్పక యిప్పుడైనా దయవుట్టెఁగా నాపై
చప్పుడుగా నవ్వు నవ్వి సంతసించే నిఁకను ॥ కానీ ॥

రట్టుగా మా యింటికి నీవిట్టె రానివాఁడవా
పెట్టుడి వారి భ్రమలఁ బెద్దయితి గాక
గట్టిగా నేడైనాను కరుణించితి గా నన్ను
జట్టిగొని నిన్ను మెచ్చి సంతసించే నిఁకను ॥ కానీ ॥

పెనఁగేవేళ నీ వింత బిరుదులాడేవాఁడవా
వొనరు నేస్తాలవారి వోజలు గాక
యెనసితి శ్రీవేంకటేశ నన్ను మన్నించితి
చనవులు మెఱయుచు సంతసించే నిఁకను ॥ కానీ ॥ 341 ॥

## సౌరాష్ట్రం

అందుకే యెదురు చూచీ నాకె నీమోము
మందలించి మీలోపని మాకెల్ల దెలుసుఁగా ॥ పల్లవి ॥

చిప్పిలఁగఁ జెమరించి సిగ్గువడీఁ జెలి యదె
చెప్పరాని మాఁట లేమి చెప్పితివో
నెప్పున నీ సేఁత లెల్ల నీవే తీరుచవలె
తప్పి నే మెల్లాను తగవు చెప్పఁగలమా ॥ అందు ॥

కాయమెల్లఁ బులకించి కాఁగిలించుకొనెఁ జెలి
ఆయము లెక్కడ నీవు అంటితివో
చాయ నీవే చూపినవి చక్కఁబెట్టవలె నీవే
చేయివట్టి నేము నిన్ను చిమ్మిరేఁచేమా ॥ అందు ॥

కొంగువట్టి నిన్నుఁ దీసి గొబ్బున నెనపెఁ జెలి
యింగితాన నెంత చనవిచ్చితివో
రంగు శ్రీవేంకటేశ నీరతులు నీకే చెల్లు
సంగతి నేమెల్లా యివి సాదించేమా ॥ అందు ॥ 342 ॥

రేకు 1758 దేసాళం

విన్నపము నేఁ జేసేది వింటివా వోయి
కన్నెను నన్నిఁకనైన కరుణించవోయి ॥ పల్లవి ॥

పక్కన నే నీతోను పంతము లాడితినంటా
యెక్కువ తక్కువ లాడీ యేమోయి యీపె
చక్కని నీమీఁది బత్తో సవతి మచ్చరమో
తెక్కువ నీ కిదేమైనాఁ దెలుసునా వోయి ॥ విన్న ॥

చేయి చాఁచి నీమీఁద సేసలు చల్లితినంటా
రాయడించె నిన్న మొన్న రంతుల నీపె
పాయపు వికారమో పతిబందమో తాను
నాయము దిద్దనేర్తువా నంటున నీవోయి ॥ విన్న ॥

నెమ్మది శ్రీవేంకటేశ నిన్ను నేఁ గూడితినంటా
కమ్మటి తా నుస్సురని కరఁగీ నీపె
యెమ్మెలు దా నెరపెనో యెడ్డతనము చేసెనో
చిమ్ముల నింతట బుద్ధి చెప్పేవా వోయి ॥ విన్న ॥ 343 ॥

## ఆహిరి

నీవు చేపట్టఁగాఁ గాక నే నిన్నాళ్లుఁ గొసరేనా
వావులు చేకొన్నమీఁద వరుస నీ చేతిది ॥ పల్లవి ॥

చింతతో నే నుండఁగాను చెలులెల్ల నవ్వఁగాను
యెంత కెంత పేసేవు నీ కేమి గూడెనో
బంతినే నీకు మొక్కితి భావమెల్లా నీకిచ్చితి
పొంతల నింక మీఁదటి పుణ్యము నీచేతిది ॥ నీవు ॥

కాఁకలతో నేనుండఁగా కడవారు మొరయఁగ
యేఁకట నూరకున్నాఁడ విది యేఁటిది
సోఁకఁగ నీ సొమ్మ నేను సొలసి సేవ సేసితి
ఆఁ కలరతులలోనిఆయము నీ చేతిది ॥ నీవు ॥

నివ్వెరగుతో నుండఁగ నీ సతు లిచ్చలాడఁగ
చివ్వన నన్ను మన్నించే చిత్త మెన్నఁడు
ఇవ్వల శ్రీవేంకటేశ యెనసితి మిద్దరము
జవ్వనపు విభవాల సరవి నీ చేతిది ॥ నీవు ॥ 344 ॥

## సౌరాష్ట్రం

ఎదురైతి మిద్దరము నేమందును
యెదలో నున్నది వల పేమందును ॥ పల్లవి ॥

నన్ను నేనే చూచుకొని నా విరహ మెంచుకొని
ఇన్నిటా జాణవు నిన్ను నేమందును
సన్నలేమి పేసేవు చవులేమి చూపేవు
మన్నన పతిని యిఁక మరియు నేమందును ॥ ఎదు ॥

మునుపే వొడఁబాటులు మొగమోటము లిప్పుడు
యినుమడించె నీ నవ్వు లేమందును
తనివి లేదు నీకైతే తమకమే తఱచాయ
పెనఁగేటిదానఁ గాను పిలిచి యేమందును ॥ ఎదు ॥

పరపుపైఁ గూచుండి భావమెల్లాఁ జేకొని
ఇరవైన నీతోను యేమందును
గరిమ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
వొరసితి నన్నిటాను వూరకే యేమందును ॥ ఎదు ॥ 345 ॥

## కాంబోది

నావలెఁ గాదువో యీపె నంటున నోరుచుకోను
చేవలు మీరఁగఁబోతే చెలి ఇంతకోర్చునా ॥ పల్లవి ॥

చల్లనిచూపులఁ జూచి సళిపించినందులోనే
కల్ల లేమాడితివో ఆకాంత తోను
అల్ల నీవోజెఱఁగనా అంది నాతో నాడినట్టే
చిల్లరలీడ నాడితే చెవి ఇంత కోర్చునా ॥ నావ ॥

చాయలు సన్నలుఁ జేసి జంకించినందులోనే
చేయార నేమిసేసితో చేరి యీపెను
మాయలు నే నెఱఁగనా మమ్ము నీవు సేసినట్టే
సేయఁబోతే గొణఁగక చెలి ఇంతకోర్చునా ॥ నావ ॥

పక్కనఁ గాఁగిటఁ గూడి పచ్చిసేసినందులోనే
ఇక్కువ లెందంటితివో యీ ఇంతిని
తక్కించి శ్రీవేంకటేశ తగ నన్నుఁ గూడినట్టే
చిక్కించుకొంటే నేఁడు చెలి ఇంతకోర్చునా ॥ నావ ॥ 346 ॥

## పాడి

మెత్తనైతే దిగఁబడే మేకుల వాఁడవు నీవు
హత్తుకొనె నీలోని ఆస యెంత ఇఁకను ॥ పల్లవి ॥

చల్లని చూపులఁ జూచి సరసములాడి ఇంతి
వెల్లవిరి సేసె నింకా వెలితేది
కొల్లున నవ్వుచు నింకా కొసరే వాపెను నీవు
అల్లనాఁడి (ఁడే?) దక్కఁగొంటి వాస యెంత ఇఁకను॥ మెత్త ॥

తగులఁగ మాఁటలాడి తనువులు సోఁకించి
వెగటుగా వలపించె వెలితేది
మొగమిచ్చులాడుతానే మొక్కేవాపెకు నీవు
అగడు సేసితివి నీ యాస యెంత ఇఁకను ॥ మెత్త ॥

కందువలు నీకుఁ జూపి కాఁగిట బిగించి కూడి
విందువెట్టి (ట్టె?) నీకు మోవి వెలితేది
అంది శ్రీవేంకటేశ నీ యక్కునఁ బెట్టుకొంటివి
అందాలుగా సింగారించేవాస యెంత ఇఁకను ॥ మెత్త ॥ 347 ॥

## లలిత

కడనున్నవారు నేనే గర్వినందురు
కడురట్టు సుమ్మమ్మ కతలు యీతనివి ॥ పల్లవి ॥

వేడుకలు దైవారె వెంగెములు మేన నిండె
యేడవారితో గొడవలేల తనకు
వాడికకు వచ్చితిమి వలసీ నొల్లనిపతిఁ
జూడరమ్మ చెలులాల సుద్దులు యీతనివి ॥ కడ ॥

కళలు మోమున మించె కాఁపురాలు వెంటవచ్చె
పలువుర మీఁద నెల్ల బాఁతియేఁటికి
వలచినదాన నేను వాసులు వెదకీఁదాను
తెలుసుకోరమ్మ మీరు తేటల యీ మాటలు ॥ కడ ॥

రచ్చఁబడెఁ దమకాలు రతికెక్కె వయసులు
తచ్చనల కిఁక నేమి తతి గాదు
పచ్చిగాఁ గూడితి నేను భ్రమసె శ్రీవేంకటేశుఁ-
డెచ్చుటఁ దలఁచరమ్మ యీతని భావములు ॥ కడ ॥ 348 ॥

రేకు 1759 ముఖారి

ఇంతులతో నిష్ఠూరము యేఁటి దొరతనము
వంతువాసు లెంచవు నీవంటివాఁడే ఘనుఁడు ॥ పల్లవి ॥

అనువెరిఁగి సరసమాడవద్దా నీవలె-
ననుచు నిన్నొక చెలి ఆడుకొనెను
మొనకులే కింతులచే మెప్పించుకొంటివి గాన
వినుపుల జాణఁడవు నీదివో జన్మము ॥ ఇంతు ॥

యెల్లవారికి నిచ్చక మెరిఁగి కూడుదువని
చల్లఁగా నిన్ను నొకతె సంతోషించెను
కల్లగాదు సతులకు కళలు రేఁతువుగాన
బల్లిదుఁడ నీదివో పట్టిన పంతము ॥ ఇంతు ॥

నగుతా నాపెనుఁ గూడి నన్నునుఁ గూడితి విట్టె
తగవెరిఁగిద్దరము దక్కఁగొంటిమి
సగము పంచిచ్చితివి సరుగ నీవయుపెల్ల
నిగుడి శ్రీవేంకటేశ నేరుపెల్ల నీదివో ॥ ఇంతు ॥ 349 ॥

## రామక్రియ

మిక్కుటపు సుద్దులు నీమీఁద నున్నవి
దక్కె నాకు నీ ప్రియము దాఁచఁగ నే నోపను ॥ పల్లవి ॥

రవ్వలేల పేసేవు రాతిరెల్ల నీవు మాతో
నవ్విన నవ్వులు నీపై నాఁగు వారీని
వువ్విళ్లూరెఁ జెమటలు వుప్పొరి కినుమడాయ
జవ్వనమె పై తరవు సాదించ నే నోపను ॥ మిక్కు ॥

పాఁచి కాఁగే లేమిటికి పట్టపగలే నీవు
రేఁచిన రేఁపులు దీన రెట్టి గొనీని
పూఁచి పులకలు నిండె పూఁప లెల్లఁ బిందెలాయ
దాఁచరాదు సిగ్గు నిన్నుఁ దప్పులెంచ నోపను ॥ మిక్కు ॥

కొసరకు మిఁక నన్నుఁ గూడిన కూటమి నీకు
ముసరి యాస మురిగి ముమ్మడయ్యీని
వెస నీవు మన్నించఁగ విరహమే చవులాయ
పొసఁగ శ్రీవేంకటేశ బొంకఁగ నే నోపను ॥ మిక్కు ॥ 350 ॥

## భైరవి

కానీవయ్య దానికేమి కై కొంటిని
మానా పతులైనవారు మట్టుపడవలదా ॥ పల్లవి ॥

కోపమెంత నేనెంత కోరి నీవు మాఁటాడితే
వోపకున్నఁ గొంత కొంత వూఁకొందుఁగాక
తీపుల మగవాఁడవు తేనెలు గురియఁగాను
పైపై వలఁచినవారు భ్రమయక వుందురా ॥ కానీ ॥

పంతమేడ నేనేడ బలిమి నీవు వట్టితే
చింతలో నున్నాఁ జనవు చెల్లింతుఁగాక
బంతినే మగవాఁడవు పాలు నీవు వోయఁగాను
మంతు కెక్క నోరూరక మానుదురా సతులు ॥ కానీ ॥

చలమెట్టు నేనెట్టు సరి నీవు గూడఁగాను
అలిగినా మాని నిన్ను నంటుదుఁగాక
యెలమి శ్రీవేంకటేశ యింత నీవు మన్నించఁగా
తలఁపు గలుగువారు తమకమే పెంతురు ॥ కానీ ॥ 351 ॥

## దేసాళం

ఏల పొట్లఁబడేవు యిందరు నీ పెట్టుఁ జట్లే
పాలు నేయైనఁ బోసేరు పైపై గొల్లెతలు ॥ పల్లవి ॥

అలయకుమంత నీవు అట్టె మాపై నొరగేవు
పలుసతులఁ జెనకి బడలితివి
మలగు వేసితి మదె మంచముపైఁ బవళించు
పిలిచి పెట్టేరు దామే ప్రియురాండ్లు విందులు ॥ ఏల ॥

దప్పిగొన కంత నీవు తగ మా మోవే యానేవు
వొప్పగురతుల నస్సురుసరైతివి
కప్పురము కోవి నదె కైకొను పానకమైన
కప్పే రెవ్వరైనాను కాంతలు పయ్యెదలు ॥ ఏల ॥

కన్ను లార్చకంత నీవు [1]కదునేల జోగిలేవు
కన్నెల మదాలు నీపైఁ గప్పెను వేఁడు
ఇన్నిటా శ్రీవేంకటేశ యిటు నన్నుఁగూడితివి
పన్ని వూడిగెపువారు పాదము లొత్తేరు ॥ ఏల ॥ 352 ॥

---

1 కదున్ + ఏల

## సాళంగం

ఆయలే యెంత లేదు నీయట మటాలు
వేయు మారులేల మమ్ము వేఁడుకొనే విపుడు ॥ పల్లవి ॥

ఆరూడి(ఢి?)గా నిన్నుఁ దిట్టి ఆయము లంటితేఁ దట్టి
నేరములెంచే సతులు నీకుఁ బ్రియము
చేరువ గాఁచుక వుండి సేవలెల్లా నీకుఁజేసి
మేరలు మీరని మమ్ము మెచ్చేవా నీవు ॥ ఆయ ॥

చెక్కులు సారెకు నొక్కి సిగ్గుతో పాదాలు దొక్కి
నిక్కి నిక్కి చూచేవారు నీకుఁ బ్రియము
మొక్కుచుఁ గందువ చూపి మోహములు రెట్టింపించి
మిక్కుటమైన వారి మెచ్చేవా నీవు ॥ ఆయ ॥

బలిమి నిన్నుఁ గలసి పంతములనే సొలసి
నెలకొని వుండేవారు నీకుఁ బ్రియము
యెలమి శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁగూడితివి
మెలఁగి వొకపాటివారి మెచ్చేవా నీవు ॥ ఆయ ॥ 353 ॥

## బౌళి

ఏల కొంగు పట్టేవు మేరుపరచుమంటాను
ఆలరి వనుచు సారె నాడేనా నిన్నును ॥ పల్లవి ॥

వేదుకకు వెల లేదు వెన్నెల కడ్డము లేదు
వాడికెకు నీకు నెందు వావి లేదు
కోడెకాడఁ నీవీ మాఁట గొల్లెతలనే యదుగు
పాడితోఁ జీకఁటితప్పు పట్టితినా నిన్నును ॥ ఏల ॥

కోరికకుఁ దుదిలేదు గుట్టు తుమ్మిదకు లేదు
వారించి నీ గుణముల వంకర వోదు
గారవపు నీమాఁట గందము కుబ్జ నడుగు
పేరుకొని నే నారడిఁ బెట్టేనా నిన్నును ॥ ఏల ॥

నగవుకు వేళలేదు ననలకుఁ గంపు లేదు
తగిన నీ మనసుకు తనివి రాదు
నిగిడి శ్రీ వేంకటేశ నీవే నన్ను నడుగు
సాగిసి నన్నుఁ గూడితి సోదించేనా నిన్నును ॥ ఏల ॥ 354 ॥

రేకు 1760 మాళవి గౌళ

సేయఁగలవెల్లాఁ జేసి చెవిఁబెట్టఁ డేమాట
దాయివలె నున్నవాఁడు ఔట్టుసేసెనంటాను ॥ పల్లవి ॥

మారు మాట లాడకుంటే మరి వాదులే లేవు
చేరి తలవంచుకుంటే సిగ్గు దోఁచదు
నేరిచినాఁ డీ విద్యలు నెరజాణ తనమంటా
రారావే తనకొద్దే రవ్వలిఁకఁ జూతము ॥ సేయఁ ॥

యెక్కడో పరాకైతే యెగ్గులు దప్పులు లేవు
పక్కన నవ్వు నవ్వితే భయము దీరు
చిక్కించుకొన్నాఁ డేడవో చిత్తడీ ముద్దులెల్ల
కక్కసించకువే తనకత లెల్లఁగందము ॥ సేయఁ ॥

ముసుఁగు వెట్టుకవుంటే ముంచు దరితీపులెల్ల
కొసరకుంటే వలపు కొనసాగును
యెసఁగ శ్రీవేంకటేశుఁ డిదెరిఁగి నన్నుఁగూడె
విసిగించకురే తన వేడుకలు చూతము ॥ సేయఁ ॥ 355 ॥

## పాళంగం

నవ్వేవంటా నుండితిమి నమ్మి యిందాఁకా
జవ్వనపు దానను సాదించక మానను ॥ పల్లవి ॥

వలపులు రేఁచితివి వాసులెల్లఁజూఁచితివి
చెలుల సుద్దులు మాతోఁ జెప్పి చెప్పి
మలకల సట లివి మాతోనే వద్దు సుమ్మీ
పెలుచుఁబంతాలదానఁ బెనఁగక మానను ॥ నవ్వే ॥

ఆసలు వుట్టించితివి ఆయాలు పట్టించితివి
వేసాల సతులఁ గొనవేసి వేసి
ఆ సుద్దులు మమ్ము నిఁక నల ఇంచ వద్దు సుమ్మీ
బేస బెల్లితనమునఁ బెనఁగక మానను ॥ నవ్వే ॥

కన్నుల సన్నలు చేసి కాఁగిట సారెకు డాసి
పన్నితి మాయ లింతులఁ బాడి పాడి
మున్నిటి శ్రీవేంకటేశ మోసములు వద్దు సుమ్మీ
కన్నెను నేఁ గూడితిని గద్దించకమానను ॥ నవ్వే ॥ 356 ॥

## ఆహిరి

నేరుపు లిన్నియు నిఁక నీ చేతిది
సారె వలపుల సంతోసాన నుందానను ॥ పల్లవి ॥

కాఁకలు నీమీఁదఁ జల్లి కాఁతాళముతో నుండితి
చేఁకట నీవు పట్టితే సిగ్గువడితి
మేఁకటతో నీవే నన్ను ఇంతాఁ జేసేవాఁడవు
వేఁకపు జవ్వనముతో వెరంగైవుందానను ॥ నేరు ॥

యేకతమైనపుడే నిన్నెల ఇంచేనంటా నుందు
వాకుచ్చి మాటాడితే నీవసమౌదును
పైకొని నీవే ఇంతా భ్రమ ఇంచేవాఁడవు
దా కొని మొగమోటకు దగులై వుందానను ॥ నేరు ॥

నించిన రతుల నిన్ను నీరేనంటా నుండితి
అంచెల నీవు గూడితే నట్టె వుంటిని
నించి శ్రీవేంకటేశుఁడ నీవింతాఁ జేసేవాఁడవు
దించని సంభ్రమముతో తిరమై వుందానను ॥ నేరు ॥ 357 ॥

## హిజ్జిజి

ఎంత కంతే చాలుఁ గాక యెక్కుడేఁటికి
వంతులకు మమ్మునేల వాసులు రేఁచేవు ॥ పల్లవి ॥

మొగము చూచినందుకు మొక్కితేనే చాలదా
నగవు లిందుకుఁదోడు నగవలెనా
అగడుసేసి నీతో నలిగేటి వారమా
వెగటుగా మమ్మేల వింతలు సేసేవు ॥ ఎంత ॥

చేసన్న సేసినందుకు సిగ్గువడుటే చాలదా
ఆసపడి అండకురా నంత వలెనా
వీసమంత పనికిఁగా వేసరించే వారమా
రాసికెక్క మమ్మునేల రాఁపులఁబెట్టేవు ॥ ఎంత ॥

వొడివట్టిన యందుకు వూరకుండుతే చాలదా
పడిఁబెట్టి కాఁగిలించ సారె వలెనా
చిడుముడిఁ గూడితివి శ్రీవేంకటేశ నన్ను
కడవారమా యేల కతలు సేసేవు ॥ ఎంత ॥ 358 ॥

## సాళంగనాట

ఈసులు వాసులు మాకు నేల రేఁచేవు
నీ సూటికి రాని సేఁత నేము సేసేమా ‖ పల్లవి ‖

ఆ రీతి కోపినవారు అలుగుదురింతే కాక
మారుకొని నే నీతో మచ్చరించేనా
పేరడి నీ కివి యెల్లాఁ బ్రియమైతే నౌఁగాక
మేరలు దప్పినపని మేము సేసేమా ‖ ఈసు ‖

అట్టడియైనవారు పట్టి బిగుతురుగాక
కట్టిడినై నే నీతో కాఁతాళించేనా
నట్టుకొట్టి నీకు నివి నవ్వులైతే నవుఁగాక
మెట్టిపట్టు కింతవని మేము సేసేమా ‖ ఈసు ‖

పలుకుఁ బంతాలవారు బలిమి సేతురు గాక
తొలుతనే నే నిన్ను దొమ్మి సేసేనా
యెలమి శ్రీవేంకటేశ యెనసితి మిటు నీలో
మెలగుతా నింతవని మేము సేసేమా ‖ ఈసు ‖ 359 ‖

## వరాళి

ఎంచినట్టు వడునా యెన్నికె లెవ్వరికైనా
దించని తమకమున తేరి నవ్వే నేను ‖ పల్లవి ‖

గునియుచు నినుఁ బాసి కోపగించేనని వచ్చి
నను నీ మాటలకు నవ్వే నేను
అనువుల నీ చేఁత నిన్నడిగే నేనఁగానే
ననుఁ జేయివట్టుకొంటే నవ్వే నేను ‖ ఎంచి ‖

ఆలరి మాఁటలు నిన్ను నాడేనంటా వచ్చి
నాలి నీ యానల కిట్టె నవ్వే నేను
జాలిఁ బెట్టి బొమ్మల జంకించి వలచిన-
నాలాగు లిటు చూచి నవ్వే నేను ॥ ఎంచి ॥

కులికి కులికి నిన్ను గోరఁ జిమ్మేనని వచ్చి
నలి నలి మేను చూచి నవ్వే నేను
చెలఁగి మండెములోన శ్రీవేంకటేశ కూడితి
నలువంక చెలులతో నవ్వేనేను ॥ ఎంచి ॥ 360 ॥

రేకు 1761 వేళావళి

నీకు వేడుకైతేఁ జాలు నే మెట్టయినా నుండేము
యేకడ చూచిన నీవే యేలవయ్య రాజ్యము ॥ పల్లవి ॥

తీపులు వుట్టించి నీవు తేరి సన్నలు సేయఁగ
కోపాలు రేఁగకుందునా కొమ్మలకు
ఆపె నేను యేమిసేతు మాదువార మెఱఁగము
యేపున నింతేసి సేసి యేలవయ్య రాజ్యము ॥ నీకు ॥

ఆసలు రేఁచి నీవు అసము లిచ్చి నవ్వఁగ
వాసులు వుట్ట కుందునా వనితలకు
వోసరించదాపె, నేను వోరువఁజాల నిందుకు-
నీసరి నిద్దరివంక యేలవయ్య రాజ్యము ॥ నీకు ॥

మలసి కొంగులువట్టి మంచముపైకిఁ దియ్యఁగ
కళలు వుట్టకుందునా కాంతలకు
యెలమి శ్రీవేంకటేశ యెనసితివి మమ్మును
యెలయించి యెలయించి యేలవయ్య రాజ్యము ॥ నీకు ॥ 361 ॥

గౌళ

పదము దప్పినమీఁద పంతమిచ్చేవా
 చెదరని ఆపలెల్ల చిత్తగించరాదా ॥ పల్లవి ॥

చెప్పఁజాలక వలపు సిగ్గువడీఁగాని చెలి
 చొప్పున మొకమువాడు చూడరాదా
 కుప్పళించి ఇందరిలో గుట్టు విడువదుగాని
 చిప్పిలె పెంజెమటలు చిత్తగించరాదా ॥ పద ॥

గుటిగాని మనసే గుబ్బతిలీఁగాక చెలి
 కఱకున సురుసురు కన్గొనరాదా
 తటి వచ్చినందాఁక తమకపడదుగాని
 చిఱునవ్వుతోడి చింత చిత్తగించరాదా ॥ పద ॥

వొలుక కుండ వయసు వొట్టి నీ కొప్పించీగాని
 సొలపుల మోముకళ చూడరాదా
 యెలమి శ్రీవేంకటేశ యెనసితి వీపె నిట్టె
 చెలఁగి నిన్నదె మెచ్చి చిత్తగించరాదా ॥ పద ॥ 362 ॥

పాడి

కానీవయ్య అందుకేమి కై కొంటిని
 యీ నిజమే నెరపితే నెందువోయీఁ బనులు ॥ పల్లవి ॥

చే పట్టి తీసి నాతోఁ జెలరేఁగి పెనఁగేవు
 వోపితేఁ జాలుఁగాక వొద్దనేనా
 తీపులెల్లాఁ జిలికించి దిమ్మరిమాట లాడేవు
 యీ పట్టుకు నిన్ను మీరి యెందువోయీఁ బనులు ॥ కానీ ॥

వొత్తి నాకుఁ జెప్పరాని వూడిగాలు చెప్పేవు
చిత్తము వచ్చితేఁ జాలు సేవసేసేను
పొత్తుకుఁ బిలిచి నన్ను పొలఁతుల నంటించేవు
ఇత్తల నీవే నేను యెందువోయీఁ బనులు ॥ కానీ ॥

పానుపుపైఁ గాఁగిలించి పంతాలకుఁ గూడేవు
దానికేమి తల..ని తలఁపాయను
పూనుక శ్రీవేంకటేశ భోగించితి మిద్దరము
యీ నయము నీకే చెల్లు నెందువోయీఁ బనులు॥ కానీ ॥ 363 ॥

వరాళి

మాది క్కేమిచూచేవు మాటి మాటికి
సాదుఁగొయ్యతనాలకు సాదించవలదా ॥ పల్లవి ॥

ఆడుమంటాఁ బాడుమంటా నలఇంచితివి చెలి
వేడుక కాఁడవై నీవు వేఁగినంతాను
వీడె మిమ్మనుచు నీవు వేగిరించే వప్పటిని
జాడల నీవోజ కాపె జంకించవలదా ॥ మాది ॥

రమ్మనుమఁ బొమ్మనుచు రవ్వసేసితివి చెలి
దిమ్మరి ఊడిగేలనే తెల్లవారెను
కమ్మి యిట్టె నవ్వుమంటా కాఁతాళించే వప్పటిని
కొమ్మ నీచేఁతలకును కోపించవలదా ॥ మాది ॥

వుండుమంటాఁ బండుమంటా వూరడించితివి చెలి
అండనే శ్రీవేంకటేశ అంకెలఁ గూడి
చండిపెట్టి పాదాలొత్త సమకట్టే వప్పటిని
మెండు నీయాసలు చూచి మేర మీర వలదా ॥ మాది ॥ 364 ॥

ముఖారి

గొల్ల దోమటాయ నేఁడు కొమ్మలకు నీతో పొందు
మెల్లనే సరసమాడ మేము నిట్టె వతెనా ॥ పల్లవి ॥

వాసులకే ఘాటలాడి వట్టి చనవు సేసుక
రాపి కెక్కే రదివో నీరామలెల్లను
వేసరినఁ బోనీక వేడుక నవ్వులు నవ్వి
నీ సరికే వచ్చిరిగా నేఁడు వీరెల్లాను ॥ గొల్ల ॥

సందడి జాణతనాలు సారెకు నీపై వేసి
కందువకే వచ్చిరిగా కాంతలెల్లాను
విందుల మోవులు చూపి వేమారుఁ గొలువుసేసి
యిందరైరిగా నీకు నిల్లాండ్లు ॥ గొల్ల ॥

వసంతములాడుతానే వడి నిన్నుఁ గాఁగిలించి
యెసరెత్తిరిగా మోహాలింతు లెల్లాను
యెసఁగ శ్రీవేంకటేశ ఇదె నన్నుఁగూడితివి
దొసకులు వేసిరిగా తొల్లిటివా రిపుడు ॥ గొల్ల ॥ 365 ॥

బౌళి

ఇట్టె భ్రమసివుందాన యేమనీఁదాను
యెట్టకేలకు నవ్వితి మేమనీఁదాను ॥ పల్లవి ॥

మొదలఁ దనపై నేను మోహము సేసినందుకు
యెదురుగుదురుగాను యేమనీఁదాను
పదరక తనకు నేఁ బంతము లిచ్చినందుకు
యిదివో యిందరు మెచ్చ యేమనీ దాను ॥ ఇట్టె ॥

చెంతలఁ జెప్పినట్టెల్లా సేసి మొక్కినయందుకు
యెంతగద్దు తనయాస యేమనీఁదాను
మంతుకెక్క నేఁ దనమాటలు నమ్మినందుకు
ఇంతలోనె వేగిరించి యేమనీఁ దాను ॥ ఇట్టె ॥

కనుసన్న చేసి తన్ను కాఁగిలించుకొన్నందుకు
యెనలేని సంతోసాన యేమనీఁదాను
చనవిచ్చి శ్రీవేంకటేశ్వరుఁడె తా నన్నుఁగూడె
ఇనుమడితమకాలు యేమనీఁదాను ॥ ఇట్టె ॥ 366 ॥

రేకు 1762 రామక్రియ

ఱట్టు సేసెఁగాక మమ్ము జాతిగుండెతో
గట్టిగ వాకిట వచ్చి కాచుకుండనా ॥ పల్లవి ॥

తనతో మాటాడనంటా తప్పులు వట్టేవాఁడు
యెనసి యీ పొద్దాయ యేడ నుండెనే
అనకుండరాదా మాట ఆయాలు సోఁకేవేళ
పెనఁగి ఇందాఁకా నేను పిలిపించనా ॥ ఱట్టు ॥

యెదురుగా రానంటా యెగ్గులు వట్టేవాడు
వుదుటు సేఁతలకేల వొడిగట్టెనే
వొదిగి వుండఁగరాదు వొరసి తా మించఁగాను
అదనఁ జెలుల నంపి ఆనలు వెట్టించనా ॥ ఱట్టు ॥

నేనే ముందు గూడనంటా నెరుసు లెంచేవాఁడు
పానిపట్టి తానేల పంతాలాడీనే
కానిమ్మంటాఁ బుట్టపర్తికాఁడ శ్రీవేంకటేశ్వరు
యీనెపానఁ గూడితి నే నెచ్చరించనా ॥ ఱట్టు ॥ 367

## వరాళి

నివ్వెరగుతో నాపె నిండుకున్నది
జవ్వనము రేచిపెట్టి చలమిఁకఁ దగునా ॥ పల్లవి ॥

వొత్తి విన్నవించలేక వొద్ద నిలుచున్న దింతి
చిత్తగించి యామాట సేయరాదా
బత్తితోడ నియ్యరానిబాసలెల్లా నిచ్చితట
పొత్తు గుడిచితివట బొంకనింకఁ దగునా ॥ నివ్వె ॥

కక్కసించలేక నీపై కాఁకలు చల్లీ నింతి
చిక్కుల ఆపె చనవు చెల్లించరాదా
మిక్కిలి యాపెకు నీవు మేలువాఁడవూనట
దక్కివున్నాఁడవూనట తప్ప నింకఁదగునా ॥ నివ్వె ॥

చేసు తియ్యఁగ లేక సిగ్గులు వడీ నింతి
సేవలు సేయించుకొని చెల్లఁగరాదా
శ్రీవేంకటేశ్వర ఇట్టె చేకొని కూడితివట
భావము మాలోనిదట పంత మిఁకఁ దగునా ॥ నివ్వె ॥ 368 ॥

## ఆహిరి

విన్నవించరే యామాట వెలఁదులాల
పన్ని తన సుద్దులేమి బాయిట వేయనే ॥ పల్లవి ॥

జగమెల్ల నెరఁగఁగ సతి నయితిఁ దనకు
తగ వించుకంతా దప్ప తనపాలికి
వెగటుగా దానెంత వేడుక కాఁడైనాను
నగేఁగాని వింతతనము సేయనే ॥ విన్న ॥

సిగ్గు నెగ్గులు నెంచక చిత్తమురా నడచితి
దగ్గరి దక్కి వుంటిని తనపాలికి
వెగ్గళించి తనసేఁత వెల్లావిరులైనను
వొగ్గి తన్ను మెచ్చేఁగాని వొరటులు చూపనే ॥ విన్న ॥

కలసి మెలసి వుండి కాఁగిలించుకొంటిని
తలఁపు వొప్పగించితి తనపాలికి
యెనసె శ్రీవేంకటేశుఁడిఁక నేమి సేసినాను
చనవిచ్చేఁగాని మరి సాదించనేరనే ॥ విన్న ॥ 369 ॥

## కాంబోది

చుట్టపు వరుస వచ్చి సొలయుచు నున్నారము
తిట్టరుగదా తరితీపుల నున్నారము ॥ పల్లవి ॥

తగవులు చెప్పఁగాను తప్పులేమీ రావుగదా
మిగులార సరసమాడే మీలోనను
నగవులు నగఁగాను నన్నేమి ననరు గదా
తగని కోపము మీ కాఁతాళములు చూచి ॥ చుట్ట ॥

సాకిరై నిలువఁగాను సడి మాకు రాదు గదా
మేకుల పంతములాడే మీలోనను
రాకపోకలకు మమ్ము రవ్వలు సేయరు గదా
కాకరితనముల మీ కందువలు చూచి ॥ చుట్ట ॥

నిక్కి మిమ్ముఁ గూడించఁగా నింద మాకు రాదు గదా
మిక్కిలి జవ్వనముల మీలోనను
యెక్కువ శ్రీవేంకటేశ యిద్దరు నెనసితిరి
చొక్కించరుగదా మీమా సుద్దులెల్లఁ జూచి ॥ చుట్ట ॥ 370 ॥

గౌళ

నిన్ను మోఁచి వచ్చినంటా నేరుపుల దిరిగేవు
సన్న లిట్టె సేసేవు నీజాడ నే నెఱఁగనా ॥ పల్లవి ॥

మొగమిచ్చ లాడలేక మోనాన నుండితిఁగాక
తగవులే పలికితే తగుననా
జగడించి యాపె నేను సాకిరి నిన్నడిగితే
నగవులు నవ్వేవు నీ నాటకాలెఱఁగనా ॥ నిన్ను ॥

యిచ్చకాలు సేయఁగాను యియ్యకోనైతిఁగాక
అచ్చముగా సడచితే నవుననా
మచ్చరించి యాపె నేను మంకులు దేరుచుమంటే
తచ్చనలు సేసేవు నీ తలఁపు లెఱఁగనా ॥ నిన్ను ॥

చలపట్టఁగా నీతో సాదించకుండితిఁగాక
యెలమి శ్రీవేంకటేశ యిందుకనేనా
అలమేలుమంగను నిన్నాపె నేనుఁ బిలిచితే
కలసితి విద్దరిని కత లివెఱఁగనా ॥ నిన్ను ॥ 371 ॥

బౌళి

ఇందులోనఁ దప్పలేవి యేల నన్ను దూరేవు
నందనందనుఁడ నాలో నవ్వితి నేను ॥ పల్లవి ॥

ఆమనిగా నిందాఁకా ఆపెమాఁటలా, డిప్పుడు
నామాఁట లాడఁగాను నవ్వితినేను
జాముదాఁకా ఆపె దిక్కు సంతోసానఁ, జూచి మాచి
నామోము చూడఁగాను నవ్వితి నేను ॥ ఇందు ॥

పోయిన రాతిరి యెల్లా పొరుగింటి కాడ నుండి
నా యింటికి రాఁగాను నవ్వితి నేను
చాయల కాపె సుద్దులు సతులచేఁ దడవించి
నాయాలు నీవు చెప్పఁగా నవ్వితి నేను ॥ ఇందు ॥

అడరి శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
నడుమ నీవు గూడఁగా నవ్వితి నేను
యెడపుల యాపెఁ దచ్చి యిట్టె నాకు మొక్కించఁగా
నడవడి చూచి నిన్ను నవ్వితి నేను ॥ ఇందు ॥ 372 ॥

రేకు 1763 కాంబోది

చెప్పినట్టు సేసేఁగాని చెలివి నీవు
కుప్పళించీ నావలపు కొంత నాన నీవే ॥ పల్లవి ॥

పెనఁగేటి విభునితో బిగియఁగరాదు నేను
చనవు గడు నిచ్చితే చలము వోదు
వెనుకొని నీవేల వేఁడుకొనే విటు నన్ను
తనుఁదానే నాయకుఁడు దండకు రానీవే ॥ చెప్పి ॥

వెక్కునొక్కి పతితోడ సిగ్గువడరాదు నాకు
యిక్కడ నే నియ్యకొంటే యాసు దీరదు
వొక్కమాఁటే నన్నేల వొడఁబరచేవే యింత
తక్కించీనా యాతఁడే తమకించనీవే ॥ చెప్పి ॥

కూడిన శ్రీవేంకటేశుఁ గొంగువట్టరాదు నాకు
యీడైతి అలమేల్మంగ నెదురు లేదు
వేడుకాయ ఇఁకనేల వేసరించేవే నీవు
వీడెపుమో వితనికి విందువెట్టనీవే ॥ చెప్పి ॥ 373 ॥

## మాళవిగౌళ

నీ యెడకు నంతేసి నే మోపము
దాయిదండగా నవే తలఁచుకోరాదా ॥ పల్లవి ॥

వోటలేక యెవ్వతో నిన్నొక చోటఁ దిట్టితేను
మాఁటలు నేర్చుకవచ్చి మమ్ము దిట్టేవు
పేటలుగ నీకు నవే ప్రియములైతేఁ గనక
చీటికి మాటికి [1]కొండసెలఁ దిట్టరాదా ॥ నీయె ॥

తొలుత మరి నెవ్వతో తురుము నిన్నుఁ బట్టితే
కొలఁది మీరఁగ మా కొప్పు వట్టేవు
యెలమి నవే నీకు యితవులైతేఁ గనక
పొలసి మొగళ్లెక్కి పూవులు గోయరాదా ॥ నీయె ॥

నలిగా నందరిచేత నవ్వించుకొని వచ్చి
అలమేల్మంగను నన్ను నట్టె నవ్వేవు
కలసితిమి శ్రీవేంకటేశుఁడ వేడుకైతే
సొలసి యద్దమునీడ చూచి నవ్వరాదా ॥ నీయె ॥ 374 ॥

## కేదారగౌళ

ఈపె యేమి సేసును యింతి గడు ముద్దరాలు
వోపిక నీకుఁ గలితే వోరసుకోవయ్యా ॥ పల్లవి ॥

సిగ్గులువడే వారికి సెలవి నవ్వులు వచ్చు
యెగ్గువట్టి గరిసించ యేలయ్య నీకు
వెగ్గళించి ఇది నీకు వెంగములైతేఁ గనక
దిగ్గన నూరివారితో తెలుపుకోవయ్య ॥ ఈపె ॥

---

[1] కొండసెల=పలుకురాయి (echoing) కావచ్చు

ముచ్చటలాడే వారికి మొక్కులు వేళమే వచ్చు
యెచ్చరి వుదిరిపడనేలయ్య్య నీకు
పచ్చిదేరి యిది నీకు పంగెములైతే గనక
కుచ్చి నీ పొరుగువారి కొంగు వట్టవయ్యా ॥ ఈపె ॥

వురముపై నుండేవారి కొద్దిక బీరము వచ్చు
యెరవుల పంతము లేలయ్య నీకు
అరిది శ్రీవేంకటేశ ఆపె యలమేలుమంగ
సరిఁగూడె నొద్దివారి సాకిరెంచవయ్యా ॥ ఈపె ॥ 375 ॥

## ఆహిరి

మరిగితి మిదె నిన్ను మా భాగ్యము
తరి తీపులఁబెట్టేరు దండనున్న చెలులు ॥ పల్లవి ॥

గుఱు(ఱు?)తులు నీ మేనివి గొబ్బున వెల్లావిరులు
మఱఁగులు మొఱఁగులు మా మాటలు
మఱి దొరవు గనక మానుపరావు పనులు
వొఱపుల నొరసేరు వొద్దనున్న చెలులు ॥ మరి ॥

తలఁపులు నీలోనివి దట్టపురాలవంటి
మలకలు మొలకలు మా వయసులు
బలిమికాఁడవు గాన పట్టరు నీగుణములు
పొలసేరు మమ్ము నైతే చుట్టాలైన చెలులు ॥ మరి ॥

గుదిగొన్న ప్రియములు కూడిన నీ కూటములు
మదములు ముదములు మా సిగ్గులు
అదె శ్రీవేంకటేశుఁడ అలమేలుమంగ నేను
పదరరు మీతో మమ్ముఁ బాడేరు మా చెలులు ॥ మరి ॥ 376 ॥

## దేసాళం

వింతవారు నిన్నేమన్నా విన(జాలము
మంతుకు బదుకవయ్య మాకు సెలవుగను ॥ పల్లవి ॥

చెక్కులును నొక్కితివి సేసలును( జల్లితివి
యెక్కువైతి వింక మాకు నేమి గొరత
దిక్కుల సతులు నిన్ను దీవించేటట్టు గాను
మక్కువ బతుకు నీవు మాకు సెలవుగను ॥ వింత ॥

సెలవుల నవ్వితివి చేయి మాపై వేసితివి
; చెల(గితి మి(క మాకు చింత యేడది
చెలిమి సేసినవారు చేయెత్తి మొక్కేయట్టుగ
మలసి బతుకవయ్య మాకు *సెలవుగను ॥ వింత ॥

కందువలు చూపితివి కాఁగిటను( గూడితివి
అంది యలమేల్మంగను అక్కర లేదు
ఇందునే శ్రీవేంకటేశ యిరుగుపొరుగు వారి
మందలించి బతుకుమీ మాకు *సెలవుగను ॥ వింత ॥ 377 ॥

## పాడి

ఏల బలిమి సేసేవు ఇంతలో మమ్ము
వాలుక రెప్పల తలవంచుటే సుకము ॥ పల్లవి ॥

మాయదారి వారి తోడ మంతనాలాడుట కంటె
చాయలు సేసుకుందుటే జాణతనము
చేయి మీ(దఇనవారి( జెనకుటకంటేను
' ఆయుమెరి(గి నవ్వుటే అది మంచితనము ॥ ఏల ॥

* 'శలవు' అని రేకు.

యేతులు నెరపేవారి యెదుట నిలుచుకంటే
దూత పనులు సేయుటే దొరతనము
కాతరించేవారితోడ కతలు చెప్పటకంటే
నీతితో [1]మోనానుండే నేరుపే నేరుపు ॥ ఏల ॥

వేసాల నెరపేవారి వేడుక చూచుటకంటే
వాసితో జూజ మాడితే వైపైవుండు
ఆసల శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
నీసొబగు యిట్లానుంటే నిచ్చకల్యాణములు ॥ ఏల ॥ 378 ॥

## రేకు 1764 సామంతం

కొమ్మలు పాదాలొత్తఁగా గోవిందుఁడు
యెమ్మెలకే పవళించె నిదివో గోవిందుఁడు ॥ పల్లవి ॥

సరిగా గొల్లెతలతో సరసాలాడి యలసి
నిరతితోఁ బవళించె నేఁడు గోవిందుఁడు
అరసి బృందావనాన ఆవులఁ గాచి వచ్చి
ఇరవుగఁ బవళించె నిదివో గోవిందుఁడు ॥ కొమ్మ ॥

కదిసి గోపాలులతో కచ్చకాయ లాడివచ్చి
గుదిగొనఁ బవళించె గోవిందుఁడు
మొదల గోవర్ధనాద్రి మోఁపు మోఁచి వచ్చి నేఁడు
యెదుటనే పవళించె నిదివో గోవిందుఁడు ॥ కొమ్మ ॥

నించి శ్రీవేంకటాద్రిని [2]నిలిచిందుఁ బవళించె
కొంచక తిరుపతిలో గోవిందుఁడు

---

[1] 'మోనావన్ + ఉండే' కావచ్చు. లేదా 'మోనానముండే' అనే పీరి సహజ ప్రయోగమునకు వ్రాయసకాని పొరపాటైన కావచ్చు.

[2] నిలిచి + ఇందు.

అంచెలఁ బదారువేల నలమి వారివరుస-
లెంచుకొంటాఁ బవళించె నిదివో గోవిందుఁడు ॥ కొమ్మ ॥ 379 ॥

గౌళ

ఇందువంక నేమి గద్దు యెంత సేసినా
పొందినవాఁడు తానే బుద్ది చెప్పీ మనకు ॥ పల్లవి ॥

చలము లేమిటికే జగడా లేమిటికే
అలరి పొత్తులమగఁడాతఁ డుండఁగా
కులికి యెంత గలితే కొంగువట్టుదము రావే
బలిమి వలపు దానే పంచిపెట్టీ మనకు ॥ ఇందు ॥

మచ్చర మేమిటికే మంతన మేమిటికే
అచ్చమయిన పురుషుఁ డాతఁ డుండఁగా
ముచ్చట యింత గలితే ముదులకింతము రావే
ఇచ్చిన చనవు దానే యేర్పరచీ మనకు ॥ ఇందు ॥

మంకు లివేమిటికే మరఁగు లేమిటికే
అంకెల శ్రీవేంకటేశుఁ డాతఁ డుండఁగా
తెంకినే తానే కూడె తెలుసుకొందము రావే
సుంకుల సలిగెలెల్ల చూరలిచ్చీ మనకు ॥ ఇందు ॥ 380 ॥

హిజ్జిజి

ఇతరుల చేత నౌనా యీపనులు
తతి నన్నిటికి గురి తానే కదవే ॥ పల్లవి ॥

బిగిసి యీపెయు నేను బీరము లాడేటివేళ
తగవుఁ జెప్పఁగలఁడు తా రమ్మనవే

అగడుగా నిద్దరము అవుఁగాదనుకొనేవేళ
వెగటు దీరుచు నిందు విచ్చేయుమనవే ॥ ఇత ॥

బలిమి నొక్కొక్కరము పంతములాడేటి వేళ
సొలపు దీర్ప నేరుచుఁ జూడుమనవే
యెలమి మాలో నేము ఇంత రేసయిన వేళ
వలసినట్లు పేసును వద్దనుండు మనవే ॥ ఇత ॥

దగ్గరి సవతులము తమకించేయట్టివేళ
సిగ్గు వాపి మమ్ముఁ గూడఁ జెల్లుననవే,
నిగ్గుల శ్రీవేంకటాద్రినిలయుఁడు తాఁగలసె
వొగ్గితిమి మా చేఁతల కొద్దుకోకుమనవే ॥ ఇత ॥ 381 ॥

## లలిత

ఏమని నే నాడినాను యీపడించేవు
వేమారు మీరలిగితే వేఁడు కొనఁదగదా ॥ పల్లవి ॥

తగవు చెప్పితినా తరుణికి నీకు నేఁడు
అగడుమీవోజ తగదంటిఁగాక
తగులుగలదానను దండనున్నదానను
[1]మగటిమి మీవాదులు మానుపఁగద గదా ॥ ఏమ ॥

గుట్టు వెళ్లవేసితినా కోమలికి నీకు నేను
పెట్టిన వొట్లు తలఁపించితిఁగాక
పెట్టిన పేసదానను ప్రియముతోడి దానను
మట్టులు మీరితే మిమ్ము మచ్చరించఁదగదా ॥ ఏమ ॥

---

1 మగటిమి='శక్తితో, సామర్థ్యముతో' అని అర్థము కావచ్చు. యౌగికార్థము ఇందు సాపగదు.

చెనకులు రేఁచితినా చేతులు మిమ్ముఁబట్టి
పెనఁగించి మీవలపు పెంచితిఁగాక
ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
చనవుగలదానవు సాదించఁ దగదా ॥ ఏమ ॥ 382 ॥

## సామంతం

ఆపె వచ్చె అవునోకాదో అడుగవయ్య
యేపొద్దాయ జాగుల మమ్మేల పెట్టేవయ్యా ॥ పల్లవి ॥

తప్పక చూచితేనే తలఁపెల్లఁ గానరాదా
చెప్పవలెనా నీచేఁతలెల్లాను
కుప్పళించె పెంజెమట గుబ్బన తురుము వీడె
దప్పిగొంటి నీసుద్దు లెందాఁక విందునయ్యా ॥ ఆపె ॥

వద్దఁగూచుండి నంతనే వలపెల్లఁ గానరాదా
ముద్దుమోము చూపి మాకు మొక్కవలెనా
చద్ది నిట్టూర్పులు రేఁగె జవ్వనము వేఁకమాయ
వద్దన వెఱతు నే నెవ్వరికిఁగానయ్యా ॥ ఆపె ॥

నిలుచుక వుండితేనే నిజమెల్ల గానరాదా
చెలరేఁగి సత్యమును సేయవలెనా
నెలవై శ్రీవేంకటేశ నీవే నన్నుఁగూడితివి
అలసితి వీడెమిచ్చే నందుకొనవయ్యా ॥ ఆపె ॥ 383 ॥

## బౌళి

ఇందుకే వెరగయ్యా మా కిందులో నిన్నుఁజూచి
సందడిపరసముల చలముకొనేవే ॥ పల్లవి ॥

కాఁకల విభునిఁ జూచి కనురెప్ప వేయవు
యేఁకట నీమది నింక నెంత గలదే
ఆఁకల మెడగట్టుక అతఁడు నీకున్నవాఁడు
వాఁకల వలపు పరవంజు కొనేవే ॥ ఇందు ॥

నున్నని మాటలాడియు నోరఁ గాయ వేయవు
యెన్నిక నీమది నింక నెంత గలదే
చన్నుల తుదలనే సరసుఁడు వున్నవాఁడు
పన్నిన రతులకెల్ల బార చాఁచేవే ॥ ఇందు ॥

నిండఁ గాఁగిలించుకొని నీలోనఁ దనియవు
యెండల నీడల యాస యెంత గలదే
అండ శ్రీవేంకటేశుఁడు అంది పాయకున్నవాఁడు
గండి తమకము లెల్ల గాదెఁ బోసేవే ॥ ఇందు ॥ 384* ॥

రేకు 1765 వరాళి

[1]మేలుదానరా నే నీకు మేలు దానరా
యేల యేఁచేవు ఇంటికి రారా
మేలుదానరా కొండలయ్య మేలుదానరా, అప్పకొండ
మేలుదానరా ॥ పల్లవి॥

---

* ఈ 384 పాటలో 'విభునిఁజూచి', 'కౌగలించుకొని' అని చదువుకొనవట సబబు. రాగరేకుల వ్రాతలో హ్రస్వదీర్ఘాలకు గుర్తు ఒక్కటే 'ం'. ప్రకరణాన్ని బట్టి మనం చదువుకోవలె. (కా.శ్రీ.).

1 ఈ 385వ పాట జావళి సరళిలో నడచినట్లున్నది. 'పల్లవి' మూడు పాదములు. అందులో మూడవ పాదము కొన ప్రగ్రహించి "అప్పకొండ" భాగమును కలిపినట్లున్నది. చరణమునకు రెండేసి పాదములు. ప్రతి చరణమునందును రెండవపాదము. కడపటి భాగముతో 1 నీమోము 2. మనసిచ్చి 3. నీపచ్చ డములను ప్రగ్రహచిహ్నములకు కడపట కలుపుకోవలసినట్లున్నవి. లేకున్న యతిభంగము.

కోమలపు నాచన్నులు నీకు గురుతు కానిక లివిరా
 చేముట్టి చేకొనరా, నీమోము చూపి మోవి యియ్యరా ॥ మేలు ॥

తనువుపై నీచేఁతలు నిన్నుఁ దలపించు నే పొద్దును
 చెనకుచు నిండుఁగాఁగిట నాతో, మనసిచ్చి మాటలాడరా ॥ మేలు ॥

పచ్చిగాఁగ నన్నుఁగూడితి నీ భావము నాలోఁ జిక్కెను
 మచ్చిక శ్రీవేంకటేశుఁడ, నీ పచ్చడము పయిఁ గప్పరా ॥ మేలు ॥

## సాళంగనాట

కానీరా చోరి కానీరా
 కానీరా లట్టె కానీరా నేఁడు
 దానికి మాఁటిచ్చి తప్పవు నీవు ॥ పల్లవి ॥

విందు నేఁ జెప్పఁగ వెనకతీసేవు
 కందువ నీగుట్టు కంటిరా నేను ॥ కానీ ॥

రాయడించి నిన్ను రతికిఁ బిలిచి
 చేయి చాఁచినాను చిక్కవు నీవు ॥ కానీ ॥

నావాఁడవై కూడి నవ్వే వాపెతోడ
 శ్రీవేంకటేశ్వర చెల్లిర నీకు ॥ కానీ ॥ 386 ॥

## పాడి

చక్కనుండవే మాతోడిజగడాలు నీకేల
 నిక్కి లోనయినవారు నిన్నుఁ బోలరా ॥ పల్లవి ॥

వచ్చి వచ్చి మాతోడి(డ?) వంతులకే పెనఁగేవు
 మెచ్చిన గొల్లెతలనాఁ డెందువోతివే

ముచ్చటదీర నితఁడు మోహించి తోసినయట్టి-
నెచ్చెలు లింతకతొల్లి నీకొలఁదివారలా ॥ చక్క ।

వుండుండి నీవు మాతో వొరయఁగ వచ్చేవు
నిరడి పదారువేలలో నీపేరేదే
గండికాఁ డితఁడు పొంది కదుపునఁబెట్టినట్టి-
అండనున్న సతులు నీయంత నేరరయ్యా ॥ చక్క ।

నవ్వి నవ్వి మాతోను నంటుసేయఁదొడఁగేవు
యెవ్వతెవే పట్టపువారెనంద్రలో
రవ్వ శ్రీవేంకటేశుఁడు రతి నన్ను నిటు గూడె
జవ్వనులు నీవలె సాదించనోపరా ॥ చక్క ॥ 387 ॥

## సామంతం

*వారిగో *వీరిగో వాడలవాడల
కోరిక మీరఁగ గోపాలులు ॥ పల్లవి ॥

జోరునఁ గారీని చొక్కపువుట్లు
పేరని పాలును పెరుగును
వారలు వట్టేవు వాకిటివుట్ల
కూరిమిఁ గృష్ణుఁడు గోపాలులు ॥ వారి ॥

తొట తొట రాలీ దొండ్లయి వుట్ల
చిటిబెల్లాలును చిమ్మిరును
తటుకునఁ బట్టి దాపేరు పుక్కిళ్ల
గుటుకలు మింగి గోపాలులు ॥ వారి ॥

---

* వారు + ఇగో
*వీరు + ఇగో

వానలు గురిసీ వరుస వుట్ల
తేనెలుం బండ్లు [1]తెంకాయలు
ఆనేరు శ్రీవేంకటాధిపతిఁ గూడి
గోనల గొందుల గోపాలులు ॥ వారి ॥ 388 ॥

పళవంజరం

ఇంత వుపకారి నైతి నిది నీకుఁ జాలదా
బంతిఁబెట్టితి వలపు భావించుకో తగవు ॥ పలవి ॥

ఆలరి యూపె దిట్టిన ఆ తిట్లల్లా దాఁచి
జాలిఁ బెట్టనైతి నిన్ను చాలదా ఇది
పోలించి నీవు బొంకిన బొంకులెల్లా చెల్లఁ బెట్టి
మేలు మేలని మెచ్చితి మెచ్చవద్దా నన్నును ॥ ఇంత ॥

చివుకున ఆపెచేసే సేఁతలకు నడ్డమై
చవుకలు సేయనైతి చాలదా యిది
తవిలి నీవు దలఁచే తలఁపెల్లా నీడేరించి
కవ గూర్చినందుకు చొక్కఁగవద్దా మనసు ॥ ఇంత ॥

*కలశాపె నవ్వఁగాను కాఁగిలించుకొని నిన్ను
చలములు మించి(చ?)నైతి చాలదా ఇది
నిలిచి శ్రీవేంకటేశ నెరవేర్చి నీపనులు
బలిమి సేసితిని చేపట్టవద్దా యిఁకను ॥ ఇంత ॥ 389 ॥

---

[1] తెన్ + కాయ = తెంకాయ. దక్షిణ దేశమున విరివిగ పండేకాయ. మన వ్యవహారములోని 'టెంకాయ'కు ఇది మూలరూపము కావచ్చు. ఆ పదమిక్కడ యతిస్థానమున బిగిసినది.

* కలసి + ఆపె

## ఆహిరినాట

*ఏఁటిదే మా వలపు యింతా నీదే వలపు
రోఁటితేఁ బదియుఁ బది రొక్కమాయ వలపు ॥ పల్లవి ॥

నిట్ట చూపులై నీకు నిండుకొనె వలపు
ముట్టి వచ్చితే పెద్ద మోపాయ వలపు
అట్టె గొరసరాయఁ డాయగా నీవలపు
నట్టుక కంబముమాఁటు నవ్వులాయ వలపు ॥ ఏఁటి ॥

బూమి మీఁద వేఁడుకొంటే పొడవాయ వలపు
గోమున నొరసితేను కోపమాయ వలపు
వేమారు నడవులెల్ల వెదకించె వలపు
ఆముకొని గొల్లదోమటాయ నదె వలపు ॥ ఏఁటి ॥

వింతవారెదుట సిగ్గు విడిపించె వలపు
బంతినే వచ్చి రాతికిఁ బ్రాణమాయ వలపు
పంతము నీవియ్యఁగా మాపాలాయ వలపు
కాంతుఁడ శ్రీవేంకటేశ కప్పెను నీవలపు ॥ ఏఁటి ॥ 390 ॥

## సాళంగనాట

ఏల వచ్చెనే గర్వము ఇట్టె తనకు
తాలిమితో నుండితేను తానే ఆఁటది ॥ పల్లవి ॥

పలుకుల పని యేమే పైపైనే ఆతని-
తలఁపు దెలిసితేనే తానే ఆఁటది
చలములకు వచ్చె(చ్చి?)నా సరసుఁ డాతనెదుట
తలఁగక నిలిచితే తానే యాఁటది ॥ ఏల ॥

---

* ఇందు దశావతార సమన్వయము కలదు.

కినుక యింతేసేఁటికే కెరలించి రమణుని
తనివిఁ బొందించితేను తానే యాఁటది
చనవులఁ బొరలినా సంగడినున్న వానిని
తనవోజ పట్టించితే తానే యాఁటది ॥ ఏల ॥

అప్పుడే బీరము వద్దే అందుండే వచ్చె నితఁడు
తప్పక తాఁ జూచితేనే తానే యాఁటది
యిప్పుడే శ్రీవేంకటేశుఁ డింటిలోన నన్నుఁ గూడె
తప్పు లెంచ నోపితేను తానే యాఁటది ॥ 391 ॥

రేకు 1766 సాళంగం

అంటి ముట్టిన పనులు ఆతఁ డెరుఁగు
వెంట వెంట మీరు నన్ను వేఁడుకొన నేఁటికే ॥ పల్లవి ॥

నగిన దొక్కటే కాని నాకు *నేమిఁ దెలియదు
అగవుఁ దగవు లెల్లా నాతఁ డెరుఁగు
జగడాలడిచితినా సరవితో నున్నదాన
వెగటుగా నన్ను మీరు వేఁడుకొన నేఁటికే ॥ అంటి ॥

మొక్కిన దొక్కటే కాని ముందు వెనక లెంచను
అక్క డిక్కడి సుద్దులు ఆతఁ డెరుఁగు
తక్కులఁ బెట్టేనా తనదాననే నేను
వెక్కసాన మీరు నన్ను వేఁడుకొన నేఁటికే ॥ అంటి ॥

కూడిన దొక్కటే కాని గుట్టు బాఇట వేయను
ఆడుకొలు బాసలెల్ల నాతఁ డెరుఁగు
యీడనే శ్రీవేంకటేశుఁ డిరవుగా నన్నుఁ గూడె
వేడుకకు నన్ను నింత వేఁడుకొన నేఁటికే ॥ అంటి ॥ 392 ॥

---

*[illegible]

## సామంతం

మే మెఱఁగమా తన్ను మెచ్చుల గొల్లెతలము
గోములు మరిగి రాసకొండుకాయ నిపుడు ॥ పల్లవి ॥

పులుగు వంటి గుబ్బము పొలము వంటిది యూలు
చిలువ వంటి పరపు సేరె(రెఁ?) దనకు
తొలుత మాగొల్లవాఁడే దొరతన మబ్బెనంటా
కొలము దాసుక రాసకొండుకాయ నిపుడు ॥ మేమె ॥

కొక్కరవంటి సంకము కుదురు[1]వంటి కైదువ
అక్కుమీఁది కొక పూస అబ్బెఁ దనకు
యెక్కువ నావులఁ గాచె నిన్నాళ్లు మావొద్ద
గుక్కక మిక్కక రాసకొండుకాయ నిపుడు ॥ మేమె ॥

పసపు వంటిది సీర పసిఁడిపతిమ సొమ్ము[2]
యెసఁగ శ్రీవేంకటాద్రి యెక్కుకొన్నాఁడు
వసముగాని సతుల(లు?) వారిఁ గూడి మమ్ముఁ గూడి
కొసరించుకొని రాసకొండుకాయ నిపుడు ॥ మేమె ॥ 393 ॥

## బౌళి

నీ మాఁటే నిజము నెలఁతలు పెక్కులైతే
మోములు చూచి చూచి మొగచాటే కాదా ॥ పల్లవి ॥

వొప్పుగా ఆకెయు నేను వొక పోలి కనేవు
కప్పురము దిన్న నోటఁ గల్ల లాడేవా

---

[1] కుదురువంటి కైదువ = చక్రము కావచ్చు.

[2] సొమ్ము : స్వాధీనమైనది (భార్య కావచ్చు) "నీసొమ్మనన్న గాణిక్య వృత్తి" నరప. భు. అ.ప. ఇత్యాదులలో ఇట్లే తోచుచున్నది

యెప్పుడు దామెరపువ్వు లెచ్చుకుందులైతే నేమి
దెప్పరపు పువ్వుఁదేనె తీపె కాదా ॥ నీమాఁ ॥

వెగటై రెండు చేతుల విడే లొక్కప రిచ్చేవు
తగవరి వన్నిటాను తప్పఁజేసేవా
బిగిసి కంటమాలలో పిన్న పెద్దముత్తే లుండే
జగతిఁ బెట్టేవారికి సరియే కాదా ॥ నీమాఁ ॥

యీవేళ నానలువెట్టి యిద్దరిని గూడితివి
శ్రీవేంకటేశ్వర నీవు సిగ్గువడేవా
వైవశపు మొగవాఁడు కప్పేనని కూరిచితే
భావించ రెండు చీరలు పచ్చడము గాదా ॥ నీమాఁ ॥ 394 ॥

## శంకరాభరణము

ఓ యమ్మ యశోద వొద్దన్న మానఁడు
ఖోయుని యారిచీ గోవిందుఁడు ॥ పల్లవి ॥

పయ్యెద లెడలఁ బట్టెరు గొల్లెత-
లొయ్యన తాఁ గొట్టీ నుట్లు
తియ్యనిపెరుగు తేనె వారవట్టీ
*కూయఁగఁ గూయఁగ గోవిందుఁడు ॥ ఓయ ॥

చాడెలు దియ్యుచు సతులు నవ్వఁగ
ఆడవారిచన్ను లట్టె తీసీ
యేడకైన చాఁచీ లెత్తిన కోలలు
కోడెకాఁడు గదె గోవిందుఁడు ॥ ఓయ ॥

---

* 'కుయ్యఁగఁగుయ్యఁగ' కావచ్చు. లేకున్న (పాపభంగము

యెమ్మెలు నెరపీ యిందిరయుఁ దాను
అమ్మరో శ్రీవేంకటాద్రి వీథులను
కమ్మి గోపికలు కాఁగిటఁ గూడఁగ
కుమ్మరించీ సిగ్గు గోవిందుఁడు ॥ ఓయ ॥ 395 ॥

## నాదరామక్రియ

ఆనతీవయ్య యేమిటా నడ్డము లేదు నేఁడు
నేను నీకీ వూడిగాలు నేరుచు కొనేను ॥ పల్లవి ॥

కొంత గొంత నీ నిలువుఁ గొప్ప జారివున్నదిదె
పంతమున నెవ్వతైనాఁ బట్టి తీసెనో
పొంతనె యెదుగాను నీ పుక్కిటఁ దమ్మ వున్నది
అంతరంగమైనచోట నాదాయము వచ్చెనో ॥ ఆన ॥

తొలుతే నీ పచ్చడము తొప్పఁ దోఁగి వున్న దిదె
నిలుచుండఁగా నాపె పన్నీరు చల్లెనో
అలపి బుసకొట్టేవు అక్కడివారు నిన్ను
బలిమిఁ జెప్పఁ గూరానిపనులు సేయించిరో ॥ ఆన ॥

యీ రీతిఁ బూవుల దండ లిన్ని నీమెడ నున్నవి
పోరానివారే నీకు బూజ సేసిరో
చేరి యలమేల్మంగను శ్రీవేంకటేశ కూడితి-
వారసి బుద్ధి చెప్పిరో అందరూనుఁ దగరు ॥ ఆన ॥ 396 ॥

## బౌళి

ఇంకనైనా మొక్కవే నీ విన్నిటికి శలవుగా
కంకి సేసేవు వలపు కటకటా యేమే ॥ పల్లవి ॥

యేకతానఁ బతితోడ నేమన్నా నమరుగాక
వాకుచ్చి యిందరిలోనా వా దడతురా
ఆకడ నవ్వీ నతఁడు అనలు వెట్టేవు నీవు
కాకు సేసేవు వలపు కటకటా యేమే ॥ ఇంత ॥

చెంతనుండే యట్టి వేళ చెనకఁగఁ జెల్లుఁ గాక
పంతమునఁ గొలువులోఁ బచ్చి సేతురా
సంతసించె నిన్ను నాతఁడు జంకించేవు నీవైతే
గంత గట్టేవు వలపు కటకటా యేమే ॥ ఇంత ॥

కూడిన యిప్పటి వేళ కొసరఁ దగవు గాక
యేడనైనా రట్టుసేసి యెచ్చరింతురా
యీడనె శ్రీవేంకటేశుఁ డితవాయఁ గంసేవు
గాడిఁ బెట్టేవు వలపు కటకటా యేమే ॥ ఇంత ॥ 397 ॥

రేకు 1767 ముఖారి

ఎవ్వరి వసము గాఁడు యెత్తినవారి చే బిడ్డఁడు
నొవ్వక నోకి కన్న నీ నోముఫల మిదివో ॥ పల్లవి ॥

వేగి లేచితే సుద్దులు వెన్నలు దొంగిలీ నవె
బాగై నీరాటే(డేఁ) రేవు పచ్చి సిగ్గులే
చేగదేరె బండె డేసి చేఁతలు ముంగిటనే
యీగతి బిడ్డఁడు వుట్టె నెశోద నీకమ్మా ॥ ఎవ్వ ॥

పొద్దుఁగూకితే కన్నవి పొంచి చీఁకటి తప్పరే
మద్దులు విరిచీ నవి మంద బయట
పొద్దు మరిఁ బొడిచితే(తేఁ?) బూతకి చంటికతలే
యెద్దువంటి బీరాలవాఁ డెంతసేసీ నమ్మా ॥ ఎవ్వ ॥

నిచ్చ నిచ్చ వేసేవి నిందు గొల్లముంజులే
రచ్చ కెక్కినది గోవర్ధన మహిమ
ఇచ్చల శ్రీవేంకటాద్రి నిరవాయ నీక్రిష్ణుఁడు
యిచ్చకాఁడు నేఁ డితని కెదురేడదమ్మా ॥ ఎవ్వ ॥ 398 ॥

## ఆహిరి

ఆఁడు జన్మమే మేలు అందరికిని
పోఁడిమితో నీవంటి పురుషుఁ డుండఁగను ॥ పల్లవి ॥

గోపికల కొరకె కొండ గొడ గెత్తితివి
గోపికల కొరకె గోవులనుఁ గాచితివి
యీపాటి వాఁడవు ఇంతులఁ గంటేఁ జాలు
యేపనియైనాఁ జేతువు యెరిఁగితిమయ్య ॥ ఆఁడు ॥

పొంచి సత్యభామకుఁగా పువ్వులమాఁకు మోఁచితి
పొంచి సత్యభామవద్ద పోటుబంటవై మించితి
ఇంచుకంతా లోఁగవు ఇంతు లొద్దనుంటేఁ జాలు
యెంచ కన్నియుఁ జేతువు యెరిఁగితిమయ్య ॥ ఆఁడు ॥

మిన్ను సాదించి తెచ్చితి మెరసి పదారువేల
మిన్ననేలఁ గూడపెట్టి మించి రుక్మిణిఁ జేకొంటి
ఇన్నిటా శ్రీవేంకటేశ ఇరవైతివి మాపాల
యెన్నియైనాఁ జేతువు నిన్నెరిఁగితిమయ్యా ॥ ఆఁడు ॥ 399 ॥

## పాడి

చేరి నీకు విన్నపాలు పేసేవారమా
కూరిమితో నీవే పైకొందువుగాక ॥ పల్లవి ॥

---

* "పుమాన్ విష్ణురితిఖ్యాతః స్త్రీప్రాయ మితరం జగత్" అని అభియుక్తోక్తి. ఆ భావమే ఈ పల్లవిలో పాదిగినట్లున్నది.

పిలువ నేరుతుమా పేరుకుచ్చి నిన్నంత
చెలరేఁగి నీవే లిచ్చేతువు గాక
సొలయ నేరుతుమా చూచి చూచి నేము నిన్ను
తలఁపులోపల దయదలఁతువు గాక ॥ చేరి ॥

నవ్వఁగ నేరుతుమా నసుపుతో నీతోను
అవ్వల నీవే సరసమాడుదుగాక
రవ్వసేయ నేరుతుమా రాజసాన నీవే వచ్చి
పువ్వువంటి వలపు పైఁబోతువు గాక ॥ చేరి ॥

మెచ్చఁగ నేరుతుమా మించి నన్నుఁ గూడితివి
చెచ్చెర నీవే సంతసింతువు గాక
యిచ్చకుఁడ శ్రీవేంకటేశ మనరతులెల్ల
తచ్చి యాడనేరుతుమా తనుతువు గాక[1] ॥ చేరి ॥ 400 ॥

## రామక్రియ

ఆసపడ్డపుడు రాక అలసినప్పుడు వచ్చి
వేసరించేవు రతికి వేళలు గానీరా ॥ పల్లవి ॥

చివ్వనఁ దియ్యకురా చేయివట్టి నీవు నన్ను
పువ్వువంటిదాన నొప్పల కోపను
ఇవ్వల బానుపుపై నీ కెదురు చూచుకొంటా
పవ్వళించి వుంటిని యే పరాకై వుంటివో ॥ ఆస ॥

కప్పకురా పచ్చడము కాఁగిటిలో నీవు నాకు
కప్పురము వంటిదాన కాఁక కోపను

---

[1] భక్తితో స్వామిని వలపించి స్వాధీనపతికలయినవారు ఈ పాటలో పేర్కొనబడినట్లున్నది. ఈ జాతి వారిలో అన్నమయ్యయు వొకఁడు.

చెప్పరాని కోరికతో సిగ్గులెల్లాఁ బారవేసి
అప్పటినుండియు నుంటి నాడనేం నుంటివో ॥ ఆస ॥

మిగులాఁ బిసుకకురా మించి నా చన్నులు నీవు
చిగురువంటి దానను చేఁత కోపను
తగిలి శ్రీవేంకటేశ దక్కి నన్నుఁ గూడితివి
అగపడి యుంటిని యేమనుచు నీవుంటివో ॥ ఆస ॥ 401 ॥

ఆహిరి

నీవే నేరుతు నేఁ జసే వలపు
పూవు వంటిది గుణము బుద్ది చెప్పు నాకును ॥ పల్లవి ॥

పాడి మెప్పించేనంటే పలచన నాయెలుఁగు
కూడి మెప్పించేనంటే కుచములు గట్లు
ఆడి మెప్పించేనంటే అంగాలు నీచూపు లంటె
యీడుదానఁ గాను నీకు నేమి సేతు నిఁకను ॥ నీవే ॥

చెనకి మెప్పించేనంటే సిగ్గులే నానిలువెల్లా
తనివి మెప్పించేనంటే తమకించీ వయసులు
మనసిచ్చి మెప్పించితే మట్టుమీరె మోహము
*నిన్ను(ను?) నమ్మివున్నదాన నేరుపుమీ చేఁతలు ॥ నీవే ॥

చూపుల మెప్పించేనంటే సూదులకంటె వాండ్లు
తీపుల మెప్పించేనంటే తేనె నా మోవి
యేపున శ్రీ వేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
యీ పనులకే మెచ్చితి యెంచకుమీ రతులు ॥ నీవే ॥ 402 ॥

* ప్రాసభంగము

## నాదరామక్రియ

ఎంత వాఁడిసేసే వేరా మమ్ము
కంతునియమ్ములకట్టలమా || పల్లవి ||

ఆసపడి నీయంగము లంటితే
వోసరించి లోఁగేవు వొద్దుకొంటా
దోసమెఱఁగవు తొయ్యలుల పొందు
సేసేమంటే చేతఁ జిక్కవద్దా || ఎంత ||

మరిగి నీమోవి మనసయ్యీనంటే
శిరసు వంచేవు సిగ్గులోడ
సరవులెంచవు సతుల వలపు
పరగించేమంటే పలుకవద్దా || ఎంత ||

కూడి మాడి చన్నులకొనల నొత్తితే
వాడేవు యలసి వత్తి వలె
యీడనె శ్రీవేంకటేశ నీదేవుల-
మీకు వెనఁగితి మెంచవద్దా || ఎంత || 403 ||

రేకు 1768 దేశాక్షి

మాపై బారాలు వేయకు మతకానను
చేపట్టినవాఁడవు నీచేతివే మహిమలు || పల్లవి ||

రాసికెక్కె నీవు మమ్ము రాఁపుసేసిన సుద్దులు
వాసికెక్కె మాగుణము వలపుతోను
ఆస యేమిటాఁ దీరదు అండకు నీవు రాఁగాను
సేసేటి పనులు నీచేతనున్న వికను || మాపై ||

దొంతులు నిండెను నీవు తొల్లిచ్చిన చనవులు
వంతుల గాముకుండె నావన్నెలమోవి
పంతము దీరదు నీవు పలుమారు వేఁడుకొన్నా
చెంతల మన్నించేది నీచేతిదే ఇపుడు ॥ మాపై ॥

వేడుకాయ నీ[1]వాడించే వేమారు యెడమాటలు
వాడికాయ నవి నాకు వడదేరెను
వీడదు కాఁగి నిదె శ్రీవేంకటేశ కూడితిమి
చేడె లేమి చెప్పేరు నీచేతివే భోగములు ॥ మాపై ॥ 404 ॥

బౌళి

ఎంతైన నీ యాల నింతే ఇందులో తప్పులెంచకు
మంతనాన నీవు నామనవి చేకోవయ్యు ॥ పల్లవి ॥

విచ్చన విడిని నీతో వేమారు నవ్వితిని
ఇచ్చకమౌనో కాదో యెఱఁగ నేను
పచ్చిపేసి కమ్మటిని పైకొని చెనకితిని
మచ్చికసేసుక నన్ను మన్నించవయ్యు ॥ ఎంతై ॥

పయ్యదకొంగు వట్టితే పలుమారు మొక్కితిని
ఇయ్యకోలౌనో కాదో యెఱఁగ నేను
నెయ్యపుమాట లాడఁగానే నీకు మారాడితి
చెయ్యారా నాచనవు చెల్లించవయ్యు ॥ ఎంతై ॥

కైవశమైలిననుచు కాఁగిలించి కూడితిని
యేవిధమో నీగుట్టు యెఱఁగనేను

---

[1] 'ఆడింతువు' అను గ్రాంథిక రూపములో 'ఉ' వర్ణ లోపము వచ్చినట్లే, 'ఆడించేవు' అను వ్యావహారిక రూపములోను 'ఉ' లోపము వచ్చినట్లున్నది.

శ్రీవేంకటేశ్వర నీ చిత్తము నా భాగ్యము
యీ వలన నన్ను మెచ్చి యీడేర్చవయ్యా ॥ ఎంత్రై ॥ 405 ॥

## ఆహిరి

చెలు లింతే మీరేమి సేతురే నేఁడు
అలరి ఆతనిపంత మమరుఁ గాక ॥ పల్లవి ॥

తలఁపు నే నెఱఁగనా తరుణులఁగంటేను
చెలిమి దాఁ జేసును సేయఁడునని
మలసిన మగవాని మా కనఁగవచ్చునా
చెలువుఁడు సేసినట్టే చెల్లుఁగాక ॥ చెలు ॥

తనగుణ మెఱఁగనా తతి మానినులతోడ
పెనఁగును పెనఁగఁడు ప్రియాననని
ఘనుఁడైనవాని మాకు గద్దించవసమా
తనివిగలిగినంతా దక్కు గాక ॥ చెలు ॥

కరుణ నే నెఱఁగనా కడఁగి మావంటివారి
కరఁగించు కరఁగ దాఁగలఁడని
యిరవై శ్రీవేంకటేశుఁ డిప్పుడిట్టె నన్నుఁ గూడె
అరుదైన నెరతన మమరుఁ గాక ॥ చెలు ॥ 406 ॥

## ముఖారి

ఆడుకోఁగలిగె మాకు నందరముఁ జెలులము
జాడల సతులు నీసరి యెవ్వరమ్మా ॥ పల్లవి ॥

అదివో పతిఁ బిలువ నంపి రప్పించుకొంటివి
యెదుట నాపనితోడ యెక్కుకొంటివి

మెదలనియ్యక అట్టె మెడగట్టించుకొంటివి
వెదకి పువ్వులదండ వేసి తీసి కొంటివి ॥ ఆడు ॥

తేరాని వైనాఁ జెప్పి తెప్పించుకొంటివి నీవు
మేరలు సేసుక వీఁపుమీఁద నుంటివి
కూరిమి నీవే దక్కించుకొంటి వడవుల వెంట
చేరి [1]పచ్చనిఅలమై శిరసు నిండితివి ॥ ఆడు ॥

విందుల నీవే పదారువేలు రూపులై మించితి-
వెందు నీపేరే మొదల నెంపించితివి
కందువ శ్రీవేంకటేశు కాఁగిటిలోపల నిండి
సందడిం చాతనిసర్వసంపదవు నైతివి ॥ ఆడు ॥ 407 ॥

## సామంతం

మాకేల అవుఁ గాదన మగవారి తోడ నింత
నీకు ప్రియము గాకుంటే నీవు సేసేవా ॥ పల్లవి ॥

చేరి నాచేతనే వారి సేవలెల్లాఁ జేయించేవు
నేరు పిది గాకుంటే నీవు సేసేవా
సారె మాట మాటలను జగడాలు దీఇంచెవు
నీరపము గాకుంటే నీవు చేసేవా ॥ మాకే ॥

జరయుచు మాచేత సంగడి మాటాడించేవు
నెఱఁ దగవు గాకుంటే నీవు సేసేవా
గుఱులు బయటవేసి గుట్టెల్లా నెత్తిచ్చేవు
నెఱజాణవు గాకుంటే నీవు సేసేవా ॥ మాకే ॥

---

[1] పచ్చని అలము=తులసి కాపచ్చు. ఆకులు అలములు అను జంట పదములోని అలముగా తోచుచున్నది.

ఆసలు వుట్టించి నన్ను నందరిలోఁ గూడితివి
నీ సూటికి రాకుంటే నీవు సేసేవా
వాసుల శ్రీవేంకటేశ వన్నెలెల్లా నించితివి
నే సమ్మతించకుండితే నీవు సేసేవా ॥ మాకే ॥ 408 ॥

## సింధురామక్రియ

ఎదుట నుండిన వారినేల దూరేవు
పదియూరు వేలవారిఁ బంగించవే ॥ పల్లవి ॥

చూపుల నాతని దిక్కు చూచితేనే కోపించేవు
కాపురాలు సేసేవారి గానవటే
పైపై నే మాఁటాడితే పదరేవు యలుగులు-
వాఁపేటి గొల్లెతలను సాదించవే ॥ ఎదు ॥

నడుమ వినోదాలు నవ్వితేనే గోణఁగేవు
కడనుండి పొందేవారిఁ గానవటే
తడవితినంటా నాపైఁ దమకించే వింతలోన
యెడపుల పువ్వులాపె నీదువెట్టుకోవే ॥ ఎదు ॥

శ్రీవేంకటేశ్వరుసేవ సేసితేనే పెనఁగేవు
కావరించివుండేవారిఁ గానవటే
యీవేళ నాతఁడే కూడె యిద్దరిని వొక్కమాఁటే
నీవంటివారినే నేరమెంచవే ॥ ఎదు ॥ 409 ॥

రేకు 1769 ## మంగళకౌసిక

అలుకెల్లా మానితిని అట్టే కానీవే
చెలులాల మీకు నిది సెలవు గానీరే ॥ పల్లవి ॥

తప్పు లెన్ని గలిగినా తన్ను నేఁ గోపగించేనా
అప్పటిమాటలు వింటి నట్టే కానీవే
అప్పస మందరు మీరు అండనుండి ఆతనికిఁగా
చెప్పేరట నేనూ నట్టే సేసేఁగాని ॥ అలు ॥

వొడ్డారపువాఁడైతే వొరసి నే నిందుకుఁగా
అడ్డమాడే దాననా నీకు నట్టే కానీవే
వెడ్డు వెట్టకురే మీరు వింటిమాట; నాలికెను
జిడ్డంటునా అట్టే సేసేఁ గానీవే ॥ అలు ॥

వాసులు దాఁ బట్టితేను వద్దనేనా పొందులకు
ఆసపడ్డదాన నేను అట్టే కానీవే
వేసరరు మీరు శ్రీవేంకటేశుఁ డిదె కూడె
సేసవెట్టితిని యిట్టె సేసేఁ గానీవే ॥ అలు ॥ 410 ॥

## హిందోళ వసంతం

ఆతని మహిమో నాది అంత మెత్తని మనసో
యేతులు నెమ్మెలు మీతో నేమి చెప్పేనే ॥ పల్లవి ॥

కోపగించి చూడఁబోయి గొబ్బునను గరఁగితి
చేపట్లకు దగ్గరి చేరి మొక్కితి
రాపులఁ బెనఁగఁ బోయి రతికేళికిఁ దీసితి
యేపున నాపంత మిఁక యేమి చెప్పేనే ॥ ఆత ॥

జంకించఁ బోయి వా చమకట్లు వదలితి
వంకలొత్తఁబోయి వానివలఁ జిక్కితి
బింకములాడఁబోయి ప్రియములెల్లాఁ జెప్పితి
యింకా వా మద్దులు వే నేమి చెప్పేనే ॥ ఆత ॥

చలము సాదించఁబోయి సరసములాడితి
బలువు చూపఁగఁబోయి పట్టి కూడితి
యెలమి శ్రీవేంకటేశుఁడెవసె నాతో నింత
యెలుగెత్తి నాగుణాలు యేమి చెప్పేనే || ఆత || 411 ||

గౌళ

మచ్చరించి మాపు దాఁకా మాఁటలేఁటికి
రచ్చలఁ బెట్టక యిట్టె రావయ్య లోనికి || పల్లవి ||

వొత్తి నే విన్నవించఁగా వోజకు వచ్చేవా నీవు
చిత్తములోపలి మాట చెప్పితిఁగాక
తత్తరించి యంతలోనె తలవంచుకోనేల
కొత్తలు సేయక ఇంద కోవయ్య వీడెము || మచ్చ ||

మొక్కఁగ నిప్పుడే నాకు మునుకొని వలచవా
వెక్కసాన నీపై వొల వేసితిఁ గాక
చెక్కు చేతితో నిప్పుడు సిగ్గువడ నీకేల
పిక్కటిల్లెఁ దమకము పెట్టవయ్య సేసలు || మచ్చ ||

కొసరి నే నడుగఁగా గుట్టు నాకుఁ జెప్పేవా
యెసఁగి నా మనసు నీ కిచ్చితిఁ గాక
పొసఁగ శ్రీవేంకటేశ పొందితివి నన్ను నేఁడు
అసురుసు రేఁటికి ఆఁపవయ్య వలపు || మచ్చ || 412 ||

శంకరాభరణం

ఇదివో మా బలు వీమాఁటే చెప్పరే
యెదుట నాతఁడు యేమనీనే || పల్లవి ||

బింకము లాడేమా ప్రియుని తోడుత
జంకించి బొమ్మల సాధింతుము
అంకెకు లోనైన యంతటిమీఁదట
కంకిగ రతులఁ గక్కసింతుము ॥ ఇది

తప్పులించేమా తనతోడ నేము
రెప్పలెత్తి రేసు రేఁతుము
కప్పర విడేలఁ గలసిన మీఁద
కుప్పల చెమటఁ గురియింతుము ॥ ఇది

సిగ్గువడేమా శ్రీవేంకటేశుతో
బిగ్గెఁ గాఁగిటను బిగింతుము
యెగ్గులెంచక తా నిట్టె నన్నుఁ గూడె
వెగ్గళించితే వేఁడుకొందుము ॥ ఇది ॥ 413

## సింధురామక్రియ

మూఁకలో నెదుర(రె?)దుర ముంగిట నుంటిననవే
యేఁకటతో మాయింటియిక్కు విదే యనవే ॥ పల్లవి

జమళి నా చూపులు చాఁచినదియే గుఱుతు
రమణుని నిక్కడికి రమ్మనవే
కొమరెచన్నులు తన కొలువు సేసే నపుడే
తమితోడ మఱవక తలఁచుకొమ్మనవే ॥ మూఁక

మారుకొని తనలో నే మాఁటాడినదే గుఱుతు
చేరి నాతోడుత పొందుసేయుమనవే
వూరెడి తేనెల మోవి వుపారమాయ నప్పుడే
తారుకణౌనో కాదో తలఁచు కొమ్మనవే ॥ మూఁక

కొప్పు వీడఁగా నేను కొంగు వట్టుటే గుఱుతు
చిప్పిల మన్నించి దయసేయు మనవే
యిప్పుడే శ్రీవేంకటేశుఁ డేడనుండో వచ్చి కూడె
తప్పక యీ భావము తలఁచుకొమ్మనవే ॥ మూఁక ॥ 414 ॥

## నారాయణ దేశాక్షి

అంతటఁ బోనీయరా నిన్నాయములంటి కరఁచి
చింతదీర నప్పుడు నే సెలవిత్తుఁ గాని ॥ పల్లవి ॥

యెక్కడో దవ్వాది చెవి నిదుక వచ్చిప్పుడు నా-
చెక్కులఁ బూసుటే రతి సెలవా నాకు
దక్కించు కన్నిపనులు దండకువ చ్చొకమాటు
చిక్కని నవ్వు నవ్వితే సెలవా నాకు ॥ అంత ॥

యే యెడనో భోగించి యింటికి నిట్టె వచ్చి
చేయి మీఁద వేసితేనే సెలవా నాకు
చాయలకుఁ దిరిగాడి చక్కటికి నీవుసేసే-
సేదురాని వినయాలే సెలవా నాకు ॥ అంత ॥

ఆసలక్కడ నిండించి అందరూఁ జూడఁగా నన్నుఁ
జేసుకొంటి వింతలోనే సెలవా నాకు
వాసికి శ్రీవేంకటేశ వడి నొకమాటే నాతో
సేసవెట్టి కూడితివి సెలవా నాకు ॥ అంత ॥ 415 ॥

రేకు 1770 శంకరాభరణం

శమించుకోవయ్య సర్వాపరాధాలు
కొమరెవయసు గుణాలదాన ॥ పల్లవి ॥

తొక్కితిఁ బాదము తొలుత నందుకు
మొక్కితి నిదివో మున్నూఁటికి
గక్కన నాచూపు కాఁడిన గంట్ల
చిక్కని నవ్వులు చిలికించేను ॥ శమిం

వొత్తితిఁ జన్నుల వొరటువాయఁగ
పొత్తిగఁ బూవులఁ బూజించేను
లత్తుక నంటిన లచ్చన నొసల
మెత్తేను గందము మీఁదనెల్లా ॥ శమిం

కూడితిఁ గాఁగిట కొసరు దీరఁగ
వీడెమింద శ్రీవేంకటేశ
వాడించితి మోవి వన్నెలు పుట్టఁగ
కూడ నే నెంచేను గుఱుతులు ॥ శమిం ॥ 416

## ఆహిరి నాట

మగువ లెంత మేటైనా మగవానికే లోను
తగవులు నెరపితే తప్పించుకొందురా ॥ పల్లవి

చెల్లుబడిగలవారు చేయివట్టి తీసితేను
పల్లదమాడుదురా పంతమా యిది
చల్లఁగా నలుకదీర జాజులు ముడిచితేను
తెల్లమిగాఁ గొప్పువట్టి తియ్యకుమందురా ॥ మగు ॥

కలపు కోరైనవారు కప్పురము చల్లితేను
బలిమి విదిలింతురా పంతమా యిది
కలపి బత్తితోడను కస్తూరి వూసితేను
అలమి మా చన్ను లంతేసి అంటకుమందురా ॥ మగు ॥

శ్రీ వేంకటేశ్వరుఁడు చెక్కునొక్కి కూడితేను
భావము సోదింతురా పంతమా యిది
మోవితేనె నీకు నిచ్చి మోహము నించితేను
చేవదేరీ నందు గంటి సేయకు మందురా ॥ మగు ॥ 417 ॥

## నాదరామక్రియ

తనకేలే యీ మంకు తరుణుల కింతేకాక
చనవిచ్చినట్టి వాఁడు సమ్మతించుఁగాక ॥ పల్లవి ॥

నెయ్యము సేసినవాఁడు నేఁడేల యెగ్గుపట్టీనే
వొయ్యనె నాచేఁతలకు నోర్చుఁగాక
తియ్యనిమాఁటలవాఁడు దిమ్మరిమాఁట లేఁటికే
పయ్యెద లోనికి లోనై బతిమాలు గాక ॥ తన ॥

చెనకిన యట్టివాఁడు శిరసేల వంచీనే
గునియక అన్నీ నియ్యకొనుఁగాక
ఘనుఁడైనయట్టివాఁడు కపటాలు దనకేలే
వెనకటి తనబాస విచారించు గాక ॥ తన ॥

సిగ్గువాపినట్టివాడు సెలవిలో నవ్వదేలే
నిగ్గుల రితిప్రియాలు నేరుపుగాక
లగ్గమై శ్రీవేంకటేశుఁ డంటి తానె నన్నుఁ గూడె
తగ్గు లేక నాక దక్కి తమకించుఁగాక ॥ తన ॥ 418 ॥

## శ్రీరాగం

ఇప్పుడుగా నీవు నేను ఇద్దరమూ గూడితిమి
పుప్పొడిఁ దేనియు నొకపువ్వున నున్నట్టు ॥ పల్లవి ॥

నిన్నుఁ బాసి కొంతవడి నీగుణాలు దలఁచితి
వెన్నెలగాసినయట్టు వేసఁగి లోన
విన్నవినుకులలోన వేడక నోలలాడుదు
వెన్నలు వుట్టిన యట్టు వేఁడిపాలలోన ॥ ఇప్పు ॥

తెరమఱఁగున నుండే తియ్యని మోవి చూపుదు
పెరలో తేనె వున్నట్టు పెరుగుతాను
సరుగ నీ చెలులతో సరసము లాడుదు
గరిమ మెఱుఁగు మేఘము నందుకొన్నట్టు ॥ ఇప్పు ॥

ఇట్టె దగ్గరుతానే యెదురుచేతులు చాఁతు
కట్టలు వరచినట్టు కన్నందుకెల్లా
రట్టుగ శ్రీవేంకటేశ ముట్టి రతిఁ జొక్కించితి
పట్టుమని ఇచ్చినట్టు భాగ్యము లన్నియును ॥ ఇప్పు ॥ 419 ॥

## కాంబోది

ఏల తమకపడేవే యేఁటికే యింత
కోలుముందై వలచితే గుదిగొనవలదా ॥ పల్లవి ॥

తాలిమిగలదానికి తనంతనే వచ్చు మేలు
ఆలరి కత్తెకుఁ గద్దా ఆపసోపాలు
బేలనై నే నుండఁగాను పిలువకేవచ్చె పతి
వీవి కాతాళించుకొంటా వెంటనే వచ్చితివి ॥ ఏల ॥

గుట్టు గలదానికి కోరినట్టల్లా నవును
రట్టడించితిఁ గద్దా యిట్టి రారాఁపు
కట్టఁగడ నే నుండఁగా కరుణించె నన్నితఁడు
వెట్టమాఁటలాడుకొంటా వెంటనే వచ్చితివి ॥ ఏల ॥

కగ్గులేనిదానికి కైవశమౌఁ బనులెల్లా
కిగ్గాడిదానికిఁ గద్దా కీసకాట్లు
సిగ్గుతో నే నుండఁగాను శ్రీవేంకటేశుఁడు గూడె
వెగ్గళించి దూరుకొంటా వెంటనే వచ్చితివి ॥ ఏం ॥ 420 ॥

తెలుఁగుఁ గాంభో(బో?)ది

ఏమంటా నుండెనో యిట్టె వేగినంతా
ప్రేమాన నిప్పుడు ప్రియము చెప్పీని ॥ పల్లవి ॥

పొంచి నా విభుఁడు పొద్దుననే వచ్చి
అంచెల [1]వేఁడుకొనానవెట్టీ
మంచిదానవే మంతనాన నీతో
యెంచుకొన్న సుద్దు లెఱిఁగింతురా ॥ ఏమం ॥

యింతిరో నితఁడు యింటికిఁదా వచ్చి
పంతమిచ్చి నాకు బాససేసీని
యెంత సేసితివే యీడ విరహాన
చింతించినవి యుల్లఁ జెప్పుదురా ॥ ఏమం ॥

శ్రీవేంకటేశుఁడు చేర నన్ను వచ్చి
చేవమీరఁ గూడి చేపట్టెను
నీవే నేఁ గానటే నిన్నమాపటంత
వేవేలు నాడితే వేగిరింతురా ॥ ఏమం ॥ 421 ॥

రేకు 1771 దేవగాంధారి

ఆతనికి లోనైతే నౌదువు గాక
ఆతుమైన చెలిమి నన్నంత సేయవలెనా ॥ పల్లవి ॥

---

[1] వేఁడుకొని+ఆన+పెట్టీ

పలుమారు మాటాడించ పంతమా నాతోను
తలవంచుకుండేదాని తమకాననుఁ
యెలమి నాతనికే యెత్తియ్యవే మాఁటలు
కలఁగి వుండినవేళ గాపిఁబెట్టవలెనా ॥ ఆత ॥

సారె నన్ను నవ్వించ చలమా నాతోను
వూరకే చింతించేదాని వుల్లసానను
కేరుఁగాని ఆతనినే గిలిగించవే నీవు
వూరకే వుండినదాని నుడికించ వలెనా ॥ ఆత ॥

చేవట్టి కాఁగిలింపించ చెలిమా నాతోను
వోవరిలో నున్నదాని వొద్దికిఁ దీసి
శ్రీవేంకటేశుఁడు గూడె చిమ్మిరేఁచవే యతని
కైవశమై వున్నదాని కదుమఁగ వలెనా ॥ ఆత ॥ 422 ॥

దేసాళం

ఆడవద్దా నే మాఁటలు ఆపెకేమి
యీడకుఁ దోడి తెచ్చితి వీఁకనేమి ॥ పల్లవి ॥

నిక్కి నిన్నుఁ బాసి నేను నీ కెదురు చూచుకొంటా
అక్కడ నెంతవుండినా నాపెకేమి
వెక్కసపు నవ్వు నవ్వి వేఁదుకొనీ నిప్ప డిట్టె
దక్కి దనపంతమెల్లా తనకేమి ॥ ఆడ ॥

నిలిచి బలిమినైనా నిన్నుఁ దోడితెచ్చేనంటా
అలసి నే వచ్చితేను ఆపె కేమి
అలుకలు నన్నుఁ దేర్చి అట్టి శాంతాలు నెరపీ
యెలయించెఁ దా మునుపే యీఁక నేమి ॥ ఆడ ॥

కదిసి శ్రీవేంకటేశ కలసితి విపుడు నే-
నదను గాచుకవుంటే నాపె కేమి
పొదిగి నాకు బొక్కి పొగడించుకొని నీచే
హృదయము చల్లనాయ నిఁక నేమి ॥ ఆడ ॥ 423 ॥

వసంతం

మేలు మే లీబుద్ధి వుట్టె మేఁటివి నీకు
మైలదీర మణుఁగాయ మంచిదాయఁ గాలము ॥ పల్లవి ॥

తగవెంచి నేఁడు దయదలఁచితిగా కిన్నాళ్లు
నగవులే కావా నీవు నవ్వేటివి
వెగటుగ నాపైఁ జేయి వేసితివిగా కిపుడు
మొగము చూచేదా కాదా ముట్టుదాని వలెను ॥ మేలు ॥

యేఁటికో కొంగువట్టితి విటమునుప లెల్లాను
మాటలే కావా సారె మాతో నాడేవి
కూటమికి నావద్దఁ గూచుంటివిగా కిపుడు
పోటి సరసాలే కావా పొరుగాపె విను ॥ మేలు ॥

కాఁగిట శ్రీవేంకటేశ కలసితి విదె నాఁడు
దాఁగిలి ముచ్చులే కావా తగురతులు
చేఁగదేర మన్నించి చెక్కునొక్కితిగా కిపుడు
అఁగుకవుండే కాదా అప్పుడే నీ వలెను ॥ మేలు ॥ 424 ॥

వరాళి

ఏమి నవ్వేవే నాతో యిప్పుడే యెరిఁగించితి
గామిడైన పతి తొల్లే కైలాటకాఁడు ॥ పల్లవి ॥

పాయపు దానవు నీవు పంతగత్తెనే నేను
చాయెరిఁగి మాటలాడు సముకానను
చేయి చిక్కి వున్నవాఁడు చెలువుఁడిద్దరికిని
తోయలేఁ డాతఁడు మన దొమ్మి వోపు కొలఁది ॥ ఏమి ॥

పిన్నదాన యించుకంత పెద్దదాన నిదె నేను
సన్నెరిఁగి నవ్వు నవ్వు సముకానను
ఇన్నిటా జాణఁడితఁడు యవ్వరెంత పెనఁగినా
మన్నించి విడేలువెట్టీ మన వోపు కొలఁది ॥ ఏమి ॥

దొరవు నీ వంతకంటె దొరను నేనూడిగాలు
పరవి యెఱిఁగి సేయు సముకానను
సిరులతో నిన్ను నన్ను శ్రీవేంకటేశుఁడు గూడె
తెరమఱుఁగింతే మన తెలివోపు కొలఁది ॥ ఏమి ॥ 425 ॥

హిజ్జిజి

సవతులమైన నేము సాదించక మానరాదు
పవళించి నీవొకతెపాలికే వచ్చునా ॥ పల్లవి ॥

తెల్లవారి జామెక్కె తేనెలు గారీ మోవి
యెల్లవారుఁ గాఁపురాలు యిట్టెసేతురా
ఇల్లు వెళ్లఁడంటాఁ బతి కిచ్చేవు విడేలు
యిల్లాండ్లైనవారి నింతులెల్లా నవ్వరా ॥ సవ ॥

కలయ నెండలుగాసె కావి దేరీఁ గన్నులను
యెలమి నీవంటివారి నిటు చూడవా
అలసెనంటా బోనా లక్కడనే పట్టేవు
చలివాసి గరితలసరిత నిట్టేయా ॥ సవ ॥

పొద్దు మద్యాన్నమాయను భోగాలు మరిఁగితివి
అద్దో లోకము మెచ్చ నణఁకు వొద్దా
బుద్దితో నీరేతిరి పొందఁడా శ్రీవేంకటేశుఁ-
డి ద(ద్ద?)రు గేస్తురాండ్లమే యెంచుకోరాచెలులు॥ సవ ॥ 426 ॥

గౌళ

ఎదిటికి రమ్మనవే యేమిచెప్పినాఁ జేసే
సదరమా నేనంత పటలు వద్దనవే ॥ పల్లవి ॥

పిలువవచ్చేదానవు ప్రియములు నేరవా
అలిగినాతఁడే వచ్చి ఆడవలెనే
చెలియవు నీవు నేనుఁ జెప్పఁబోతే నొక్కటే
తలుపుమాటున నుండేతన కింత దగునా ॥ ఎది ॥

వొక్కటి సేసేదాన వొడఁ బరచనేరవా
తక్కించి నాతఁడే ఇందు దగ్గరుగాక
మొక్కనేరే యాఁదుఁబొందు మొదలఁ గలిగినదే
కుక్కి నీచే కుదుళ్లలో గుట్టాలఁ దోలించీనా ॥ ఎది ॥

వొడిపట్టినదానవు వున్న సుద్ది నేరవా
బడినే శ్రీవేంకటాద్రిపతి తాఁ బట్టె
పడతివై వొప్పగించి పట్టి తెరవేసితివి
యెడయక నన్నుఁ గూడె యిఁక మరఁగేఁటికే ॥ ఎది ॥ 427 ॥

రేకు 1772 ఆహిరి

ఎఱఁగను నేను నీతో యెదురుమాటలాడను
తఱి నీవే యెంచుకొని దయసేయవయ్యా ॥ పల్లవి ॥

చొప్పున నీవు నన్ను చూచితే నేనూఁ జూడక
అప్పుడు దలవంచిన దపరాధము
చిప్పిలి ఆడుదానవై సిగ్గువడితి నిందుకు
తప్పేమిటఁ దీరు నీవే దయసేయవయ్యా ॥ ఎఱఁ ॥

నిగిడి నీవు నవ్వఁగ విందుసబలోన నేను
నగకవుండినదే నానేరమి(ము?)
తగిలి కన్నెగనక దంటతన మొల్లనైతి
తగిన బుద్దులు చెప్పి దయఁజూడవయ్యా ॥ ఎఱఁ ॥

గక్కన శ్రీవేంకటేశ కాఁగిట నీవు గూడఁగా
యిక్కువలు గరఁగిన దిదియే తప్పు
మొక్కి యలమేల్మంగను మోహములెల్లా నించితి
తక్కక నన్ను మన్నించి దయఁజూడవయ్యా ॥ ఎఱఁ ॥ 428 ॥

శ్రీరాగం

ఇంకనేల నీవే ఆనతియ్యవయ్యా । నీ-
అంకె దెలుసుకొనేను ఆనతీవయ్యా ॥ పల్లవి ॥

పంతము దప్పదు నీతోఁ బలికిన మాత్రమున
యెంత లేదు వినే నాన తియ్యవయ్యా
చెంతల నీ చెప్పినట్టు సేసితే నాకేమాయ
అంతరంగమెల్ల నిట్టె ఆనతియ్యవయ్యా ॥ ఇంక ॥

వన్నె దరగదు నీ వద్ద నుంటే నేమాయ
యిన్నియు నాతో నానతియ్యవయ్యా
మన్ననకు లోనైతే మరి నాకు నేమాయ
అన్నిటా జాణవౌదువు ఆనతీవయ్యా ॥ ఇంక ॥

జవ్వనము సమయదు సారెఁ గూడితే నేమాయ
ఇవ్వలఁ జేకొంటి నానతియ్యవయ్య
రవ్వగ శ్రీవేంకటేశ రతుల మించితి విట్టె
అవ్వలఁ దడవనని ఆనతీవయ్యా ॥ ఇంక ॥ 429 ॥

## పాడి

బుద్ధిమంతురాల నైతి పూఁచి నీ[1]కతాలను
ఇద్దరికి సంతోసము ఇదె జాణతనము ॥ పల్లవి ॥

నిచ్చా నిన్ను [2]సతంలతో నిందలుగట్టనోపక
ఇచ్చలాడ దొరకొంటి నిదివో నేను
తచ్చి నీతో నే నలిగి తలవంచుకో నోపక
ముచ్చటలు దీర నీ మోము చూచే విదివో ॥ బుద్ధి ॥

వుప్పతించి మచ్చము నీ వొళ్లఁ జూపనోపక
కప్పదొరకొంటి నీ గతులెల్లాను
తప్ప వేసి నీ సతుల తలఁగుమనఁజాలక
చెప్పరాని వూడిగాలు సేయించ నేర్చితిని ॥ బుద్ధి ॥

చలము సాదించి నిన్ను జంకించనోపక
అలమి కాఁగిలించితి నప్పుడే నేను
యెలమి శ్రీవేంకటేశ యెనసితి మింతలోనె
సొలయునోపక నీ చుట్టమ నైతిని ॥ బుద్ధి ॥ 430 ॥

## కాంబోది

ఘనుఁడవు నీకేమిటాఁ గడమ లేదు
మనలో నిట్లనేల మరఁగెల్లాఁ బాసెను ॥ పల్లవి ॥

---

[1] 'కతములను' అను బహువచనమునకు రూపాంతరము కావచ్చు.
[2] 'సతులతో' కావచ్చు.

యెప్పటికి నీచిత్త మెటువలె వచ్చి వుండు
అప్పటికిఁ దగుమాఁట లాడేనేను
ఇప్పు డడుగదేరి మా ఇంటికి విచ్చేయుమయ్య ,
చెప్పినట్టే సేసేను నీసేఁతలెల్లా దక్కేను ॥ ఘనుఁ ॥

యెవ్వతె పొందు సేసితి విదియును లోఁగొనేను
యివ్వల నీకెంత పంతమిచ్చే నేను
చివ్వన విసుకనేల శిర సింపు కెత్తవయ్య
నవ్వినట్టే నవ్వేను నయము నీకౌయను ॥ ఘనుఁ ॥

యెటువలె మెత్తువు నీ యిచ్చకమే సేసేను
యిటువలెఁ గూడితివి యియ్యకొంటిని
ఘటన శ్రీవేంకటేశ కంటి నలమేల్మంగను
తటుకన మొక్కితివి తలఁపు లీడేరెను ॥ ఘనుఁ ॥ 431 ॥

## నాదరామక్రియ

విన్నపాలు నేఁ జేసితే వెంగెమై తోఁచు
నిన్ను నీవే చూచుకొనే నేర్పు నీకు వలదా ॥ పల్లవి ॥

యెగసక్కేనకు నిన్ను యెవ్వతె వొగడినాను
జిగితో నవ్వేవుగాని సిగ్గువడవు
మొగము చూచితే నీమోవినే మచ్చమున్నది
తగుఁదగదని యెంచి తలఁచుకోవలదా ॥ విన్న ॥

గుట్టు దెలియవలసి కొమ్మ వొకతె మెచ్చితే
అట్టె యౌనంటా నీవు నంగవించేవు
పట్టి యిచ్చీ నీవొళ్ల పరకాంతల భోగాలు
రట్టయ్యే ననుచు పదరక వుండవలదా ॥ విన్న ॥

యెంగిలి సేయవలసి యెవ్వతె వీడె మిచ్చినా
సంగతాయనంటా నట్టె చవిగొనేవు
కుంగక శ్రీవేంకటేశ కూడితి నలమేల్మంగను
యింగితాకారాలు నీవే యెఱుఁగుకోవలదా ॥ విన్న ॥ 432 ॥

లలిత

అందుకేమి రావయ్యా అంతవాఁడవు
చందాలు సేసీ నిదె చక్కని నీరూపము ॥ పల్లవి ॥

గొప్పలు మా చన్నులు కొంచము మానదుము
యెప్పుడు మా వొళ్ల లేవా యెచ్చకుందులు
తప్పులు నీవల్లనుంటే తలవంచుకోనేల
కప్పిపోయ పూసినట్టి గందపుఁ బూఁతలును ॥ అందు ॥

తెల్లని మా కన్నులలో దిష్టించి నల్లగుద్దు
లల్లుకొని రెండు నీపై నాడించేము
కల్లలు నీమాటలైతే కడు సిగ్గువడనేల
చెల్లు బడాయ నన్నీ నీ సేసిన బాసలనే ॥ అందు ॥

జంకెలు మా బొమ్మలున్ను సరి నవ్వు సెలవుల
వుంకువై శ్రీవేంకటేశ వొక్కటైతిని
లంకె నలమేల్మంగను లతి భూసతిఁ దెచ్చితి
పొంకమాయ నీవిపుడు భోగించిన భోగము ॥ అందు ॥ 433 ॥

రేకు 1773 రామక్రియ

ఏల నీకు నింతగుట్టు యేమిగట్టుకొనే విందు
మేలిమిచేఁత నిండితే మెచ్చకుండేరా ॥ పల్లవి ॥

కొత్తగందవొడి చల్లు కొనేవు నీమేవినిండా
చిత్తడి చెమటలకు సిగ్గయ్యీనా
హత్తి సేసేవు విడేలు అట్టె మోవి విప్పి యైతే
ముత్తరము చెలులెల్లా ముంచి నవ్వేరా ॥ ఏల ॥

నేరుపుతో పువ్వుదండ వెత్తిఁ జుట్టుకొనేవు
బారపు జాలు దురుము పట్టిఇచ్చీనా
సారె విసరుకొనేవు చప్పుదుగా నింతలోనె
ఆ రీతి బుసకొట్లు నీకాలి డయ్యీనా ॥ ఏల ॥

ముదిత లిందరిలోనా ముసు(సుఁ?)గు వెట్టుకొనేవు
మదనకళల కిది మరఁగయ్యీనా
కుదురై శ్రీవేంకటేశ కూడితి వలమేల్మంగను
పదరకు మింతలోనె వచ్చి దోఁచీనా ॥ ఏల ॥ 434 ॥

## ఆహిరి

ఆయఁ దొల్లె అన్నివను లాపెకేమి
ఆయా లెల్లాఁ జేకొనె నాపె కేమి ॥ పల్లవి ॥

వీడె మిచ్చె నిన్నుఁ బట్టి వింతచేఁతలెల్లాఁ జేసె
అడనుండే నవ్వు నవ్వె నాపె కేమి
వాడుదేరఁజేసి నావద్దికి నిన్నంపి మూచీ
ఆడికెకు వెఱవదు ఆపెకేమి ॥ ఆయఁ ॥

విప్పిల నెంగిలిసేసి చేరి నిన్ను వాకిచ్చె
అప్పసము గాచుకొన్న దాపె కేమి
వొప్పగ వాయింటిలోనె వురమెక్కె తాను నీకు
అప్పుడు నిప్పుడుఁదానె యాపె కేమి ॥ ఆయఁ ॥

వేను తొలసిదేవిని నీపాదాలు పూజింపించి
ఆనుక తా విట్టువీఁగీ నాపెకేమి
తానె యలమేలుమంగ తగు శ్రీవేంకటేశుఁడ
ఐనతగవు నెరపె నాపె కేమి ॥ ఆయఁ ॥ 435 ॥

## ద్రావిళ భైరవి

ఏమి సేయవచ్చు నిఁక యిట్టుండెను నీ పుణ్యము
కామినుల భోగ మెంత కాఁగలదో నీకు ॥ పల్లవి ॥

మంచివాఁడవె నీవు మంకువనితెను నేను
యెంచి మాతోఁ గూడి నీవు యెడ్డవైతివి
కంచము పొత్తున నేల కదిసి యారగించేవు
ఇంచుకంత యెంగి లంటి ఇఁక నెంత యౌదువో ॥ ఏమి ॥

తగవరివే నీవు తమకపుదాన నాతో
తగులఁగా నీవింత తక్కరివైతి
పగటున నేఁ బండేపానుపుపైఁ బండేవు
యెగువ దిగువలను యిఁక నెంత యౌదువో ॥ ఏమి ॥

అట్టె శ్రీవేంకటేశుఁడ వలమేలుమంగ నేను
తొట్టి వురమెక్కించుక దొరవైతివి
బట్టిగొని అప్పటిని సరసములాడేవు
యిట్టె నీ జాణతనాల యిఁక నెంత యవుదువో॥ ఏమి ॥ 436 ॥

## వరాళి

మొగమేమి చూచేవు ముద్దరాలను
వెగటైనదానఁ గాను వెఱవకు మిఁకను ॥ పల్లవి ॥

ఛలమెంత గలిగినా చనవే మెరసేఁగాని
బలిమి సేయను నీవు పంతగాఁడవు
అలుకెంత గలిగినా అందుకు మొక్కేఁగాని
వెలుపల దూర నిన్ను వెఱవకు మిఁకను ॥ మొగ ॥

వాసి యెంత గలిగినా వద్దనే వుండేఁగాని
పాసిపోను నేరుపుల బలువాఁడవు
వేసటెంత గలిగినా వేడుకతో నుండేఁ గాని
వీసమంతాఁ బదరను వెఱవకు మిఁకను ॥ మొగ ॥

కూరిమెంత గలిగినా కొంగువట్టుకుండేఁ గాని
మేరలు దప్పను నీవు మేనవాఁడవు
ఆరీతి శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
వీరువారు నేమనేరు వెఱవకు మిఁకను ॥ మొగ ॥ 437 ॥

## సాళంగనాట

[1]ఆతఁడు నీవాడినట్టె అన్నివనులునుఁ జేసు
శ్రీతరుణివి మమ్ము రక్షించవమ్మ ॥ పల్లవి ॥

యేలవమ్మ మమ్మును యెక్కితివి పతి వురము
నీలీల లేమి సేసినా నీకుఁజెల్లును

---

[1] ఈ పాటలో స్వామియను గ్రహమునకు లక్ష్మీదేవి ఉపాయము అను ఒకతెగ వైష్ణవ సిద్ధాంతమును పొందుపరచినట్లున్నది. (ఈ పాట అధ్యాత్మకీర్తనల ఛాయలోనిది)

[1]బాలకి వన్నిటా నీవు పనిగొంటి వాతనిని
కీలు నీచే నున్నది రక్షించవమ్మా ॥ అత ॥

మన్నించవమ్మ మమ్ము మగఁడు నీచేతివాఁడు
సన్నల నీచేఁతలెల్లా సాగి వచ్చీని
అన్నిటాఁ జక్కనిదాన వటమీఁదట దొరవు
యెన్నికె కెక్కె నీబ్రదు కిఁకఁ గావవమ్మా ॥ అతఁ ॥

యాదేరించవమ్మ మమ్ము నిట్టె యలమేల్మంగవు
గూడితి శ్రీవేంకటేశుఁ గోరినట్టెల్లా
యీడులేనిదానవు నే మూడిగాలవార మిదె
వేడుక లెల్లా నీసొమ్మే వెలయించవమ్మా ॥ అతఁ ॥ 438 ॥

## ఆహిరి

నెట్టుకొన్న మగఁడవు నీవే కదా
యిట్టె నేఁ బదరఁగా యేమాయ నాకును ॥ పల్లవి ॥

పంగించి నిన్ను బలిమిఁబట్టి పెనఁగఁగనేల
సంగడివారితో పాటు చాలదా నాకు
యింగిత మెఱిఁగి నేనిట్టె వుండే మేలుగాక
యెంగిలి సేసుకోఁగా యేమాయ నాకును ॥ నెట్టు ॥

వాదడిచి నిన్నుఁ గదువంముక తిరుగనేల
సొదననిపించుకొంట చాలదా నాకు
నీదయ గోరుకవుండే నీవే మెచ్చేవు గాక
యేదియని కొసరఁగా నేమాయ నాకును ॥ నెట్టు ॥

---

1 'బాలకి' ప్రయోగము శ్రీనాథ, అనంతామాత్యులలో కూడ కానవచ్చుచున్నది.

సలిగె శ్రీవేంకటేశ సారె నీతోఁ జెప్పనేల
[1]అలమేలుమంగవార మౌట వాలదా
వలపుతో నేనుంటే వచ్చి కూడితివి గాక
యెలమి రటు సేయఁగా నేమాయ నాకును ॥ నెట్టు ॥ 439 ॥

రేకు 1774 దేసాళం

నేను నీవంటిదాన నేరమెంచేనా
దానికేమి నీలోనే తలఁచుకో పనులు ॥ పల్లవి ॥

మగఁడు వద్ద నుండగా మాట మాఁటలను నీతో
జగడములడచేనా సాదవు నీవు
నగవు నీవు నవ్వఁగా నాకేల కోపము వచ్చీ
తగవులు నీవే చెప్పి తలఁచుకో పనులు ॥ నేను ॥

ఆతనికి నీవిట్టె ఆకు మడిచియ్యఁగాను
చేత నిన్ను దొబ్బేనా సిగ్గుదానవు
నీతితో నడవఁగాను నిన్ను దూరేనా నేను
[2]దైతతన మెవ్వరందో తలఁచుకోపనులు ॥ నేను ॥

అలమేల్మంగవు నీవు ఆతఁడు శ్రీవేంకటేశు-
డలిగేనా నే నీతో నంత దొరవు

---

[1] అన్నమయ్య అలమేలుమంగ పక్షమువాడవుటయే తనకోరికగా ఈపాటలో స్పష్టముగా చెప్పకొన్నాడు. ఆమె యనుగ్రహమ్మూ, దానితో స్వామియనుగ్రహము సంపాదించుట యీతని ప్రధాన ఉద్దేశము. తాను అలమేలు మంగయేకావలెనని తపించెనా? అనిగూడ యీతని రచనలో తోచుచున్నది.

[2] 'దయిత' అను సంస్కృతశబ్ద వికారముగా తోపదు. 'దైత, దయిత' ఈరెండు రూపములు గయ్యాళి, జగడాలమారి ఇత్యాద్యర్థములలో మాండలికముగా ప్రసిద్ధములు. ఇదే ప్రకరణమునకు సరిపడునట్లున్నది.

మలసి విభునిచేత మన్నింపించితివి నేఁడు
తలఁపెల్లా నొక్కటాయ తలఁచుకో పనులు ॥ నేను ॥ 440 ॥

## మాళవిగౌళ

మేలెఱఁగనిదాననా మిక్కిలి నేను
చాలుకొన్న నీగుణాలు చక్కఁగాక మానీనా ॥ పల్లవి ॥

చెల్లుబడై నీవు నాకు చెప్పినట్టు సేయఁగాను
గొల్లెతల సుద్దులకే కోపగించేనా
చల్లఁగా నీవు నాతో సరసములాడఁగాను
వొల్లనే నీ నేరములు [1]వోరు వలెనా ॥ మేలె ॥

అంకెల నీవు నాయానకు లోనైవుండఁగా
ఇంక నెవ్వరిఁ దెచ్చినా యీసడించేనా
సంకెదీర నీవు నాకు చనవెల్లా నియ్యఁగాను
వుంకువై నీవు చెప్పఁగా నొడఁబడకుందునా ॥ మేలె ॥

ఇంత నన్నుఁ గూడి వురమెక్కించుక వుండఁగాను
పంతాన నీవెంతవున్నా పాడిదప్పేనా
చెంతల శ్రీవేంకటేశ సిగ్గుదేర నవ్వితివి
వంతువాసు లెంచి నిన్ను వలఁబెట్టేనా ॥ మేలె ॥ 441 ॥

## బౌళి

చనవు చెల్లించ నేర్చే సరసుఁడవు
నిను ముదు లడుగక నీఇల్లు చేకొంటిని ॥ పల్లవి ॥

---
[1] 'వోరువ వలెనా' కావచ్చు.

ఆసతోడ నిన్ను నేను అంటిముట్టి పెనఁగుదు
వాసివంతు లెంచను నే వనిత నైనా
సేసవెట్టిన సలిగె చిత్తమునఁ బట్టుకొని
నీ సిరులకెల్లాను నేనే కర్తనైతిని ॥ వన ॥

సంతోసాన నీతోను సారె సారె నవ్వుదును
వింత సేసుకొనను నే వెంఁది నైనా
పొంతఁ జేయివట్టినదే భోగ్యము సేసుకొని
రంతుల నేనే నీరాజ్యమెల్లా నేలితి ॥ వన ॥

గక్కన శ్రీవేంకటేశ కాఁగిలించి కూడితిని
తక్కరి తనము సేయఁ దరుణినైనా
దక్కి నాపాల నున్నదే దరిదాపు సేసుకొని
వొక్క మనసున నీకు వొద్దికై నేనుంటిని ॥ వన ॥ 442 ॥

## సాళంగం

రామలకు సహజమే రమణుఁడు నేమిసేసు
మోములు చూచుకొందము మోనానఁ జెలులము ॥ పల్లవి ॥

పూఁచినట్టి చేతిమొక్కు పురుషునిమీఁదను
చాఁచిన వెంగేలేం(ల్ల?) సవతి మీఁద
తూఁచి చల్లీ నొక్కమాఁటే తొయ్యలి ఇద్దరిమీఁద
దాఁచుకొనీ వెదనవ్వు తా నడుమ నాతఁడే ॥ రామ ॥

కానుక తామెరపువ్వు ఘనుఁడుప్రాణేశునికి
సానఁబట్టినట్టి చూపు సవతికిని
ఆనించీ నిద్దరికిని 'అంగనఁ దానొక్కమాఁటే
నానచేసీ వలపులు నడుమ దా నతఁడే ॥ రామ ॥

---

'అంగన'ఁ ప్రక్కనవున్న అరసున్న విచార్యము

చిందేటి మోవితేనె శ్రీవేంకటేశ్వరునికి
సందడిఁగాకుండఁ దెర సవతికిని
పొందు సేసె నొకమాటే పొత్తుల నిద్దరికిని
మందలించీ నడుమను మాఁటలనే ఆతఁడు ॥ రామ ॥ 443 ॥

వరాళి

[1]మంచిదాయ దానికేమి మమ్ముఁ గావ నీకే పోదు
నించి యింకా నీవే కరుణించేవు గాని ॥ పల్లవి ॥

యెప్పుడు జవ్వనధర్మ మెఱఁగనివాఁడవా
చెప్పనేల నీకు నిదె చింతగాదా
తప్పక యీపని నాతలనే వేగినదా
చొప్పులు నాపైనే నీవు చూపేవు గాని ॥ మంచి ॥

ముంచిన వలపులకు మొదలివాఁడవు గావా
యెంచనేల నీకు నిదె యితవు గాదా
పెంచి యీకతలు నాకె [2]పేరువారి వున్నవా
అంచెలను నాకు ప్రసాదించేవు గాని ॥ మంచి ॥

నే నిన్నుఁగూడిన రతి నీవు నేర్పినవి గావా
మేను ముట్టి నీవు నన్ను మెచ్చఁ గలిగె
కోనేటి శ్రీవేంకటేశ కొదదీర్చి కూడితివి
వీనులు చల్లఁగా నింకా వేఁడుకొనేవు గాని ॥ మంచి ॥ 444 ॥

రామక్రియ

లేలే యాపె తిట్లు లెక్కసేసే విప్పు డిట్టె
చాలుఁజాలు మీకు లోలో చవులు గావా ॥ పల్లవి ॥

---

1 దీనిలోని భావము సుస్పష్టముగుట లేదు

2 పేరువారి పేరుగలిగి, పేరుపెట్టి ఇత్యాదిగా తోచుచున్నది. 'నాకుగానే పేర్చి పెట్టినారా' అని భావము కూడ కావచ్చు.

తగవు లెన్నేసి లేవు దగ్గరి నీవు చెప్పితే
వెగటైన యందాఁక విందువే నేను
యిగురుఁబోఁడికి నీకు నెప్పుడునుఁ గలదే
పగుటున నాపె నీకు ప్రాణము గాదా ॥ లేలే ॥

తారుకాణ యెంతలేదు తగవు నిలిపితే
కూరిమి నెందాఁకాఁ గనుఁగొందుము నేము
యీరీతి తచ్చనలు యిద్దరికిఁ గలదే
కోరినట్టి యాపె నీకు కొంగుపైఁడి గాదా ॥ లేలే ॥

చందాలు సేసేకొవేవు సరి నాపెలోనైతే
యెందాఁకా నవ్వుదును యిందుకు నేను
చెంది నన్ను నేలితివి శ్రీవేంకటేశ్వర నీవు
నిందలేక యాపెప్పుడు నీ నేస్తకత్తెకాదా ॥ లేలే ॥ 445 ॥

రేకు 1775 సాళంగనాట

చూడవయ్య నీతో పొందు సులభమా ఇందరికి
వేడుక పైఁబూయక వేరే నీవు మెచ్చేవా ॥ పల్లవి ॥

చెప్పినట్టి సేసి మీ చెలులకెల్లా నేను
నెప్పున నిచ్చలాడక నీవు మెచ్చేవా
చప్పుడు సేయుక పైపై సరసము లాడుకొంటా
తప్పు నీపై లేదనక తగ నీవు మెచ్చేవా ॥ చూడ ॥

మోమెత్తి పట్టుక నీకు మోహములు చల్లుకొంటా
నీ మనసు గరచక నీవు మెచ్చేవా
దీమసము సేసుకొని తెలివిదెచ్చుక సారె
అమని నవ్వు నవ్వక అటు నీవు మెచ్చేవా ॥ చూడ ॥

కాతరించి విన్నపాలు కడు నీకు విన్నవించి
నీతో నిట్లాఁ గూడక నీవు మెచ్చేవా
యీతల శ్రీవేంకటేశ యేలితివి నన్ను వలె
జాతినీతి నెరయక సరి నీవు మెచ్చేవా ॥ మాద ॥ 446 ॥

లలిత

ఇదివో మా సాజము యెఱఁగ విన్నవించితి
కదిసి మన్నించవయ్య కాదనము పనులు ॥ పల్లవి ॥

వంకలొత్తీ నాపె నీవలపుల మాఁటలు
అంకెవచ్చి నట్టెల్లా నీవాడవయ్య
సంకెలేక నిజమాడి సాదించనేకాని
పొంకాలు సేయనేరము బూటకములెల్లాను ॥ ఇది ॥

చక్క గప్పీ నాపె చక్కని నీమేని చేఁతలు
దక్కించు కొంటివి మమ్ము దగ్గరవయ్య
పక్కన నెరుసులుంటే బయటవేయనేకాని
మిక్కిలి దాఁచనేరము మెరమెచ్చులెల్లాను ॥ ఇది ॥

పేరఁబెట్టీ నాపె నీపెలుచు మోవి తేనెలు
చేరి మాకు నియ్యవయ్య చేకొనేము
కోరి శ్రీవేంకటేశ్వర కూడితివి సందునవే
ఆరీతిఁ జెప్పనేరము ఆయపు నీరతులు ॥ ఇది ॥ 447 ॥

పాడి

భ్రమయకుమనరమ్మ పనిగద్దు యిఁకమీఁద
తమకించి తనవల్లఁ దప్పు వేసేవారమా ॥ పల్లవి ॥

సిగ్గుతోడ నున్నదానిఁ జేరి యులిగితినంటా
యెగ్గులెల్ల గడిఇంచే వేడ రేనివి

కగ్గి యాడో ఆఁటదాని కాతాళాలఁ బడి వచ్చి
వెగ్గళించి మా మీఁద వెల్లించవలెనా ॥ భ్రమ ॥

మానాపతి నైనదాని మారుమాటలాడనంటా
సానఁబట్టేవు పంతాలు సారె సారె
నానఁబెట్టి తానెవ్వతోనాలిఁబడి ఇందు వచ్చి
ఆనుకొని మాగుణాలు అట్లాఁ జూచీని ॥ భ్రమ ॥

రతి నలసినదాని రాజసము చూపినట్టు
కతలెల్ల గడిఇంచి కాఁగిలించీని
యితవై శ్రీవేంకటేశుఁ డితఁడు నన్నే కూడి
యితర సతులవలె నిటు నన్ను మెచ్చీని ॥ భ్రమ ॥ 448 ॥

## ముఖారి

ఇప్పుడు దా దక్కెనేమో యెవ్వఁ డెఱుఁగు
చిప్పిలఁగ నవ్వితేనే సేసినవారు గార(రా?) ॥ పల్లవి ॥

పొద్దువోక ఆతనితో పొందులు సేసుకొంటా
కొద్దిమీర గోళ్లల గోడ రాచేవే
అద్దరిపాటు నే రాఁగా నటు కొంకితిరి గాక
వద్ద లేకుంటే కూడినవారు మీరు గారా ॥ ఇప్పు ॥

వంచిన శిరసుతోడ వాడికెలు సేసుకొంటా
మంచమెక్కి పతినేల మరిగించేవే
అంచెల నేఁ గనఁగాను ఆం(అం?)తట నున్నారుగాక
ఇంచుకంత మఱఁగైతే ఇట్టె కూడుకొనరా ॥ ఇప్పు ॥

నవ్వి కాఁగిలించుకొంటా నమ్మిక లిప్పించుకొంటా
రవ్వలేల సేసేవే నే రాఁగా నేఁడు

యివ్వల శ్రీవేంకటేశుఁ డెనసె నన్నింతలోనె
దవ్వుల నుండేను పంతాలవారే కారా ॥ ఇప్పు ॥ 449 ॥

బౌళి

ఏల మమ్ముఁ గొసరేవు యెంతగద్దు నీయాస
వోలిఁ జెలులు నీరతి కోర్వఁగవశమా ॥ పల్లవి ॥

పెదవిపై తేనెలు పేరుకొనవచ్చుగాక
పొదిగి తెచ్చి కుండలఁ బోయవశమా
కుదురు గుబ్బలమీఁద కుప్పసేయవచ్చు గాక
చిదిమి తెచ్చి వయసు చేతఁ బెట్టవశమా ॥ ఏల ॥

సిరిమించే నవ్వులు సెలవుల నుండుఁ గాక
వరుసఁ జిత్తరువున వా(వ్రా?)యవశమా
సరసపుఁ జూపు నీపైఁ జల్లఁగవచ్చుఁగాక
జరసేటి వేళ గంటే సరి జూప వశమా ॥ ఏల ॥

కరఁగిన మోహములు కాఁగిటఁజూపుటఁగాక
బెరశంచి వోర్పునఁ బెట్టవశమా
గరిమ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
తెరలోననే కాక తెలుపఁగ వశమా ॥ ఏల ॥ 450 ॥

శ్రీరాగం

చెలులాల చూడరమ్మ చేసినది లేదందురు
అలివేణిబొంకు కంటే అదె జాణతనము ॥ పల్లవి ॥

మొనమాట నే నాడితే మొలక నవ్వులు నవ్వీ
తన మనసెఱఁగని తగ వున్నదా

యెనసిన రమణుఁడు యెదుటనే వున్నాఁడు
అన నేమున్నది తన కదె జాణ తనము ॥ వెలు ॥

తప్పులు నేఁ బట్టితేను తానే పొందు సేయవచ్చీ
నెప్పున తా నేరనినేరు పున్నదా
చొప్పురెత్త నిద్దరికి మట్టు మీద నున్నవాఁడు
అప్పసము గాచుకున్న దదె జాణతనము ॥ వెలు ॥

మొగము నేఁ జూచితేను ముచ్చట సన్నలఁ జల్లీ
వెగటైన వినయాలు వెదచల్లఁడా
యెగ సక్కన శ్రీవేంకటేశుఁ డిట్టె మమ్ముఁ గూడె
అగడు దీర్చుకొనుట అదె జాణతనము ॥ వెలు ॥ 451 ॥

రేకు 1776 సామంతం

సేసేటి మా సేఁతలెల్ల సింగారాలే
మూసిన ముత్తేలము మొనలంత చూపము ॥ పల్లవి ॥

చూపులకు వాండ్లు సూటియై వుండును తొల్లె
కోపగించుకొన్నఁ బూవు కొత్తగా నీపై
నీ పనులకు మతిలో నీకు నీకే తోఁచీఁగాని
తీపులమోవివారము తెగవలు సేయము ॥ సేసే ॥

వొత్తుఁ జన్నులు గట్టులై వుండేది సాజమే
మెత్తఁ జేసితేఁగావు మించి నీచేత
హత్తిన నీగుండెవంక నవి రాఙకొనెఁగాని
నిత్తెపుఁగోమలులము నిష్ఠూరము చూపము ॥ సేసే ॥

చేతులకుఁ గొనగోళ్లు చిగిరించేది సాజమే
కాతరించితేఁ బోము కలకాలము

యేతుల శ్రీవేంకటేశ యెంచనేల కూడితిమి
ఆతుమైన వారము అంత రట్లు సేసేమా ॥ సేసే ॥ 452 ॥

## బౌళి

ఊరకుండే నేమందువో వూడిగము సేయనని
ఆరూఢి నేఁ బైకొంటి ఆయము నేచేతిది ॥ పల్లవి ॥

చేయెత్తి పిలిచితేను చేరి నే నిలిచితిని
యే యింతిఁ బిలిచితివో యెఱఁగ నేను
వాయెత్తి మాటాడితేనే వడిగా నేమీ యంటి
నీయిచ్చ దెలియఁగాని నేనే సంతోసించితి ॥ ఊర ॥

మున్ను నీవు నవ్వితేనే యెక్కుచు నేనూ నవ్వితి
యెన్నికె లెవ్వతెపై యెఱఁగ నేను
కన్నులు విచ్చి చూచితే గక్కనఁ జెమరించితి
సన్న దెలియదు గాని చనవు చేకొంటిని ॥ ఊర ॥

పానుపుపై నీవుండఁగా పైకొని నేఁ గూడితిని
యీనయము నాకే యౌత యెఱఁగ నేను
పూనితివి వలపులు పొదిగితి నే నన్నియు
దీనికె శ్రీవేంకటేశ తేఁకువెల్లాఁ గంటిని ॥ ఊర ॥ 453 ॥

## శంకరాభరణం

అందాఁక నీరప మవుఁగాదనను
కందువ వేళనే కైకొనేఁ గాక ॥ పల్లవి ॥

వలచినదాన వద్దనఁ గలనా
వెలఁగి నీ వేమి సేసినను

మొలక చన్నులు మోపేటి వేళనే
చలము లన్నియు సాదించేఁ గాక ॥ అందాఁ ॥

కోరుకొన్నదాన కోపగింతునా
మేరలు నీ వెంత మీరినను
సారపుఁ గెమ్మోవి చవిగొనే వేళ
బీరములన్నియు పెనచేఁగాక ॥ అందాఁ ॥

కూడి నట్టి దాన గుట్టు దాఁచేనా
యీడనే శ్రీవేంకటేశ నిన్ను
మేడెపురతులమీఁద నున్న వేళ
పాడి పంతములఁ బంగించేఁ గాక ॥ అందాఁ ॥ 454 ॥

## సౌరాష్ట్రం

ఇతవరులమయ్యే ని న్నింతకుఁ దెచ్చితిమి
కతలకెల్ల నిక్కిన కదు దొడ్డవాఁడవు ॥ పల్లవి ॥

చేరి నిన్నుఁ గూడేమంటా చెమట లంటింతుము
మేరతో కొప్పువిరులు మీఁద రాలును
యీరీతి మాతోడి పొందు ఇంతకుఁ దెచ్చెను నిన్ను
పోరచి నందరిచేత పూజగొనేవాఁడవు ॥ ఇత ॥

మోవి తేనెలిచ్చేమంటా ముంచి యెంగిలి సేతుము
భావించి పెనఁగఁబోతే పాదాలు సోఁకు
వావులు మాతోడను వాఁటాలు సేసెను నిన్ను
దేవరవై ఇందరిలో తేజమైన వాఁడవు ॥ ఇత ॥

రతుల మెప్పించేమంటా రసము లుబ్బింతుము
చతురత మాటలెల్లా సాదింపు లౌను

ఇతవై శ్రీవేంకటేశ ఇటు నన్నుఁ గూడితివి
సతులు పెక్కులు గల సవరనివాఁ డవు ॥ ఇత ॥ 455 ॥

## పాడి

దానికేమి తప్పు గాదు దయదలఁచు కొంటేను
వీనుల మామాటలెల్ల వినవమ్మ చెలియ ॥ పల్లవి ॥

చలమెల్ల నొక్కటే సతులకుఁ బతులకు
బలిమి కొలఁదినే పంతాలు గాని
నిలుచున్నాఁడు నీపతి నేము వొడఁ బరచేము
నెలకొని ఇంతట మన్నించవమ్మ చెలియ ॥ దాని ॥

బిగువెల్ల నొక్కటే పెనఁగేటివారికి
నగవు కొలఁదినే ననుపుగాని
మొగము చూచీ నతఁడు మొక్కేము నేమెల్ల
నిగిడి యీవేళను మన్నించవమ్మ చెలియ ॥ దాని ॥

రతియల్లా నొక్కటే రసికుల కెల్లాను
మతులకొలఁదినే మరపు గాని
యితవై శ్రీవేంకటేశుఁ డిదె కూడె మమ్ము మెచ్చ
సతమై నీ సరసాలు వల్లవమ్మ చెలియ ॥ దాని ॥ 456 ॥

## భైరవి

వద్దు వద్దు రమ్మనవే వలవని జాగు లేల
నిద్దురకన్నులతేట నేనే యెరుఁగుదునే ॥ పల్లవి ॥

మంచము మీఁదటి మాఁట మరచెనా తానేమైన
కంచము పొత్తుల చవి కానఁడా తాను

ఇంచుకంత వట్టి గుట్టులేల మాతోఁ జేసీని
నించేటి తన లాగులు నేనే యెఱుఁగుదునే ॥ వద్దు ॥

గుబ్బల గుజ్జనగూళ్లు గోర నూఁది చూడఁడా
వుబ్బుఁగవణపు పుక్కి ‌ లున్నదిగదె
మబ్బువయసు మదము మాపైనేల కప్పీనే
నిబ్బరపు తనతమి నేనే యెఱుఁగుదునే ॥ వద్దు ॥

బీరపు కాఁగిటిపస బిగిఇంచి మెచ్చఁడా
సారె జారుఁగొప్పు గురి సరసాలకు
యీరీతి శ్రీవేంకటేశుఁ డింతసేసి నన్నుఁ గూడె
నేరుపు నేరములెల్లా నేనే యెఱుఁగుదునే ॥ వద్దు ॥ 457 ॥

రేకు 1777 రామక్రియ

ఒప్పగించితినంటాను వూరకేల మమ్మ నేవు
నెప్పున నే మొరసితే నిన్ను సోఁకి రాదా ॥ పల్లవి ॥

సలిగె గలిగినాపె సణఁగులు రాలిచితే
నిలువునఁ జేకొనఁగ నీకె హితవు
అలరి సవతులము అంది వాదు లడిచితే
నెలకొన్న మాఁటలెల్ల నిన్ను సోఁకి రాదా ॥ ఒప్ప ॥

చిత్తము వచ్చినయాపె చేతికొన దాఁకించితే
హత్తి నీకె సరసములై వుండును
పొత్తుల మగువలము పూనుకొని వచ్చితేను
నిత్తెమైన అలవాటు నిన్ను సోఁకిరాదా ॥ ఒప్ప ॥

కదిసిన యాపె నీ కందువలు రేఁచితే
యిదె శ్రీవేంకటేశ నీ యెమ్మ(మ్మె?)లు మించు

అదనుగాఁగా నేము అలమి భోగించితిమి
నిదురకన్నుల నవ్వు నిన్ను సోఁకి రాదా ॥ ఒప్ప ॥ 458 ॥

కాంబోది

ఎడమాట లాడవే మా ఇద్దరి సందు
గడుసుఁ దనము మాన్పఁ గలనా యీతనిని ॥ పల్లవి ॥

తగవెరిఁగితేఁ జాలు తప్పులు నేఁ బట్టేనా
మొగమెత్తుమనవే నే ముంచి చూచేను
జగడాలడువడట చలము సాదించేనా
నగుమనవే వలపు నానఁబెటే(ట్టే?)ను ॥ ఎడ ॥

నేమముతో నుండునట నెరుసు నే నెంచేనా
ఆమాఁట ఆడు మనవే అంది విడేలు
ఆముకో వలచునట అనుమానించేనా
దోమటికి రమ్మనవే తొడికే నే మొదలు ॥ ఎడ ॥

పెనఁగఁగా నేరివితే పిరి తీసేనా ఇఁక
చన విమ్మనవే ఇట్టె సమ్మతించేను
యెనసె శ్రీవేంకటేశుఁ డెదురెదురనే నన్ను
వినుమనవే మనవి విందు మోవిఁ బెట్టేను ॥ ఎడ ॥ 459 ॥

బౌళి

విచారించుకోవు గాక వెనకముందు
పచారాలవలె బట్టఁబయట బెట్టుదురా ॥ పల్లవి ॥

చెనకుచు మగవాఁడు సిగ్గువిదువఁగఁ జెల్లు
అనిశము విడువరా దాఁటదానికి
చనుఁగవ చూపుమంటా సారెసారెఁ దిట్టేవు
మొనలైవుండును అవి ముట్టితేనే నాఁటవా ॥ విచా ॥

కన్నచోటఁ బతులకు కడుఁ దమకించఁ జెల్లు
అన్నిటాను అణకువే ఆఁటదానికి
వన్నెలమోవి ఇమ్మంటా వచ్చి వచ్చి జంకించేవు
నున్ననై వుండును అది నోరూరింపించదా ॥ విచా ॥

యీడానాడా నినుబోఁటి కెమ్మెలాడుకోఁజెల్లు
ఆడికెఁ బడఁగరాదు ఆఁటదానికి
కూడితివి రతి నన్ను గొబ్బున శ్రీవేంకటేశ
వాడికై వుండును అది వ(ద?)లపులు రేఁచవా ॥ విచా ॥ 460 ॥

## ఆహిరినాట

కానవచ్చె నీగుణాలు గక్కన నద్దరిపాటు
ఆనుక మంకుఁదనాన కంతదాన వవుదువే ॥ పల్లవి ॥

నెట్టుక ఆతఁడు నేనూ నీఇంటికి వచ్చితేను
అట్టె కూచుండి లేవవు అంతదానవే
చుట్టరికము సేసితే సూడువట్టె వింతలోనె
అట్టె నీపతి యెడకు నంతదాన వౌదువే ॥ కాన ॥

చాయసేసుకొని నేము సరుసఁ గూచుండితేను
ఆయముగా వొత్తుకోవు అంతదానవే
నాయములు నడపితే నటనలు సాదించేవు
ఆయలేని రమణుని కంతదాన వౌదువే ॥ కాన ॥

చేతులు చాఁచి నేము చెక్కులు నిన్ను నొక్కితే
ఆతలీతలఁ దిప్పే వంతదానవే
యీతల శ్రీవేంకటేశుఁ డిద్దరిఁ గూడెను వాఁడె
ఆతనియెడకు నీ వంతదాన వౌదువే ॥ కాన ॥ 461

## భైరవి

వట్టి చింత నీకు నేల వంచిన శిరసురేల
పట్టుమా అందిచ్చే నాపె బాగాలు నీకును ॥ పల్లవి ॥

కూరిమి గలవాఁడవు కోపాలఁ బడనోపవా
యీరసాలాపె యాడినా యేమాయ నీకు
చేరి మాముందరగాఁగా సిగ్గువడేవో యేమో
రారమ్మ వొక్కటిసేసే రమణిని నిన్నును ॥ వట్టి ॥

చెట్టవట్టినవాఁడవు చెనకులకు లోఁగేవా
యెట్టు నిన్నాపెసేసినా నేమాయను
గుట్టు గంటిమని మాకుఁ బొంకి వున్నాఁడవో యేమో
నెట్టుకొలిపేరమ్మా నెలఁతలు నిన్నును ॥ వట్టి ॥

తగిలిన నీవు రతి తప్పులకు నోపవా
యెగ సక్కే లా పేమన్నా నే మాయను
నగి శ్రీవేంకటేశుఁడ నన్నూ నాపెఁ గూడితివి
జగడాలు దిద్దే రమ్మా సకియను నిన్నును ॥ వట్టి ॥ 462 ॥

## తెలుఁగుఁగాంబోది

అట్టె కాదా ఆస నీ కెంతో
యెట్టుక యితనికి నీవొక్కెతవా ॥ పల్లవి ॥

వాలుకచూపులు వంచితివి గదవే
యేలిన రమణుఁడు యేమనెనే
కోలుముందుగాఁ గోపములేలే
తాలిమి మా కిటు దయివారఁగాను ॥ అట్టె ॥

కొంచెపు మాఁటలఁ గొసరితివి గదవే
యించుక రమణుఁడు యేమనెనే
మంచమెక్కి మరి మంకు లదేలే
పొంచుక నేమెల్లా బొందితి మిదివో ॥ అట్టె ॥

కులికి కులికి రతిఁ గూడితివి గదవే
యెలయించిన పతి యేమనెనే
కలసితిమి శ్రీవేంకటపతి నతనినే
వలపులుమాకును వంతాయ నిపుడు ॥ అట్టె ॥ 463 ॥

రేకు 1778 ఆహిరి

మెత్తనిది నా మనసు మేటివి నీవు
యెత్తిన యాసలదాన యేమిసేసే నిన్నును ॥ పల్లవి ॥

కోపగించవచ్చి నేను గొబ్బున నీమోము చూచి
నాపంతము విడువకే నవ్వితి నేను
చేపట్టి నీ చిత్తము వచ్చినట్టె సేయవయ్య
యీపాటిదాన నేను యేమిసేసే నిన్నును ॥ మెత్త ॥

చేయి చాఁచేనని వచ్చి చిమ్ముల నీమాఁట విని
ఆయాలు గరఁగి లోనైతి నీకును
నీ యిచ్చలోనిదాన నేఁ డిట్టె మన్నించవయ్య
యీయెడఁ జేతిలోదాన నేమిసేసే మిందును ॥ మెత్త ॥

కూరిమి గొసరవచ్చి కూడితి నీకాఁగిట
నేరుపు గలిగినట్టి నీ మహిమలు
సారపు శ్రీవేంకటేశ సతమైనయట్టిదాన
యీరసములేనిదాన నేమిసేసే నిన్నును ॥ మెత్త ॥ 464 ॥

## సాళంగనాట

నావద్ద నున్నఁ దడవు నాఁటకాలేల
  నీ విధమే యిది యంతా నీవే బుద్ధియ్యవోయి ॥ పల్లవి ॥

వాసులకు నీపై నే వలపులు చల్లితేను
  బేసబెల్లి తానేల పేఁడుకొనీని
  ఆసపడితే వచ్చునా అవ్వలివారి సొమ్ము
  నీసూటి మానిసి యాపె నీవే బుద్ధియ్యవోయి ॥ నావ ॥

చనవున నీతో నేను సరసము లాడితేను
  పనిమాలినాపె తాను పంతాలాడీని
  పెనఁగితేఁ బుట్టునా ప్రియములు లోలోన
  నినుఁ జుట్టుకొనీ నాపె నీవే బుద్ధియ్యవోయి ॥ నావ ॥

జవ్వనాన నే నిన్ను సాదించి కూడితేను
  పవ్వళించి తాను నట్టె పైకొనీని
  యివ్వల శ్రీవేంకటేశ యిద్దరము సరే నీకు
  పువ్వక పూచె నీ కాపె బుద్ధియ్య వోయి ॥ నావ ॥ 465 ॥

## నారాయణి

నలినాక్షి నిన్నుఁ జూచి నవ్వువచ్చె మాకెల్ల
  చలపట్టితే పంతము చవుకాయను ॥ పల్లవి ॥

తలఁచఁగఁ దలఁచఁగ తనలోనె మరు దుండె
  చెలి బెదరి యట్టె నీచేయి వట్టెను
  అలిగి యెవ్వరిమాఁట అటమున్ను వినదాయ
  వులికి యిప్పుడు తానె వొక్కటాయను ॥ నలి ॥

చెక్కు చేతఁబెట్టఁగానే చిగురు బాణమాయ
గక్కన నీరెంటె మిఁ(మిం?)తి గప్పుకొనెను
మొక్కే రమ్మన్నా రాదు మొదల నీ గాత వంక
చిక్కి నేఁడు తానే నీ చేతికి లోనాయను ॥ నలి ॥

కందువ నిద్దిరించితే కలలో నీవు గూడితి-
విందుకే తా నిన్నుఁ గూడె యిచ్చకానను
సందడి శ్రీవేంకటేశ సరివచ్చె మామాఁట
పొందిక లొక్కొక్కటికి పోదులై నిలిచెను ॥ నలి ॥ 466 ॥

## దేసాళం

నేరిపేవు మాకు నిది నీటుతోడను
నీరచన నింత విచ్చి నేనాడవలెనా ॥ పల్లవి ॥

సిగ్గు గలదైతే నిన్నుఁ జేవట్టి తీసునా నీవు
వెగ్గళించినా దా విట్టువీఁగుఁ గాక
కగ్గులేని బత్తిదంటా కడు నాతోఁ బొగడేవు
నిగ్గుల యిందలిమేలు నీసత్య మెఱఁగదా ॥ నేరి ॥

యింగిత మెఱిఁగినది యెదురు నీతో నవ్వునా
సంగతి నిన్ను బొమ్మల జంకించుఁ గాక
చెంగట నీపె జూపి చేసన్నలు సేసేవు
అంగడి ఆడికాఁడవు అదెఱఁగవా ॥ నేరి ॥

పొందెరిఁగినవి యైతే పొదుగంగఁ జూచునా
కందువల నుండే నిన్నుఁ గలసుఁగాక
యిందులో శ్రీవేంకటేశ యీడుకు నన్నుఁ గూడితి
వందాలు మాలోనివి నీ యరచేతివే కావా ॥ నేరి ॥ 467 ॥

## సాళంగనాట

ఇదివో మా విన్నపము యెన్ని సేసినా
  వుదుటొక్కటే వారి వుపమలు వింతలు ॥ పల్లవి ॥

చలిమి బలిమిగల సతి నే నీకు
  యెలయింపుఁ గాంతలు మరెందరు లేరు
  వలపే సరి గాని వాడికె లెచ్చుకుందురు
  అలరు లొక్కటే వాస నందులోన వేరులు ॥ ఇది ॥

నంటున నీవు మన్నించే నగవు నాది
  యింటింట మరి నవ్వులు యెంత లేదు
  కంటి యింపే గురిగాని గాలి ముడె(డి?) గట్టరాదు
  వంటక మొక్కటైనా వడ్డపేరు వేరులు ॥ ఇది ॥

గక్కన నీవు కూడిన కాఁగిలి యిది
  యెక్కడి సతుల కాఁ గిలెంత లేదు
  చక్కఁదనమే సొమ్ము సకలముఁ గలిగినా
  యెక్కువ శ్రీవేంకటేశ యితరులు వేరులు ॥ ఇది ॥ 468 ॥

## కన్నడ గౌళ

ఇతవుగా మతి కోప మింతయుఁ దీరిన మీఁద
  కతకు గాళ్లు చెప్పేఁ గడమ లేదయ్యా ॥ పల్లవి ॥

నెలఁతలతో నిన్ను నిష్టూరాలాడుకొంటా
  సొలయుచు నీకెదురు చూచుకొంటాను
  అలసేటి వేళనే అండకు విచ్చేసితివి
  కులికి యా నోరనే కొనియాడేమయ్యా ॥ ఇత ॥

వూరకే నిన్ను సాదించే వుపమ దలఁచుకొంటా
సారె నీకుఁ గమ్మ వా(వ్రా?)సి చదువుకొంటా
యీరీతి నే నుండఁగా నన్నింతలో మన్నించితివి
కూరిముల ఆనోరనే కొనియాడేమయ్యా ॥ ఇత ॥

సరవి నీ బాసలు సాకిరులు వెట్టుకొంటా
ధర మీ చక్కఁ దనాలు తలఁచుకొంటా
వొరయఁగా శ్రీవేంకటోత్తమ నన్నుఁ గూడితి
సరుగ యీ నోరనే సన్నుతించేమయ్యా ॥ ఇత ॥ 469 ॥

రేకు 1779 కాంబోది

కాదందునో అవునందునో గరిమలు నీవి మాచి
సోదించి తెలుసుకొని చొక్కితి నిట్టె నేను ॥ పల్లవి ॥

నగితే నీ సెలవుల నయమై వెన్నెల గాసీ
మొగము మాచితేను ముద్దు గారీని
యెగసక్కేలాడేనంటే యెట్టు మనసు గొలుపు
పగటు నీ చేఁతలకు బ్రమసితి నేను ॥ కాదం ॥

మాఁటలాడి చూచితేను మంచితనాలే వూరీ
వాఁటపు నీ చూపులను వలపే నిండీ
ఆఁ టదాన జంకించ నందుకెట్టు వొడఁబడే
కూటువ నీ మన్ననల గురుతైతి నేను ॥ కాదం ॥

సారె ( గాఁగిలించుకొంటే సంతోసములే మించీ
కూరిమి నీవు గూడిన కూటమే చెప్పీ
యీరీతి శ్రీవేంకటేశ యేమని పొగడవచ్చు
తారుకాణ నీరతులఁ దనిసితి నేను ॥ కాదం ॥ 470 ॥

### రీతిగౌళ

మేలు మేలు నీ గుణాలు మెచ్చితి నేను
తాలిమి మాకింత నుండే తరుణుల మాదుమా ॥ పల్లవి ॥

వెరవున నే నెంత వేగిరించి దూరినాను
సరవి దప్పవు నీశాంత మెట్టిదో
యిరవుగ నీ గుండె ఇంత బలువు గాకుండే
తెరలి పెక్కు సతులఁ దెచ్చుకొందువా ॥ మేలు ॥

కాతరినై నే నిన్ను కరకరిఁ బెట్టినాను
[1]ఆతుర పడవు యెంత అభ్యాసమో
భీతి విడిచింత[2] నీకు బిరుదు గలుగకుండే
ఘాతల గొల్లెతలఁ జీఁకటితప్పు సేతువా ॥ మేలు ॥

నిబ్బరపురతి నిన్ను నే నెంత పెనఁగినాను
వుబ్బు సదు(డ?)లవు యెంత వొట్టిన యాసో
గబ్బివై శ్రీవేంకటేశ కదునీటు మీరకుండే
తబ్బిబ్బులేక నన్నింత తప్పక యేలుదువా ॥ మేలు ॥ 471 ॥

### దేసాళం

అందరితోడి పాటు అట్టే కానీవయ్య
సందడించి వేఁడుకోఁగా చలపట్టేనా ॥ పల్లవి ॥

---

[1] "గ్లానగ్లాస్నూ ఆమయావీ వికృతో వ్యాధితోఽపటుః । ఆతురోఽభ్యమితోఽభ్యాంతః" అని అమరము. సంస్కృతమున 'ఆతురః రోగీ' అని మాత్రమే అర్థము. ఆతురః, సంభ్రమః అస్య అస్తీతి అను వ్యుత్పత్తితో ఇత్వరా సంభవమే అను ధాతువుమండి కలిగినట్లు చెప్పచున్నారు. దాని ఛాయార్థము తొందరపాటు, వేగిరము, ఆత్రము ఇత్యాదులు కావచ్చు. ఈ యర్థమునవే ఇక్కడ ప్రయోగము.

[2] విడిచి + ఇంత

కప్పురాలు మాఁటలు కారాలు చేఁతలు
 యెప్పుడు మీ పొందులు సతు లెట్టు సేతురో
 తప్పు వట్టరాదు నీకు తమక మెంతైనా గద్దు
 నెప్పన నీ యానతి నేఁ గాదనేనా ॥ అంద ॥

నిగరాలు బాసలు నెరుసలు మాయలు
 మగువలు నీకే యెట్టు మరుపుదురో
 తగవులే నెరపేవు దైవారీ వలపులు
 నిగిడి నీ యానతి నేఁ గాదనేనా ॥ అంద ॥

చెలువము మొగము చెనకులు మేనెల్ల
 బలిమి నీ యింతు లెట్టు భ్రమఁ జిక్కిరో
 కలసితి విటు నన్ను గక్కన శ్రీవేంకటేశ
 నెలవై నీ యానతి నేఁ గాదనేనా ॥ అంద ॥ 472 ॥

వరాళి

వారు చెప్పినట్టు సేసేవారి వారము
 యీరీతి పనుల కప్పు ణెప్పించుమా నాకును ॥ పల్లవి ॥

కోరేటి యాఁడు వారము కోపాల కెల్లా మొదలు
 యేరా నీతోడి పొందు కేమి బాఁతి
 చేరి మమ్ముఁ జెనకేవు చేయి మేము చాఁచితేను
 దూరు రాదా నీతొంటి తొయ్యలులచేతను ॥ వారు ॥

పంతపు మాటవారము పట్టినందుకెల్లా గురి
 ఇంతటివారి మెప్పించ నెఱుఁగుదుమా
 మంతనము లాడేము మరుచుమాటాడితేను
 సంతసించేరా నీ సవతు లిందరును ॥ వారు ॥

వేడుకవేళ దానను వేవేలు రతుల పోగు
కూడితి శ్రీవేంకటేశ గుట్టెరిఁగేనా
వూడిగేలకు మెచ్చేవు వొద్దనే నీదేవియని
తోడ నాపెసమ్మతే యింతు లెల్లా నవ్వేరు ॥ వారు ॥ 473 ॥

ముఖారి

తొల్లింత నేరవు నీవు దొరకొన్న కుచ్చితాలు
వల్లనిదే కాదా వెల్లి చాపకిందిది ॥ పల్లవి ॥

పయ్యదలోపలినా బలుపుగుబ్బలు నీవు
చెయ్యంటక తెలుసునా జిగి నామేను
వొయ్యన నా మనసేమి వొరసేవు మాఁటలను
గయ్యాళితనా లెవ్వతె గరపెనో నీకును ॥ తొల్లిం ॥

పానుపు మీఁదట నాపంతపురతుల నీవు
మేనుచొక్క కెటేఁగేవా మించు నాగుట్టు
మోనాన నుండి నాతమి ముందేమి వెలుచుకొంటి-
వానటన లెన్నాళ్లనుం డట్టె నేర్చుకొంటివో ॥ తొల్లిం ॥

కాఁగిటిలోపలి నాకరఁగు లిట్లా నీవు
చేఁగదేరక నమ్మేవా శ్రీవేంకటేశ
మాఁగినమోవి చేకొని మన్నించితి వెంతకెంత
వీఁగని మహిమ లెన్ని వేవేలు గలవో ॥ తొల్లిం ॥ 474 ॥

రామక్రియ

చెక్కునొక్కి మన్నించు చేతులెత్తి మొక్కేము
దిక్కుల కెక్కించి యిఁక దిగవిడువకుమీ ॥ పల్లవి ॥

వనితలు నీకు బాఁతా వద్దనుండి సేవసేసి
మనసు పట్టేము గాక మా కొరకు
నిను మెప్పించే వారమా నీవారమన్నవారి
యెనసి మన్నించేదే యెక్కుడు నీ బిరుదు ‖ చెక్కు ‖

నీ కెంద రిష్టులు లేరు నీ పొందు సేసి నిన్ను
మైకొని దక్కఁగొనేము మా కొరకు
నీకు నీడు వత్తుమా నీ సలిగె పట్టువారి
యీకడ మన్నించేది యెక్కు డిది సుమ్మీ ‖ చెక్కు ‖

నిచ్చపెండ్లి యెంత లేదు నీకు నేము సేసవెట్టి
మచ్చిక చల్లేము గాక మా కొరకు
చెచ్చెరఁ గూడితి నన్ను శ్రీవేంకటేశ నీవారి
హెచ్చించి మన్నించుటే యెక్కుడైన కీరితి ‖ చెక్క ‖ 475 ‖

రేకు 1780 సామంతం

భావించుకో రమణుఁడ పచారించితి మిదె
నీ విచ్చిన సలిగె నేరుచుకొన్నారము ‖ పల్లవి ‖

కన్నుల జంకింతుము కాఁకలు చల్లుదుము
ఇన్నియు నీపై మోహమే యీసుగాదు
కన్నెలము నేమట కాంతుఁడవు నీవట
నిన్ను మీరే పను లేవి నీదయ గోరుదుము ‖ భావిం ‖

అట్టె వెంగే లాడుదుము ఆయము లంటింతుము
గుట్టున నీతో పొందుకే కోపము గాదు
పట్టు మాకు నీవే యట బలిమి నీచేతిదట
నెట్టన నీ కెదురేది నేనెంత వారము ‖ భావిం

రతులఁ బెనఁగుదుము రాజసము చూపుదుము
ఇతవు నీకుఁ జేసేదే యెరవు గాదు
గతి మాకు నీవే శ్రీవేంకటేశుఁడ కూడితివి
మతకాలు నీ మీఁదనా మచ్చికైనవారము ॥ భావిం ॥ 476 ॥

ఆహిరి

వీనులు చల్లఁగా ఇట్టె వినేఁగాక
యీనయగారి నీతో యెదురాడేనా ॥ పల్లవి ॥

చందురుఁడు నీ చూపు ఆ చాయలది నామోము
సందడి నిందుకే యెట్టు సరియౌదును
చెంది నన్ను మన్నించి చెప్పేవు యీసమ్మంధము
ఇందు నీ చిత్తము కొలఁ దెదురాడేనా ॥ వీను ॥

పాము నీ పరపు ఆబాగులది నా యూరు
సామివి యిందుకే యెట్టు సరి యౌదును
చేముట్టి చుట్టరికాలు చెప్పి నన్నుఁ బొదిగేవు
యేమనినా నీమాట కేదురాడేనా ॥ వీను ॥

చుట్టుఁ జక్రము కత్తి యీ సూటివే నా కుచములు
జట్టిగా నిందుకే యెట్టు సరి యౌదును
గుట్టున శ్రీవేంకటేశ కూడితివి వావులకె
యెట్టు నన్నేలినా నీకు నెదురాడేనా ॥ వీను ॥ 477 ॥

లలిత

ఇన్నిటా నీతనిచిత్త మెఱిఁగి చేకొనవమ్మ
యెన్నటికి నలుగకు ఇచ్చకాలే వలెను ॥ పల్లవి ॥

సిగ్గులేలే యితనితో చెలియ
　సిగ్గుల గొల్లెతలను చేతులెత్తించె
　వెగ్గళించకువే వీని వేమారు తొల్లి
　వెగ్గళించిన సతిని వెసఁబిన్నఁజేసెను ‖ ఇన్ని ‖

యింటిలో దాఁగకువే యీత నెదుట
　యింటిలోని గొల్లెతల నెంగిలి సేసె
　దంట తనమేఁటికే తగ వీనితో
　దంటల సురసతులఁ దానె లోఁగొనఁడా ‖ ఇన్ని ‖

ఆఱఁడిఁ బెట్టకువే యీతనిని
　ఆఱఁడి గొల్లెతలను ఆండ్లఁజేసె
　మీఁటి శ్రీవేంకటేశుఁడు మెచ్చి నిన్నేలె
　మీఁటినవారే కారా మెలుఁత లీతనికి ‖ ఇన్ని ‖ 478 ‖

## రామక్రియ

బాపు బాపు నేఁజేసిన భాగ్య మెట్టిదో
　తాపి కత్తెఁ జేసి నన్ను దయఁ జూచితివిగా ‖ పల్లవి ‖

మనసొక్కటాయ నేఁడు మగువా నీవును రాఁగా
　యెనసి వుండిన పొందు కిది గురుతు
　ననిచిన వారము నాకు నీకుఁ బోవునా
　ఘనమై యెక్కుడు వస్తే కైకొందువుగాక ‖ బాపు ‖

నమ్మితి నీమాఁటలెల్లా నాయింట నీపెఁ బెట్టఁగా
　యిమ్ములఁ గొంకుదేరుట కిది గురుతు
　సమ్మతైన మనలోన సరవులు దప్పీనా
　వుమ్మడివారు వచ్చితే వూరడింతుగాక ‖ బాపు ‖

యెక్కువ భూసతిఁ గూడి యిటు నన్ను మన్నించితి-
విక్కడ శ్రీ సతి వొట కిది గురుతు
దక్కితి శ్రీవేంకటేశ తప్పులు మనకు లేవు
మిక్కటపు యీపెరతి మెత్తువు గాక ॥ బాపు ॥ 479 ॥

## మధ్యమావతి

అంతా నీ మహిమే ఆఁటది యేమి యెఱుఁగు
పొంతల మమ్మెంత నీవు పొగడేవయ్యా ॥ పల్లవి ॥

నీ వెవ్వతె మన్నించినా నేరుపు గలమ్మ యీపె
భావించి చూచితేనే పట్టముదాపె
కైవసము నీవైతేనే కలికితనాలదాపె
పోవులుగ మమ్ము నేమి పొగడే వయ్యా ॥ అంతా ॥

సెలవి నీవు నవ్వితే సేసిన పుణ్యము దాపె
పలికితే నన్నిటాను బలిమి దాపె
సలిగె యిచ్చినప్పుడే సర్వానకుఁ గర్త యీపె
పొలసి మమ్మె యెంత పొగడేవయ్యా ॥ అంతా ॥

కాఁగిట నీవు కూడితే కలిమిగలది యీపె
ఆఁగి కూడితి శ్రీవేంకటాధిప నన్ను
పిఁగి యీపె*ననిందాఁకా పేరుకొంటి నన్ను నేనే
పోఁగెత్తి యట్లా నన్నుఁ బొగడేవయ్యా ॥ అంతా ॥ 480 ॥

## మాళవిగౌళ

నావద్ద నున్నాఁడు వీఁడె నావిభుఁడు
చేవ మీరఁ జూడరమ్మ చెలులాల మీరు ॥ పల్లవి ॥

---

* అని + ఇందాఁకా

జాలిఁ బడి వూరఁగల సవతు లెంత చెప్పినా
యేలిన రమణునకు యేల పొయ్యీనే
చాలా నాపై బత్తిగల సరసుఁడు నాసొమ్మే
కుఃఠ సతులకు కష్టగుణమే దక్కెను ॥ నావ ॥

చూడఁ జాలని వారలు సూటి యెంత దప్పించినా
వేడుక నాపతి యేల విడిచీనే
వాడిక గల మగఁడు వసము నాకైనాఁడు
వాడ సవతులకు నెవ్వగలే నిలిచెను ॥ నావ ॥

పొద్దువోని మగువలు బోధించి పెనఁగినా
వొద్దనున్న యీతఁడేల వోరసేసీనే
గద్దరి శ్రీవేంకటాద్రి ఘనుఁడు దా నన్నుఁ గూడె
బద్దుల కాంతలకు వుప్పతింపులే మించెను ॥ నావ ॥ 481

రేకు 1781 ఆహిరినాట

ఏమని నీకు మొక్కే నిటువంటిదాన నేను
ఆముకొని యప్పటిని ఆదరించేవు నన్ను ॥ పల్లవి ॥

కదిసి నీదేవినైన గర్వాన నే నాడితిని
యెదురు మాటలు నీతో యెన్నియైనాను
మదన పరవశాన [1]మరిఁ గొన్ని సేసితి
చెదరి యెవ్వరితోడాఁ జెప్పరాని చేఁతలు ॥ ఏమ ॥

మన్నించేవనుచు నీతో మందెమేళాల నవ్వితి
సన్నల చాయల నిట్టె సరిబేసికి
చిన్నదానఁ గనక నీసిగ్గులు విడిపించితి
కన్న వారికెల్లా నవి కమ్మని గురుతులు ॥ ఏమ ॥

---

1 'మరియుఁ'లో 'యు' లోపించిన రూపము కావచ్చు

కొసరి నీవు గూడిన కూటాలకు *నే నొక్కితి
పసిమి నీ చెక్కులు *నేఁ బలుమారును
యెసఁగితి శ్రీవేంకటేశ నీకీడు గనక
రసికులకెల్లా నవి రహస్యపు కతలు ॥ ఏమ ॥ 482 ॥

## తెలుఁగుఁగాంబోది

నీవిచ్చిన సలిగెనే నిన్ను నే నింత దూరితి
కావరించ కంత నీవు గరడిలోపలను ॥ పల్లవి ॥

తప్పులేదు నీయందు తగిన జాణఁడవే
చప్పనాయ మోహము సారె నే రాఁగా
వుప్పుఁ జేసి ఇంచుకంత వుండరాదా ఇంటిలోన
ఇప్పుడేల పదరేవు యెదురైన వేళను ॥ నీవి ॥

వెగటు లేదు నీ యందు విభుఁడవు నాకు నీవే
మొగచాటాయ నారతి ముంచి పొందఁగా
పగటుఁదమి వుట్టించె పవళించరాదా యిఁక
మొగమేమి చూచేవు మొగసాల లోనను ॥ నీవి ॥

కొఱత లేదు నీవల్లఁ గోరి శ్రీవేంకటేశుఁడ
తఱితోఁ దరితీపాయ దమి రేఁచఁగా
గుఱిగాఁ గూడితి విట్టె గుట్టుతోడ నుండరాదా
మఱఁగేల దోమతెర మంచము లోనను ॥ నీవి ॥ 483 ॥

## పాడి

ఆపె ఎఱఁ గనిదా అంత నీవు సేసే మేలు
తీపుల నీమోవి ఇచ్చి తిద్దుకొనరాదా ॥ పల్లవి ॥

---

* ఇవి పునరుక్తులు. ఇట్టి వక్కడక్కడ గలవు
* ఇవి పునరుక్తులు. ఇట్టి వక్కడక్కడ గలవు

కూరిమిగలదానికి కోపము గలితేనేమి
చేరి యందులోనే చవి చేసుకోరాదా
నీరాక కెదురు చూచి నిన్నుఁ దిద్దితే నేమి
గారవించి నవ్వు నవ్వి కాఁగిలించరాదా ॥ ఆపె ॥

మనసిచ్చినదానికి మందెమేళమైతే నేమి
చెనకి యదె చవిచేసుకోరాదా
చనవు నీ వొసఁగఁగా జంకించితే నేమి
తనివంది రతుల చిత్తరిఁ జేయరాదా ॥ ఆపె ॥

పాయకున్న దానికి పంతమాడుకొంటే నేమి
సేయరాని సేవ చవిచేసుకోరాదా
యీయెడ శ్రీవేంకటేశ యింతి నిట్టె కూడితివి
కాయముపై కళలంటి కడు మెచ్చరాదా ॥ ఆపె ॥ 484 ॥

## సౌరాష్ట్రం

నీ సుకము చెరుతురా నీవారము
లాసి తనంత వచ్చేది లాభము గాదా ॥ పల్లవి ॥

బందు బందుగా నెవ్వతె వట్టి నిన్నుఁ దీసినాను
కొండవలెఁ జూచుకుండే కొలువులోను
వెండియు నెవ్వతె వచ్చి వెంగెమాడి తిట్టినాను
అండ వూరకుండే వింటా నదె నా సేవ ॥ నీసు ॥

పట్టి నిన్నెవుతె తన పనులు సేయించినాను
పొట్టఁ బొరుగున నుండే పొగడుతాను
రట్టడిరతి కెవ్వతె ఇట్టె నిన్నుఁ దీసినాను
అట్టె బయము దెలిపే నదె నా సేవ ॥ నీసు ॥

విందు నీ కెవ్వతె వచ్చి వెంటనే చెప్పినాను
అందు నీ పొత్తుల నుండే నారగించఁగా
కందువ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
అందరికి నప్పణిచ్చే అదె నా సేవ ॥ నీసు ॥ 485 ॥

## నాదరామక్రియ

ఎఱఁగను మీరింతేసి [1]యిద్దరిమాలో సన్నలు
వొఱపులు మాపనేల వున్నట్టేవుండరే ॥ పల్లవి ॥

దయగల విభనికి తరుణులెల్లా సరే
నయము రేఁచుక మీరు నవ్వేరు గాని
క్రియ దెలుసుక నేము కినియ మాతనితోడ
ప్రియముగల యాటది బిరుదులాడునా ॥ ఎఱఁ ॥

సారమైన జాణనికి సరసమెల్లా సరే
నేరుపులు పచరించి నిక్కేరు మీరు
తారుకాణై వుండఁగాను తప్పు లెంచ మాతనిపై
యీరీతి లోనైనచెలి యిచ్చాడక మానునా ॥ ఎఱఁ ॥

శ్రీవేంకటపతికి చెణకులెల్లా సరే
వావులు సేసుక మీరు వదిఁ(డిఁ?) బొందేరు
యీవేళ నన్నుఁ గూడె యితఁడు మీరు మెచ్చను
కైవసమయిన యింతి కదుఁ దమకించునా ॥ ఎఱఁ ॥ 486 ॥

## శ్రీరాగం

ఇందాఁకా నిన్ను దూరితి నెఱఁగక రమణుఁడ
గొందిఁ బాసికూడిన కూటమేకా చవులు ॥ పల్లవి ॥

---

[1] 'మా యిద్దరిలో సన్నలు' అనుట సహజము

విరహతాపము మాన్ప విచ్చేసితి వీడ విట్టె
వొరసితే నా కిదెంతవుపకారము
సరి నీవు నవ్వితేను చల్లనారె నా కోపము
మరుగఁ జేసిన యీ మన్ననెంత నాకు ‖ ఇందాఁ ‖

అలపెల్లాఁ దీర నీచేయి అట్టె నాపై వేసితివి
వొలిసిన నా కిదెంతవుపకారము
పలికి మోము చూచితే పల్లవించె నా మనసు
కలకాలముఁ జేసిన కరుణెంత నాకు ‖ ఇందాఁ ‖

విడువక యిపుడు శ్రీవేంకటేశ కూడితివి
వొడలికి నా కిదెంతవుపకారము
అడియాల మిచ్చితివి అందరిలో యెంత కీర్తి
వుడివోని వలపుల కుంకువాయ నాకు ‖ ఇందాఁ ‖ 487 ‖

రేకు 1782 మాళవిగౌళ

వద్దివారి నెఱఁగదు వలపులు నీమీఁద
వుద్దండానకే చల్లే(ల్లీ?)వుదుటుగా యిది ‖ పల్లవి ‖

చూపులు నీపై వంచి సోయగపుటెలుఁగున
తీపులుగా మాఁటలాడీఁదిట్టఁ గా ఇది
కోపగించుకో దెంతైనా కొసరి కొసరి నిన్ను
రాపుగా జోలిఁ బెట్టీని రవ్వగా ఇది ‖ వద్ది ‖

సెలవుల నిన్ను నవ్వి చేయి మాఁటుసేసుకొని
లలి నీకు నెత్తిం (త్తి?)చ్చీ లందుగా ఇది
పిలువకే తా వచ్చి పిరుఁదులు నిన్ను నెంచి
చలివాపీ రతులకు జాణగా ఇది ‖ వద్ది ‖

గక్కనఁ బైఁ జేయివేసి కలసీ ని న్నింతలోనె
మొక్కుమొక్కి ఇచ్చలాడీ ముగ్ధగా యిది
యిక్కడను శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
పెక్కుసుద్దు లడిగీని పెద్దగా యిది ॥ వద్ది ॥ 488 ॥

## కాంబోది

ఇంకనేడ సుద్దులు యీడేరితి విన్నిటాను
వంకలొత్తఁ బోతేను వంగుదువా సూటికి ॥ పల్లవి ॥

చన్నుల కాఁకల నొత్తి చలివాపె నీకు నాపె
యెన్నికలు మీరి సేయకిఁక లోఁగేవా
నిన్న మొన్నటివారము నేఁడు మాకు వెఱచేవా
కన్నుల జంకించిన మాకల్ల ఇంతేకాక ॥ ఇంక ॥

కందువ చేఁతల మోవి కాయఁలు గాపించె నాపె
గొంది మోవిపండ్ల చవులు కోరకుండేవా
మందలించి కన్నెలము మా దిద్దుబడి వచ్చేవా
సందడించి పోరేటి మాసట లింతే కాక ॥ ఇంక ॥

కలసిన రతులచే కళలు రేఁగించె నాపె
పలుమారు మాతో సాము బడలించీనా
కులికి శ్రీవేంకటేశ కూడితివి నీవారము
అలమి పాయునిమాలో నాస లింతేకాక ॥ ఇంక ॥ 489 ॥

## బౌళి

అన్ని బిన్నాణాలు నేర్తు వవునే నీవు
మన్నించిన జాణనికి మరి కోపమున్నదా ॥ పల్లవి ॥

వూఁకొనని మాటలకు వుత్తరాలు చెప్పేవు
   వీఁకల నాతఁడు నీకు వెఱచునటే
కాఁకల చూపులకేల కప్పురాలు నూరేవే
   వాఁకమైన సరసుఁడు వద్దనీనా నిన్ను ॥ అన్ని ॥

మనసులో నవ్వులకు మరి వొడ్డించుకొనేవు
   ఘనుఁ డాతనిచిత్తము కంటినటవే
పొనుఁగ నీమోవి వేల బోనాలు వండేవు
   తనిసిన ప్రాణేశుఁడు తప్పులు వట్టీనా ॥ అన్ని ॥

కాఁగిటిలో రతులకు గాదెలు గట్టుకొనేవు
   ఆఁగి శ్రీవేంకటేశుఁడు అచ్చునటవే
వీఁగక యీతనిఁ గూడి విందు వెట్టేవు వలపు
   చేఁగదేరెను ధీరుఁడు సిగ్గులు వడీనా ॥ అన్ని ॥ 490 ॥

ఆహిరి

కక్కసించనేఁటికి ఘనుఁడ నీ వప్పటిని
   చెక్కు నొక్కేవు నీమాఁట సేయ ననేనా ॥ పల్లవి ॥

చేరువఁ గూచుండితివి చేయిపైఁ జేయి వేసేవు
   గారవించే వన్నిమేళ్లు గంటి నీవల్ల
సారపుఁగాంతలు చల్లే సణఁగుల కేమిసేతువు
   వూరట నీతోడి పొందు వోపననేనా ॥ కక్క ॥

వీడెము నా కిచ్చితివి వేడుకలు రేఁచేవు
   పాడితోడ నా వలపు పండె నీవల్ల
వూడిగపు నీకాంతల వుప్పతింపుల కేమందు
   మేడెపు నీరతులకు మెచ్చననేనా ॥ కక్క ॥

కలసితి విదె నాపైఁ గప్పురాలు చల్లేవు
నలువంకఁ దని వందె నామనసు
నిలిచి శ్రీవేంకటేశ నీగాగి నెట్టు నమ్మింతు
కొలఁది మీరితే నన్నుఁ గొరఁ తెంచేనా ॥ కక్క ॥ 491 ॥

## సాళంగనాట

ఎఱఁగదా నీమనసు యేల విన్నపము సేయ
యెఱుకసేసేవు మాతో నింతేసి వలెనా ॥ పల్లవి ॥

పంతమిచ్చి (చ్చే?) ఆఁడువారె పొలుమాలితేఁగనక
యెంత చెప్పినాఁ జెల్లు యేతులు నీకు
వంతుతో నీవద్దనుండి వాసికే సేవలు సేసే
అంతరంగమైన మాపై నంతేసి వలెనా ॥ ఎఱఁ ॥

సిగ్గుగలవనితలే చేతులెత్తి మొక్కితేను
వెగ్గళించ నమరును వేవేలు నీకు
యెగ్గులుఁ దప్పులుఁబట్ట కిచ్చకము నీకు నాడే
అగ్గమైన మాపైనే అంతేసి వలెనా ॥ ఎఱఁ ॥

మానాపతి మగువలు మతి గుట్టు విడిచితే
నీ నేరుపులే యంతటా నిలుచు నిందు
పూని శ్రీవేంకటేశుఁడ భోగించితి నీకాఁగిట
ఆనుకొన్న మాపైనే అంతేసి వలెనా ॥ ఎఱఁ ॥ 492 ॥

## నాదరామక్రియ

మొదలనే చేతులెత్తి మొక్కినార మల్లనాఁడె
పదిఁ బదిగా నిఁక బతికించవయ్యా ॥ పల్లవి ॥

యెంత నీతో నలిగినా నేమీననక పోదు
వంతుకు నీవు వచ్చితే వద్దనఁ జాల
యింత మెత్తని మనసు యింతిని నిన్నేమిసేసే
పంతము నీ కిచ్చితిని పాలించవయ్యా ॥ మొద ॥

ఆలికిని మగనికిని ఆస లెప్పుడుఁ దీరవు
మేలిమి మాఁటాడితేను మెచ్చక మాన
తాలిమి మొగదాకిరి దానను నిన్నేమి సేసే
కాలమెల్ల నమ్మితిఁ గరుణించవయ్యా ॥ మొద ॥

యిదివో నీవు గూడితి వియ్యకొనకుంటేఁ బోదు
అదన శ్రీవేంకటేశ అవుఁగాము లెంచ
యెదుట నీ కిచ్చలాడి యిఁక నిన్ను నేమి సేసే
చదురుఁదనాల నిఁక చనవియ్యవయ్యా ॥ మొద ॥ 493 ॥

రేకు 1783 ముఖారి

ఇల్లు మంచము నున్నది ఇద్దరము నుండే మీద
తెల్లమిగ నాకొసరు దిద్దుక రారాదా ॥ పల్లవి ॥

ఆపెమోము చెమరించె నట్టె నీమై చెంగలించె
యేపున మీమోహాలు మాకేల దాఁచేరు
వోపిక నే మిందరము వుండితే నీకేమాయు
లోపలికిఁబోఁ ఇ అట్టె లోఁగొని రారాదా ॥ ఇల్లు ॥

తప్పక చూచీ నాపె తలఁపు నీ కందున్నది
ఇప్పుడు మీమోహాలు మాకేల దాఁచేరు
చెప్పక నే మెఱిఁగితే సిగ్గులు మీకేల వచ్చె
దుప్పటి మఱుఁగువట్టే తొక్కరాదా పాదము ॥ ఇల్లు ॥

సెలవి నాపె నవ్వే చే సన్నలు సేసితివి
యలమి మీ మోహాలు మాకేల దాఁచేవు
తొలుతే శ్రీవేంకటేశ దొమ్మిగాఁ గూడితి మిట్టె
మలఁగుపై నున్న దాపె మాటలాడరాదా ॥ ఇల్లు ॥ 494 ॥

## పాడి

ఇయ్య కొనవోయి మాట యేమోయి
నెయ్యపు నెచ్చెలులకు నీరాయ మనసులు ॥ పల్లవి ॥

మొకము చూడఁగానే మోహము చల్లీ నాపె
యెకసక్కేలాడేవు యోమోయి
చికుర భరము వంచి సిగ్గు వడె నంతలోను
సుకానఁ జూచువారికి చురుకనె గుండెలు ॥ ఇయ్య ॥

సింగారించుకొనఁగానే చేయివట్టి తీసీనాపె
ఇంగిత మెఱఁగలేవు యేమోఇ-
ముంగిట నివ్వెరగంది మోనన నున్న దిందుకు
సంగడినున్నవారికి జల్ల ననె మేనులు ॥ ఇయ్య ॥

కందువ నీ కుండఁగానే కాఁగిటఁ గూడె నాపె
ఎందరిని భ్రమఇంచే వేమోఇ
అంది శ్రీవేంకటేశుఁడ అట్టె నన్నుఁగూడితివి
ముందువెనకవారికి *మూఁడేశాయ మూఁపులు ॥ ఇయ్య ॥495॥

## లలిత

వట్టి వెఱపేలా నీకు వద్దనేనా నే నిన్ను
పొట్టఁ బొరుగు పోరచి పుచ్చుకొనరాదా ॥ పల్లవి ॥

---

* మూడేసి + అయి

మలపి నీతో నాపె మాట చెప్పఁ దిరిగీని
వెలయు లోనికిఁదీసి వినరాదా
చలపట్టి మాతోడి సరసా లెందువోయీని
వెలినున్న వలపులు వెలుచుకోరాదా ॥ వట్టి ॥

ననుపున నాపె నీతో నవ్వేనంటాఁ బూఁచీని
మనసొగ్గి వేళయిచ్చి మన్నించరాదా
చెనకేటి మాచేతిసేవ లెందువోయీని
పెనగొనే ముచ్చటలు పిరి దూరరాదా ॥ వట్టి ॥

యింతలో నిన్నాపె గూడి యేతులకుఁ బొదిగీని
*చెంతల నా చనవులు చెల్లించరాదా
వింతగా శ్రీ వేంకటేశ వెస నన్నుఁ గూడితివి
బంతి చుట్టరికములు పనిగొనరాదా ॥ వట్టి ॥ 496 ॥

## వేళావళి

మరిగితిమి గనక మనభాగ్యమే యింతా
పరి పరి విధముల పంటవండె వలపు ॥ పల్లవి ॥

చెవి సోఁకె నీ మాట సెలవికి నవ్వు వచ్చె
వివరించఁ బోతేను వింత వింతలు
రవళి మనపొందులు రవ్వలాయఁ బొరుగెల్లా
పవళించే ఇంటిలోనే పంటవండె వలపు ॥ మరి ॥

కన్నులనంటె నీరూపు కాయమెల్లాఁ జెమరించె
పన్ని చూపఁబోతేను బట్టబయలు
పన్నల మనమాటలు చలివాపె నిందరిలో
పన్నీటికాలువలఁ బంట వండె వలపు ॥ మరి ॥

---

* చెంతలన్ + ఆచనవులు

చేతులఁ జిక్కె నీ రతిసిగ్గులు పలచనాయ
  ఆతుమ దలఁచుకొంటే ఆనందాలు
ఘాతల శ్రీవేంకటేశ కలసితి మిద్దరము
  పై తరవు తమకాన పంట వండె వలపు ॥ మరి ॥ 497 ॥

వసంత వరాళి

నెరజాణ విన్నిటాను నేరుచుకొమ్మీ
  వొరపైన సరసాలు కుంకువ సొమ్మీ ॥ పల్లవి ॥

కలికి నీకు నంపిన కప్పురపుఁ బలుపులు
  చలివేఁడి మోహాలకు చాకిరి సుమ్మీ
అలరి మాచేత నీకు నంపిన యెడమాఁటలు
  తలపోఁత ధనానకు దాఁపిరము సుమ్మీ ॥ నెర ॥

పడఁతి నీకు నంపిన బంగారు సుర టిది
  అడియాలపు రతుల కాసలు సుమ్మీ
వొడలిపై వ్రాసి నీకు వుత్తరాలుగా నంపె
  వడిగొన్న సిగ్గులలో వక్కణిది సుమ్మీ ॥ నెర ॥

యీవేళ నింతియంపిన యింద్రనీలపుంగరము
  భావపు నీ కూటమికి ప్రాణము సుమ్మీ
వావిరి శ్రీవేంకటేశ వచ్చి నిన్ను సతి గూడె
  మోవుల మీ తేనెలు చిమ్ముల విందు సుమ్మీ ॥ నెర ॥ 498 ॥

గౌళ

ఎఱఁగమా మీరాజస మింతకతొల్లి
  మఱఁగులు మాని నాతో మాఁటలాడరాదా ॥ పల్లవి ॥

మొగము చూచి నేఁడు మొక్కించుకో నెంత లేదు
నగ వెంత లేదు నీకు నలినాక్షితో
తగ నీకు నాపెకును దగ్గరి వచ్చిన యట్టి-
మగువను నాతో గొంత మాఁటలాడరాదా ॥ ఎఁఱఁ ॥

వేడుక నాపెచేఁతకు వెరగంద వెంత లేదు
యీడు జోడుగాఁ బెనఁగ నెంత రేదు
కూడితిరి మీరిద్దరు గురియై నే నింతలో
మాడలు రాలఁగ నాతో మాఁటలాడరాదా ॥ ఎఁఱఁ ॥

చంచుల సన్నలుసేసి చనవియ్య నెంత లేదు
ఇంచు కించుకే కొసర నెంత లేదు
కొంచక శ్రీవేంకటేశ కోరి నన్ను నేలితివి
మంచముపైనే నాతో మాఁటలాడరాదా ॥ ఎఁఱఁ ॥ 499 ॥

రేకు 1784 గౌళ

ఏమి గట్టుకొంటివే ఇంతేసికుచ్చితాలను
నేమపు మాతమకాలు నించనీరాదా ॥ పల్లవి ॥

మెలుపున నీ యెమ్మెరే లెరసేవు పలితోడ
చెలఁగి మా విన్నపాలు సేయనీరాదా
అలరి యీవేళనే అడ్డాలు పాలసేవు
సొలసి కన్నులఁ గొంత చూడనీరాదా ॥ ఏమి ॥

బయలు పడ నతని పరాకులే పేసేవు
నయమున మమ్ముఁ గొంత నవ్వనీరాదా
నియమించి ఆపోదాన నీవే కొంగువట్టేవు
రయమున నావద్దికి రానీరాదా ॥ ఏమి ॥

వూరకె నీవిభుఁడంటా వూడిగేలు సేసేవు
కూరిమి నాచేత సేవ గొననీరాదా
యీరీతి శ్రీవేంకటేశుఁ డీతఁడిట్టె నన్నుఁగూడె
గారవాన నామేలల్లాఁ గననీరాదా ॥ ఏమి ॥ 500 ॥

## సౌరాష్ట్రం

ప్రేమము నాపైఁ బూసేవు పెద్దరికము సేసేవు
యేమయ్య నాయకుఁడ నీ హృదయ మెఱఁగను ॥ పల్లవి ॥

చనవు లిచ్చినవారు సరసము లాడఁ జెల్లు
మనసు లెనయువారి మాఁటలు చెల్లు
ఘనమోహములవారి గబ్బితనములు చెల్లు
యెనసి నే నిందులో నీకెవ్వరో యెఱఁగము ॥ ప్రేమ ॥

సిగ్గులు యెంచనివారు సేసినదల్లా నమరు
వెగ్గళించి వున్నవారి వేడు కమరు
బిగ్గెఁ గాఁగిలించువారు పెనఁగినంతా నమరు
యెగ్గులేదు ఇందులో నీకెవ్వరో యెఱఁగము ॥ ప్రేమ ॥

వావిగలమేనవారు వచ్చి కాలు దొక్కఁదగు
చేవ మీరినవారు మెచ్చితేఁ దగును
శ్రీవేంకటేశ్వరుఁడ చేరి నన్నుఁ గూడితివి
యీవేళ నే నిందరిలో యెవ్వరో యెఱఁగము॥ ప్రేమ ॥ 501 ॥

## బౌళి

అనుమాన మిఁకనేల అంటెవచ్చె నీవేళ
వానరి ఇట్టె వద్దనుండవయ్యా ॥ పల్లవి ॥

కోపమెల్లాఁ జల్లనారె కూరిమికి నోరూరె
 రాపులఁ బెట్టక యిట్టె రావయ్యా
తీపులు మోముల నిండె దిష్టమైన వలపు పండె
 యేపున నీచేత విడె మియ్య వయ్యా ॥ అను ॥

సెలవుల నవ్వు వచ్చె చెక్కుళ్లఁ జెమట హెచ్చె
 చెలరేఁగి మా మొక్కులు చేకొనవయ్య
నిలువు నివ్వెరగందె నీకు నా విన్నపమందె
 పిలిచి రతిఁ జొక్కించేఁ బెనఁగకువయ్యా ॥ అను ॥

చనుల [1]చంద్రులు నిక్కె సమరతు లివె దక్కె
 మనసెల్లాఁ గంటి మిఁక మన్నించవయ్యా
ననిచె శ్రీవేంకటేశ నాకు నీకుఁ బోదిఁక
 యెనసితి మిద్దరము యిరవుకోవయ్యా ॥ అను ॥ 502 ॥

వరాళి

ఇంతటఁగాని యెఱఁగ వేమిసేతు నీ బుద్ది
 పంతపు నీగుట్టు నేఁడు బయటఁబెట్టితిని ॥ పల్లవి ॥

వలపు పేరఁబెట్టి వాసి తచ్చి చల్లసేసి
 కొలుచుకు నీకు నమ్మే గొల్లెత
పిలిచినా నెఱఁగవు పేరుకొని నే నిన్ను
 కులికి యెచ్చరికగా గోర నిమ్మాఁదితిని ॥ ఇంత ॥

కాఁకల నెయ్యి గాఁచి గసివెట్టీ సారె సారె
 కూఁకటపాయపునీకు గొల్లెత

[1] 'చంద్రులు' ఇక్కడ మహద్వాచకముగాదు. చంద్రాకారమైన నఖక్షతములు. కావున 'నిక్కె' క్రియ ఏకవచనమైనది.

మాఁకువతె నున్నాఁడవు మన సాపె మీఁదఁ బెట్టి
సోఁకించితిఁ బల్లు నీ సోఁకు మోవి నిందుకు ॥ ఇంత ॥

నిండురతిఁ దరివట్టి నీకె వేల్పులకు మొక్కి
కొండలవంటి కుచాల గొల్లెత
అండనె శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
గండి బొమ్మ జంకెనల ఘాతలు సేసితిని ॥ ఇంత ॥ 503 ॥

## కాంబోది

ఇందరివలెనా నీ యిల్లాల నేను
కుంది నీవు తలవంచుకోకుమీ ఇఁకను ॥ పల్లవి ॥

నీ మనసే పట్టి నేను నెరవేరుదుఁగాని
కైమీరి చేఁతలు సేసి గయ్యాళించను
మోమోటాన నీకు నే మొక్కులే మొక్కుదుఁగాని
వాములైన పంతాలను వాఁటాలు సేయను ॥ ఇంద ॥

యెంత సేసినా నీకు నిచ్చకమాడుదుఁగాని
వింతవారివలె నీపై వేగిరించను
మంతనాన మరి నేను మనవి చెప్పుదుఁగాని
కొంతము లెగరవేసి గురులు సేయను ॥ ఇంద ॥

చనవు సేసుక మోవిచవులు నేఁ జూతుఁగాని
వెనకటి సుద్దులకు వెంగెమాడను
ఘనుఁడ శ్రీవేంకటేశ కలసితి మిద్దరము
పనులెల్లాఁ జూసి నిన్నుఁ బైపై ఁబట్టు సేయను॥ ఇంద ॥ 504 ॥

## శ్రీరాగం

నేనంత నిష్ఠూరిఁ గాను నీ యెడకు
కానున్న పనులే నీపై గట్టియాయఁ జుమ్మీ ॥ పల్లవి ॥

చిత్తములోని దాన నీవు చెప్పినట్టు సేతు
చూచి చూచి నిన్ను నెట్టు సోఁకనాడేను
యేచి నీవు పట్టపగ లీపె నీవు నున్నందుకు
రా చిలుకలే మిమ్ము రవ్వసేసెఁ జుమ్మీ ॥ నేనం ॥

తగులైనదాన నీకు తపము సేయుచుందుదు
వెగటుగ నీతో నేఁడు వెంగెమాడేనా
జిగి నాపెతో నీవు సేసిన సన్న లివ్వల
పగటునద్దము నిదె పట్టి యిచ్చెఁ జుమ్మీ ॥ నేనం ॥

కూడిన కాఁగిటిదాన కోరి నీ కిచ్చ లాడుదు
వాడిక రతుల నిన్ను వంచుకొనేనా
యీడనె శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను
వీడెపు నీ మోవి వెల్లా విరిసేసెఁ జుమ్మీ ॥ నేనం ॥ 505 ॥

రేకు 1785 ఆహిరినాట

వద్దు వద్దు నాతోను వట్టి యెమ్మెలు చూపను
బుద్దులకు లోనై నీ పొంతనే వుందానను ॥ పల్లవి ॥

ఆపలనేల పెట్టేవు ఆయములేల ముట్టేవు
సేసినట్టెల్లా నీ చేఁతకు లోను
వేసాల కొకరివలె వెరపించుకొన నేర
యీసులేక ఇదివో నీ ఇంటిలో నుందానను ॥ వద్దు ॥

యేఁటికి నవ్వు నవ్వేవు యెగసక్కె లేలాడేవు
మాఁటమాత్రమున నే నీమతిలోదాన
పాటించి యొకతెవలె పచ్చి సేయ నేనేర
చాటున నీపాదాల పరుస నుందానను ॥ వద్దు ॥

గోరనేల గీరేవు కొంగువట్టేల తీసేవు
కేరుచు నెప్పుడు నీకాఁగిటిలోదాన
చేరి నన్నుఁ గూడితివి శ్రీవేంకటేశ్వర నేఁడు
యీరీతి నీ పచ్చడము యిక్కువ నుందానను ॥ వద్దు ॥ 506 ॥

## తెలుఁగుఁగాంబోది

నాయకుఁడే ఇంతసేసె నా మోహము
పాయరాని భాగ్యముల పంతపు నామోహము ॥ పల్లవి ॥

చవులుగా నీతోను సరసము లాడించె
నవకపువిధముల నా మోహము
చివురువంటి నాచేతు లెత్తి మొక్కించె
సవరఁదనముల నా జవ్వనపు మోహము ॥ నాయ ॥

తగిన విరహవేళ దయ వుట్టించెను నీకు
నగవు సమేళముల నా మోహము
మగటిమి నీచేతి మన్ననలు చేకూర్చె
నిగిడి నామతిలోన నిండుకొన్న మోహము ॥ నాయ ॥

రయమున నీ కాఁగిటిరసములు గురియించె
నయగారితనములనామోహము
నియతి శ్రీవేంకటేశ నిన్ను నాతోఁ గూడించె
ప్రియముల నేపొద్దుఁ బెనఁగే నా మోహము ॥ నాయ ॥ 507 ॥

## సామంతం

చెప్పఁబోతే యీమర్మము సిగ్గు ముంచీని
పిప్పి దారతె నీవల్ల ప్రియురాండ్ల కెల్ల ॥ పల్లవి ॥

మంచిమాట లాడుతానే మనసు చొక్కించి నీచే
　　లంచము గొనెఁగా మోవి లలన
యెంచ నేమున్నది ఇఁక యెంగిలిసేసె నిన్ను
　　కంచము పొత్తు గలసె(పె?) కాంతలకు నెల్లను ॥ చెప్ప ॥

కన్నులను నవ్వుతానే గందము వూసిన మేన
　　చన్నుల ముద్ర లొత్తెఁగా సకియ
వున్నవెల్లాఁ జెప్పనేల వొకటెతో భోగించి
　　కన్నెలకెల్లా వడ్డించె కడమదొడమలు ॥ చెప్ప ॥

సంగడిఁ గూచుండుతానే చక్కఁబెట్టుకొమె నిన్ను
　　రంగుగ శ్రీ వేంకటేశ రమణి
పొంగేటి జవ్వనమునఁ బొదిపి నిన్ను గూడి
　　ముంగిట మమ్ముఁగూడించె ముదితలనెల్లను ॥ చెప్ప ॥ 508 ॥

## వరాళి

ఇది నీ పెద్దరికమే యెఱుఁగుకొమ్మీ
　　పదిలానఁ గప్పేది నీ పచ్చడమే నేను ॥ పల్లవి ॥

వెనకకి విభుడ నీవు చెప్పినట్టు సేయఁగాను
　　మునుకొని సవతులు మొక్కఁగాను
నినుపు గర్వముతోడ నీవు వచ్చే దెఱఁగక
　　వొనరి మంచము మీఁద నుందాన నెమ్మదివి ॥ ఇది ॥

చింతదీర నీ సొమ్ములు చేరి నామేన నుండఁగా
　　పంతపు నీపై పదాలు పాడి మెచ్చఁగా
ఇంతట నీవు నమ్మిన దెఱఁగక పరాకున
　　యింతిపైఁ గాళ్లు చాఁచుక యెమ్మెతో నుందానను ॥ ఇది ॥

శ్రీ వేంకటేశ నీవు చేయివేసి నన్నుఁగూడఁగా
భావించి చిలుకలట్టె పలుకఁగాను
యీవలఁ జెక్కునొక్కిన దెఱఁగక నీ మీద
కావిరిఁ జన్నులు మోపి కదు నూఁదె నిపుదు ॥ ఇది ॥ 509 ॥

## దేసాళం

ఇయ్యకోలు సేసే మీఁద నేమి గల్లాను
వియ్యపు సమ్మంధాలవిడె మిందవయ్య ॥ పల్లవి ॥

ముచ్చట లాడేటి వేళ ముద్దులు గురుతుఁగాక
యెచ్చుకుందు లాడుదునా ఇప్పుదు నీతో
ఇచ్చకము సేసితివి ఇంటికి విచ్చేసి నీవు
అచ్చపు మామోవి విందు ఆరగించవయ్యా ॥ ఇయ్య ॥

కన్నుల నవ్వేటివేళ కందువ లంటుదుఁగాక
సన్నల నోరార్తునా సారెకు నీతో
మన్నన నా కిచ్చితివి మరులుగొంటివి నాకు
పన్నిన నా చన్నులఁ గప్పుముఁ గొనవయ్యా ॥ ఇయ్య ॥

రతులఁ గూడేటి వేళ రసము లానింతుఁగాక
తతి దప్పింతునా మరి దాకొని నీతో
కతగా శ్రీవేంకటేశ కలసితి మిద్దరము
మితిమీరి మోహముల మెప్పించు కోవయ్యా ॥ ఇయ్య ॥ 510 ॥

## బౌళి

పట్టినంతే పంతము బలిమిగలవారికి
చిట్టకాలు మానుమాను చెప్పనా నీకును ॥ పల్లవి ॥

చాలునంటే మానరాదా పరసాలు మాతోడ
కాలుదొక్కినందులోనే కానవచ్చెను
వాలుక చూపులు గొంత వంచవలెనా ఇంకా
మేలు మేలనుచు దొల్లె మెచ్చనా నిన్నును ॥ పట్టి ॥

అడిగితేఁ జెప్పరాదా ఆయములైన కతలు
కదు లోలో నవ్వినందే కానపచ్చెను
వొడ లేమి నిమిరేవు వూరకైనా నప్పటిని
గదుసుఁ జన్నుల మతి కరఁగించనా ॥ పట్టి ॥

యియ్యకోలు సేయరాదా యిప్పటి నీ చేఁతలెల్ల
కయ్యము పెట్టనీయందే. కానవచ్చెను
వియ్యపు శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
వుయ్యాల మంచము మీఁద నొరయనా నేఁడు ॥ పట్టి ॥ 511 ॥

## రేకు 1786 శుద్ధవసంతం

ఒద్దు వొద్దు నన్ను నేల వొడఁ బరచేదే మీరు
సుద్దులు చెప్పినంతనే సూడు వాసెనటవే ॥ పల్లవి ॥

నవ్వులేల నిజమానే నాయము నాయమే కాక
రవ్వకాఁడై నన్నెంత రచ్చ వేసీనే
పువ్వులు ముడిచినతల పూరి మోవవచ్చునా
యెవ్వతెఁ దాఁ బొగడినా నేల వినేనే ॥ ఒద్దు ॥

మొక్కులేల తగులౌనే మోహము మోహమే కాక
వెక్కసీఁడై నన్నునేల వెద్దు వెట్టీనే
చిక్కని తేనెల మోవి చేఁదు మేయవచ్చునా
పక్కన సవతికేల పంత మిచ్చెనే ॥ ఒద్దు ॥

వేసటేల సతమౌనే వేడుక వేడుకే కాక
ఆసకాఁడై నన్ను నేల అంటుకొనీనే
బాస ఇచ్చి శ్రీవేంకటపతి నన్ను నిదె కూడె
బేసబెల్లి వారికేల పిరితీసేనే ॥ ఒద్దు ॥ 512 ॥

## రామక్రియ

నాలిసేయ నేమిటికి నాతో నీవు
ఆలరి తనములేల ఆనతియ్యరాదా ॥ పల్లవి ॥

చేతులెత్తి మొక్కఁగాను చిటికనవేలు వట్టి
పాతురాడించిన యట్టు పట్టి తీసేవు
యేతులకు నీచేఁత యెట్టు వలసినా వచ్చు
ఆతుమలోపలిమాట ఆనతియ్యరాదా ॥ నాలి ॥

కానుక నే నియ్యఁగాను గక్కున నా కొంగు వట్టి
సానదిప్పినట్లు దిప్పి సాముసేసేవు
అనుకొన్న యీ నటన లన్నిటికిఁ బొత్తేవుండు
ఐన దయ్యీఁగాని నిజ మానతియ్యరాదా ॥ నాలి ॥

పాదాలు నేఁ బిసుకఁగా పైకొని కాఁగిటఁ బట్టి
సేదదేర నన్నుఁగూడి చెక్కు నొక్కేవు
యీదెస శ్రీవేంకటేశ యిది గుమిత మార్గము
ఆదరించి నీ గుట్టు నా కానతియ్యరాదా ॥ నాలి ॥ 513 ॥

## సామవరాళి

సిగ్గువడ కంత నీవు చిత్తమెఱుఁగుదు నేను
యెగ్గు లెవ్వరెంచినా నియ్యకోలు నేను ॥ పల్లవి ॥

కందువ నావాఁడవై కలిగి నీవుండఁగాను
యెందరినిఁ దెచ్చుకొన్నా నేమాయను
అందుకుఁగా దూరేరు అతివ లిందరు నిన్ను
విందువలె నీమాఁట వినవోప నేను ॥ సిగ్గు ॥

యీడ నా చెప్పినట్టు ఇట్టె నీవు సేయఁగాను
యేడనుండి వచ్చినాను యేమాయను
వాడవారిందరు నిన్ను వడి నిందుకే నవ్వేరు
చూడఁ జాల నిది నేఁడు సోవలుగా నేను ॥ సిగ్గు ॥

ఆయమంటి నీవు నా కాఁగిటిలో నుండఁగాను
యే యింతిచే మొక్కించినా నేమాయను
యీయెడ నన్నుఁ గూడితివి చెలులెల్లా మెచ్చిరి
పాయలేను శ్రీవేంకటపతి నిన్ను నేను ॥ సిగ్గు ॥ 514 ॥

## ముఖారి

పొడగనే నిదె నిన్ను పొలఁతులు వేరె వేరె
అడియాలా లెత్తించే నే వందరిని నీకును ॥ పల్లవి ॥

సెలవి నవ్వుల నిన్నుఁ జేతికి లోఁ జేసుకొన్న-
కలికివో యీపె నీకుఁ గానుకిచ్చీని
మొలక చన్నులు చూపి మోహింపించె నిన్నీసతి
యెలయించె మాటలనే యీ వనిత ॥ పొడ ॥

మోవితేనె చూపి నీచే మొక్కించుకొన్న దీయింతి
కేవల మెప్పుదు తా సాగిలి మొక్కీని
వావులు చల్లె(ల్లి) నిన్ను వలపించె నీ మగువ
పూవుల వేసి నిన్నుఁ బొందెను యీ తరుణి ॥ పొడ ॥

గక్కనఁ గాఁగిటఁ బట్టి కరఁగించె నన్నీకాంత
చెక్కునొక్కి తానే ముందు సేసఁబెట్టీని
యిక్కువంటి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
యెక్కుడైతి నిందరిలో నిందువంక నేను ॥ పొడ ॥ 515 ॥

## దేశాక్షి

చెప్పరాదు నీ సొంపు చిమ్మిరేఁగె వేడుకలు
కప్పురగందిమొగము కానవచ్చెను ॥ పల్లవి ॥

కళలు రేఁగె నీ మోము కాంతఁ దలఁచుకొంటివో
వలనై యాపె యీడకు వచ్చేననెనో
తొలఁగక గవాక్షుల తొంగిచూచెనో నిన్ను
చెలినుండే తనెలుఁగు వినుపించెనో ॥ చెప్ప ॥

పులకించె నీ చెక్కులు పొలఁతి సేస చల్లెనో
కలువరేకులదండ కాను కంపెనో
కొలఁది చన్నులు వ్రాసి గురుతులు వుత్తెంచెనో
పలుమారు నీ మీఁది పదములు వాడెనో ॥ చెప్ప ॥

చెలవుల నవ్వుదేరి చెలి నీలోన నున్నదో
కలసి నీవురముపై కాఁపున్నదో
యెలమి మీరిద్దరును యేలితిరి మమ్మునిట్టె
అలరి శ్రీవేంకటేశ ఆపె బుద్ది చెప్పెనో ॥ చెప్ప ॥ 516 ॥

## శుద్ధదేశి

నీవు సేసినదే చేఁత నీ విందుకు నోఁచితివి
యీవల నవ్వే వారి నెఱఁగము గాని ॥ పల్లవి ॥

విన్నపము సేసినంతా వినీనంటాఁ బలితోడ
యెన్ని సన్నలు సేసేవే యెందాఁకానే
కన్నుల నవ్వేముగాని కాఁతాళించ మిందుకెల్లా
మన్నన నోరుపుగల మగఁడు గలిగెనో ‖ నీవు ‖

వేసరఁడంటా నాతని వేగినంతాఁ బొదిగేవు
ఆస యెంత నీకు గద్దె ఆడఁజాలమే
నీ సూటికి వచ్చినట్టి నేస్తకత్తెలము నేము
సేసవెట్టిన యీతఁడు చేతిలో వాఁడాయనే ‖ నీవు ‖

మొగమోడీ యీతఁడంటా ముంచి చన్నుల నొత్తేవు
యోగసక్యమా యిది యేఁటిదే యింత
తగ శ్రీవేంకటేశుఁడు తానే మమ్ముఁగూడె నేఁడు
తగ వెటిఁగెఁ దా నంత తారుకాణ వచ్చెనే ‖ నీవు ‖ 517 ‖

రేకు 1787 హిజ్జిజి

ఒద్ద నుండి యీవేళ వుత్తరమిచ్చే నేను
పెద్దరిక మాతనిపైఁ బెనచరే యిపుడు ‖ పల్లవి ‖

తలయెత్తి నేఁజూచితే తమకించి నవ్వినాఁడు
తలఁపెల్లా నొక్కటే తనకు నాకు
చెలులాల మీకేమైనాఁ జెప్పెనా అందలిమాట
అలిగివుందాన మీరే అడుగరే యిపుడు ‖ ఒద్ద ‖

సందడి నేఁ దగిలితే చాయలకే లోఁగినాఁడు
ముందు వెనకలు పరే మోహములోన
మందలించి మీ మనసు మఱఁగులు వాపెనా
వుందాన గుట్టునఁ బలి నొరయరే ఇపుడు ‖ ఒద్ద ‖

కాయము నే నొరసితే కాఁగిలించుకొన్నాఁడు
నాయములేల తప్పు నను పైతేను
యీయెడ శ్రీవేంకటేశుఁ డెరిఁగెనా మీ భావము
చేయి మీఁదై వున్నదాన చెలఁగరే ఇపుడు ॥ ఒద్ద ॥ 518 ॥

## లలిత

ఇప్పుడు నీ వేమాడిన యెమ్మెలందువు
చప్పుడు సేయక నుంటే చవివుట్టీ నపుడు ॥ పల్లవి ॥

చలము సాదించవద్దు సవతి మచ్చరమున
చెలువునికి బుద్దులు చెప్పవమ్మా
వలచిన సవతి నేను వద్దనుండే నావేళ
తెలుసుకొందము నీనా తేజమెల్లా నపుడు ॥ ఇప్ప ॥

కుచ్చితము సేయవద్దు గుణము మంకుఁ దనాన
పెచ్చు వెరిగి పతితోఁ బెనఁగవమ్మా
మెచ్చుల నాచనవులు మెరసేను ఆవేళ
కచ్చు పెట్టి నీ నా నేర్పు కనుకొంద మపుడు ॥ ఇప్ప ॥

మనసు చూడఁగవద్దు మాయదారి తనమున
యెనసి విభుని కప్పణియ్య వమ్మా
చెనకి నన్నుఁ గూడెను శ్రీవేంకటేశుఁడితఁడు
నిను మెచ్చి నీకరుణ నించుకొనే నపుడు ॥ ఇప్ప ॥ 519 ॥

## ఆహిరి

ఏల జాగులు సేసేవు ఇట్టె రాఁ గదవయ్య
వేళ గాచుకొని చెలి విన్న వించు మనెను ॥ పల్లవి ॥

చెలరేఁగి బాగాలు చేతఁ బట్టుకుండి నిన్నుఁ
బిలుచుకరమ్మని నీ ప్రియురాలు
పలు ప్రియములు చెప్పి(ప్పె?) పదివేలుగా నీకు
నలువునఁ దనమారు నన్నే మొక్కుమనెను ॥ ఏల ॥

అందముగ సోబనపు టక్షతలు నీకుఁ బెట్టి
విందు చెప్పి రమ్మనె నీ వెలఁది
మందలిం చదుగులకు మదుఁగులు వరచుక
చెంది నీ వెంటఁగొలిచి చేరువ రమ్మనెను ॥ ఏల ॥

కొత్తలుగా మోవి చవిగొందువంటా నిన్నుఁ దన
పొత్తుననుఁ బెట్టుమనె పొలఁతి
యిత్తల శ్రీవేంకటేశ యేలితి వింతలోవచ్చి
మత్తిలి నిన్నే తాను మరిగితి ననెను. ॥ ఏల ॥ 520 ॥

## భైరవి

ఇంటికి రమ్మనవే యెడమాఁట లికనేల
వింటిఁ దన సుద్దులెల్లా వేసాలిఁక నేఁటికి ॥ పల్లవి ॥

చూడఁ జూడ వేడుకాయ సారిదిఁ దన చేఁతలు
యీడ లిందరిలోఁ దను నమనేనే
కోడెకాఁడు మొదలనే గురుతులు మెయి నున్నవి
కూడి సంతోసించేఁగాక కొఱత లెంచేనా ॥ ఇంటి ॥

వండ వండనట్లాయ వలచిన వలపులు
చండిసేసి తను నిఁక సాదించేనా
నిండుదొర తాను మరి నేరుచు మాఁటలెల్లాను
అండఁ బాయకుండేఁగాక అఱడిఁ బెట్టేనా ॥ ఇంటి ॥

వూర నూర నూటలాయ నొద్దికఁ దనమోహము
మేర మీరి ఇఁకఁ దను మెచ్చుకుండేనా
చేరి నన్నుఁ దానె కూడె శ్రీవేంకటేశుఁడు
సారెకుఁబొగడేఁ గాక చదురులాడేనా ॥ ఇంటి ॥ 521 ॥

## పాడి

ఇంకనేల బొంకేవు యింత బాఁతి పడఁగాను
అంకెల నీ వాతని యానతి మీరకువే ॥ పల్లవి ॥

అట్టె పాట పాడి పాడి యంతలో విభునిఁగని
గుట్టుతోడ సిగ్గువడి కూచుంటి వేమే
గట్టిగ వేడుకతోడఁ గడమవి నేనంటా
పెట్టీ దనపై నానలు పెనఁగక పాడవే ॥ ఇంక ॥

నీలోనే నవ్వుతా వచ్చి నెట్టన నాతనిఁ గని
తాలిమిఁ జెలియపొంత దా కొనేవేమే
ఆలించి తా నంతలో ని న్నందుకే వేడుకపడి
వేలకొంగు వట్టి తీసీ చిత్తము రా నవ్వవే ॥ ఇంక ॥

చేరి పవ్వళించియుండి శ్రీవేంకటేశుఁగని
వూరకే లేచి నిలుచు కుండే వేమే
గారవించి వుండుమని కాఁగిలించుకొనీ నిన్ను
సారె నీవాతనితోడ జంటై పవ్వళించవే ॥ ఇంక ॥ 522 ॥

## శంకరాభరణం

ఏఁటికిఁ బరాకు లిఁక నీకు
కోటిసేసు నిదె కోమలి వలపు ॥ పల్లవి ॥

వినవయ్యా నా విన్నపము
మునుకొని నీకిదె మొక్కేనూ
పెనఁగకు పతి నిను( బిలిచీని
యెనయఁ బనులు నీ కెన్నైనఁ గలవూ ॥ ఏఁటి ॥

యియ్యవయా తనవిఁక నాకూ
యియ్యెడఁ గానుక లిచ్చేనూ
చెయ్యార సన్నలు పేసీఁ జెలి
నెయ్యము చూపఁగ నీ కిది వేళా ॥ ఏఁటి ॥

పలుకవయా తప్పక నాతో
నెలకొని వేఁడుకొనే నిన్నునూ
వెలఁది యేలితివి శ్రీవేంకటేశుఁడా
యిల నీపంతము లీడేరె నిపుడూ ॥ ఏఁటి ॥ 523 ॥

రేకు 1788 ధన్నాసి

ఇందాఁకా వేఁగిరింత కిచ్చ నుంటిని
చెందితివిగా ఇట్టె చిత్తగించు నన్నును ॥ పల్లవి ॥

చెనకినవాఁడవు చేపట్టక మానేవా
చనువులు గలుగు దాఁకా చక్కనుంటిని
నిను నెంచి చూచితేను నేరుపరి విన్నిటాను
యెనసి వొరసితివి యిఁకఁ జూడు నన్నును ॥ ఇందాఁ ॥

నవ్వినట్టి వాఁడవు నమ్మించక మానేవా
రవ్వలైన యిందాఁకా రాక వుంటిని
యివ్వల నీ మహిమలు యిందరుఁ దెలిసినవే
జవ్వనమే తరవాయి చక్కఁజూడు నన్నును ॥ ఇందాఁ ॥

కూడినట్టి వాఁడవు గురుతు గాక మానేవా
యీడు చూచుకొన్నదాఁకా యింట నుంటిని
యీడనె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
పొడి పంతములు చేర భావించు నన్నును ॥ ఇందాఁ ॥ 524 ॥

ఆహిరి

నీవు సేసినట్టి మాయో నే వలచిన వలపో
చేవలు మీరి యుండుదు సిగ్గువడ నిపుడు ॥ పల్లవి ॥

అలుగ మనసురాదు అట్టె నీవేమి సేసినా
పిలుతు సారెకు నిన్నుఁ బేరుకొనుచు
తొలఁగ మనసు రాదు దొమ్మి నీవు సేసితేను
నిలుచుందు నీ యెదుట నీచేతికి లోనై ॥ నీవు ॥

వెంగెమాడఁ గొలుపదు వింతలే నీవెట్టుండినా
సంగతిగా నవ్వుదును సరసమాడి
కంగువెట్టఁ గొలుపదు గర్వముతో నీవుండితే
యెంగిలిమోవి యడిగి ఇచ్చకమే సేతును ॥ నీవు ॥

పంతమాడ సొగయదు పైకొని నీవు గూడితే
సంతోసాలే పుట్టింతు సారె సారెకు
ఇంతట శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
మంతనాలే ఆడుదు మచ్చిక దైవారును ॥ నీవు ॥ 525 ॥

లలిత

చెఱకు దీపంటా నేమిసేయువచ్చునే
మఱి మరి విభునితో మారుకు మారే కాక ॥ పల్లవి ॥

మనవి వినీనంటా మాపుదాఁకాఁ జెప్పుదురా
చనవు గలదంటాను సాదింతురా
చెనకనేరుతునంటా చేతిగోరు దాఁకింతురా
యెనసే మగవానితో నెంత కెం(కం?)తే గాక ॥ చెలి ॥

సరసమాడేనంటా సారెకుఁ బెనఁ గుదురా
ఇరవైనదాననంటా నెలఇంతురా
తరితీపు సేసేనంటా దండకు రాకుండుదురా
మరిగినమగనితో మట్టుకుమట్టే కాక ॥ చెలి ॥

కూరిమిగలదంటాను కొసరి పైకొందురా
గారవించెనంటాను కక్కసింతురా
యీరీతి శ్రీవేంకటేశుఁ డిప్పు డిట్టె నిన్నుఁగూడె
కోరి యేలినవానితో మేరకు మేరే కాక ॥ చెలి ॥ 526 ॥

## గౌళ

చేసన్నకే వచ్చి వానిఁ జెట్టవట్టి తియ్యనేల
బాసయిచ్చి నన్ను నేలెఁ బదరకురే ॥ పల్లవి ॥

మక్కువ సేసినవాఁడు మన్నించనేరఁడా
కక్కసించి పతినేల కాకు సేసేవే
నిక్కమాతని మనసు నేనే యెఱుఁగుదును
మొక్కేఁగాక మీరేల మోవనాడేరే ॥ చేస ॥

కన్నులఁ జూచినవాఁడు కరుణించనేరఁడా
సన్నల నాతనినేల సాదించేరే
తన్నుఁదానె వచ్చీఁగాక తగవు దప్పఁ డతఁడు
పన్ని నేనే వేఁడుకొనే పైకొని దూరకురే ॥ చేస ॥

కదియవచ్చినవాఁడు కాఁగిలించ నేరఁడా
యెదుట నున్నవాని నే మెగ్గు లెంచేరే
యిదివో శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁగూడె
వదలక సేవ సేసే వాసిఁ బెనఁగకురే ॥చేస ॥ 527 ॥

## నట్టనారాయణి

చిత్తగించఁ గదవయ్య చెలియ సింగారము
హత్తి నీకు దేవులుగా నన్నిటాఁదగినది ॥ పల్లవి ॥

కుప్పెసవరముతోడ కొప్పువెట్టె విరులతో
ముప్పిరి గీలించె ముత్తెముల పాపట
కప్పులుదేర నొసల గస్తూరి బొట్టమరించె
వొప్పుగా రత్నాలకమ్మ లొనరించె వీనుల ॥ చిత్త ॥

కంకణ సూడిగములు కైకొనె సందిదండలు
కొంకె మెడఁ బదకముహారాలు నించె
పొంకముగ చంద్రగావిపుట్టము ధరించుకొనె
లంకించె నొడ్డాణము బిల్లల మొలనూలును ॥ చిత్త ॥

పెట్టె నందెలుఁ బెండెము బెరయఁ బాదాలను
మట్టెలు మోఁతలతోడ మలయఁగాను
ఇట్టె శ్రీవేంకటేశ ఇంతి నిట్టె యేలితివి
పట్టము గట్టుక నీపానుపుపై నున్నది ॥ చిత్త ॥ 528 ॥

## బౌళి

యెగ్గే తోఁదుగదా యెఱఁగఁ జెప్పఁగదవే
వెగ్గళపు రాజసాన వెలసీని యీతఁడు ॥ పల్లవి ॥

సిగ్గువడి వుండితేను చిత్తమెట్టుండునో యంటా
దగ్గరి కాలు దొక్కితి దగవే కదే
అగ్గమై తలవంచితే నలిగితివ నీ నంటా
వొగ్గి సోఁక నాడితే నుచితమే కదవే ॥ యెగ్గే ॥

సంగడికి రాకుండితే చలమరి వనీనంటా
యెంగిలిమోవి యిచ్చితి యితనే కదే
కంగున మాఁటాడితేను గయ్యాళితనమౌనంటా
రంగు గుబ్బల నొత్తితి యింగితమౌ గదవే ॥ యెగ్గే ॥

గుట్టున నూ కుండితే కుచ్చిత మౌనోయంటా
బెట్టి(ట్టు?) కాఁగిలించుకొంటి ప్రియమే కదే
యిట్టె శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁగూడె
చుట్టమనయితి నిఁక సులభమే కదవే ॥ యెగ్గే ॥ 529 ॥

రేకు 1789 కాంబోది

ఇదివో నా తలపోఁత యేమి సేతును
కదిసి గాలి ముడియ గట్టరాదు గాని ॥ పల్లవి ॥

వేగినంతా మాటలాడి వేసారదు నామనసు
జాగుకు నీ వోపవంటా జడిసేఁగాని
[1]ఆగడీఁడవు తొలుతే అది సాదించినాఁడవే
ఆగతి నిన్నింత నేను అనరాదు గాని ॥ ఇది ॥

నీమోవి తేనియలాని నిండదు నాలో నాసలు
కోమల మోరువదంటా కొంకేఁ గాని
కామించి తొల్లే అదియు కాయలుగాచి వున్నది
చేముట్టి యిప్పుదు రట్టుసేయరాదుగాని ॥ ఇది ॥

---

1 ఆగడము + ఈఁడు

బిగువుఁ జన్నుల నొత్తి పిరితియ్యదు పంతము
మొగి నీ వలసేవంటా మెరఁగేఁగాని
తగు శ్రీవేంకటేశుఁడ దక్కి నన్నుఁ గూడితివి
నగితి విందుకు నే సన్నలు సేసేఁగాని ॥ ఇది ॥ 530 ॥

## దేసాళం

కాదనేమా నిన్నును కడు మెచ్చే మింతే కాక
సాదించితివి వలపు జాణకాఁడ వవుదువు ॥ పల్లవి ॥

నయగారి మాటలెల్ల నాకుఁగా నేరిచితివి
క్రియ లెరుఁగుకొంటివి గేస్తురాండ్లలకు
దయదలఁతువు నీవు తరుణులైతేఁ జాలు
జయములే యెప్పుడును జాణకాఁడ వౌదువు ॥ కాద ॥

నగవులు పెలవుల నాకుఁగాఁ దెచ్చుకొంటివి
అగపడితి వట్టె పదారువేలకు
జిగిమించు గొల్లెతల సిగ్గులకు లోనైతివి
జగడము లేదు నీకు జాణకాఁడ వౌదువు ॥ కాద ॥

నంటున కాఁగిటఁ గూడి నాకే లోనైతివి
అంటక బాఁ పెతలవిం దారగించితి
వెంటనె శ్రీవెంకటేశ వేడుకకాఁడవై
జంటవాయ విటు నన్ను జాణకాఁడ వౌదువు ॥ కాద ॥ 531 ॥

## పాడి

ఇంతి గడుజవరాలు ఇంతట మన్నించరాదా
చెంతనుండి చూచిచూచి చిప్పిలీ మా మనసు ॥ పల్లవి ॥

జల జలఁ జెమరించె జాజులు కొప్పున జారె
చెలితో నేమి సాములు సేసేవయ్య
తవిరుమోవి వాడి తమకము గదురేఁగె,
మలసి యెందాఁకాను మాటలాడించేవయ్య ॥ ఇంతి ॥

చెదరెను ముంగురులు చిబ్లె గందపుబొట్టు
సుదతి నవ్వుల నెంత చొక్కించేవయ్య
వుదుటుగుబ్బలు రాసె నొయ్యనే పయ్యద జారె
ఇదె నీపాదా లొత్తించే వెందాఁకానయ్య ॥ ఇంతి ॥

కన్నులఁ గెంపులు దేరె కళలు మోమున నిండె
కన్నె నెంత రతులను గదిమే వయ్య
ఇన్నిటా శ్రీవేంకటేశ యేలితివి వేదుకతో
యెన్నేసి తరితీపుల నింపు పుట్టించేవయ్యా ॥ ఇంతి ॥ 532 ॥

## ఆహిరినాట

ఔనయ్యా నీవేమైనా నంటివి గాని
యీ నెలఁతఁ జిత్తగించు యేమనఁగ వచ్చును ॥ పల్లవి ॥

మొలకలైన చన్నులే మోవరాని మోఁపు లౌను
కలికి కన్నులచూపు గాలపువేఁట
పలచని కెమ్మోవి పండి పచ్చితేనె గారు
కెలనఁ గాంతల నెట్టు గెలువఁగ వచ్చును ॥ ఔన ॥

వేమరు నాడే మాటలే వెస నంటు జిగురులు
ఆముకొన్న బొమ్మజంకె లాసవలలు
దోమటి చుట్టరికాలు తోయఁగరాని తగుళ్లు
భామలగంటే మనసు పట్టనెట్టు వచ్చును ॥ ఔన ॥

నేరుపుల వినయాలు నెరి నడపు నీడలు
కూరిమిచెనకులు చొక్కులమందులు
యీరీతి శ్రీవేంకటేశ యీకె నిట్టె యేలితివి
చేరి సతుల రతులు చెప్ప నెట్టు వచ్చును ॥ ఔన ॥ 533 ॥

## ముఖారి

అద్దమరేతిరికాడ నానలేల పెట్టేవు
ఇద్దరికిఁ దగు నివి యింకాఁ గొంత వలెనా ॥ పల్లవి ॥

పొరుగున నుండి యాపె పొందులు నీతోఁ జేయఁగ
విరులను సారె సారె వేయఁగాను
దొరకొని నీ మొగము తొంగి తొంగి చూడఁగాను
మరిగె నీమనసందు మరి యేఁటి సుదులు ॥ అద్ద ॥

యెదుటనే వుండి యాపె యెడమాటలాడించఁగా
పెదవి సన్నల నిన్నుఁ బిలువఁగాను
వెదకి వెదకి నీకు వేఁడుకొని మొక్కఁగాను
తుదకెక్కె నీ మోహము దూరనేల నిన్నును ॥ అద్ద ॥

పానుపుపైనుండి యాపై బత్తి నీపైఁ జేయఁగాను
నానఁబెట్టి పదరక నవ్వఁగాను
పూని శ్రీవేంకటేశుఁడ పొంచి నన్ను నేలితివి
తానూ నిన్నుఁ బెండ్లాడె తప్పలేదు నీకును ॥ అద్ద ॥ 534 ॥

## గౌళ

ఎదుటనున్నాఁ డతఁడు ఇదివో నా భాగ్యమున
పొదిగొనీ వేడుకలు పొంచి యేమి సేతునే ॥ పల్లవి ॥

మొగము చూచేనంటే ముప్పిరిగొనీ సిగ్గులు
నగితే మందెమేళాలు నానుకొనీని
తగిలి పెనఁగేనంటే తలిగొనీఁ బులకలు
ఇగిలించీ నాకోరిక లిఁక నేమి సేతునే ॥ ఎదు ॥

విరుల వేసేనంటే వెస నాకు దయవుట్టీ
సరి గాఁగిలించేనంటే చన్ను లొత్తీని
మరిగించుకొనేనంటే మగనితో గర్వమయ్యీ
నిరతి నాగుణమిది నేనేమి సేతునే ॥ ఎదు ॥

కదురతిఁ గూడేనంటే కరఁగీ నాతని మతి
తొడపై నుంటే పాదముతుద దాఁకీని
యెడయక శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
తడఁబడీ నాయాసలు దాని కేమిసేతునే ॥ఎదు ॥ 535 ॥

## రేకు 1790 రామక్రియ

మొక్కే మీ వుపకారమునకు మేము నీకు
ఇక్కువకు మాపితివి యేమి గొరతయ్యా ॥ పల్లవి ॥

పడఁతుల గర్వములు పతి యాదరించినంతా
జడియని నవ్వు సరసములంతాను
మదుపు మాట పలుకు మందె మేళములయుంతా
యెడమిచ్చినాఁడవు మా కేమి గొరతయ్యా ॥ మొక్కే ॥

సతమైన రాజసము చనవు లిచ్చినయుంతా
రతులలో నేరుపులు రమించెనంతా
ప్రతిలేని వలపులు భావించుకొన్నంతా
ఇతవుగా మా కిచ్చితి వేమిగొరతయ్యా ॥ మొక్కే ॥

మోవితేనియ విందులు ముంచి యాస గలయంతా
చేవమీరిన పనులు సేసినంతాను
శ్రీవేంకటేశ నన్నుఁ జేకొని కూడితి విట్టె
యీవల నా మన్ననల కేమి గొరతయ్యా ॥ మొక్కె ॥ 536 ॥

బౌళి

పచ్చిదేరెఁ బనులు పంతము లీడేరెను
ఇచ్చ యెఱుఁగుదును మా ఇంటికి రావోయి ॥ పల్లవి ॥

మొదల మేను నీమోవి చూచి నోరూరితి
కొదవెట్టి ఇఁక నిన్నుఁ గోపగించేనా
వదలెఁ బయ్యెదకొంగు వలపు నీరపమాయ
హృదయాలు గలసెను ఇంటికి రావోయి ॥ పచ్చి ॥

సంగతిగా నిదివో నీ సరసానకు లోనైతి
రంగుగా నే నిఁక నిన్ను రవ్వ సేసేనా
అంగమెల్లఁ జెమరించె ఆయము నీవెఱుఁగుదు-
వింగితాకారాలు గంటి నింటికి రావోయి ॥ పచ్చి ॥

కతలుగా నేఁడు నీ కాఁగిటిలోనఁ జొక్కితి
[1]పతిగా నే నిఁక నీతో పంతమాడేనా
సతమైనకళ లుబ్బె సమమోహములు నిండె
హితవై శ్రీవేంకటేశ ఇంటికి రావోయి ॥ పచ్చి ॥ 537 ॥

వరాళి

ఏకాంతములోని సుద్దు లెన్నఁడూ మఱవరాదు
యీకడఁ జెలియ నీతో నేమని చెప్పెదుమే ॥ పల్లవి ॥

---

1 ఈ 'పతి' ప్రతిశబ్ద భవము బదులుగా, మారుగా, ఇత్యాదులర్థము కావచ్చు

వీడిన నా తురుమున విరులు నిండా ముడిచె
వాడుదేర మోమున జవ్వాది సమరె
తోడనే చెక్కుచెమట దుడిచె కెంగేలను
యీడనే వోయమ్మ నీతో నేమని చెప్పుదునే ॥ ఏకాం ॥

నుదుటికస్తూరి బొట్టు నునుగోరనే దిద్దె
అదనఁ గప్పుర మిచ్చె నలపు వాయ
చెదరినహారముల చిక్కులెల్లా నెడలించె
యిది యెట్టికాత్తో నీతో నేమని చెప్పుదునే ॥ ఏకాం ॥

కోమలము నామేనంటాఁ కుంకుమ గందము పూసె
కామించి నేఁగోరినట్టె కరుణించెను
యీమేర శ్రీవేంకటేశుఁ డిన్నిటాను చనవిచ్చె
యేమి సోద్యమో నీతో నేమని చెప్పుదునే ॥ ఏకాం ॥ 538 ॥

## కన్నడగౌళ

ఎంత నన్ను వేఁడుకొనే విల్లాల నేను
చెంత నిట్టె యేలుకో నీ చిత్తములోదానను ॥ పల్లవి ॥

మోవి చూపి నోరూరించి మొకమిచ్చుమాటలాడి
వావిచెప్పుకొనేయటువంటి దాననా
కావరించి సన్నసేసి కలపుకోలు సేపక
తావుకొని రతులకుఁ దగిలేఁటి దాననా ॥ ఎంత ॥

వాడిక వలపు చూపి వట్టి తరితీపు సేపి
జోడుకుఁ బెనఁగేటివాసులదాననా
వేడుక నవ్వులు నవ్వి వేసాల ప్రియాలు చెప్పి
యేడనైనా మేలమాడే యేతుల దాననా ॥ ఎంత ॥

చనవులు పేసుకొని జక్కవ గుబ్బల నొత్తి
చెనకుచు నాసలు రేఁచే దానవా
యెనసితివి శ్రీవేంకటేశ యింతలో నన్ను
పనివడి నేరుపురే పచరించే దానవా ॥ ఎంత ॥ 539 ॥

## పాడి

ఆకె వింటే నేమైనా ననదా నిన్ను
మేకొని యింతేసి యాల మేర మీరేవు ॥ పల్లవి ॥

నవ్వుతాఁ జెలియాడిన ననుపులమాటలెల్లా
యివ్వల నీవీపెకుఁ[1] జెప్పి(ప్పే?) విచ్చుకాలకు
నివ్వటిల్లఁ గానుకగా నీ కిచ్చిన కప్పురము
జవ్వనులకెల్లా నేల సారెకుఁ బెట్టేవు ॥ ఆకె ॥

పొంచి యాపె నీమైనిండాఁ బూసినతట్టు పుణుఁగు
యించుకించుకే చెలుల కేల పూసేవు
అంచెల నీమీఁది బత్తినంపిన జాజివిరులు
మించి కొలువుసతులమీఁద నేల చల్లేవు ॥ ఆకె ॥

వింతలుగా నాపె నీకు వేలఁబెట్టిన వుంగర-
మింతలోఁ బొరుగువారికేల చూపేవు
కాంత నిన్నుఁ గూడిన యేకాంతము శ్రీవేంకటేశ
రంతుల నిందరితోడ రవ్వేల సేసేవు ॥ ఆకె ॥ 540 ॥

## భైరవి

అదుకొంటేఁ బెద్దరికమే వుండుఁగాని
యీదు జోడై నన్నుఁ బాయఁ డెంతబత్తే ఇతఁడు ॥ పల్లవి ॥

---

[1] వ్రాఁతలు గల యక్షరములు చిలుముతో బొత్తిగా కన్పించుటలేదు. సందర్భముతో నేమూహించినదే.

చెప్పిన నామాఁట విను సేసు నే పనులైవాను
అప్పసము నామేలువాఁడై వుండునే
తప్పక నాపై నానకు తానింతా జవదాఁటఁడు
యెప్పుడును నామీఁద నెంతబత్తే ఇతఁడు ॥ ఆడు ॥

మొగమోడు నాకుఁగడు ముచ్చటలు దాఁచఁడు
నగవుకైనా బొంకఁడు నాతోడను
తగ నా చెలుల గంటే దయతోడ నాదరించు
ఇగిరింపించు నామతి యెంతబత్తే ఇతఁడు ॥ ఆడు ॥

చెల్లించు నా సలిగెలు చేతికి లోనైవుండు
చల్లనిచూపులఁ జూచి చనవిచ్చునే
వెల్లవిరిగా నేలె శ్రీవేంకటేశుఁ డిదె నన్ను
యెల్లవారిలో నామీఁద నెంతబత్తే యితఁడు ॥ ఆడు ॥ 541 ॥

## సామంతం[1]

కంటిఁగా తమ పొందులు కన్నులారాను
ఇంటిలో నా చుట్టరిక మెందువోయీవే ॥ పల్లవి ॥

యే పొద్దూ బాయనివారి నెగసక్కెలాడనేల
కాఁపైపురాలు సేసేవారిఁ గలఁచనేల
రాఁపై వలచినవారి రవ్వలఁ బెట్టఁగనేల
ఆఁపరాని తమకము లడ్డపెట్టవసమా ॥ కంటి ॥

ఆసపడివున్నవారి యనువు దప్పించనేల
బాపపేసుకొన్నవారిఁ బాపఁగనేల

---

[1] ‍క్రీ గీతగల అక్షరములు చిలుము బలిసినవి. 1. ఈ సామంతం పాటలో క్రీగీతలుగల స్థలములందు చిలుము రేకునుగూడ కొన్ని పట్టుల తినివేసినది.

వేసారక వుండేవారి వెలికిఁ బిలువనేల
మూసిమంతనపు గుట్టు ముంగిటిక్కి ద్రే[1]వచ్చునా ॥ కంటి ॥

యెనపి వుండినవారి నెఱుకసేసుకోనేల
పెనఁగులాడేవారి బెల్లించనేల
నను శ్రీవేంకటేశుఁడు నయముననే కూడె
పనులెల్లాఁ జక్కనాయ పదరఁగనేఁటికి ॥ కంటి ॥ 542 ॥

## పాళంగనాట

వట్టి నిష్టూరమేఁటికే వనితలకు
చుట్టరి గా సూడు వట్టఁదగునా ॥ పల్లవి ॥

యెగసక్కే లేలాడేవే యెదుట నీ విభుఁడు నా-
మొగము చూచితే నేను మొక్కఁగరాదా
నగనేలే నీ వప్పటి నా యింటి కితఁడు రాఁగా
సొగిసి నే నించుకంత చోటియ్య వలదా ॥ వట్టి ॥

వేపరుకోనేఁటికే వేడుకతో నాతఁడు
నాసంగడి నుండఁగఁ జెనకఁగరాదా
వాసులేల నెరపేవే వాలాయించి నా కాతఁడు
చేసన్నలు గావించఁగా సేవసేయ వలదా ॥ వట్టి ॥

చేతులేల చాఁచేవే శ్రీవేంకటేశుఁడు నాకు
ఆతఁడే విడెమియ్యఁగా నందుకోరాదా
కాతరించ నిఁకనేలే గట్టిగా నన్నేలినాఁడు
నీతో గూడె నన్నూ మన్నించె మెచ్చవలదా ॥ వట్టి ॥ 543 ॥

---

1 క్రీ గీతలు గల అక్షరములు చిలుము బలిసినవి.

## పాడి

సవతుల కీమాఁట సమ్మతిగాదు గాని
యివల నీవెటుండినా నిఁక నేఁ గాదనేనా ‖ పల్లవి ‖

వద్దు నా కేమి చెప్పేవే వలచు నీ కాతఁడంటా
కద్దులేవే నీమాఁట కల్లఁగాదు
సుద్దులెల్లా వింటి నాఁడే సోద్యము గాదు నాకు
అద్దో నీ పెద్దరిక మందరు నెఱఁగరా ‖ సవ ‖

చూపనేలే నీ కాతఁడు సొమ్ము లిచ్చె నంటాను
యేపున నీకుఁ దగునే ఇటువంటివి
వైపాయ నీ సింగారము వడి సంతోసించుకొంటి
ఆపాటి నీ దొరతన మందరు నెఱఁగరా ‖ సవ ‖

పెట్టేవేమే విడేలు పెండ్లాడె నిన్నాతఁడంటా
గుట్టుగలవారి కిదే గుణముగాదా
యిట్టె శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
అట్టేకాదా మీపొందు నేఁ డందరు నెఱఁగరా ‖ సవ ‖ 544 ‖

## నాదరామక్రియ

వినయమే మంచిది విభునితోను
ననుఁజూప కాతనితో నవ్వవే నామారు ‖ పల్లవి ‖

వచ్చితేనేమే విభుని వద్దనఁగ వచ్చునా
మచ్చికతోఁ బీఁటవెట్టి మాఁటలాడవే
నిచ్చపెండ్లికొడుకుతో నిష్టూరము చెల్లునా
ఇచ్చకములే యాడవే ఇప్పుడే నామారు ‖ విన ‖

వేఁడుకొంటే నేమాయనే వింతవాఁడా తానేమి
నాఁడే కోపమెల్లాఁ దీరె నావాఁడే తాను
ఆఁడుదానఁ దనతో నే నోఁగాదనఁ బనియేమే
పోఁడిమితో వీడెమీవే పొద్దున నామారు ॥ విన ॥

సరసమాడితేనేమే చవులుగాక మానీనా
యెరవు లేకుండితే మే లియ్యకొనవే
ఇరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
గరిమ నీ విందుకుఁ బొగడవే నామారు ॥ విన ॥ 545 ॥

## దేసాళం

నేరుపే కలిగితేను నెయ్యము దానే కూడు
తారుకాణ వచ్చితేను తలఁపెల్లా నొక్కటే ॥ పల్లవి ॥

మల్లి మల్లి చూచితేను మాఁటలెన్నైనాఁగలవు
వెల్లవిరిగా నన్నీ వింటినే నేను
చెల్లుబడి గలవారు సేసినదే చేఁతగాదా
యెల్లవారు వినఁగా నన్నే లొడఁబరచీనే ॥ నేరు ॥

తప్పక చూచితేను తనివెంతైనాఁ దీరదు
వొప్పగ తనవద్దనే వుందానఁగదే
యెప్పుడూనుఁ గలవారి నెవ్వరైనాఁ గాదందురా
ముప్పిరి నమ్మికలేల ముంచి తాఁ జేసీనే ॥ నేరు ॥

వేడుకకు నవ్వితేను వెలవెట్ట వసగాదు
ఆడినట్టే దేవుల నేనైతిఁ గదవే
యీడనే శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
మేడెపు నారతు లెంత మేకొని మెచ్చీనే ॥ నేరు ॥ 546 ॥

సామవరాళి

నీచిత్త మెట్టుండునో నిన్ను నే నడుగరాదు
చూచి చూచి వోర్వరాదు సుద్దు చెప్పవయా ॥ పల్లవి ॥

ఆరగించితివో లేదో ఆపెఁ జూచే వేడుకలు
వూరకె మఱచి యట్టే వుంటివో నీవు
నేరుపుల జాగరాల నిద్ర వచ్చెనో రాదో
కోరి యీ విచారాననే గుబ్బతిలి వుంటిని ॥ నీచి ॥

జలకమాడితో లేదో సతిఁ గూడే పరాకున
చెలప చెమటలనే చిప్పిలితివో
యెలమిఁ దెల్లవారిన దెరుక పడెనో లేదో
తలపోసి నీకుఁగానే తత్తరించి వుంటిని ॥ నీచి ॥

సింగారించుకొంటో లేదో చెనకేటితమకాన
వుంగిటితో మోవికి నోరూరుచుంటివో
అంగవించి శ్రీవేంకటాధిప నన్నేలితివి
చెంగలించి నీగుణమే చెప్పకొంటానుంటిని ॥ నీచి ॥ 547 ॥

రేకు 1792 రామక్రియ

నాతోనేల పెనఁగేవు నన్నెంతొడఁబరచేవు
ఆతనిచిత్త మెట్టిదో అడుగఁగరాదా ॥ పల్లవి ॥

పన్ని సరసమాడితే పై కొంటగాక వూరకే
సన్నలు సేయఁగఁబోతే సమ్మతులౌనా
కన్నులెదుట నున్నాఁడు కదియఁగా వద్దనేనా
చిన్నదాన నేమీఁ జేయ సిగ్గయ్యీ నాకును ॥ నాతో ॥

మలసి మాఁటాడితేను మచ్చిక చూపుటగాక
పిలిచి కొసరఁబోతే ప్రియములౌనా
కొలువులో విడెమిచ్చి గుట్టుసేయ నిఁకనేల
తెలిపి చెప్పెదనంటే తేనెగారీ మోవిని ॥ నాతో ॥

గక్కనఁ దా నవ్వితేను కాఁగిలించుకొంటఁగాక
ఇక్కువలే యంటఁబోతే నితవులౌనా
అక్కరై శ్రీవేంకటేశుఁ డంతలోఁ దా నన్నుఁ గూడె
చెక్కునొక్కి వేఁడుకోవే చిమ్మిరేఁగీ మనసు ॥ నాతో ॥ 548 ॥

## ముఖారి

ఈ మేటితోఁబుట్టినట మాయలమేలుమంగ
ఆమేలే చూతురుగాని అవుఁ గాదనకురే ॥ పల్లవి ॥

చూడరమ్మ అల్లవాఁడే చుక్కలరాజు
వేడుకలువెదచల్లే వెన్నెలరాశి
కూడపెట్టి దాఁచినట్టి కూడేటిబుద్ధి
వోడక జలధిపాలి వుబ్బరిమందు ముద్ద ॥ ఈమే ॥

మెచ్చరే వాఁడె మరుని మేనమామ
మచ్చెముతోడి మట్టిమాని విత్తు
పచ్చిదేరే విరహపు పాముండే పుట్ట
కొచ్చి దేవతలపాలి గుజ్జనగూడు ॥ ఈమే ॥

యితఁడేసుండి శ్రీవేంకటేశు మరఁది
తతిఁ బన్నీరూరే యమృతంపుఁ జలమ
పతులమోములఁ బోలేసరియలతి
గతి గూడిన పదారు కళల నిధానము ॥ ఈమే ॥ 549 ॥

## ఆహిరి

కోరి విందు విటు రారే గొల్లెతలాల
మేరతో మన కతఁడు మేనమరఁది ॥ పల్లవి ॥

ఆవుల మందలలోన నదె పిల్లఁదురు లూదీ
చేవమీరే వేడుకతోఁ జిన్ని కృష్ణుఁడు
పూవులతోఁటలోన పొంచి గొబ్బిళ్లఁ బాడీని
వేవేలు చందాలతోడ వెన్నముద్ద కృష్ణుఁడు ॥ కోరి ॥

రచ్చకొట్టాలలో నుండి రాగాన నీలలువెట్టీ
గచ్చులు సేయుచు కోడెకాఁడు కృష్ణుఁడు
తచ్చి నీలాటిరేవుల తగిలి సన్నలు సేసీ
పచ్చిమాఁట లాడుకొంటా బాలకృష్ణుఁడు ॥ కోరి ॥

దొరకొని యమునలో తుత్తురుఁగొమ్ము వట్టీని
అరుదుగా శ్రీవేంకటేద్రి కృష్ణుఁడు
వరుసతోఁ గిన్నెరలు వాయించి ఇండ్లకువచ్చి
ఇరవై మనలగూడె నిట్టె ముద్దుఁ గృష్ణుఁడు ॥ కోరి ॥ 550 ॥

## కురఁ(రం?)జి

నీ గుణాలెల్లా వింటి నిన్న మొన్ననే
ఆగడా లేమిసేతువో అత్తింటి కోడలను ॥ పల్లవి ॥

చద్దికి వేడికి నాతో సరసమాడవచ్చేవు
వద్దు సుమ్మీ వోయి మావారే మందురో
వుద్దండీఁడవు నీవైతే వొంటి నున్నదాన నేను
అద్దో నీవేమి సేతువో అత్తింటి కోడలను ॥ నీగు ॥

నట్టింటిలోనికి వచ్చి నాతోను నవ్వేవు
చుట్టా లేమందురో నిన్నుఁ జూచుకొమ్మీ
పట్టెఁడేసి గుబ్బలదాన పాయపు వాఁడవు నీవు
అట్టె నన్నేమిసేతువో అత్తింటి కోడలను ॥ నీగు ॥

వావి చెప్పి పక్కఁ బండి వలచి కాఁగిలించేవు
యీవల విన్న కన్నవారేమందురో
శ్రీ వేంకటేశుఁడవు చిన్ని చక్కనిదాన
ఆవటిం చేమి సేతువో అత్తింటి కోడలను ॥ నీగు ॥ 551 ॥

## నాదరామక్రియ

ఏడ నేరుచుకొంటివే యింతేసి దిట్టతనాలు
మేడెము గూడి చెలులు మెచ్చేరు నిన్నును ॥ పల్లవి ॥

ముసి ముసి నవ్వులతో ముద్దు లేమి గురిసేవే
కొసరి విభునినిన్నుఁ గొలువులోన
కసుఁగాటు వలపుల కతకారి వవుదువే
వెస నిన్నుఁ జూచి చూచి వెరగయ్యీ నాకు ॥ ఏడ ॥

చెక్కిటి చేతితోడ సిగ్గు లేమి నెరపేవే
మొక్కలాన రమణుని మొగమెదుట
వెక్కసపుఁ జేఁతల వేడుకకత్తె వవుదువే
చొక్కుచు నీసుద్దులకు సోద్యమయ్యీ నాకు ॥ ఏడ ॥

సరికి బేసికి నుండి జాణతనా లేమాడేవే
పరగ శ్రీవేంకటేశుపానుపు మీఁద
యిరవై నన్నితఁడేలె యిచ్చకురాల వవుదువే
తొరలి నీ బుద్ధికి సంతోసమయ్యీ నాకు ॥ ఏడ ॥ 552 ॥

లలిత

అటువంటి విద్యలు నీ యందు వున్నవి
నటన లెందూ నొల్లవు నాకే దక్కితివి ॥ పల్లవి ॥

ముంచి యవ్వతెకైనాను మోహించిన మగవాఁడు
కొంచించు మాఁటలాడ కోమలులతో
వంచించక నమ్మికలు వడి నొసఁగినవాఁడు
అంచెల వట్టియాచారాలన్నియు నెరపును ॥ అటు ॥

ననిచి యెవ్వతెకైనా నమ్మిక లిచ్చినవాఁడు
యెనసి నవ్వఁ జాలఁడు యింతులతోడు
మనసిచ్చి యొక్కతెనే మరిగియుండినవాఁడు
చెనకిన లోనుగాక చెల్లించు నేమములు ॥ అటు ॥

వాడికె నెవ్వతెకైనా వసమై యుండినవాఁడు
చూడనోడు నూరకైనా సుదతులను
యీడ నిట్టె శ్రీవేంకటేశ నన్ను నేలితివి
యేడా నీవంటివాఁడు లేఁ డిచ్చక మిట్టుండును ॥ అటు ॥ 553 ॥

రేకు 1793 బౌళి

మేలు మేలు నీచేఁతలు; మెచ్చితి నిన్ను
వాలాయించి ఇందరిలో వలపించుకొంటివి ॥ పల్లవి ॥

వెలిమండి కలఁకలు వెదకేవు మాఁటలకు
తలములు సోఁకించి తమకించేవు
ములుఁగుచు వలపులు మోకు గట్టి యెత్తేవు
తలఁచితే నేడనైనా తగఁ బొడచూపేవు ॥ మేలు ॥

గుట్టునఁ గొలచినండే(ందే?) కొలచే వేపనికైనా
యెట్టి కులమైనా నట్టు నిట్టు పేసేవు
రట్టుగా సతులకై రాఁపులనే పెనఁగేవు
వెట్టికిఁ గొండయైనాను వేలనే యెత్తేవు ॥ మేలు ॥

పిగ్గు లెగ్గు లెంచక చెలులతో మాఁటాడేవు
వొగ్గి తూరలెక్కేవు నీ వుద్దాండనను
అగ్గమై శ్రీవేంకటేశ యన్నిటా జాణవౌదు
వెగ్గళించితే రూపులు వేవేలయ్యేవు ॥ మేలు ॥ 554 ॥

## సాళంగనాట

నేరుపరియౌ నీపె నెలఁతలలో నెల్లా
వూరకె నడుము దూరి వొట్టికాయ నీకును ॥ పల్లవి ॥

పయ్యద చెరఁగు జారఁ బగటుతోడుత వచ్చి
వొయ్యనే మగువ నీ వొద్దఁ గూచుండె
యియ్యెడ నీకేమవునో యెంతపని గలిగెనో
నెయ్యాన నీతన సంది నేస్తమెల్లాఁ జూపెను ॥ నేరు ॥

కంకణాలు గదలఁగా కదుసలిగె తోడుత
పంకించక ఇదివో నీ పాదా లొత్తెను
వుంకువ యేమిగానెనో వొడఁబడి కెట్టిదో
అంకెఁ దనచుట్టరికమంతా నేఁడు చూపెను ॥ నేరు ॥

గందపుబేంట్లు రాల గబ్బితనముననే
కందువ దెలిపి నిన్ను కాఁగిలించెను
చందముతో శ్రీవేంకటేశ్వర నన్నుఁ గూడితివి
ఇందులకే మెచ్చి తనఇతవెల్లాఁ జూపెను ॥ నేరు ॥ 555 ॥

## పాడి

తెరవేయరే సిగ్గులు దేరీఁ దమకుఁదమకే
మరుఁడే బుద్దులు చెప్పీ మంతనపు వారికి ‖ పల్లవి ‖

మనసుగలయు చోట మాటలు దానే తోఁచు
తనువులు సోఁకితేనే తమివుట్టును
పెనఁగులాడఁబూనితే ప్రియములు గడురేఁగు
మనము చెప్పవలెనా మగువకుఁ బతికి ‖ తెర ‖

చూపు చూపు నంటుకొంటే చుట్టరిక మొనరించు
యేపున నవ్వఁజొచ్చితే నిపులెసఁగు
కాఁపురాలు సేయఁగానే కళలు దానే కరఁగు
యీపనులు నేరిపేమా ఇంతికి విభునికి ‖ తెర ‖

యెప్పుడుఁ బాయకుండితే నేకములౌ మనసులు
ముప్పిరిఁ దగిలితేను మోహమెచ్చును
వొప్పిగఁ బానుపుమీఁద నొద్దికయై వున్నారు
చెప్పనేల సతికిని శ్రీవేంకటేశునకు ‖ తెర ‖ 556 ‖

## వరాళి

కంటివిగా నేఁడు దీనికతకారి తనములు
పెంటవెట్టుకొని నీతో పెచ్చువెరిగీని ‖ పల్లవి ‖

పాపట దువ్వుకొంటాను పడఁతి నీయెదుటను
పూఁప చన్నులు పయ్యదఁ బొదుగుకొంటా
చూపులు నాఁట రెప్పలు చొక్కి యల్లారుచుకొంటా
యీపె యెన్నిచేఁతలు నీయెదుటఁ జేసీని ‖ కంటి ‖

తములము పేసుకొంటా తమకించీ లోలోనె
చెమటలు కొనగోరఁ జిమ్ముకొంటాను
బొమముడి వెట్టుకొని పొంచిపొంచి నవ్వుకొంటా
సముకాన నెంతేసి వేసాలఁ బొరలీని ॥ కంటి ॥

కొప్పు చక్కఁబెట్టుకొంటా కూరిములు చల్లిచల్లి
చిప్పిలుమెయి పోఁక నిన్నుఁ జెనకు కొంటా
చొప్పుగా నీవు నన్నేలఁజూచి శ్రీవేంకటేశుఁడ
ఇప్పుడు నీ ముందరఁ దా నేమినటించీని ॥ కంటి ॥ 557 ॥

ముఖారి

పతి నీఁ జేసెనంటా సాకిరులేల పెట్టేవు
కతకారితనమింతే గరువముకాదయ్యా ॥ పల్లవి ॥

పంతములు బిగువులు పలుకులు కొసరులు
కాంతల కెప్పుడు నివి గలిగినవే
చెంతఁ జెక్కిటిచేతులు చిరుసిగ్గులు నవ్వులు
ఇంతులకు సాజమిది యెగ్గుపట్ట రాదయ్యా ॥ పతి ॥

యెలఇంపుఁ జేఁతలును యెల్లిదాలు పల్లదాలు
అలివేణులకు నివి యలవాటులే
కలికితనములు బింకములు బీరములును
చెలువచందాలు రట్టుపేయఁగరాదయ్యా ॥ పతి ॥

పరసాలు జంకెనలు సరివాలుఁ జూపులును
సరసిజాక్షుల కివి సంగతులే
ఇరవై శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
తరుణుల వోజ లివి తగదనరాదయ్యా ॥ పతి ॥ 558 ॥

గౌళ

ఊరకే తెమలునా వుదుటైన నీమనసు
తారుకాణలు దెలిసి దయవుట్టీఁ గాక ॥ పల్లవి ॥

తరుణి గుబ్బలు నిన్నుఁ దాఁకినప్పుడుగదా
మరిగి యాపె చెప్పినమాఁట విందువు
అరిది బొమ్మజంకెన లంటినప్పుడుగదా
వరుసలు దప్పకుండా వత్తువు నీవు ॥ ఊర ॥

నిక్కి సేయరాని చేఁత నిన్ను మోఁచినను గదా
అక్కరతోఁ జేతికి లోనై వుందువు
కక్కసపుఁ జూపులు కాఁడిపారినను గదా
తక్కక యాపె నే పొద్దూఁ దతఁతువు నీవు ॥ ఊర ॥

సొలపుఁ బలుకు నిన్ను సోఁకినంతటఁగదా
తలవంచి సిగ్గులోడ దండవాయపు(వు?)
చెలి నేలితి వింతలో శ్రీవేంకటేశ్వర
కలసి యిట్టైతేఁ గదా కరఁగుదువు నీవు ॥ ఊర ॥ 559 ॥

రేకు 1794 ముఖారి

నా దిక్కు చూచి నీవు నవ్వులెంత నవ్వేవు
దాదాత నీలోని తలఁపు లీడేరెను ॥ పల్లవి ॥

సలిగె గలదానవు సరసములాడఁగదే
కొలువైవున్నాఁ డతఁడు కొంకఁగనేల
చెలుల మాఁటున నుండి సిగ్గువడ నేమిటికి
వెలయఁగ వలపులు నెల్లవిరులాయను ॥ నాది ॥

చుట్టమవైనదానవు సుద్దులు చెప్పఁ గదవే
యిట్టె నీఇంటికి వచ్చె నెరవులేల
వట్టి సన్నలుఁ జాయలు వల దిందరిముందర
తెట్టెలైన మీ పొందులు తేటతెల్లమాయను ॥ నాది ॥

తగులుగల దానవు దండఁ గూచుండఁగదవే
మొగముచూచి విన్నైతె మొరఁగులేల
తగు శ్రీవేంకటేశుఁడు తానే నిన్ను నన్ను నేలె
జిగిమించి యీ కతలు చెప్పఁగొత్తలాయను ॥ నాది ॥ 560 ॥

## సామంతం

చేరి నీతో సంగాతాలు సేయమనేవు నన్ను
గారవించి నీవే నన్నుఁ గరుణింతువు గాక ॥ పల్లవి ॥

వులివట్టుకొని యాపె నొడఁబరచఁగ నీతో-
నెడచొచ్చి మాఁటలాడ నెట్టు వచ్చును
అదరి మంచముమీఁద నట్టె మీరు గూచుండఁగా
నడుమ నప్పటి నీతో నవ్వ నెట్టు వచ్చును ॥ చేరి ॥

యేకతానఁ దెరలోన నిద్దరూను నుండఁగాను
యీకడ నిన్నుఁ బిలువనెట్టు వచ్చును
మేకొని మీలో మీరు మించి విడేలు సేయఁగా-
నాకు మడిచియ్య నీకు నది యెట్టు వచ్చును ॥ చేరి ॥

ముచ్చట నొకరొకరు మొగములు చూచుకోఁగా
యెచ్చరించి సన్నసేయ నెట్టు వచ్చును
ఇచ్చట శ్రీవేంకటేశ యేలితివి నన్ను నీడ
మెచ్చితి నెంతైనా నిన్ను మీర నెట్టు వచ్చును ॥ చేరి ॥ 561 ॥

### లలిత

అన్నిటా జాణఁడు అలమేలుమంగపతి
పన్ని నీకు మేలువాఁడై పరగివున్నాఁడు ‖ పల్లవి ‖

పట్టినదే పంతమా పతితోడ నీ కిప్పుడు
యిట్టె నిన్ను వేఁడుకోఁగా నియ్యకోరాదా
వొట్టి యప్పటనుండి నీవొడి వట్టుకొన్నవాఁడు
గట్టువాయు తనమేల కరఁగవే మనసు ‖ అన్ని ‖

చలములే సాదింతురా సారె సారె నాతనితో
బలిమిఁ బిలువఁగాను పలుకరాదా
కలపుకోలు పేసుక కాఁగిలించుకున్నవాఁడు
పెలుచుఁదనములేల పెనఁగవే రతిని ‖ అన్ని ‖

చేరి ఇట్టె బిగుతురా శ్రీవేంకటేశ్వరునితో
మేరతో నిన్నేలఁగాను మెచ్చఁగరాదా
యీరీతి నిన్నుఁ బెండ్లాడె యెడయక వున్నవాఁడు
వీరిడితనములేల వెలయవే మరిగి ‖ అన్ని ‖ 562 ‖

### శుద్ధదేశి

ఇంతవేడుక గలితే విందుకి విచ్చేయరాదా
చెంత నీవు చెప్పినట్టు సేవసేసేఁగాని ‖ పల్లవి ‖

సిగ్గులే చీఁదరగొంటే చెలి ఇఁక వేమిసేసు
వొగ్గి కతచెప్పుమని వొడివట్టేవు
వెగ్గళపు వలపులవెల్లి యెట్టు యీఁదవచ్చు
అగ్గవకోరికలకు నాసపడేవు ‖ ఇంత ‖

నవ్వులే చిమ్మి రేఁచితే నలినాక్షి యేమిసేసు
చివ్వన మాఁటాడుమని చెక్కునొక్కేవు
వువ్విళ్లూరే మోవితేనె వుట్టిఁగట్ట నెట్టు వచ్చు
పువ్వువంటి తమకము పోదిసేసేవు ॥ ఇంత ॥

పాయమే కారుకమ్మితే పడఁతిఁ దా నేమి సేసు
కాయజకేలి యిమ్మని కాఁగిలించేవు
యీయెడ శ్రీవేంకటేశ యేలితి వలమేల్మంగను
చాయల నీచేఁత లిన్నిఁ జవులు సేసేవు ॥ ఇంత ॥ 563 ॥

## కేదారగౌళ

చెప్పరాని నేరుపు లీ చెలివద్దనే వున్నవి
యిప్పు డెంచితే వావి నేమౌనో నీ- ॥ పల్లవి ॥

చేటఁడేసి నవ్వులు సెలవుల నుండఁగానే
మూటఁడేసిమాఁట లాడీ ముదిత నీతో
గాఁటమైన చెమటలు కాలువలుగట్టి పారీ
వాఁటముగ నెందుండి వచ్చెనో తాను ॥ చెప్ప ॥

పట్టెఁ డేసి గుబ్బలపైఁ బయ్య దుండఁగానే
పెట్టెఁడేసి సిగ్గులనుఁ బెనఁగులాడీ
నెట్టుకొన్న వేడుకతో నిట్టూర్పులు చల్లుకొంటా
గుట్టుతో నీవల పెందుఁ గూడపెట్టు కొనెనో ॥ చెప్ప ॥

బారెఁడేసి వెంట్రుకల బలుకొప్పు జారఁగానే
చేరఁడేసి కన్నులఁ జూచీ నిన్నును
కోరి యలమేలు మంగకుఁబతి శ్రీవేంకటేశ
యీరీతి నన్నేలితివి యెట్టి పొందో తనకు ॥ చెప్ప ॥ 564 ॥

బౌళి

మాతోఁ జెప్పఁగదవే మగువ నీ సుద్దులెల్లా
యీతల నీ వేడుకలు ఇన్నీ నేఁడుఁగంటిమి ॥ పల్లవి ॥

కన్నులఁ దేటలు నిండె కమ్మి మైఁ జెమట లూరె
వున్నతి యిందాఁకా నెందునుండి వస్తివే
సన్నపు నీ పెదవులు చాలాఁ బిప్పలు గట్టె
పన్ని యెవ్వరితో మాట పలుకు లాడితివే ॥ మాతో ॥

గట్టి కొప్పు వెడ జారె కళలు మోమునఁదేరె
అట్టె యేపనుల నీ వలసితివే
కట్టిన చెంగావిచీర కదు నెరి విరిగెను (వీఁగెను?)
బెట్టి(ట్టు?) నీ వెవ్వరితోడఁ బెనఁగితివే ॥ మాతో ॥

పెలవినవ్వు మెరసె చేఁతలు మేన నెరసె
అలరి సంతోస మెట్లబ్బెనే నీకు
అలమేలుమంగపతియైన శ్రీవేంకటేశుఁడు
కలసెనో నిన్ను నే భాగ్యములు సేసితివే ॥ మాతో ॥ 565 ॥

రేకు 1795 వరాళి

మొదలనే నేనైతే మొకదాకిరి దానవు
యెదురాడఁ జాల నిఁక నేమందునే ॥ పల్లవి ॥

మంతనావఁ జుట్టి చుట్టి మాఁటలెల్లాఁ జెల్లఁబెట్టీ-
నంతేసి గురుతులు మై నట్టె వుండఁగా
వింత వాసనలతోనే వేమారు వేఁడుకొనీని
యెంతనేరుపరి యీతఁ డేమందునే ॥ మొద ॥

పేపిన చేఁతలకెల్లాఁ జెల్లఁబో నెపాలు చూపి
లాపీ చిరునవ్వులు పెలవిఁ దేరఁగా
సేసపాలు రాలఁగానే చెప్పరాని బాప లిచ్చీ
యీ సుద్దులవటరతో నేమందునే ॥ మొద ॥

కానవచ్చిన పొందులు గంపఁగమ్మి పాసఁగించీ
ఆనుకొని తనచుట్టా లండ నుండఁగానే
పూని శ్రీవేంకటేశుఁ డా పొందుతోనే నన్నుఁ గూడె
యీనాఁటకపు విభుని నేమందునే ॥ మొద ॥ 566 ॥

## ఆహిరి

ఏమని చెప్పుదురయ్య ఇట్టిది నాకాఁపురము
నీ మేలులోనిదాన నేఁ జుమ్మీ రమణుఁడ ॥ పల్లవి ॥

నిలిచి యొక్కకమారు నీ వాదరించినదెల్లా
తలఁచు కొంటేను చిత్తము గరఁగు
యెలమిఁ బొద్దు వోకకు యెడనెడ నీగుణాలు
చెలులచే వింటేను చిప్పిలి పంతోసము ॥ ఏమ ॥

చేముంచి నీ వేకతానఁ జేపిన గురుతులెల్లా
నామేనఁ జూచుకొంటే నవ్వు వచ్చును
కామించి నీవంపినట్టి కస్తూరి నేఁ బూసుకొంటే
ప్రేమపుఁ దమకములు పెడరేఁగును ॥ ఏమ ॥

అద్దరిపాటుగాను నా యండకు నీవు వచ్చితే
కొద్దిమీరిన వేడుక గుదిగొనును
వొద్దికై శ్రీవేంకటేశ వొగి నన్నుఁ గూడితివి
చద్దివేఁడి రతు లిట్టె పమకొనును ॥ ఏమ ॥ 567 ॥

## పాడి

ఇట్టె నాకు బ్రియము లెంత చెప్పేవు
నెట్టుకొన్న నాగుణము నీ వెరఁగవా ॥ పల్లవి ॥

చిత్తగించి నీవేమి సేసినా నియ్యకొనేఁగాక
ఇత్తల నా ఇచ్చల నీ కెదురాడేనా
బత్తితో నీమన్ననలు పదివేలుగాఁ జూచుక
మెత్తుగాక నీ యెడకు మేర మీరేనా ॥ ఇట్టె ॥

నాకు నీవే మానతిచ్చినా సమ్మతించేఁగాక
కాకరితనాల నీతోఁ గాఁతాళించేనా
పైకొన్న నీ యాదరణే కాణాచిగాఁ జేసుకొని
నీకితవై వుండుఁగాక నెపాలెంచేనా ॥ ఇట్టె ॥

యేరీతి నన్నేలినా నెనసి వుండేఁగాక
కూరిమి గొసరి నిన్ను గుంపించేనా
కోరి శ్రీవేంకటేశ నీకూటమి కొండసేసుక
సారెకు మొక్కదుఁగాక సాదించేనా ॥ ఇట్టె ॥ 568 ॥

## పాళంగం

పొద్దొక విధమై యుండు పొందు లెంచి చూచితేను
బుద్ది చెప్పేమాట విని వొద్దికి రమ్మనవే ॥ పల్లవి ॥

వినుకలి యాసలు వింతచవులై తోఁచు
కనుకలిఁ దమకము గనమై తోఁచు
మనసులో తలపోఁత మరితరితీపై తోఁచు
యెనసిన మీఁద నన్నీ నింపులై తోఁచును ॥ పొద్దొ ॥

పరసపుఁ జెనకులు పమరతులై తోఁచు
పరగిన పన్నలు లాభములై తోఁచు
పొరిది మొగమోటలు చుట్టరికాలై తోఁచు
తరవాత నివియే తగుళ్లై తోఁచును ॥ పొద్దొ ॥

నెట్టుకొన్న కాఁగిళ్లు నిధానములై తోఁచు
గుట్టుతోడినవ్వులే గురులై తోఁచు
యిట్టె శ్రీవేంకటేశుఁ డిన్నిటానునన్ను నేలె
చుట్టుకొంటే సంతోసాలు సులభమై తోఁచును ॥ పొద్దొ ॥ 569 ॥

## శుద్ధ వసంతం

తా నెక్కడ నే నెక్కడ తగిలీఁదాను
వూని నన్ను వేఁడుకొనీ నోయమ్మ తాను ॥ పల్లవి ॥

వొద్ద వచ్చి కూచుండి వొంటి నుండఁగా నన్ను
సుద్దులడిగీ నెంత చుట్టమే తాను
చద్దికి వేఁడికి వట్టి సన్న లూరకే సేసీ
వొద్దన్నా మానఁడు గదే వోయమ్మ తాను ॥ తానె ॥

పక్కన మోము చూచి పయ్యద జారితేను
చక్కఁ బెట్టీ నెంత యిచ్చకుఁడే తాను
చిక్కించుక యేకతము చెప్పీనంటాఁ జెవిలోన
వొక్కొక్కమాఁటే యాడీ నోయమ్మతాను ॥ తానె ॥

పూఁచి శ్రీవేంకటేశుఁడు బోదించి బోదించి
రేఁచీ వావు లెంత మేనరికమే తాను
ఆఁచి కాఁగిలించి కూడి అంగడిఁబెట్టీ పిగ్గులు
వూఁచఁడు వాఁచఁడు మాడు వోయమ్మతాను ॥ తానె ॥ 570 ॥

కాంబోది

అన్నిటా జాణఁడు తాను, ఆటదాన నింతే నేను
విన్నపములా ఇఁక వెస నెచ్చరించేవి ॥ పల్లవి ॥

యిట్టె తా నిన్ను మన్నించి యేలితే నేలెఁగాక నా-
వట్టి వినయములా వలపించేవి
చుట్టమై తా వచ్చితేనే సులభమౌఁగాక నా-
దిట్టచేఁతలా తన్నుఁ దెమలించేవి ॥ అన్ని ॥

పన్నెరిఁగి తానే నాతో పరప మామత గాక
కన్నుల మొక్కులా తన్నుగరఁగించేవి
నన్ను నాదరించి తానే నవ్వితే నవ్వెఁగాక నా-
చన్నుల మొనలా తన్ను సాదించేవి ॥ అన్ని ॥

గొనకొని తానే నన్నుఁ గూడితేఁ గూడెఁగాక నా-
పెనఁగు లాటలా తన్నుఁ బెడరేఁచేవి
యెనసెను శ్రీవేంకటేశుఁడు తానే నన్ను
చెనకులా తన్ను నేఁడు చిమ్మి రేఁచేవి ॥ అన్ని ॥ 571 ॥

రేకు 1796 హిజ్జిజి

నావల్ల గడమ యేదే నన్నేల గోరపేపేనే
యేవేళకావేళ ఇంపుసేయనైతినా ॥ పల్లవి ॥

సూడిదెగాఁ దా నెవ్వతె సుద్దులు వాతోఁ జెప్పినా
వేడుకతోఁ జెవులొగ్గి విన నైతినా
యేడనుండి వచ్చినాను యెదురుకొని మోమెత్తి
జోడుగూడి తన దిక్కు చూడనైతినా ॥ నావ ॥

చిదుముడి వింత వింత సింగారాలతో నుండఁగా
నడుమ నందుకు మెచ్చి నవ్వనైతినా
కడువేఁడి చెమటలు గారఁగాఁ దనమేను
విడువక సురటిని విసర నైతినా ‖ నావ ‖

ఇట్టె పరిమళాలు యెవ్వరివి పూసుకొన్నా
గుట్టుతోడఁ గాఁగిలించుకొన నైతినా
నెట్టన శ్రీవేంకటాద్రినిలయుఁడు నన్నుఁ గూడె
చుట్టరికము లెల్లాను చూపనైతినా ‖ నావ ‖ 572 ‖

లలిత

ఇవిఁగొన్నివట్టి ప్రియాలేల పేసీనే
తవిలి నాకాఁగిటను తనివొందుఁగాక ‖ పల్లవి ‖

యింత నాపై బత్తి గల్తే నెడమాఁట లేఁటికే
మంతనాన తానే వచ్చి మాఁటాడుఁగాక
వింతలేక మెలఁగితే వెడసన్న లేఁటికే
సంతోసాన నందరిలో చనవిచ్చుఁగాక ‖ ఇవిఁ ‖

మనసు నాపైఁ బారితే మళ్లి మళ్లి చూడనేలే
ననిచి వద్ద గూచుండి నవ్వుఁగాక
తనకే నే బాఁతైతే తలపోఁత లేఁటికే
చెనకి నారతులకుఁ జిత్తగించుఁగాక ‖ ఇవిఁ ‖

దేవులఁ గావలసితే దెరమరగేఁటికే
మోవితేనెపొత్తులకు మొనయుఁగాక
శ్రీవేంకటేశుఁడు చేరి తానే నన్నుఁ గూడె
పూవుల వేయ నేఁటికే పొందివుండుఁ గాక ‖ ఇవిఁ ‖ 573 ‖

వరాళి

కదువెరగయ్యా నీపె కతకారితనాలకు
బడిబడిఁ జిత్తగించి భావించుకోవయ్యా ॥ పల్లవి ॥

వేడుకతో నాపె వినయపుమాఁటలాడీ
యేడ నేరిచెనోకాని యీ వేసాలు
వూడిగా లెల్లాఁ జేసి వొద్దనే కాచుకున్నది
జాడతో యిందుకే యెంత చదివినోకాని ॥ కదు ॥

అందుకొని సేవసేసి ఆస నీకుఁ బెడరేఁచీ
యెందుండి తెచ్చుకొనెనో యీనయాలు
పొందుగా నేపొద్దు నీపైఁ బొంచిపొంచి బత్తిసేసీ
చెంది ఇందుకెంత సాముసేసెనోకాని ॥ కదు ॥

పన్నలు సేసి నీమోము సారెఁ జూచి నవ్వీని
యెన్నఁడు సాదించెనో యీమాయలు
నన్ను నిట్టె కూడితివి నంటున శ్రీవేంకటేశ
నున్నఁగాఁ దా యిందుకెంత నోమెనోకాని ॥ కదు ॥ 574 ॥

హిందోళం

ఇంతలేసి కోపునా యీపె నీతోను
మంతనాన గుట్టుతోనే మన్నింతువు గాక ॥ పల్లవి ॥

కలువపూవుల వేసి కనుసన్న లటుసేసి
తలకొని జవరాలిఁ దమిరేఁచేవు
మొలకనవ్వులు నవ్వి మోవినే యాసలు చూపి
యెలయించి ఆఁటదాని నెంత సేసేవు ॥ ఇంత ॥

పన్నీరు మీఁదఁ జల్లి పక్కనఁ గందువ చెప్పి
కన్న చోటనే యింతిఁ గరఁ గించేవు
చన్ను లూరకే పొగడి సళుపుఁ జూపులఁ జూచి
అన్నిటాను ముద్దరాలి నలయించ నేఁటికి ॥ ఇంత ॥

కప్పురము నోరనిచ్చి కాఁగిటను బిగియించి
చొప్పులెత్తి పువ్వుఁ బోణిఁ జొక్కించేవు
యిప్పుడే శ్రీవేంకటేశ యీకె నిట్టె యేలితివి
వొప్పగ నీ యిల్లాలి వొగి బాయ కిఁకను ॥ ఇంత ॥ 575 ॥

## శ్రీరాగం

ఇందాఁకా వెదకితివి యిదె నీవిభుఁడు వచ్చె
పొందులకోరికె లింత పోగువోయ నేఁటికే ॥ పల్లవి ॥

వెక్కసపు నవ్వులనే వెన్నెలగా ఇంచవే
చెక్కిటిచేతి చింతల చీకు దవ్వక
పక్కన వయోమదానఁ బదను లెక్కించవే
యెక్కువ విరహముల యెండగాయ నేఁటికే ॥ ఇందాఁ ॥

చెలువంపు మాటల చిలుకలఁ బిలువవే
కలఁక నిట్టూర్పుల గాలి రేఁచక
కలువ కనుచూపులఁ జలువలు చల్లవే
తలపోఁత వుమ్మదాల దైవార నేఁటికే ॥ ఇందాఁ ॥

వున్నతి నీ మోవెత్తి చంద్రోదయము గావించవే
చిన్ని మోవి ముక్కలకై సిగ్గువడక
నిన్నుఁ గూడె శ్రీవేంకట నిలయుఁ డింతటిలోనె
పన్నిల సంతోసాలు సందడించ నేఁటికే ॥ ఇందాఁ ॥ 576 ॥

## పాడి

కాఁపురాలు సేసేది యేకాలమో కాని
ఆఁపరాని తమకము లందుకోనే పట్టెను ॥ పల్లవి ॥

వాసులకే పెనఁగీని వంతులకే లాచీని
వేసర దెంతైనాఁ జెలి విభునితోను
ఆసలనే పొరలీని ఆయములే కరఁగీని
సేస వెట్టిన మొదలు చెనకనే పట్టెను ॥ కాఁపు ॥

యెగ్గెఱఁగక నవ్వీని యిట్టె మోవికి నోరూరీ
అగ్గలికెంతో కాని అంగనకును
వొగ్గి సన్న లెల్లాఁ జేసీ వొయ్యారాలే చూపీని
సిగ్గులు వచారించి చీరగట్టాఁ బట్టెను ॥ కాఁపు ॥

మునుపుగాఁగాఁగిలించీ ముచ్చటలే యాడీని
తనివి యంతటనో తరుణికిని
తను నింతలోఁ గూడె తగ శ్రీవేంకటేశుఁడు
చనవులు చెప్పుకోను సంతోసించాఁ బట్టెను ॥ కాఁపు ॥ 577 ॥

రేకు 1797 సామంతం

మగవానితో నేలే మందెమేళాలు
తగవెరిఁగి యాతఁడే దయఁజూచీఁగాక ॥ పల్లవి ॥

ఇచ్చకములే సేసి ఇంపు చల్లవలెఁగాక
కొచ్చి కొచ్చి రమణునిఁ గొసరుదురా
అచ్చముగా సరసములాడి మెప్పించుటగాక
పెచ్చు వెరిఁగి బలిమిఁ బెనఁగుదురా ॥ మగ ॥

ననుపులు వచరించి నవ్వు నవ్వవలెఁగాక
చెనకి చెనకి పతిఁ జిమ్మిరేఁతురా
వినయపుఁ జేఁతలనే వెద్దు వెట్టుదురుగాక
చనవుగలదంటాను సాదింతురా ‖ మగ ‖

తలఁపెరిఁగి రతులఁ దనియించవలెఁగాక
అలమి యలమి విభు నలయింతురా
యెలమి శ్రీవేంకటేశుఁ డీతఁ డిట్టె నిన్నుఁ గూడె
కలికితనాల నింత గరిసింతురా ‖ మగ ‖ 578 ‖

## శ్రీరాగం

చెలులాల చూడరే చెలియ చక్కఁదనము
తలఁచరా దింతంతని తలఁచుకుండారాదు ‖ పల్లవి ‖

పోలుతమా జక్కవల పొలఁతి చన్నులు నేఁడు
పోలుచరా వవి పాయుఁ బొద్దుగుంకితే
మేలిమైన కురులు తుమ్మిదలని యందమా
ఆ లీల ననకు మవి యలుకు సంపెఁగలకు ‖ చెలు ‖

యీడౌనా యీపెతొడ లేపున ననంట్లతో
యీడు గావు పారపొచ్చే లెంచితే నవి
జోడుసేతమా మొగము సొరిదిఁ జంద్రునికిని
జోడుగాదు దినమొకజోకవాఁ డతఁడు ‖ చెలు ‖

యెనసేతమా చిగురు యీపె కరపాదాలకు
[1]యెనసేయ కొకవేళ ఇవి ముదురు
పెనతమా యీలేమను ప్రేమ శ్రీవేంకటేశుతో
పెనచనేల కూడిరి పెంపున నిద్దరును ‖ చెలు ‖ 579 ‖

---

1 ఎనసేయకు+ఒకవేళ

ఆహిరి

తమక మాపగరాదు తలఁపు నిలుపఁగరాదు
కొమరెపాయపు వలపు గుబ్బతిలఁ దొడఁగె ॥ పల్లవి ॥

పిలుతునా యతని నేఁ బేరుకొని యొకమాఁటు
సొలతునా కొనగోరు సోఁకనొక్కి
తెలుతునా తనమనసు తేరకొన మాటాడి
యెలమి నాకోరికలు యీడేరు టెపుడే ॥ తమ ॥

వత్తునా నీవెంట వరుస నాతనిఁ జూడ
తెత్తునా ఇంటికిని తెలిపి చెప్పి
ఇత్తునా వీడెంబు యెదురుకొని చేతికిని
హత్తి యేమనునొకో యతఁడు నా యెడకు ॥ తమ ॥

వంతునా తనమీఁద వడిగొన్న మోహంబు
నింతునా రతిఁగూడి నేర్పులెల్లా
యింతలో శ్రీవేంకటేశుఁ డిదె నను నేలె
సంతసపుఁ గోరికలు జంటలయి పెరిగె ॥ తమ ॥ 580 ॥

ముఖారి

తెలుసుకోవే నాబుద్ధి తేట తెల్లమిగాను
ఇల నోరుపు గలితే నిన్నిటికి మంచిది ॥ పల్లవి ॥

వెంగెము దొలుత నాడి వెనక వేఁడికోవద్దు
ముంగిటనుండే పతికి మొక్కుట మేలు
కంగు వెట్టుకొని పాసి కాఁకలఁ బొరలవద్దు
అంగజకేలి మరిగి యాసపడేదానికి ॥ తెలు ॥

వూరకే వొట్టు వెట్టుక వుండలే కలయువద్దు
 సారెకు గుట్టుతోనుండే శాంతమే మేలు
 బీరముతోడఁ బెనఁగి ప్రియము చెప్పఁగవద్దు
 మేరతో మగనిమీఁద మేలుగల దానికి ॥ తెలు ॥

యెఱఁగక సిగ్గువడి యెదురు చూడఁగవద్దు
 మఱఁగులేక తగిలేమచ్చికే మేలు
 గుఱిగా నిన్ను నిప్పుడే కూడె శ్రీవేంకటేశుఁడు
 నెఱయ నీతఁడు దక్కు నీవంటి దానికి ॥ తెలు ॥ 581 ॥

పాడి

ఏఁటికి వేగిరించేరే యింతులాల
 దాఁటపుదొర యాతఁడే కరుణించీఁ గాక ॥ పల్లవి ॥

మనసెఱఁగక తొల్లే మాటలె ట్టాడఁగవచ్చు
 ననిచినఁగాక యెట్టు నవ్వవచ్చును
 మునుకు వెనకెంచక ముచ్చట లెట్టాడవచ్చు
 ఘనుఁ డాతని తలఁపు గనుకొందమే ॥ ఏఁటి ॥

పరసమాడక తొల్లె చవులెట్టు గొనవచ్చు
 పిరిగొన సోఁకకెట్టు పెనఁగవచ్చు
 తెరదియ్య కెటువలె తేరకొనఁ జూడవచ్చు
 గరిమె నాతనిబుద్ధి గనుకొందమే ॥ ఏఁటి ॥

చేరువకు రాకతొల్లె పేస లెట్టు వెట్టవచ్చు
 కూరిమెఱఁగక యెట్టు గొసరవచ్చు
 యీరీతి శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్నుఁ గూడె
 గారవిం చాతనిమేలు గనుకొందమే ॥ ఏఁటి ॥ 582 ॥

పౌరాష్ట్రం

సతికిఁ బంతము చూపఁ జనదు రమణుని తోడ
మితిమీర వినయమున మెలఁగంగవలెను ॥ పల్లవి ॥

వలచి పైకొనిన నవ్వలి పరాకై యున్న
చెలఁగి పతి కిచ్చకము సేయవలెను
పలికినను వెస మరచి పలుక కుండిన నతని-
కొలువుసేయుచు రతులఁ గొసరంగవలెను ॥ సతి ॥

కనుఁ గొనిన రాజసంబునఁ గనుఁగొనకయున్న
ననుపు చల్లుచు నతనిఁ జెనకంగ వలెను
పెనఁగినను గుట్టుతో బెనఁగ కూరకయున్న
చనవుసేసుక మోవి చవి చూపవలెను ॥ సతి ॥

సొరిది నవ్విన మనసు చూడ నటు నవ్వకున్న
నిరతమగుపొందు లటు నెరపంగ వలెను
అరిది శ్రీవేంకటేశుఁ డాతఁడే నినుఁ గూడె
సరికి బేసికి నిటుల జట్టిగొన వలెను ॥ సతి ॥ 583 ॥

రేకు 1798 రామక్రియ

పొందుసేసి రతులు పండి పొల్లవోవనిత్తురటవే
సందడించెఁ దమక మతనిఁ జక్కఁజూడవే ॥ పల్లవి ॥

కోటికొండలైన మనసుకోరికలకు గొలఁది లేదు
వాఁటమైన జవ్వనంపు వయసువారికి
వూటలగుచు మోహరసము లూరనూర నేరులవును
యేఁటి కింతసిగ్గు పతితో మాఁటలాడవే ॥ పొందు ॥

అనలుఁ గొనలు సాగినట్టి యాసలు గడించ రావు
తనివిలేని చుట్టరికపు తగులువారికి
తనువు మీఁది చక్కఁదనము దట్టమగుచు మోపులవును
ననిచె నీకు సిగ్గువడక నవ్వు నవ్వవే ॥ పొందు ॥

యెదురు దొట్టి వేడ్కలెల్ల యీఁతలాయు దాఁటరావు
వదరాని కాఁగిళ్ల వలపువారికి
యిదివో శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్నుఁ గూడె
ముదురుసిగ్గు లింకనేల మోవి చవులు చూపవే॥ పొందు ॥ 584 ॥

ఆహిరి

పదరమా ధైర్యంబు పతులకునుఁ బతులకును
చెదర కిటువలెఁ బొందు సేయవలెఁగాక ॥ పల్లవి ॥

గుదిగొన్న తమకములు కూటములకునుఁ దగులు
పొదలు నేస్తములు వలపులకుఁ దగులు
పదమదపుఁ గోరికలు సరసంబులకుఁ దగులు
యెదురుచూపులు తెగనియంపులకుఁ దగులు ॥ పద ॥

మునుకొన్న తలపోఁత మోవిచవులకుఁ దగులు
ననుపు లేపొద్దు మరి నవ్వులకుఁ దగులు
పెనగొన్న యడియాస ప్రియములకుఁ బెనుఁదగులు
చెనకుఁ జేఁతలు మదన[1]చిహ్నలకుఁ దగులు ॥ పద ॥

పోదిమాఁటలు మిగుల భోగంబులకుఁ దగులు
ఆదరింపులు సతములగుటకునుఁ దగులు
యీదెసల శ్రీవేంకటేశుఁ డింతులఁ గూడె
పొదుకొను మొక్కులే పనులకునుఁ దగులు ॥ పద ॥ 585 ॥

---

[1] 'చింహ్న' అని రేకు

## పాడి

సుదతినేర్పు లెవ్వరికినిఁ జూపిచెప్ప వసముగాదు
ఆదరిపాటు నీకు నాపె కందుకోళ్లాయను ॥ పల్లవి ॥

విరులు నిండఁ గొప్పవెట్టి వెలఁది నిన్ను నిక్కిచూచి
సురటి చాటువెట్టుకొనుచు చొక్కి వలపు దాఁచెను
వరుసఁ జెమటఁ దొప్పఁదోఁగి వలిపెపయ్యదంటు కొనఁగ
శిరసువంచి వెనకమరలి సిగ్గుదేర నవ్వెను ॥ సుద ॥

అతివ వీణె మీఁటి నీవు యచట నాలకించు టెఱిఁగి
సతుల మాఁటుసేసి యొదిగి [1]చదురుఁదనము దాఁచెను
మతిగరఁగి యంతలోనె మదనకళలు వుప్పతిలఁగ
రతులయాస చిలుకఁజూచి రమణ పన్నుసేసెను ॥ సుద ॥

వనిత పరిమళములు వూసి వాసనలు నీమీఁదఁ బొదువ
పెనఁగలేక గుట్టులోనె బిగువులెల్ల దాఁచెను
యెనసితివి శ్రీవేంకటేశుఁడ యీకె నిన్ని చందములను
చెనకుచును నినుఁ బలుదెఱంగుల చిత్తమలరఁజేసెను ॥ సుద ॥

## హిజ్జిజి

మూడఁ బిన్నవుగాని నీ జూటుఁజేఁత రెంచరావు
యీడు మిగిలినట్టి పగటు లెందు నేర్చుకొంటివే ॥ పల్లవి ॥

చొక్కపుమోవిఁ దేనెలొలుక సుద్దులు చెప్పుచు నాయకునకును
చక్కనిమోము చూపి యతని చనవు చేకొంటివే

[1] చదురుఁదనము = చతురత్వము. 'చతురురాలు' అనుటకు 'చదురాలు' అనియు ఈ వాఙ్మయమున గలదు.

జక్కవచన్నులు దాఁకఁగదీసి చల్లుఁజూపుల మనసు గరఁచి
యెక్కడలేని కలికితనము లెందు నేర్చుకొంటివే ॥ చూడఁ ॥

నవ్వులు చెక్కుల నారుకొనఁగ నయముఁ బ్రియము దైలువార
పువ్వుల వేసి యతని నెట్టు పొందుసేసుకొంటివే
దువ్వటంపు చెఱఁగు మొరయ తోడు దోడ సురటి విసరి
ఇవ్వల నతని మరపుకొనఁగ నెందు నేర్చుకొంటివే ॥ చూడఁ ॥

పిగ్గుల చేఁతలు బయులు పడఁగ సేవలుసేసి చవులురేఁచి
వెగ్గళమైనయతని మన్నన వెలయఁ జేసుకొంటివే
నిగ్గుల శ్రీవేంకటేశుఁడు నేఁడు నన్నుఁ గాఁగిటఁగూడె
యెగ్గులులేని రతులు నీవు నెందు నేర్చుకొంటివే॥ చూడఁ ॥ 587 ॥

రేకు 1799 నాదరామక్రియ

పతికి విన్నవించఁగదరే పడఁతులాల
యీకె తెఱఁగు కతలు చెప్పనేల యతఁడే కరుణఁజూచుఁగాక
॥ పల్లవి ॥

చిమ్మిరేఁగి చెలియమేనఁ జెలప చెలప చెమట లూరె
వుమ్మగిలుచు మోహజలధి వుబ్బెనోకాక
ముమ్మరముగఁ గొప్పగాను ముడిచినట్టి నెరులు చెదరె
అమ్మరో సంపెంగనాపిక కలులు బెదరెనోకాక ॥ పతి ॥

కారుకమ్మి మిగులఁ గలికి కన్నులందుఁ గెంపు దేరె
తోరమగుమదరాగరసములు తొట్టెనో కాక
వారుకొనుచు బులకగములు నవకముగను నిండుకొనియె
కోరికలు జవ్వనపుఁ బదనున కొనలుసాగెనో కాక ॥ పతి ॥

వెక్కసంపు టూర్పు లెపుదు విసరఁదొడఁగె లోలోనె
తక్కకీ తమకములు రతి కెడలాఁకుచున్నవోకాక
యిక్కడికిఁ దా వచ్చి మగువలు యేలె శ్రీవేంకటగిరీశుఁడు
చక్కఁగా నిపు డీకె నోములు సఫలమాయనోకాక ॥ పతి ॥ 588 ॥

## పాడి

ఎఱఁగ మింత వెకలివవుత ఇంతగాలము నిన్నుఁబెంచితి
గుఱుతు లెన్నఁడుఁ గాన మిపుడు కొత్తలాయనే ॥ పల్లవి ॥

ముక్కుచెరమల నిట్టూర్పులు ముంచి చన్నులమీఁదఁ బొలయఁగ
చెక్కిటి చెమటలు గోరికొనలనుఁ జిమ్ముకొంటాను
చిక్కులుదేరిన నెరుల పాపట చేత నొయ్యనే వొయ్యన దువ్వుచు
యెక్కడనుండి వచ్చేవే చెలియ యెంతబిన్నాణివే ॥ ఎఱఁ ॥

వీడియు వీడని తురుములోని విరులు మెల్లనె రాలఁగాను
చోదుముట్టుచు వీనుల జవ్వాది సొరిది జారఁగా
వాడిన చిగురుమోవిమీఁది వన్నెలు చేత నదుముకొనుచు
యేడనుండి వచ్చేవే చెలియ యెంత వొయ్యారివే ॥ ఎఱఁ ॥

మేలిమి పులక జాజినవలు మేనునిండ జాజుకొనఁగ
వాలుఁగన్నులకెంపుడాలు వలపు దెలుపఁగా
యీలీలఁ జనవులొసఁగి శ్రీవేంకటేశుఁడు నినుఁగూడఁబోలు
యేల ఇంక బొంకులునెరప నెంతబిత్తరివే ॥ ఎఱఁ ॥ 589 ॥

## శంకరాభరణం

జవ్వనంబు రూపురేఖ చాలఁ గలిగినట్టి ప(ఫ?)లము
పువ్వువంటి యాసతోడి పొందు కామధేనువే ॥ పల్లవి ॥

మనసుమర్మమెరిఁగితేను మాటలెల్ల సమ్మతవును
చనవు గలుగఁజేసుకొనిన పలిగెఁగలుగును
పెనఁగ నేర్పు గలిగితేను ప్రియము లంతకంత కడరు
వనితలకును మగనిమీఁది వలపు కామధేనువే ॥ జవ్వ ॥

తగ వెరింగి మెలఁగితేను తలఁపులెల్లఁ జక్కనౌను
నగుమొగంబు సేసుకొన్న నాఁటుఁ బ్రియములు
మిగులననుపు సేసుకొనిన మేలమాడఁ జవులు వుట్టు
చిగురు గలిగి కొనలు సాగు చెలిమి కామధేనువే ॥ జవ్వ ॥

ఇచ్చకములు నెరప నెరప నిన్నిటాను మేలుగలుగు
కచ్చుపెట్టి కాచుకున్నఁ గలుగు వేడ్కలు
యెచ్చరించి శ్రీవేంకటేశుఁ డిపుడె నిన్నుఁ గూడె
మెచ్చఁజేసి కలయురతులమేలు కామధేనువే ॥ జవ్వ ॥ 590 ॥

## ముఖారి

ఈవిలాసంబులును యీ చక్కఁదనములును
భావించి చూడ నీపడఁతికే తగును ॥ పల్లవి ॥

నలినాక్షి చెక్కులివి నవ్వు వెన్నెల పొలము
విలుసాముగరిడి బొమ్మలకు నొసలు
పలుకుఁజిలుకకు మోవి పంజరపు దండెంబు
నలిఁగుంతలములకాణాచి పెనుఁగొప్పు ॥ ఈవి ॥

గురు కుచము లివియే సిగ్గులకుఁ బుట్టిన ఇండ్లు
సరసముల కిరవు హస్తముల కదలు
సురత విభవముల దాఁపురమున వెయ్యపు బిరుఁదు
కరులయానముల నిలుకడ వనము తొడలు ॥ ఈవి ॥

అన్నువగు నడుము గుట్టనెడి సింహపు నెలవు
తిన్నని మొగము కళలు దేరు తెంకి
మన్నించి యేలితివి మరిగి శ్రీవేంకటేశ
ఇన్ని సింగారముల లెనసె నీలలన ॥ ఈవి ॥ 591 ॥

ఆహిరి

విన్నవించరే పతికి వెలఁదులాల
సన్నలనే ఆసలెల్లా జాజుకొనెఁ గదరే ॥ పల్లవి ॥

తలపోసి తలపోసి తమకము దైలువారె
మొలకలై పులకలు మోసులెత్తెను
పిలువఁగాఁ బిలువఁగా ప్రియములు చిమ్మిరేఁగె
కలికి భావము చెప్ప గతలాయఁగదరే ॥ విన్న ॥

యెదురులు చూడఁ జూడ యెదురెక్కెఁ గోరికలు
ముదిరి నివ్వెరగులు ముప్పిరిగొని
వెదకఁగా వెదకఁగా వేడుకలు దొట్టుకొనె
సుదతి చందము లింత సూటికెక్కెఁగదరే ॥ విన్న ॥

నవ్వి నవ్వి నట్లానే నాఁటుకొనె మమతలు
వువ్వాళ్లూరి చెమటలు వూటలెత్తెను
ఇవ్వల శ్రీవేంకటేశుఁ డింతలోనె కూడఁగాను
జవ్వని సంతోసాలు సతమాయఁగదరే ॥ విన్న ॥ 592 ॥

రేకు 1800 ఆహిరి

ఏల తన్ను దూరేను ఇక్కడికి రమ్మనవే
తాలిమి గలిగితేను దయపుట్టుఁ గాక ॥ పల్లవి ॥

ఇచ్చకము లాడితేను ఇందు రమ్మందును గాక
 కొచ్చి వెంగేలాడితేను కూడునా పొందు
వచ్చినట్టే వచ్చితేను వలపు చవౌఁగాక
 యెచ్చుకుందై పెనఁగితే నెరవులే కావా ॥ ఏల ॥

వినయముతో మొక్కితే వేడుకలు వుట్టుఁగాక
 వొనరనియడియాస లొద్దిక లౌనా
ననపుతో నవ్వితేను నాఁటుఁగాక ప్రియములు
 మనసురాని పనులు మరి ఇంపులౌనా ॥ ఏల ॥

బత్తిసేసి పిలిచితే భావము గరఁగుఁగాక
 వొత్తు కోళ్లైనరతు లొడఁబడీనా
ఇత్తల శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్నుఁ దానె
 హత్తి ఇంత లేకుండితే నాటపాట వలపు ॥ ఏల ॥ 593 ॥

## ముఖారి

ఎంతసేసెఁ జూడరే ఇంతి జవ్వనపాయము
 అంతలోనే వేడుకలూ నట్టె యొన గూడెను ॥ పల్లవి ॥

తెగనియాసోదము తీగెలు సాగిసాగి
 సాగసి వలపులై చుట్టుకొనెను
తగులు విరులైనట్టి తమకము లుప్పతిలి
 మొగము చూడఁగానే ముంచుకొనెఁ బ్రేమము ॥ ఎంత ॥

వులివచ్చి తలపోఁత లుమ్మగిలి వుమ్మగిలి
 చెలికిఁ జుట్టరికమై చిగిరించెను
చలిమి బలిమితోడి సరసము లుక్కుమీరి
 నిలువుకు నిలువే నిండె నివ్వెరగులు ॥ ఎంత ॥

చేవ మీరిన సిగ్గులు చిమ్మిరేఁగి చిమ్మిరేఁగి
వేవేలు మంతనములై వెల్లివిరిసె
శ్రీవేంకటేశ్వరుని చిత్తజకేలి రతులు
యీవేళ నలమేల్మంగ కిరవాయఁ గళలు ॥ ఎంత ॥ 594 ॥

### కాంబోది

ఏమి సేసితివో చెలి ఇంత నీకు మోహించె
చూమరసేయక ఇంతిఁ జూతువు రావయ్యా ॥ పల్లవి ॥

వనిత చెక్కిటిచేత వలపులు దొంతివెట్టె
వొనరఁగ నాసలకు వొడిగట్టెను
తనివోని మంతనాల తమకము వెదవెట్టె
జనుగక రమణినిఁ జూతువు రావయ్యా ॥ ఏమి ॥

పక్కనఁ దలపోఁతల బయలువందిలి వెట్టె
చిక్కని చిరుసిగ్గునఁ జీరగట్టె
వొక్కలపుఁ గోరికల ముసుఁగు నిండాఁ బెట్టె
చొక్కముగ జవరాలిఁ జూతువు రావయ్యా ॥ ఏమి ॥

వసివాఁడుమోవి దేనె వైపుగానే వడివెట్టె
కొసరుచు గుట్టుననే గోడవెట్టె
యెసగ శ్రీవేంకటేశ యేలితి వలమేల్మంగను
సుసరానఁ జెలినేర్పు చూతువురావయ్యా ॥ ఏమి ॥ 595 ॥

### మధ్యమావతి

పెచ్చువెరిగీ నింతిప్రియములు లోలోనె
యిచ్చక మేమాడుదమే నెచ్చెలులాల ॥ పల్లవి ॥

తమకము లుప్పతిల్లి దైలువారఁదొడఁగి
చెమరించె మేనెల్లా చెలియకును
కొమరెపాయ మందుపై కుప్పలు దెప్పలు నాయ
ఇముడక, వుపచారా లేమిసేతమే ‖ పెచ్చు ‖

తలపోఁత లుక్కుమీరి తడఁ బడఁగఁ దొడఁగి
పులకించెఁ జెక్కు లిట్టె పొలఁతికిని
పెలుచువలపు పెండ్లి పేరటముగా విడిసె
కలికి భావము చెప్ప గతలాయెనే ‖ పెచ్చు ‖

సరసము లెడచొచ్చి చవులు రేఁచఁ దొడఁగి
కరఁగించె నెమ్మనము కలికికిని
యిరవై శ్రీవేంకటేశుఁ డింతలో నీసతిఁగూడె
[1]యెరవులేనీతనితో నేమందమే ‖ పెచ్చు ‖ 596 ‖

ముఖారి

కడుమేటి జవరాలు కలికిచేఁతల కీలు
పిడికిటితలఁబాలు పెట్టీ నీకెఁ జూడరే ‖ పల్లవి ‖

కన్నుల చూపులతేట కమ్మఁజెమటలవూట
పిన్నమొగముపై గొప్ప పెట్టినికోట
యెన్నఁగఁ గంఠనాదము ఇమ్మల కోవిలపాట
యెన్నిటికి గురియాయ నింతిఁ జూడరే ‖ కడు ‖

జక్కవచన్నుల చొప్ప చక్కఁదనముల చొప్ప
పక్కన జారిననునుఁ బయ్యెద కప్ప
అక్కజపునె న్నడుము అరిదిసింగమునెప్ప
యిక్కువైన సింగారాల యీకెఁ జూడరే ‖ కడు ‖

---

[1] ఎరవులేని + ఈతనితో

పెలవి నవ్వుల నిగ్గు చిప్పిలు రతులపిగ్గు
కెలఁకుల మోవిమీఁదికెంపులకగ్గు
యెలమి శ్రీవేంకటేశుఁ డిప్పుడిట్టె యీకెఁ గూడె
వెలలేని వేడుకల వెలఁదిఁ జూడరే ॥ కడు ॥ 597 ॥

## భైరవి

ఈ సొబగు లెచటఁగల వీపె యందే కాక
వాసివంతుల నీకెను వర్ణింప వసమా ॥ పల్లవి ॥

అలివ పద్మినిగనక యలికుంతలి యనదగు
సితచంద్రముఖిగాన జిగిఁ జకోరాక్షి యగు
తలిఁ బువ్వుఁబోడిఁగన తగులుఁ బికవాణి యన
చతురబిసహస్తగన శంఖగళ యగును ॥ ఈసొ ॥

హరిమధ్యగన చెలియ గ్రిదికుచ యనదగును
గరిమ నాభి సరసిగన వళితరంగ యగు
వురుచక్రజఘనగన యూరుయుగ యనదగును
గురుహంసయానగన కూర్మపద యగును ॥ ఈసొ ॥

కలిత కనకాంగిగన కాంతమణినఖ యగును
జలధి గంభీరగన పరసామృతాదర యగు
యెలమి శ్రీవేంకటేశుఁ డెనపెఁగన సిరియగును
కలిత శృంగారగన కల్యాణి యగును ॥ ఈసొ ॥ 598 ॥

శ్రీ శ్రీ శ్రీ

## విశేషాంశాలు:

సంకీ. 145: 'కరియమాణిక్కెదేవుడా': నగరి నడిబొడ్డులో ఉభయనాంచారులతో వెలసిన నిలువెత్తు అర్చామూర్తిని 'కరియమాణిక్కెం' దేవుడని వ్యవహరిస్తారు. అతిపురాతనమైన ఈ శిథిల దేవాలయం తిరుమల తిరుపతి దేవస్థానాల ఏలుబడిలో ఈ మధ్యనే చేరి పురావైభవాన్ని సంతరించుకొంటున్నది. కరియమాణిక్కెం వరదరాజస్వామిగ వినుతికెక్కిన ఈ వేలుపును దర్శిస్తే ఆయురారోగ్యఐశ్వర్యాలు చేకూరుతాయనేది విశ్వాసమే కాదు, అనుభవసత్యం కూడ. ఈ ఆలయం అదుగున సుందర మండపాలతో ప్రాకారాలతోకట్టడాలున్నవని స్థానికులు పేర్కొంటారు. ఆలయ ప్రాకారంలో త్రవ్వకాలు జరిపినప్పుడు కొన్ని శిలామూర్తులు కూడ లభించినవి. గజేంద్రుని కాపాడిన 'వరదు'డితడేయని, గజేంద్రమోక్షానికి సంబంధించిన గాథ ఇక్కడే జరిగినదని స్థానికులు కథలు చెబుతారు.

అన్నమయ్యపాటల్లో చోటుచేసుకొన్న వేలుపితడేయని నా విశ్వాసం.

సంకీ. 314: గండికోట చెన్నకేశవుడు. గండికోట చారిత్రాత్మకమైనది. రాయలసీమలో కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరులోని కొన్నిభాగాలు కలసి కడపసీమగ అలనాడు వ్యవహరించేవారు. ఇందులో గండికోట, రేనాడు, పొత్తపినాడు మూడు మండలాలుగ విభజించినారు. ఈ గండికోట 'బాలనాగమ్మ' కథకు పునాది వేసినది. కడపజిల్లా జమ్మలమదుగు సమీపంలో వెలసిన ఈ గండికోట కొన్ని శతాబ్దాల రాజకీయచరిత్రను వినిపిస్తుంది. కోటలోపల ఎన్నో శిథిల దేవాలయాలున్నవి. చెన్నకేశవుడు లేక చిన్నబోయిన దేవాలయం ఉలులగిలిగిం

తలకు మురిసిన శిలల శిల్పాలు ఆలపించే విషాదగీతికలను నేటికీ వినవచ్చు. సంకీర్తనాచార్యుని కాలము నాటికి 'గండికోటచెన్నకేశవుడు' ఎన్ని వైభవాలలో తేలినాడో.

సంకీ. 328/367: 'గొడుగుమద్ది చెన్నరాయుని', 'పుట్టపర్తి వేంకటేశ్వరు'ని వెదకి పట్టవలె.

* * *

# 1. అనుబంధము

## అకారాదిగ రాగ సంకీర్తన సంఖ్యాసూచి

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| అమరసింధు | .. 89, 317 |
| ఆందోళి | .. 56, 64 |
| ఆహిరి | .. 8, 25, 45, 48, 54, 79, 111, 140, 164, 179, 186, 187, 190, 203, 236, 243, 267, 272, 274, 289, 306, 321, 323, 339, 344, 357, 369, 376, 399, 402, 406, 428, 435, 439, 464, 477, 491, 520, 525, 550, 567, 580, 585, 592, 593 |
| ఆహిరినాట | .. 98, 125, 245, 257, 390, 417, 461, 482, 506, 533 |
| కన్నడగౌళ | .. 80, 268, 469; 539 |
| కాంబోది | .. 23, 34, 72, 83, 85, 131, 188, 218, 237, 250, 313, 346, 370, 373, 420, 431, 459, 470, 489, 504, 530, 571, 595 |
| కురంజి | .. 37, 551 |
| కేదారగౌళ | .. 375, 564 |
| కొండమలహరి | .. 91 |
| గుజ్జరి | .. 84, 205, 295 |

| రాగములు | | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| గౌళ | .. | 11,28, 42, 50, 57, 74, 81, 115, 138, 165, 167, 170, 173, 175, 213, 255, 277, 303, 332, 362, 371, 380, 412, 427, 499, 500, 527, 535, 559 |
| తెలుఁగుఁగాంబోది | .. | 108, 239, 264, 421, 463, 483, 507 |
| తోండి | .. | 93, 123, 132, 326 |
| దేవక్రియ | .. | 61 |
| దేవగాంధారి | .. | 19, 262, 266, 422 |
| దేశా(సా)క్షి | .. | 36, 44, 68, 104, 193, 404 |
| దేశి | .. | 18, 204, 327 |
| దేసాళం | .. | 1, 46, 53, 65, 86, 99, 105, 133, 137, 145, 168, 176, 202, 241, 244, 301, 310, 343, 352, 377, 423, 440, 467, 472, 510, 531, 546 |
| ద్రావిళభైరవి | .. | 436 |
| ధన్నాసి | .. | 103, 524 |
| నట్టనారాయణి | .. | 119, 248, 528 |
| నాగవరాళి | .. | 59, 329 |
| నాదరామక్రియ | .. | 60, 113, 126, 144, 216, 228, 299, 311, 396, 403, 418, 432, 486, 493, 545, 552, 588 |

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| నారాయణదేశాక్షి | .. 415 |
| నారాయణి | .. 26, 466 |
| పళవంజరం | .. 76, 124, 157, 240, 389 |
| పాడి | .. 3, 14, 33, 39, 62, 75, 92, 96, 120, 135, 153, 159, 171, 195, 209, 222, 227, 229, 254, 258, 302, 305, 308, 324, 333, 340, 347, 363, 378, 387, 400, 430, 448, 456, 484, 495, 522, 532, 540,544, 556, 568, 577, 582, 586, 589 |
| పూర్వగౌళ | .. 128, 225 |
| బంగాళం | .. 110, 169 |
| బౌళి(భవుళి) | .. 15, 22, 51, 63, 90, 141, 149, 152, 183, 192, 198, 207, 211, 231, 253, 270, 284, 290, 309, 330, 354, 366, 372,384, 394, 397, 405, 442, 450, 453, 460, 490, 502, 511, 529, 537, 554, 565 |
| (బౌ)ళిరామక్రియ | .. 341 |
| భల్లాటి | .. 154 |
| భూపాళం | .. 20, 109, 265 |
| భైరవి | .. 27, 49, 163, 196, 259, 282, 291, 351, 457, 462, 521, 541, 598 |

| రాగములు | | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| మంగళకౌశిక | .. | 17, 88, 102, 212, 226, 286, 331, 410 |
| మధ్యమావతి | .. | 6, 146, 480, 596 |
| మాళవి | .. | 134 |
| మాళవిగౌళ | .. | 100, 143, 194, 246, 271, 287, 304, 322, 355, 374, 441, 481, 488 |
| ముఖారి | .. | 32, 38, 73, 95, 129, 130, 155, 178, 182, 197, 206, 238, 260, 281, 297, 316, 334, 349, 365, 398, 407, 449, 474, 494, 515, 534, 549,558, 560, 581, 591, 594, 597 |
| రామక్రియ | .. | 12, 58, 101, 208, 275, 292, 312, 315, 338, 350, 367, 401, 434, 445, 458, 475, 479, 513, 536, 548, 584 |
| రేవగుప్తి | .. | 298 |
| రీతిగౌళ | .. | 97, 151, 471 |
| లలిత | .. | 21, 30, 41, 70, 117, 121, 156, 162, 172, 191, 219, 234, 279, 285, 288, 325, 348, 382, 433, 447, 478, 496, 519, 526, 553, 562, 573 |

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| వరాళి | .. 2, 9, 10, 24, 31, 52, 69, 87, 94, 106, 112, 116, 136, 142, 147, 166, 181, 214, 233, 242, 261, 269, 280, 294, 318, 320, 360, 364, 368, 385, 425, 437, 444, 473, 503, 509, 538, 557, 566, 574 |
| వసంతం | .. 424 |
| వసంతవరాళి | .. 498 |
| వేళావళి | .. 296, 336, 361, 497 |
| శంకరాభరణం | .. 118, 247, 252, 263, 395, 413, 416, 454, 523, 590 |
| శ్రీరాగం | .. 4, 55, 150, 273, 419, 429, 451, 487, 505, 576, 579 |
| శుద్ధదేశి | .. 71, 307, 517, 563 |
| శుద్ధవసంతం | .. 5, 7, 43, 148, 201, 210, 217, 512, 570 |
| శోకవరాళి | .. 29 |
| సామంతం | .. 13, 40, 67, 127, 160, 184, 235, 249, 256, 300, 314, 328, 337, 379, 383, 388, 393, 408, 452, 476, 508, 542, 561, 578 |
| సామవరాళి | .. 335, 514, 547 |

| రాగములు | సంకీర్తన సంఖ్యలు |
|---|---|
| సాళంగం | .. 77, 158, 177, 180, 200, 220, 276, 293, 353, 356, 392, 443, 569 |
| సాళంగనాట | .. 16, 78, 122, 139, 185, 221, 223, 251, 319, 359, 386, 391, 438, 446, 465, 468, 492, 543, 555 |
| సింధురామక్రియ | .. 224, 409, 414 |
| సౌరాష్ట్రం | .. 35, 66, 82, 161, 199, 232, 278, 342, 345, 455, 485, 501, 583 |
| హిందోళం | .. 47, 189, 215, 575 |
| హిందోళవసంతం | .. 107, 114, 411 |
| హిజ్జిజి(జ్జి) | .. 174, 230, 283, 358, 381, 426, 518, 572, 587 |

# 2. అనుబంధము

## అకారాదిగ సంకీర్తన రాగ సంఖ్యాసూచి

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| అంగన | బౌళి | 141 |
| అంటిముట్టిన | సాళంగం | 392 |
| అంతటఁబో | నారాయణదేశాక్షి | 415 |
| అంతనేరుపరి | పాడి | 153 |
| అంత సేసి | ముఖారి | 334 |
| అంతా నీ | మధ్యమావతి | 480 |
| అంతేపని | పాడి | 120 |
| అంతేసి | దేశి | 327 |
| అందరి | దేసాళం | 472 |
| అందరు | బౌళి | 90 |
| అందాఁక | శంకరాభరణం | 454 |
| అందుకందుకు | బౌళి | 183 |
| అందు కేమి దోసమా | దేసాళం | 65 |
| అందు కేమి నీతో | మంగళకౌసిక | 212 |
| అందు కేమి రావయ్య | లలిత | 433 |
| అందు కే యెదురు | సౌరాష్ట్రం | 342 |
| అటని | నాదరామక్రియ | 126 |
| అటువంటి | లలిత | 553 |
| అట్టైకాచు | పాడి | 14 |
| అట్టైకాదా | తెలుఁగుఁగాంబోది | 463 |
| అడవి | సామంతం | 249 |
| అది నామేలే | మంగళకౌసిక | 286 |
| అద్దమరేతిరి | ముఖారి | 534 |
| అద్దోయెక్కడి | ఆహిరి | 25 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| అవకువే | ఆహిరినాట | 125 |
| అనుమాన | బౌళి | 502 |
| అనుమానించక | పాడి | 308 |
| అన్నిటా జాణఁడు అల | లలిత | 562 |
| అన్నిటా జాణఁడు తాను | కాంబోది | 571 |
| అన్నిటా నేర్పరు | దేసాళం | 1 |
| అన్నిటా భాగ్య | దేసాళం | 86 |
| అన్నిబిన్నాణాలు | బౌళి | 490 |
| అన్నియు | వరాళి | 24 |
| అపుడే | దేసాళం | 244 |
| అప్పుడే | గుజ్జరి | 84 |
| అలయికెరఁగ | ఆహిరి | 79 |
| అలుకెల్లా | మంగళకౌశిక | 410 |
| అవురవురా | తోండి | 123 |
| అవ్వలిమో | ఆహిరి | 306 |
| ఆఁటదానిఁ | పాడి | 3 |
| ఆఁటదాని | దేశి | 204 |
| ఆఁడుజన్మ | ఆహిరి | 399 |
| ఆకెకు | పళవంజరం | 124 |
| ఆకెవింటే | పాడి | 540 |
| ఆడనుండి | అమరసింధు | 317 |
| ఆడవద్దా | దేసాళం | 423 |
| ఆడుకొంటేఁబెద్ద | భైరవి | 541 |
| ఆడుకోఁగలిగె | ముఖారి | 407 |
| ఆతఁడువీకుఁదగు | బంగాళం | 169 |
| ఆతఁడునీవాడి | సాళంగనాట | 438 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| ఆతఁడే నీవు | నాదరామక్రియ | 299 |
| ఆతనికి నాల | ముఖారి | 260 |
| ఆతనికి లోనైతే | దేవగాంధారి | 422 |
| ఆతని మహిమో | హిందోళవసంతం | 411 |
| ఆనతీవయ్యనాతో | బౌళి | 211 |
| ఆనతీవయ్య యేమిటా | నాదరామక్రియ | 396 |
| ఆపె ఆతని | సాళంగం | 158 |
| ఆపె ఎఱఁగ | పాడి | 484 |
| ఆపెకు నమరునా | గౌళ | 170 |
| ఆపెకును | లలిత | 285 |
| ఆపె గలిగుండఁగా | వరాళి | 136 |
| ఆపెనేను | లలిత | 325 |
| ఆపెవచ్చె | సామంతం | 383 |
| ఆమీఁది | బౌళి | 192 |
| ఆయఁదొర్లె | ఆహిరి | 435 |
| ఆయనాయఁ | సౌరాష్ట్రం | 199 |
| ఆయనాయరా | లలిత | 172 |
| ఆయలే | సాళంగం | 353 |
| ఆసపడ్డ | రామక్రియ | 401 |
| ఇంకనిన్ను | ఆహిరినాట | 98 |
| ఇంకనీతలఁపు | శంకరాభరణం | 263 |
| ఇంకనేడ | కాంబోది | 489 |
| ఇంకనేలనీవే | శ్రీరాగం | 429 |
| ఇంకనేలబొంకేవు | పాడి | 522 |
| ఇంకనేలే | సామవరాళి | 335 |
| ఇంకనైనా నుపకార | భైరవి | 196 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| ఇందుకే పెండ్లాడి | దేసాళం | 53 |
| ఇందుకేపో | బౌళి | 231 |
| ఇందుకే వెరగయ్యీ | బౌళి | 384 |
| ఇందునున్న | ఆహిరి | 272 |
| ఇందులోనఁదప్ప | బౌళి | 372 |
| ఇందువంకనేమిగద్దు | గౌళ | 380 |
| ఇందువంకనేమివచ్చీ | శుద్ధవసంతం | 148 |
| ఇక్కడనిందరి | సాళంగం | 180 |
| ఇచ్చకురాల | శ్రీరాగం | 273 |
| ఇచ్చితిమి | ముఖారి | 155 |
| ఇచ్చితివా | సామంతం | 160 |
| ఇటువంటినే | భల్లాటి | 154 |
| ఇటువంటిసుద్దుల | పాడి | 254 |
| ఇట్టెనాకు | పాడి | 568 |
| ఇట్టెబ్రమసి | బౌళి | 366 |
| ఇతరుల | హిజ్జిజి | 381 |
| ఇతవరుల | సౌరాష్ట్రం | 455 |
| ఇతవుగా | కన్నడగౌళ | 469 |
| ఇద్దరము | రీతిగౌళ | 97 |
| ఇది నీపెద్ద | వరాళి | 509 |
| ఇదివోనా | కాంబోది | 530 |
| ఇదివోమా | శంకరాభరణం | 413 |
| ఇదివోమా విన్నప | సాళంగనాట | 468 |
| ఇదివోమాసాజము | లలిత | 447 |
| ఇదెఱఁగ | కాంబోది | 313 |
| ఇద్దరము | బౌళి | 253 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| ఉండనుండఁజవు | లలిత | 234 |
| ఉన్నదాన | కాంబోది | 188 |
| ఉన్నవారిఁదడ | వరాళి | 242 |
| ఉప్పచింది | రామక్రియ | 338 |
| ఊరకుంటే | బౌళి | 453 |
| ఊరకున్న | శుద్ధవసంతం | 5 |
| ఊరకె గుట్టు | రామక్రియ | 58 |
| ఊరకే తెమలు | గౌళ | 559 |
| ఊరకేనే | శంకరాభరణం | 247 |
| ఊరకేవుండఁగ | ముఖారి | 95 |
| ఊరకే వున్నాఁడితఁడు | పాడి | 135 |
| ఎంచినట్టు | వరాళి | 360 |
| ఎంతకంతే | హిజ్జిజి | 358 |
| ఎంతకు | ఆహిరి | 140 |
| ఎంతటివాఁడవు | భైరవి | 259 |
| ఎంతనన్ను | కన్నడగౌళ | 539 |
| ఎంత నీరాజన | గౌళ | 303 |
| ఎంతనీవు | ఆహిరి | 236 |
| ఎంతపాప | సాళంగం | 220 |
| ఎంతమందె | వరాళి | 166 |
| ఎంతమేలు | దేశాక్షి | 36 |
| ఎంతలేదు | పాడి | 333 |
| ఎంతవడి | దేసాళం | 176 |
| ఎంతవాఁడ | రామక్రియ | 292 |
| ఎంతవాఁడి | నాదరామక్రియ | 403 |
| ఎంతవేదుకో | తెలుఁగుఁగాంబోది | 264 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| ఎంతసేసెఁజూడరే | ముఖారి | 594 |
| ఎంతసేసేవిందు | వేళావళి | 296 |
| ఎంతసేసేవు | మాళవిగౌళ | 287 |
| ఎంతసేసేవేమయ్యా | గౌళ | 115 |
| ఎంతైన నీయాల | బౌళి | 405 |
| ఎందాఁకా నెడమాట | ఆహిరి | 190 |
| ఎందాఁకావట్టి | దేసాళం | 301 |
| ఎందాఁకావిన్నపాలు | శ్రీరాగం | 150 |
| ఎందువోయీ | శుద్ధదేశి | 307 |
| ఎందువోయే | గౌళ | 255 |
| ఎక్కడపరాకు | హిందోళవసంతం | 114 |
| ఎక్కినవాని | సాళంగం | 177 |
| ఎగ్గుపట్టేవు | మధ్యమావతి | 146 |
| ఎచ్చరించ | లలిత | 288 |
| ఎటువంటి జాణ | పళవంజరం | 76 |
| ఎటువంటి నీపై | లలిత | 30 |
| ఎట్టిదేవరవు | సాళంగనాట | 251 |
| ఎట్టు మఱవఁగ | ఆందోళి | 56 |
| ఎట్టువలసినఁజేయు | నాగవరాళి | 329 |
| ఎట్టుసేసి | గౌళ | 28 |
| ఎడమాట | కాంబోది | 459 |
| ఎదిటికి | గౌళ | 427 |
| ఎదిటిపంత | ముఖారి | 129 |
| ఎదుటనుండిన | సింధురామక్రియ | 409 |
| ఎదుటనున్నాఁడ | గౌళ | 535 |
| ఎదురుబడి | లలిత | 117 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| కాఁపురాలు | పాడి | 577 |
| కాచుకున్న | కాంబోది | 83 |
| కాదందునో | కాంబోది | 470 |
| కాదని తొలఁగ | వరాళి | 181 |
| కాదనేమా | దేసాళం | 531 |
| కానవచ్చె | ఆహిరినాట | 461 |
| కానీకానీ | వరాళి | 318 |
| కానీకానీ | సాళంగనాట | 319 |
| కానీరా | సాళంగనాట | 386 |
| కానీవయ్యఅందు కేమి | పాడి | 363 |
| కానీవయ్యదానికేమి | భైరవి | 351 |
| కానీవయ్యనీమేలు | బౌళిరామక్రియ | 341 |
| కానీవయ్యా | ఆహిరి | 179 |
| కదుగోల | దేశాక్షి | 44 |
| కూడినవేళ | బౌళి | 15 |
| కైకొనేఁగాక | దేసాళం | 168 |
| కొమ్మలు | సామంతం | 379 |
| కోరివింద | ఆహిరి | 550 |
| గయ్యాళితనము | ఆహిరి | 186 |
| గొల్లదోమటాయు | ముఖారి | 365 |
| ఘనుఁడవు | కాంబోది | 431 |
| చక్కనుండవే | పాడి | 387 |
| చనవుచెల్లించ | బౌళి | 442 |
| చాలుఁజాలు | కురంజి | 37 |
| చాలుఁజాలు | దేసాళం | 133 |
| చాలు నూరకే | ఆహిరి | 323 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| చేరి నీకు నేమెల్లా | తోండి | 326 |
| చేరినీకు విన్నపాలు | పాడి | 400 |
| చేరినీతో | సామంతం | 561 |
| చేరిమొక్కరే | పాడి | 33 |
| చేసన్నకేవచ్చి | గౌళ | 527 |
| చేసినట్టల్లా | సాళంగం | 77 |
| జవ్వనంబు | శంకరాభరణం | 590 |
| తగవెంచుకొన | అమరసింధు | 89 |
| తగు నీకూ | శుద్ధవసంతం | 43 |
| తనకు లేకున్నా | ముఖారి | 32 |
| తనకేలే | నాదరామక్రియ | 418 |
| తమకమాపఁగరాదు | ఆహిరి | 580 |
| తలఁచి యిటు | వరాళి | 69 |
| తలఁచుకో | గౌళ | 81 |
| తానెక్కడ | శుద్ధవసంతం | 570 |
| తానేల లోఁగీ | గౌళ | 11 |
| తానేల సిగ్గువడీ | దేవగాంధారి | 19 |
| తెరవేయురే | పాడి | 556 |
| తెలుసుకోవే | ముఖారి | 581 |
| తొల్లింతనేరవు | ముఖారి | 474 |
| తొల్లిఇంత | నాగవరాళి | 59 |
| దయగలవాఁడు | పాడి | 302 |
| దానికేమి తప్పుగాదు | పాడి | 456 |
| దానికేమి దోసమా | హిందోళం | 189 |
| దీనికేమి దోసమా | మంగళకౌసిక | 331 |
| దేవర విన్నిటా | దేసాళం | 137 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| దొరవౌదు | లలిత | 156 |
| ననిచిమరీఁగొంత | నట్టనారాయణి | 119 |
| నన్నునెంత | శోకవరాళి | 29 |
| నమ్మవేచెలి | నారాయణి | 26 |
| నమ్మితినీమాట | వరాళి | 269 |
| నలినాక్షి | నారాయణి | 466 |
| నలుగడఁదన | లలిత | 191 |
| నవ్వేమంటా | సాళంగం | 356 |
| నవ్వేవారి | బౌళి | 63 |
| నాకొరకు | ఆహిరి | 339 |
| నాతోనేమి | తోండి | 93 |
| నాతోనేల | రామక్రియ | 548 |
| నాదిక్కు | ముఖారి | 560 |
| నాయకుఁడే | తెలుఁగుఁగాంబోది | 507 |
| నాలిసేయు | రామక్రియ | 513 |
| నావద్దనున్నఁదడవు | సాళంగనాట | 465 |
| నావద్దనున్నాఁడు | మాళవిగౌళ | 481 |
| నావల్లగడమ | హిజ్జిజి | 572 |
| నావల్లనైనదిది | హిజ్జిజి | 283 |
| నావలెఁగాదువో | కాంబోది | 346 |
| నిక్కమైన | కన్నడగౌళ | 268 |
| నిజము | వరాళి | 294 |
| నిన్నుఁజూచి | శుద్ధదేశి | 71 |
| నిన్నుమోఁచి | గౌళ | 371 |
| నివ్వెరగుతో | వరాళి | 368 |
| నీకు వేడుకైతేఁజాలు | వేళావళి | 361 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| నీసుకము | సౌరాష్ట్రం | 485 |
| నెట్టుకొన్న | ఆహిరి | 439 |
| నెరజాణ | వసంతవరాళి | 498 |
| నేనంత | శ్రీరాగం | 505 |
| నేనునీవంటి | దేసాళం | 440 |
| నేనూ నాపెఁగలిగిన | సాళంగం | 200 |
| నేనెప్పుడు | వరాళి | 87 |
| నేనేమీ | హిందోళం | 215 |
| నేమాయెఱఁగ | బౌళి | 330 |
| నేమెరిఁగిన | వరాళి | 147 |
| నేమేమన్నా | సామంతం | 256 |
| నేరిపేవు | దేసాళం | 467 |
| నేరుతువు | దేసాళం | 145 |
| నేరుపరి వైతే | ఆహిరి | 274 |
| నేరుపరియౌ | సాళంగనాట | 555 |
| నేరుపుచాలక | పాడి | 324 |
| నేరుపు లిన్నియు | ఆహిరి | 357 |
| నేరుపులు | సాళంగనాట | 223 |
| నేరుపేకలిగితేను | దేసాళం | 546 |
| పంతములిచ్చిన | బౌళి | 198 |
| పంతములేఁటికి | పాడి | 159 |
| పచ్చిదేరెఁబనులు | బౌళి | 537 |
| పట్టుకుపట్టుకు | దేవగాంధారి | 262 |
| పట్టినంతే | బౌళి | 511 |
| పడఁతులిందరిలోనా | పాడి | 92 |
| పతికి విన్నవించఁగదరే | నాదరామక్రియ | 588 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| పదముదప్పిన | గౌళ | 362 |
| పరిణాములాయ | పాడి | 75 |
| పవ్వళించుమిపుడిట్టె | కాంబోది | 72 |
| పాయక | భైరవి | 27 |
| పిలువరే | శ్రీరాగం | 55 |
| పెక్కుసతులు | గౌళ | 165 |
| పెచ్చువెరిగీ | మధ్యమావతి | 596 |
| ప్రేమముతో | దేశాక్షి | 104 |
| ప్రేమము | సౌరాష్ట్రం | 501 |
| పొందు సేసి | రామక్రియ | 584 |
| పొడగనే | ముఖారి | 515 |
| పొద్దువోక | పాడి | 62 |
| పొద్దువోని | లలిత | 121 |
| పొద్దొక | సాళంగం | 569 |
| బట్టబయలాయ | నాదరామక్రియ | 216 |
| బాపుబాపు | రామక్రియ | 479 |
| బుద్ధిమంతురాల | పాడి | 430 |
| భ్రమయుకు | పాడి | 448 |
| భావించుకో | సామంతం | 476 |
| మంచిదాయ | వరాళి | 444 |
| మచ్చరించి | గౌళ | 412 |
| మగవానితో | సామంతం | 578 |
| మగువలెంత | ఆహిరినాట | 417 |
| మమ్మేమి | శుద్ధవసంతం | 201 |
| మమ్మేల | గౌళ | 332 |
| మరిగితిమి గనక | వేళావళి | 497 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| మేలుదానరా | వరాళి | 385 |
| మేలుమేలీబుద్ధి | వసంతం | 424 |
| మేలుమేలుజాణ | సామంతం | 300 |
| మేలుమేలు నీగుణాలు | రీతిగౌళ | 471 |
| మేలుమేలు నీ చేఁతలు | బౌళి | 554 |
| మేలెఱఁగని | మాళవిగౌళ | 441 |
| మొక్కేమీ | రామక్రియ | 536 |
| మొగమేమి | వరాళి | 437 |
| మొగమోటదాన నేనుమొక్కే | బౌళి | 309 |
| మొగమాటదానవేను మొదలనే | బౌళి | 290 |
| మొదలనే చేతులెత్తి | నాదరామక్రియ | 493 |
| మొదలనే నేనైతే | వరాళి | 566 |
| మొదలివారము | సామంతం | 127 |
| మోము చూచితిఁగనక | గౌళ | 167 |
| యెగ్గేతోఁచదు | బౌళి | 529 |
| యేమని విన్నవించే | ఆహిరి | 203 |
| రచ్చల నన్నెలయించీ | సౌరాష్ట్రం | 35 |
| రమణుఁడ నామన పరయువు | శుద్ధవసంతం | 7 |
| రమణుఁడు | కాంబోది | 85 |
| రవ్వలైనా | సామంతం | 184 |
| రాకురాకు | గౌళ | 173 |
| రామలకు | సాళంగం | 443 |
| రావయ్యమా | పూర్వగౌళ | 128 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| విన్నవించరే పతికి | ఆహిరి | 592 |
| విన్నవించరే యీమాట | ఆహిరి | 369 |
| విన్నవించరే వెలయు | తెలుఁగుఁగాంబోది | 108 |
| వీనుల చల్లఁగా | ఆహిరి | 477 |
| వెరవు | భైరవి | 291 |
| వేగిరమేఁటికి | సింధురామక్రియ | 224 |
| వేగిరించఁబని | వరాళి | 112 |
| వేగిరింతునా | గౌళ | 74 |
| వేరానాకు | భూపాళం | 265 |
| శమించుకోవయ్యా | శంకరాభరణం | 416 |
| సంగడిఁగూచుండ | సౌరాష్ట్రం | 232 |
| సంతోసించే | ముఖారి | 38 |
| సటకాఁడు | పూర్వగౌళ | 225 |
| సతికిఁబంతము | సౌరాష్ట్రం | 583 |
| సతినీఁ జేసె | ముఖారి | 558 |
| సదరమా | ఆహిరి | 585 |
| సరసుఁడ | మాళవిగౌళ | 246 |
| సరి నెఱిఁగించ | ఆహిరి | 187 |
| సవతుల కీమాఁట | పాడి | 544 |
| సవతులమైన | హిజ్జిజి | 426 |
| సవతులిందరు | ఆహిరి | 321 |
| సిగ్గులు | కాంబోది | 237 |
| సిగ్గువడ | సామవరాళి | 514 |
| సిగ్గువిడిచిన | మంగళకౌసిక | 88 |
| సుదతి నీచరిత | శ్రీరాగం | 4 |
| సుదతి నేరు | పాడి | 586 |

| సంకీర్తన మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| సేయఁగలట్టల్లా | బౌళి | 22 |
| సేయఁగలవెల్లా | మాళవిగౌళ | 355 |
| సేసినట్టెల్లా | సౌరాష్ట్రం | 82 |
| సేసిన పాపము | ముఖారి | 130 |
| సేసేటి మా సేఁత | సామంతం | 452 |
| క్షితి నిట్టే | గౌళ | 57 |

